# మీ బిడ్డను ఒక జంట లాభంతో బడికి పంపండి.



## రుచి + పోషణ బానీ మిక్స్ నుండి.

మంచి పోషణలో ఉండడమంటే సగం ప్రయత్నం నెగ్గడమే. ప్రతిరోజూ, మీ బిడ్డకు బానీ మిక్స్ యొక్క రెండు-విధాల లాభాన్ని సమకూర్చండి. రుచికరమైన ఆపిల్స్, మామిడి పండు, ఖర్జూరము, ఎండుద్రాక్ష, మరియు పప్పులు, అంతేకాకుండా గోధుమ, బియ్యం, మరియు మొక్క-జొన్న వంటి పుష్టికరమైన చిరుధాన్యాలను కూడ అది కలిగియున్నది. మీ బిడ్డకి ఇవ్వండి దానికవసరమైన అధిక పోషణను.

**తయారు చేసికొనుటకు ఎంతో అనుకూలమైనది.**



వండుకోవలసిన అవసరం లేదు. ఒక గిన్నెలో కావలసినంత పరిమాణంలో బానీ మిక్స్‌ను వేయండి. మరగపెట్టి సిద్ధంగా ఉంచిన పాలను అందులో పోయండి. మీకు కావలసిన మృదువైన జావ తయారయ్యే దాకా నెమ్మదిగా కలియబెట్టండి.




గ్లాక్సో నుండి వస్తుంది మంచి ఆరోగ్యం.

GL/3/89-R-TEL

# ఇరువిధాలా లాభపడండి.
# యులిప్ చేపట్టండి.

తక్కువ
ఖర్చుతో మీకవసరమైన
భీమా రక్షణ.



తప్పనిసరిగా
మీరు కోరే అధిక
ప్రతిఫలాల ఆర్జన.

యూనిట్ లింక్‌డ్ ఇన్సూరెన్స్ ప్లానులో మీరు పెట్టుబడి పెట్టినప్పుడు, నామమాత్రమైన ప్రీమియంపైన మీకు జీవిత భీమా రక్షణ లభిస్తుంది. అది కూడా వైద్య పరీక్ష లేకుండానే. ఇంకా, రు. 15,000 దాకా ప్రమాదాల భీమా రక్షణ కూడా లభిస్తుంది.

అంతేననుకున్నారేమో. యులిప్‌ని ఇంకా మరింత ఆకర్షణీయంగా చేసేది, ఏటేటా పెరుగుతూ, పునః పెట్టుబడి పెట్టబడే డివిడెండ్లు. గత సంవత్సరం డివిడెండు 14.5%. దీనికి తోడుగా, పరిణతి సమయంలో బోనస్ కూడా. 10 ఏళ్ల ప్లానులో 5%, 15 ఏళ్ల ప్లానులో 7.5% మీరందుకుంటారు.

### ఇక పన్ను రాయితీల మాటేమిటి?

యులిప్ క్రింద మీరు కట్టే మొత్తానికి, ఆదాయం పన్ను చట్టం సెక్షన్ 88 క్రింద ఆదాయం పన్ను రాయితీ లభిస్తుంది. రు. 13,000 దాకా డివిడెండ్ల పైన కూడా సెక్షన్ 80 L క్రింద రాయితీ లభిస్తుంది.

### ప్లాను వివరాలు

వయస్సు : ఈ ప్లానులో చేరడానికి కనీస వయస్సు ఇప్పుడు 12 ఏళ్లు. గరిష్ఠ వయస్సు 10 ఏళ్ల ప్లానుకు 55½ ఏళ్లు. 15 ఏళ్ల ప్లానుకు 50½ ఏళ్లు.

టార్గెట్ మొత్తం : రు. 6,000 నుంచి రు. 60,000.

వ్యవధి : మీకనువైన వ్యవధి ఎంచుకోవచ్చు—10 ఏళ్లు లేదా 15 ఏళ్లు.

ఉచిత సమాచారానికై ఏ యూనిట్ ట్రస్ట్ కార్యాలయం వద్దగానీ, ముఖ్య ప్రతినిధి లేదా ఏజెంటు వద్దగానీ, ఏ పంచవటి సూపర్ మార్కెట్ దుకాణం వద్దగానీ సంప్రదించండి.



**యూనిట్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా**

ఒక కోటి పైగా యూనిట్ హోల్డర్ల సేవకై అంకితం

## యూనిట్ లింక్‌డ్ ఇన్సూరెన్స్ ప్లానులో పెట్టుబడి పెట్టండి.

సెక్యూరిటీ పెట్టుబడులన్నిటి వెనుకా మార్కెట్ రిస్కు ఉంటుంది. పెట్టుబడి పెట్టే ముందుగా మీ పెట్టుబడి సలహాదారునుగానీ, ఏజెంటునుగానీ తప్పక సంప్రదించండి.

---

మండల కార్యాలయము : 45, సెకండ్ లైన్ బీచ్, మద్రాసు 600 001. ఫోన్ : 587433, 562257.

శాఖా కార్యాలయము : విజయవాడ : 29-3-12, వెంకటేశ్వరరావు వీధి, ఆప్కో భవన్ దగ్గర, వెస్ట్ ఆఫ్ రహమాన్ పార్క్, గవర్నర్‌పేట, విజయవాడ 520 002. ఫోన్ : 63964 □ హైదరాబాదు : 203/204, మొఘల్ కోర్ట్ కాంప్లెక్స్, రెండవ అంతస్తు, బషీర్‌బాగ్, హైదరాబాదు 500 001, ఫోన్ : 240030.

ఆంధ్రప్రదేశ్‌లో మా ముఖ్య ప్రతినిధులు : □ ఆదిలాబాద్ : ఇస్మాయిల్ రాంజీ, సిర్పూర్, కాగజ్ నగర్, ఫోన్ : 91 (పి.పి.) □ అనంతపూర్ : వి.యల్. నారాయణ, ఫోన్ : 22196 □ కడప : ఎ.ఆర్. కృష్ణారెడ్డి, ఫోన్ : 2701 □ కర్నూలు : టి. సీతారామయ్య, ఫోన్ : 22335 (పి.పి.) □ కరీంనగర్ : శ్రీమతి టి. అహల్యా శ్రీనివాస్ ఫర్టిలైజర్ సిటీ, ఫోన్ : 312 □ ఖమ్మం : జి. అమరనాథ్, ఫోన్ : 8711-8709 □ గుంటూరు : పి.వి. తిలక్, ఫోన్ : 24964, 31839 □ చిత్తూరు : పత్తి చంద్రయ్య, తిరుపతి, ఫోన్ : 22176 □ తూర్పు గోదావరి : పి. వెంకటరమణ, కాకినాడ, ఫోన్ : 76047 □ నల్గొండ : యమ్. శంకర్‌గుప్తా, సూర్యాపేట, ఫోన్ : 545 □ నిజామాబాద్ : డి. నర్సయ్య, హెచ్. నెం. 5-5-18, తహసిల్ ఆఫీసు రోడ్డు వెనుక, ఖలీల్‌వాడీ, నిజామాబాద్ 503 003 □ నెల్లూరు : పి. సత్యనారాయణ, ఫోన్ : 22002 □ పశ్చిమ గోదావరి : వై. సోమసుందరరావు, తణుకు, ఫోన్ : 2440 □ ప్రకాశం : యమ్.వి. రమణయ్య, ఒంగోలు, ఫోన్ : 3337; 3244 □ మహబూబ్‌నగర్ : యస్. వెంకటనారాయణ, హెచ్. నెం. 10-87, టి.ఆర్. కాంపౌండ్, జడ్చర్ల 509 301 □ మెదక్ : పి.వి. కృష్ణారెడ్డి, ఫోన్ : 2820 □ రంగారెడ్డి : యస్. వీరరాఘవులు గోవిందప్ప, 26-75, ఎ.పి.ఎస్.ఇ.బి., సికింద్రాబాద్ 500 047 □ వరంగల్ : టి.యస్.యస్. మూర్తి, ఫోన్ : 8631 □ విజయనగరం : యం.యస్.యన్. శర్మ, ఫోన్ : 2401 □ విశాఖపట్టణం : సి. నారాయణస్వామి, ఫోన్ : 63116.

Sista's UTI 1759 91 TE B

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✱ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

------------------------ కూపన్ ------------------------

ఫిబ్రవరి చతుర నవల తెరవెనుక

సమీక్షకుని పేరు : ..............................................................

చిరునామా : ..............................................................

..............................................................

..............................................................

..............................................................

# చమత్ప్రపంచం

## ప్రాణాంతకమైన దర్జా

చీటికి మాటికి మొగుళ్లని పెళ్లాలూ, పెళ్లాల్ని మొగుళ్లూ మార్చేసుకున్నట్లే అమెరికన్లు దర్జాల విషయంలో కూడా చాలా తొందర తొందరగా తమ అభిప్రాయాల్ని మార్చేసుకుంటుంటారు. అందుకే అమెరికాలో ఇవ్వాళ దర్జాగా భావించిన విషయం మరునాటికల్లా మారిపోతుంది. ప్రస్తుతం వాళ్లు వేలంవెర్రిగా 'పిట్‌బుల్స్' పట్ల మోజును చూపిస్తున్నారు. పిట్‌బుల్స్‌ని కలిగి ఉండడం అత్యంత దర్జాగా భావిస్తున్నారు.

పిట్‌బుల్స్ అంటే చాలా అరుదుగా కన్పించే ఒక జాతి కుక్కలు. ఎత్తుగా, బలిష్టంగా, ఎర్రని కళ్లతో పెద్దపెద్ద కోరలతో చూడ్డానికే భయం పుట్టించేలా ఉంటాయవి. పైకి అలా కన్పించినా నిజానికి అవి చాలా సాధు స్వభావులు. అయితే అమెరికన్లు వాటిలో క్రౌర్య గుణం, రోషం వృద్ధిచెందేలా పెంచుతారు. వాటి ఆహారంలో ఘాటైన మిరియాల పొడులు, కారాలు దట్టించి వాటిలో నిద్రాణమైయున్న కోపావేశాల్ని మేల్కొల్పుతారు. మరికొందరు పెద్ద మనుషులు వాటికి టైముకి తిండిపెట్టక అవి ఆకలితో నకనకలాడుతున్న సమయంలో పిల్లుల్ని బాతుల్ని వాటి ముందు పడేస్తారు. ఆకలికి తాళలేక అవివాటిని పీక్కుతింటూంటే వినోదంగా చూస్తూ కేరింతలు కొడ్తారు. మరి కొంతమంది ఇంకో అడుగు ముందుకేసి, వాటిని సాటి మనుషులమీదికి ఉసిగొల్పుతారు. దాంతో అవి మానవ రక్తం రుచి మరిగి ప్రజల ప్రాణాలకు ముప్పుగా తయారవుతాయి. ఇటీవల కేవలం ఒక్క సంవత్సరంలోనే సుమారు 56,000 మందికి పైగా ప్రజలు పిట్‌బుల్స్ కాటుకు గురయ్యారు. వారిలో 230 మంది పైలోకానికి ప్రయాణం కట్టేయడం జరిగింది.

ఈ విషయాల్ని పరిశీలించి ప్రభుత్వం పిట్‌బుల్స్ పెంపకాన్ని నిషేధిస్తూ చట్టం తెచ్చింది. కానీ చాలా చట్టాల్లాగే అది మూలపడిపోయింది. ప్రస్తుతం పిట్‌బుల్స్ మెడలో చైను బిగించి బజారు వెంట నడపడం చాలా మందికి దర్జా విషయమై పోయింది. 'చూశారా! నా దగ్గర పిట్‌బుల్ ఉంది. ఎవరైనా నా జోలికి వచ్చారో చచ్చారన్నమాటే! ఖబడ్దార్...' అని అర్థం వచ్చేలా రోడ్ల మీద షికార్లు చేస్తున్నారు అమెరికన్లు. ఇలాంటి ప్రాణాంతక పనులు చేయడంలో అమెరికన్లు ఎప్పుడూ ముందంజలోనే ఉంటారని ప్రపంచ ప్రజలు అనుకోవడంలో అనౌచిత్యం ఏమీలేదనే అన్పిస్తోంది.




కవర్ పేజీ ఫొటోగ్రాఫర్:
పి. శ్రీనివాసులురెడ్డి

# పన్నెండేళ్ల వృద్ధుడు

పట్టుమని పన్నెండేళ్లన్నా నిండకుండానే వార్ధక్యాన్ని అనుభవిస్తున్నాడు నబేందుఘోష్. ఆ వయస్సు పిల్లల్లో కనుపించే అమాయకత్వం, చిలిపిదనం, హుషారు కాగడావేసి చూసినా అతనిలో ఎక్కడా కన్పించవు. అతని శారీరక స్థితి కూడా వందేళ్లు పైపడ్డ వృద్ధుల్నే తలపింపచేస్తుంది. అతని జుట్టు తెల్లబడిపోయింది. పళ్లు ఒకదాని తర్వాత ఒకటి ఊడిపోయి బోసినోరువచ్చేసింది. కంటిచూపు, వినికిడిశక్తి దాదాపుగా పూర్తిగా తగ్గిపోయాయనే




చెప్పాలి. కర్రసాయం లేందే లేవడం, కూర్చోడం అతని శక్తికి మించిన పని అయిపోయింది. మానసికంగా కూడా వందేళ్ళుదాటిన వృద్ధుల జాబితాలో అతనెప్పుడో చేరిపోయాడు.

ప్రపంచంలో ఇలాంటి విచిత్ర కేసులు కేవలం 17 మాత్రమే ఉన్నాయని అతన్ని పరీక్షించిన డాక్టర్లు చెప్పారు. భార్యాభర్తలలోని కొన్ని అనారోగ్య పరిస్థితులవల్ల, ఇంకా అనేకానేక అనివార్య కారణాలవల్ల ఇటువంటి పిల్లలు పుట్టే అవకాశం ఉందని తెలుస్తోంది. అవడానికి నబేందుఘోష్ 12 ఏళ్లవాడే అయినా వైద్య శాస్త్రప్రకారం అతని వయస్సు 100 ఏళ్లు దాటిపోయిందని డాక్టర్లు నిర్ధారించారు. కలకత్తాకు చెందిన ఈ బాలవృద్ధుడు ఇంకా ఒకటి రెండు ఏళ్లకు మించి బ్రతకడం కష్టమని అతన్ని చూసినవాళ్లంతా అంటున్నారు.

# పీత కడుపులో శిశువు

బీహార్‌లోని బర్నాహిల్ అనే కుగ్రామం అకస్మాత్తుగా ఇటీవల వార్తలలోకి ఎక్కి ప్రపంచదృష్టిని ఆకర్షించింది. కారణం సదరు గ్రామంలో ఒక పీత కడుపులో ఓ మానవశిశువు పెరుగుతుండడమే! పూర్తిగా రూపుదిద్దుకున్న తల, కాళ్లు, చేతులతోనున్న ఆ శిశువు పీత కడుపులో నుంచి వెలికితీసిన కొద్దిక్షణాలకే ప్రాణాలు విడిచింది. అయినా అపురూపమైన ఆ సత్యాన్ని పదిమందికీ వెల్లడిచేసే ఉద్దేశంతో ఆ మృతశిశువును రసాయనాలలో భద్రంచేసి ఉంచారు డాక్టర్లు.

ఊహకందని కొన్ని కారణాలవల్ల ఇలాంటి సంఘటనలు జరుగుతుంటాయి. దీనికి ఇది కారణమని ఇదమిత్థంగా చెప్పడం కష్టం. ఇంతకుపూర్వం కూడా ఇలాంటి సంఘటనలు కొన్ని జరిగాయి. ఉదాహరణకు తమిళనాడులోని తిరునల్వేలి పట్టణంలో కొన్నేళ్లక్రితం ఒకానొక ఆవు కడుపులో రెండుతలల మానవశిశువు రూపుదిద్దుకొంది.

ఇలాంటి అసహజ సంఘటనలకు జన్యుకణాలలో హఠాత్తుగా సంభవించే పెనుమార్పులే కారణం కావచ్చునని శాస్త్రజ్ఞులు అభిప్రాయపడుతున్నారు. అయితే అలాంటి మార్పులు ఎందుకు సంభవిస్తున్నాయన్నది వారు చెప్పలేకపోతున్నారు.

పీత కడుపులోంచి వెలువడ్డ పీతసుతుని మృతదేహాన్ని అన్ని కోణాల్నుంచి సమగ్రంగా పరిశీలించి, పాట్నా మెడికల్ కాలేజి డాక్టర్ యస్.యస్.అలి, "ఇలాంటి అసహజ జననాలు అత్యంత అరుదుగా జరుగుతుంటాయి. వైద్యశాస్త్రపరంగా దీన్ని వివరించేందుకు అవకాశం ఏమీ కనిపించడంలేదు" అని పెదవి విరిచారు.




# చతుర కథలు

## సెన్సార్

"హలో" కుర్చీలో కూర్చున్న సరళాదేవిని ఆప్యాయంగా పలకరించింది నక్కుబాయి.

"మీరు..." అని అర్థోక్తిలో ఆగిపోయింది సరళాదేవి.

"నేను ఏకాంబరంగారి మిసెస్‌ని. అదే... మావారు ఏకాంబరంగారు" నవ్వుతూ బదులిచ్చింది నక్కుబాయి.

"మీరా! రండి, రండి. ఇలా కూర్చోండి" అని తనపక్కన ఖాళీగా ఉన్న సీటు చూపించింది సరళాదేవి, కూర్చుంది నక్కుబాయి.

సాధారణంగా రెండు కొప్పులు ఒకచోట కలవ్వు. కలిశాయా ఇక వాటిని ఏ శక్తీ వేరుచేయలేదు. కుశలప్రశ్నలతో మొదలైన వారి సంభాషణ కువైట్ యుద్ధందాకా సాగింది.

ఇంతలో లైట్లు ఆరిపోయాయి. ఎదురుగా ఉన్న స్క్రీన్‌మీద పిక్చర్ పడింది. అయినా ఆ ఇద్దరి వాక్ప్రవాహం ఆగలేదు. రీల్‌వెంట రీల్ మార్చేస్తున్నాడు ఆపరేటర్. టాపిక్ తరువాత టాపిక్ మార్చిపారేస్తున్నారు ఆ ఇద్దరూ.

ఆ హాలులో ఉన్న మిగిలిన ప్రేక్షకులు నిశ్శబ్దంగా ఎదురుగా ఉన్న స్క్రీన్‌మీద పడుతున్న సినిమాని చూస్తూ ఎంజాయ్ చేస్తున్నారు. అదే హాలులో ఒకమూల సీట్లో కూర్చునివున్న ఏకాంబరం మాత్రం గుండెలు చిక్కబట్టుకొని జరిగే తతంగాన్ని నిశ్శబ్దంగా గమనించ సాగాడు.

సినిమా బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌లో ఎక్కువ, తక్కువలు వచ్చినప్పుడు సరళాదేవి తల ఆటోమేటిక్‌గా స్క్రీన్‌వైపు తిరిగేది. కానీ నక్కుబాయి తన వాక్చాతుర్యంతో, హిప్నటైజ్ చేసి ఆ తలని తిరిగి తనవైపుకి తిరిగేలా చేసుకునేది.

ఇంతలో విరామసూచకంగా హాలులో లైట్లు వెలిగాయి.



"అరె! ఇంతసేపూ చూడలేదే! ఎంతబాగుంది" అంది నక్కుబాయి అకస్మాత్తుగా.

"ఏమిటి?" అయోమయంగా అడిగింది సరళాదేవి.

"మీ చీర ఎక్కడ కొన్నారు?" అడిగింది నక్కుబాయి.

"షోకేసులో బొమ్మకి కట్టిన చీర విప్పించి మరీ కొన్నారు మావారు. నేను కట్టుకునే చీరల సెలక్షనంతా మావారిదే. ఇప్పటివరకూ ఆ షోకేసులో బొమ్మకి కట్టటానికి సరియైన చీరలేక అలానే వుంచేశారట ఆ పాపువాళ్ళు" గర్వంగా చెప్పింది సరళాదేవి.

"మీవారి సెలెక్షన్ ఎంత గొప్పదో మిమ్మల్ని చూడగానే ఊహించానులెండి" అంది నక్కుబాయి. ఆ మాటతో స్వల్పంగా సిగ్గుపడింది సరళాదేవి.

కానీ వెంటనే తేరుకుని - "మొహమాటానికి అంటున్నారుగానీ, మీ చీరముందు నా చీర వెలవెలబోతోంది. ఎక్కడ కొన్నారు" నక్కుబాయి కట్టుకొన్న చీరని ముట్టుకొని దాని నాణ్యత పరిశీలిస్తూ అడిగింది సరళాదేవి.

వెంటనే ఆ చీర కొన్నప్పటి చరిత్ర సవివరంగా చెప్పసాగింది నక్కుబాయి. ఆ కబుర్లలో తిరిగి పిక్చర్ బిగిన్ అవ్వటంకానీ, తెరమీద 'శుభం' పడటం కానీ ఆ ఇద్దరికీ తెలియనే తెలియదు. హాలులో లైట్లు వెలగటంతో తిరిగి ఈలోకంలోకి వచ్చారు. అక్కడితో వాళ్ళ వాక్ప్రవాహానికి అనకట్ట పడింది.

నిర్మాత ఏకాంబరంగారి సదరు సినిమాకి సెన్సార్‌వాళ్ళు ఎటువంటి కట్స్ లేకుండా క్లీన్ సర్టిఫికెట్ ఇచ్చారు.

"హడలిచచ్చానండీ... మన సినిమానిండా అసభ్య దృశ్యాలే. కుర్రకారేమిటి, ముసలివాళ్ళ రక్తాన్ని కూడా వేడెక్కించే సీన్స్. అందులోనూ సెన్సార్‌లో ఆడసభ్యురాలు కూడా ఉంది ఎలాగా అని ఖంగారు పట్టుకొందండీ" అన్నాడు ప్రొడక్షన్ మేనేజర్ దైవసహాయం.

"అందుకే, మా శ్రీమతిని రంగంలోకి దింపానెయ్యా. సెన్సార్ సభ్యులందరూ మన సినిమాని ఎంజాయ్ చేశారు. ఆ ఆడసభ్యురాలి దృష్టిని మా ఆవిడ డైవర్టు చేసింది. నిజానికి ఆవిడ సినిమా చూసివుంటే అస్సలు సెన్సార్ అయ్యేది కాదు" అన్నాడు నిర్మాత ఏకాంబరం గర్వంగా.

-కాశీభట్లభానుమూర్తి

## రాజాగారి గుర్రం

(జైనా మినీకత)

తమ రాజాగారి మీద గల గౌరవంతో ఆయన మరణానంతరం ఊరిబయట, కొండమీద ఆయనకో ఆలయాన్ని నిర్మించి, నిత్యం భక్తిశ్రద్ధలతో కొలవసాగారా దేశప్రజలు. భక్తుల దర్శనార్థం రాజాగారి గుర్రాన్ని కూడా ఆ దేవాలయం దగ్గరే ఉంచేవారు. తళతళమెరిసే ఖరీదైన జీను, అందమైన కళ్లెం ధరించి ఠీవిగా తలెత్తి చూడడం, కెమెరాలకు ఫోజులివ్వడం మాత్రమే దాని పని. సంపన్న కుటుంబాలకు చెందిన ఉత్సాహవంతులైన యువతీ, యువకులు దానిమీద ఎక్కి కూర్చుని ఫొటోలు దిగేవారు. అందుకుగాను వాళ్లు బోలెడంత సొమ్ము గుడి మేనేజరుకి ముట్టచెప్పుకోవాల్సివచ్చేది. సుకుమారులైన యువకులేగాక అందమైన యువతులు కూడా తనని అధిరోహించినప్పుడు పులకించిపోతుండేది రాజావారి గుర్రంగారు. తన తోటి గుర్రాలు ఎగుడుదిగుడు కొండలమీద, గుట్టల మీద బండెడేసి బరువులు ఛస్తూ, పడుతూ మోస్తుంటే తానుమాత్రం ఇక్కడ అతిలోక సుందరులవంటి అమ్మాయిల స్పర్శసుఖాల్ని పొందుతున్నందుకు గర్వపడిపోయిందా అశ్వరాజం.

"ఆహాహా... రాజాగారి గుర్రం చూడు! దాని రాజసం చూడు... అసలు దాని చూపు చూశావా? ఎంత ఠీవి ఉట్టిపడుతోందో?" అంటూ దేవాలయానికి వచ్చే భక్తులు, సందర్శకులు తనని పొగడుతుంటే తెగ గర్వపడిపోయేవారు గుర్రంగారు.

ఎవ్వరుబడితే వారు విచ్చలవిడిగా ఫొటోలు తీయకుండా గుర్రందగ్గర ఓ నౌకర్ని ఫుల్ టైమ్ ఫొటోగ్రాఫర్ని నియమించారు. అతనే

ఫొటోలు తీసి వాటికిగాను ఇంత అని డబ్బు పుచ్చుకుంటాడు. అరకంగా నిత్యం ఎంతో డబ్బు మేనేజర్‌కి చేరేది. ఆ డబ్బులో చాలా భాగం గుర్రం సంరక్షణకు, బలమైన ఆహారానికి, వినియోగించేవారు. ఒక్కమాటలో చెప్పాలంటే గుర్రంగారికి నిత్యం రాచమర్యాదలు జరిగిపోతున్నాయి.

దేశంలోని సంపన్నగృహాలన్నింటిలో తన ఫొటో లైఫ్‌సైజ్‌లో వేలాడుతున్నట్లు గ్రహించడంతో రాజావారి గుర్రానికి అతిశయం బాగా పెరిగిపోయింది. తన ప్రతికదలికా కెమేరాలలో బంధింపబడుతూ రావడంతో దాని ఆనందానికి మేరలేకపోయింది. తన ఫొటోలేని ఆల్బమ్ దేశం మొత్తంమీద కన్పించదంటే అదంతా తన అదృష్టంకాక మరేమిటి అనుకుందది. ఇటీవల సిన్మాకంపెనీవాళ్లు వచ్చి ఆ గుర్రంగారితో కొంత షూటింగ్ చేసుకుని పోయారు. అప్పటినించీ జనానికి అదంటే మరీ క్రేజు పెరిగిపోయింది.

ఇప్పటికీ గుడిదగ్గరకొచ్చే మామూలు గుర్రాల్ని చూస్తే దానికెంతో జాలేస్తుంది. అవిమాత్రం దానిని చూసి ముఖం మాడ్చుకునేవి. వాటి కళ్లల్లో తనపట్ల తొణికిసలాడుతున్న ఈర్ష్యాభావాన్ని చూసి నవ్వుకునేదది. తనుమాత్రం ఏంచేయగలదు? ఎవరి అదృష్టం వారిది. మొదట్లో తనుమాత్రం వాటిలా మూటలూ, ముల్లెలు మోసిందిగాదూ? రాజావారి దివాణంలో చేరాకనేగదా తన దశ తిరిగింది. రెండు పూట్లా కడుపునిండా తిండి తినగలిగింది. రాజాగారు పోయాకమాత్రం ఈ ఠీవిగా నుంచోడాలు, రాజసంతో పోజు పెట్టడాలు తనకోవట్టాన అలవడ్డాయా? అవి నేర్పేటప్పుడు మేనేజరు, ఫొటోగ్రాఫర్లు తిట్టిన తిట్టు తిట్టకుండా తనని తిట్టేవారుకాదూ? ఈమధ్యేగదా తన వనితనాన్ని గమనించి వాళ్లూ తనకి మర్యాదయిస్తున్నది. ఏదైనా చేసుకున్నవాళ్లకి చేసుకున్నంత? ఈ పిచ్చి గుర్రాలు తనమీదపడి ఏడవడమెందుకు? అనుకునేది రాజావారి గుర్రం.

రాజావారి గుర్రానికి రోజులు హాయిగా గడిచిపోతున్నాయి.

ఉన్నట్లుండి ఓరోజున పెద్ద తుఫాను వచ్చింది. మేనేజరుగారి ఆఫీసు కూలిపోవడంతో ఆయన తీవ్రమైన గాయాలు తగిలి చావుబతుకుల్లో కొట్టుకుంటున్నాడు. అర్జంటుగా హాస్పిటల్‌కి తీసుకువెళ్లందే ప్రాణాలు దక్కేలా లేవు. సమయానికి బండి ఏదీ దొరకలేదు.

ఆ పరిస్థితుల్లో ఒక పెద్ద మనిషి, "రాజాగారి గుర్రం ఉందిగదా? మేనేజర్‌గార్ని దానిమీద హాస్పిటల్‌కి తీసుకువెళ్దాం" అన్నాడు.

అంతా సరేనంటే, సరేననుకొని మేనేజర్‌ని ఎత్తి గుర్రంమీద కూర్చోబెట్టారు. కానీ గుర్రం కదలందే! అంతా ఆశ్చర్యచకితులయ్యారు.

"త్వరగా నడవకపోతే మేనేజర్ ఛస్తాడు..." హెచ్చరించారంతా.

అయినా గుర్రం అంగుళం కూడా కదల్లేదు.

"రాచమర్యాదలతో నిన్ను ఇన్నాళ్లూ పోషించిన మేనేజరుపట్ల నీకు ఆవగింజంత విశ్వాసం కూడా లేదా" అంటూ బండబూతులు తిట్టసాగారు వారు.

రాజావారి గుర్రానికి కోపం వచ్చింది.

"అయితే నన్నేం చేయమంటారు? దారంతా అంత ఛండాలంగా ఉంటే ఎలా వెళ్లాలి?" అంది పొరుషంగా.

"నువ్వు రాజాగారి గుర్రానివన్న విషయం మర్చిపోయినట్లున్నావ్! నీకు అసాధ్యమన్నది ఏదీ ఉండకూడదు" అన్నాడో పెద్దమనిషి.

గుర్రం మౌనంగా ఉందేతప్ప ఒక్క అడుగు కూడా కదల్లేదు.

దాంతో వళ్లుమండిన ఒక భక్తుడు, "ఏమే. మర్యాదగా చెబుతుంటే నడవవుకదూ?" అంటూ కొరడా తీసుకొని ఒక్కటంటించాడు.

గుర్రానికి కళ్లవెంట గిర్రున నీళ్లు తిరిగాయి.

"ఇన్నాళ్లుగా అలవాటు లేకపోవడంతో నేను నడవడమెలాగో, దౌడుతీయడమెలాగో మర్చిపోయాను. నన్నీ స్థితికి తీసుకొచ్చింది మీరుగాదా?" అంటూ బావురుమంది.

అక్కడున్నవాళ్లంతా నోరుతెరిచేశారు ఏంమాట్లాడాలో తెలియక.

-వాంగ్ మింగ్యీ





# భూమిపుత్రుడుపై చతుర సమీక్షలు

డిసెంబర్ 'చతుర'లో ప్రచురితమైన కాలువ మల్లయ్య నవల 'భూమిపుత్రుడు'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## మా పల్లె ప్రతిబింబం

(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

'చతుర'ద్వారా కాలువ మల్లయ్యగారి 'భూమిపుత్రుడు' అద్దంలో మా పల్లెను చూసుకున్నాను. మనమధ్య నడయాడే పల్లెపట్టు మనుమల ప్రకృతులకు, ప్రవృత్తులకు, వారి యిండ్లలోను, ఇరుగుపొరుగిండ్లలోను నిత్యం జరిగే సంఘటనలకు, సన్నివేశాలకు అక్షరాకృతి ఈ నవల.

అతివృష్టి, అనావృష్టులకు పంటలు పండక, చేసిన అప్పులు తీరక, ఉన్న భూమినమ్మి ఊరు వదలిపోయిన 'భూమిపుత్రుడు' కొండమల్లయ్య మాఊరివాడే! మాయింటివాడే! చేసిన అప్పు తీరుస్తాడో, తీర్చడో అని నమ్మలేక కళ్ళంలోనే ధాన్యరాశిని బండ్లకెత్తుకపోయే రాజేశంలాంటి షావుకార్లు, ఒకటికి మూడింతలిచ్చినట్లుగ వేలిముద్రలు వేయించుకుని నిరక్షరాస్యులను మోసంచేసే రామారావులాంటి దగాకోర్లు మా వీధిలోనివారే! కనిపెంచి పెద్దచేసిన ముసలమ్మను నెలకొక్కరుగా పంచుకునే మల్లయ్య, కొండయ్య, వెంకటయ్యలు మా సోదరులే! పెండ్లాం మాటవిని చావును కొనితెచ్చుకున్న రాజయ్య మా యిరుగింటివాడే! అన్నల్లో కలిసి ప్రాణాలు పోగొట్టుకున్న పెద్ద కొడుకూ, చదివి ఉద్యోగంకొరకు ఎదురుచూచి ఏదో బ్రతుకుతెరువు చూసుకున్న తిరుపతయ్యా మా పొరుగింటివారే! సర్దుకుపోలేక పోటుమాటలతో వేరుపడే నర్సమ్మ, లక్ష్మివంటి అత్తాకోడళ్ళూ, వియ్యంకులే అయినా పెళ్ళిళ్ళలో ఖచ్చితంగా అన్నీ వసూలుచేసుకునే కాంతమ్మ, లస్మయ్యలు నిత్యం ఎదురుపడేవాళ్ళే! ఎప్పుడో వచ్చే పండుగలు, చేసుకునే విందులు, చావులు, ఏడ్పులు మా అందరివీనూ!

సాగిపోయే నదిలో ఒడ్డుపైనున్న పల్లె ప్రతిబింబంలా నడచిన భూమిపుత్రుడులోని పాత్రలు, సంఘటనలు, సన్నివేశాలు చివరివరకు చదివింపచేశాయి.

చెప్పే విధానం ఎన్నుకున్న యితివృత్తానికి అనుగుణంగానే ఉండి సంతృప్తినిచ్చింది.

-యన్.కేశవరెడ్డి, నంబులపూలకుంట

## వెన్నెముక?

(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

'రైతు దేశానికి వెన్నెముక' అని పాఠ్యపుస్తకాల నుంచీ పొలిటీషియన్స్ వరకూ ఘోషిస్తున్నా దేశాన్ని ఓటుగా నిలబెట్టవలసిన ఆ వెన్నెముక ఈనాడు ఎలా క్షీణించి వంగిపోతున్నదో తెలుసుకోవలసిన అవసరం అందరికీ ఉంది.




ఒకప్పుడు పాడిపంటలకు లోటులేని భాగ్యసీమలైన మన పల్లెల్లో నేడు 'అన్నదాత'ల బ్రతుకు ఎంత బాధాకరంగా తయారైందో తెలుసుకోవడానికి కొండమల్లయ్య జీవితమే ఒక దృష్టాంతం. దేశంలో అనాదిగా నాలుగింట మూడొంతుల ప్రజలు చేపట్టిఉన్న వృత్తి ఈనాడు వారికి కత్తిమీద సామే అయ్యింది. అతివృష్టి, అనావృష్టి సృష్టిస్తోన్న అననుకూల వాతావరణం ఒకవైపు, చక్రవడ్డీలతో తడిసి మోపెడవుతున్న రుణభారం మరోవైపు, అంతూ-దరీ లేకుండా సాగుతున్న ఉద్యమాలు ఇంకోవైపు గ్రామసీమలను అల్లకల్లోలపరుస్తుంటే, తెలంగాణ బక్కరైతు బతుకు నేడు రోట్లో తలదూర్చిన చందంగా ఉంది. 'గడిమరికాము, గవ్వ ఆదాయం'లేని వ్యవసాయ వృత్తిలోని ఎందరో 'భూమిపుత్రులు' నాగళ్ళు, పారలు వదిలేసి ప్రత్యామ్నాయ వృత్తులకోసం గనులూ, కార్ఖానాలవైపు దారితీస్తున్నారు.

'భూమిపుత్రుడు' చదువుతున్నంతసేపూ ఇది నవల అన్న ఆలోచనే ఎక్కడా రాలేదు. నామటుకు నాకు నాలుగురాష్ట్రాల అవతల ఉన్న మా వరంగల్ జిల్లాలోని పల్లెటూరికి వెళ్ళి వచ్చినట్లుగా అన్పించింది. చరిత్ర గతిలో చిరిగిపోతున్న రైతన్నల బతుకు పుస్తకం మన కళ్లముందు విప్పిపరిచారు రచయిత. ఈ కథలో ఒక తండ్రి, తల్లి, వారి ముగ్గురు కొడుకులు, కూతురు వెరసి ఒక కుటుంబంలోని మొత్తం వ్యక్తుల జీవితగతులు కాలక్రమంలో ఎలా మార్పులు చెందాయో చూడొచ్చు. 'నేనీ మట్టిల్నే పుట్టిన... ఈ మట్టిల్నే పెరిగిన, ఈ మట్టిల్నే మన్నయిపోత' అని నేలతల్లిని కన్నతల్లిగా భావించిన కొండమల్లయ్యకు చివరకు ఆ భూమితో అనాదిగా ఉన్న బంధం తెంచుకోక తప్పలేదు. పెద్దకొడుకును 'ఎన్‌కౌంటర్', రెండోకొడుకు రాజయ్యను బొగ్గుబావి బలితీసుకున్నాయి. కష్టపడి సంపాదించిన డిగ్రీ బ్రతుకుతెరువును చూపించక పోగా ఆలస్యమైతే తట్టలుమోసే పనికూడా దొరకదన్న భయంతో ప్రాణాన్ని పణంగానైనా పెట్టి తనూ గనిపనిలో చేరడమొక్కటే మార్గమైంది మూడోకొడుకుకు.

గ్రామాల్లో రైతు కుటుంబాల్లోని నిత్యవ్యవహారాలు, పండుగ-పబ్బాల్లో చేసుకునే వేడుకలూ, పనిపాటల్లో వారి హాస్యస్ఫూర్తి, పెళ్ళి-పేరంటాల్లో పెట్టుకునే గిల్లికజ్జాలు మొదలైన చిన్న చిన్న అంశాలు కూడా వివరించటం మెచ్చుకోదగిన విషయం. రచయిత చెప్పినట్టు అన్నలరాకతో గ్రామాల్లోని దొరతనపు జులుం తగ్గినా, ఇటు పోలీసుల వేధింపులు, అటు అన్నల బెదిరింపులమధ్య వారి పరిస్థితి అడకత్తెరలో పోకచెక్కలా ఉందనే అంశాన్ని కూడా చెప్పటం సందర్భోచితంగా ఉంది. అగ్నిగుండంలా మండుతున్న తెలంగాణ పల్లెపట్టుల్లోని నడుస్తున్న చరిత్రకు నిలువుటద్దం పట్టిన దృశ్చిత్రం 'భూమిపుత్రుడు'.

-మేడేపల్లి శేషు, న్యూఢిల్లీ

## మారిన విలువలు ఏవీ?

*(తృతీయ బహుమతి రూ. 50/-పొందిన సమీక్ష)*

**తె**లంగాణ రైతుజీవితం ఇతివృత్తంగా, చతుర అందించిన నవల ''భూమిపుత్రుడు'' హృద్యంగా ఉంది. రైతు తన చెమటతో మట్టిని రంగరించి మనకు అన్నం అందిస్తున్నా ఆ అన్నం, ఆ మట్టి తనకే పరాయివై కుంగదీస్తున్న వైనాన్ని రచయిత సహజంగా చిత్రించారు. దీనిని నవల అనడంకంటే రైతు బ్రతుకు పుస్తకంగా చెప్పవచ్చు. తెలంగాణ జనజీవన సౌందర్యాన్ని ఆత్మీయమైన భాషను మేళవించి ప్రతి సన్నివేశాన్ని హత్తుకునేలా రచయిత చక్కగా చిత్రించారు.

కొండమల్లయ్య జీవితం, ఆ జీవితంతోపాటు సమాంతరంగా రూపాంతరం చెందిన వ్యవస్థ స్వరూపాన్ని మరింత తార్కికంగా ఆలోచించి విశదం చేసివుంటే నవల మరింత ప్రయోజనకరంగా రూపొందేది. ధళారీకోరు మార్కెట్ దోపిడీని ఎందువల్ల చిత్రించలేదో బోధపడలేదు. రైతుజీవితంలో షావుకారు, దొర, ఇతర పాత్రలు, బ్యాంకులు ఇలా పైకి కనపడేవి మాత్రమే గాకుండా చాపకింద నీరులా రైతుజీవితంలోకి ప్రవేశించి రైతును ఊబిలోకి లాగుతున్న ప్రభుత్వ దివాళాకోరు విధానాలు, దమననీతి, రాజకీయాల రొంపిని రచయిత దాటవేశారు. శ్రీరాంసాగర్ వచ్చేనాటికి తెలంగాణ రైతు

కి భూమికి మధ్య ఏర్పడ్డ అగాధాలను, తద్వారా వచ్చిన మార్పులు, ఆర్గనైజేషన్ తద్వారా పల్లెల సాంస్కృతిక జీవనంలో చోటు చేసుకున్న కృత్రిమత, మారిన విలువల బంధాలు చిత్రించకుండా పుటల్ని కాలాలు మారిన క్రమంలో వివరించుకుంటూ పరిగెత్తించారు రచయిత. ఈ క్రమంలో సాంస్కృతిక జీవనానికి ప్రాధాన్యతనిచ్చారు కాని ఆచారవ్యవహారాల్ని మాత్రం అంటీఅంటకుండా వదిలేశారు.

ఒక్కోసారి కొండమల్లయ్య ఓ పెట్టుబడిదారులా, మరీ ఎదగని, జీవితానుభవంలేని, మధ్య తరగతి వ్యక్తిలా కనబడతాడు. అతనికి పేగుబాధ తెలుసు, పెనుగులాటా తెలుసు కదా.

పెద్ద కొడుకు అన్నల్లో కలిసి చనిపోవటం, తిరుపతి మాటమాటకి రాడికల్సులో కలుస్తానని బెదిరించడం, నడిపివాడు రాజయ్యకూడా బెదిరించడం ఘోరంగా ఉంది. రాడికల్సులో కలవటం, మానటం సన్యాసుల్లో కలుస్తానన్నట్టు అంత కృత్రిమంగా జరుగుతాయా? బానిసపట్ల మోజుతో ఆ మాటని ఊతగా వాడుకున్నట్లు చూపటం బాగాలేదు. బావుల్లోపనికి రైతు ఎందుకు తరమబడ్డాడు. భూమి రైతుకు దూరమై రైతుకు భారంగా కదిలి గోదావరిఖనికి రావాల్సిన పరిస్థితులు మరీ విపులంగా విశదీకరించాల్సింది. దుర్భరమైన గనిజీవితంవైపు రైతు మొగ్గుచూపడానికి కారణం ఇక్కడ కమ్ముకున్న మార్కెట్ విపవలయం. రాజకీయాలు రైతు జీవితాన్ని అతలాకుతలం చేస్తున్న దమనకాండ అన్నది నిర్వివాదాంశంకదా.నవలలోఆద్యంతం చక్కని భాష, భావగర్భితమైన సంభాషణలు చోటుచేసుకోవడం నవలకు మంచి ఊపునిచ్చాయి. ముఖ్యంగా నానుడులు వాడుకున్న తీరులో కాలువ మల్లయ్యగారు. అభినందనీయులు. నవలలో మల్లయ్య భార్య,తల్లి, కూతురు, కోడలు పాత్రలు క్లుప్తీకరించారు. మరింత వివరించి ఉంటే సమగ్రంగా ఉండేవి. నవల అందించిన 'చతుర'వారికి, రచయితకు అభినందనలు.

-వఝుల శివకుమార్ ఫెర్టిలైజర్ సిటీ.

## మాండలికం అయినా

(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)

ఒక రైతు కుటుంబం కేంద్రంగా వ్రాసిన "భూమిపుత్రుడు" కరీంనగర్ మాండలికంలో ఉన్నప్పటికీ ఆ ప్రాంతపు రైతుల ఆర్థిక స్థితిగతులను చెప్పి ఆలోచింపచేసేదిగా వుంది. రచయిత ఒక గ్రామ రైతుకుటుంబాన్ని తీసుకొని వారు మాయామర్మం లేకుండా జీవిస్తున్నప్పటికీ, ఏవిధంగా చితికిపోయిందీ, దానికిగల కారణాలనూ కళ్లకు కట్టినట్లు చూపించుటలో కృతకృత్యులయ్యారు. ఒకపక్క అన్నల హడావిడి, మరోవక్క పోలీసుల వేధింపుతో బ్రతుకు దినమొకగండంగా ఎలా మారిందో చెప్పారు. నిరక్షరాస్యులైన బక్కరైతులు షావుకార్లవల్ల ఏవిధంగా దోపిడీకి గురై వడ్డీలబారిన పడుతున్నదీ వివరించారు. ఆస్తులు తెగనమ్మినా తీరని అప్పు, ప్రభుత్వం ప్రకటనలలో కీర్తించే అన్నదాతల దయనీయగాథల్ని చెప్పారు. మంత్రిగారి మీటింగ్‌లో ఎండ్రిన్ తాగి చనిపోయిన రైతు గురించిన ఆవేదనతో, ప్రభుత్వంయొక్క సహాయ సహకారాలెంతో తేటతెల్లమైనాయి. తన కుటుంబసభ్యులంతా పశువులతోపాటే ఎండ, వాన, చలిని సహిస్తూ ఎంత కష్టపడినా అతివృష్టి, అనావృష్టి మూలంగా కష్టం చేతికి వచ్చిందాకా నమ్మకంలేని బ్రతుకులు వారిని. ఆర్థిక ఆటుపోట్లు, అనుకోని కుటుంబ ఖర్చులకు షావుకార్లనుండి తెచ్చే రుణం మూలంగా వారికి నిజంగానే ఈ జన్మలో రుణవిముక్తి జరగదు. ఆఖరి కొడుకు తిరుపతయ్య నిరుద్యోగ విషయం జాలిగా వున్నా కొంత కల్పితంలా వుంది. తల్లి పోషణ గూర్చి కొడుకులు పడిన తర్జనభర్జన సహజంగా ఈ రోజుల్లో జరిగేదే అయినా పెద్దల సమక్షంలో సరైన పరిష్కారం చూపారు. అత్తాకోడళ్ల మధ్య వుండే సహజసిద్ధమైన స్పర్ధలనూ, బావా బావమరుదుల విందు, వినోదాలను, పండుగలయొక్క వేడుకలను జరిపేతీరు పల్లె వాతావరణాన్ని ప్రతిబింబించేలా అన్ని కోణాల్లోనూ సహజంగా తీర్చిదిద్దారు. పాతతరం అన్నదమ్ములకూ, కొత్త తరం అన్నదమ్ములకు సారూప్యం సరిగ్గా చూపించగలిగిన రచయితకు నా అభినందనలు.

-జి.శాంతి హైదరాబాద్.





## మానవవికాస కథనం

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

నిరుపేద రైతులు కూలీలుగా, కార్మికులుగా మారే మానవ కథావికాసాన్ని అందుకు దారితీసిన పరిస్థితుల్ని యదార్థ దృశ్యంలా చిత్రీకరించారు రచయిత. అందుకు ఆయన ఎన్నుకున్న కాన్వాస్ తగినంత విస్తృతి కలిగివుంది. కథనం తెలంగాణా గ్రామీణ పదజాలంతో మనను తనవెంట నడిపించగలుగుతుంది. కన్నతల్లి వంటి భూమిని నమ్మడమే తప్ప అమ్మడానికి ఎంత మాత్రమూ అంగీకరించక, విశ్రాంతెరుగని శ్రమతో నిరంతరం 'మట్టమట్టయి పన్జేసే' కొండమల్లయ్య కంటె నిజమైన భూమి పుత్రుడెవరు? సన్నకారు గ్రామీణ రైతు జీవితంలో వ్యధను, బీదరికాన్ని మాత్రమేకాక, సంబరాలను, సంతోషాలను కూడా దండలో దారంగా గుచ్చారు. తీవ్రమైన పరిశీలన శక్తో లేదా కఠోరమైన జీవితానుభవమో కలిగివుంటేనే తప్పఇటువంటి రచనఉద్భవించ దు. తల్లిని పంచుకోడానికి, తమ్ములను పంచాయితీకి పిలిపించడం 'అలాగే రాజయ్య, తన తండ్రికి డబ్బు సహాయం చేయలేనని చెప్పినప్పుడు తగ్గిపోయి, వాళ్లను సుఖంగా బ్రతుకమని చెప్పడం- ఆర్ద్రత కలిగించే సంఘటనలు ఈ నవలలో. మొత్తంగా 'భూమిపుత్రుడు' అన్న పేరు కొండమల్లయ్యకు సరిగ్గా అతుకుతుంది. అతనికి భూమే సర్వస్వం. భూమే తోడూ, నీడా! తన పరిస్థితులకు తన ఖర్మే కారణమనుకున్నాడుగానీ భూమినెన్నడూ నిందించలేదు.

రాజకీయ, పరిణామాలకూ, సాంఘిక పరిణామాలకూ, వ్యక్తి జీవితగమనానికీ, కల కార్యకారణ సంబంధం ఈ నవల ద్వారా రచయిత సమర్థవంతంగా విశ్లేషించారు. అయినా శైలిలోగాని, సంవిధానంలోగాని నూతనత్వం లేకపోవడంవలన, సబ్జెక్టు కొత్తది కాకపోవడంవలన- ముందెప్పుడో చదివిన ఒక మంచి పుస్తకం తిరిగి చదివినట్లయింది. ఈ రచయిత కలం మరికొన్ని మంచి నవలలు అందించగలదని ఆశిద్దాం.

-జె.వి.బి. నాగేశ్వరరావు సాలూరు

## సజీవ పాత్రలు

*(రూ. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

ఆరుగాలం కష్టం చేసినా భూమిగల రైతు, అప్పులపాలై భూమిని అమ్ముకొని పొట్టచేత్తో పట్టుకొని ఉన్న ఊరిని, ఆ సంబంధాలను వదులుకొని ఏవిధంగా వలసపోతున్నాడో ఇతివృత్తంగా రాసిన నవల 'భూమి పుత్రుడు' మానవ జీవితాన్ని ఆ జీవితంతో పెనవేసుకున్న మానవ సంబంధాన్ని పెట్టుబడిదారీ వ్యవస్థ ఏవిధంగా ఆర్థిక సంబంధాలుగా దిగజార్చిందో రచయిత నైపుణ్యంగా చిత్రించగలిగారు.

పెట్టుబడిదారీ వ్యవస్థ భూసంబంధాలను క్రమేణా మార్చడం, భూమిని నమ్ముకొన్న రైతుని ఈ వికృతమైన వ్యవస్థ ఎరువుల, పురుగుమందుల, షావుకార్ల, ప్రభుత్వ విధానాల రూపంలో ఎలా దోపిడీ చేస్తుందో కళ్లకు కడుతుంది ఈ నవల.

అయితే అందరికి తెలిసిన సమస్యను సమస్యగానే చిత్రించడంతో రచయిత బాధ్యత తీరదు. సమస్యా పరిష్కారాన్ని సూచించాలి. ఈ నవలలో తీసుకున్న భూసమస్య పరిష్కారంపట్ల రచయితకు పూర్తి అవగాహన లేకపోవడంతో నవల ఆసాంతం జరుగుతున్న రైతు ఉద్యమాల్ని ఉపేక్షించడం జరిగింది. అందుకే నవల ముగింపు మనల్ని నిరాశలో ముంచేస్తుంది. దీర్ఘకాలంకుగాని, పరిష్కారంకాని సమస్యను ఇతివృత్తంగా తీసుకున్న రచయిత అంతిమంగా 'ఈ సమస్య ఇంతే, దీన్ని ఎవరూ మార్చలేరు' అన్న నిరాశను మనలో ప్రేరేపించారు. అందుకే ఈ నవల, సమస్యను సమస్యలా చూపించటంవరకే విజయం సాధించింది.

రచయిత తన భావాలను, అభిప్రాయాలను పాత్రల ద్వారా చెప్పించటంలో విఫలం అయి, వివరణల ద్వారా చెప్పడం జరిగింది. పాత్రలన్నీ సజీవంగా ఉన్నాయి. ముఖ్యంగా కొండమల్లయ్య పాత్ర.

-యం. కృష్ణారావు చోడవరం

సంపుటి:15 సంచిక:1 ఫిబ్రవరి 1992

# చతుర

ఈనాడు... అందరికీ అందుబాటులో ఉన్న ఏకైక వినోదం సినిమా. నవరసాల
మేలుకలయికతో, చక్కని కథాకథనంతో, విశిష్టపాత్రలతో, సన్నివేశానికి తగిన
పాటలతో,సంగీతంతో కమనీయంగా రూపుదిద్దుకునే దృశ్యకావ్యం సినిమా. సకల
జనులకూ వినోదవిజ్ఞానాల్నందించే ఈ సినిమాని అతి తక్కువ ఖర్చుతో, రెండు
గంటలపాటు చూసివచ్చి బాగుందనో బాగోలేదనో తేల్చిపారేస్తాం. కానీ దానిని
తయారుచేయడానికి తెరపైన కనిపించే వారిదే కాక తెరవెనుకా ఎందరో సృజనశీ
లుల కృషీ, పట్టుదలా, ప్రతిభా అడుగడుగునా ఉంటాయి. నటులు, గాయకులు,
రచయితలు, కవులు, దర్శకులు, సంగీత దర్శకులు, నిర్మాతలు, ఫొటోగ్రాఫర్లు,
సాంకేతిక నిపుణులు... ఇలా ఎందరో తమలోని కళనూ, సమయాన్నీ, పరిజ్ఞానాన్నీ
శ్రమనీ ధారపోస్తేగానీ సినిమా తయారవదు.

ఇంతచేసే ఆ సినిమా కళాకారుల తెరవెనుక కృషీ, వారి సమస్యలూ, సాధకబాధకా
లూ ఎటువంటివి?

తెరకోసం తెరవెనుక జరిగే ఈ యజ్ఞాన్ని సమర్థవంతంగా ప్రదర్శిస్తూ వివిధ
అంశాల్ని ఆసక్తికరంగా చిత్రించిన

వినయ్ రచన

# తెరవెనుక

ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్రనవల

(ఈ నవలలో సినిమాల గురించిన చర్చల్లో కొన్ని నిజ జీవితంలోని పేర్లు ప్రస్తావించటం జరిగింది. అది పాఠకులకు సులువుగా అర్థంకావటం కోసం మాత్రమే తప్ప యదార్థజీవితంలోని అంశాలుకావు. ఈ విషయాలు ఎవరి మనసునైనా నొప్పించినా చివుక్కుమనిపించినా, అది ఉద్దేశపూర్వకంగా చేయలేదని గ్రహించి, మన్నించ ప్రార్థన -రచయిత)

అర్ధరాత్రి పన్నెండు గంటలు దాటింది. ఆ కాంపౌండులోంచి ఒక వ్యక్తి బైటికి నడిచి గేటును సమీపించాడు. అటూ ఇటూ వున్న చెట్లు వూగుతూ, వాటి నీడలు గేటుమీద పడుతూభయంకరంగాకనిపిస్తున్నాయి.ఆ వ్యక్తి గేటు దాటి, రోడ్డుపైన నడక సాగించాడు.

అదే సమయంలో ఆ ఊళ్ళోనే ఓ ఇంట్లో పడుకునున్న ఓ వ్యక్తి నిద్ర పట్టక అటూఇటూ దొర్లుతున్నాడు. చటుక్కున మంచం మీంచి లేచి, దిగి, పారా, మరో రెండు చిన్న వస్తువులు తీసుకుని, వీధిలో కొచ్చాడు. చుట్టుపక్కల గమనించాడు. ఎవ్వరూ లేరు. దూరంగా ఓ కుక్క మొరుగుతూంది. ఇంటి తలుపులు దగ్గరికేసి, అతను నడక సాగించాడు.

నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వున్న స్మశానం చేరుకున్నాడతను. ఒక సమాధి దగ్గరికెళ్ళి దాన్ని తవ్వసాగాడు. అప్పుడే స్మశానం దగ్గరికొచ్చిన మరో వ్యక్తి, ఓ చెట్టు చాటున నక్కి దాక్కుని ఇదంతా గమనిస్తున్నాడు.

ఓ కారు వేగంగా స్మశానంవైపు వస్తూంది.

సమాధి తవ్వుతున్న తను పారను పక్కన పడేసి, చేతుల్తో మట్టిని జరపసాగాడు. ఈలోగా మరో వ్యక్తి స్మశానానికి మరో వైపునుండి వచ్చి, అతన్నే గమనిస్తున్నాడు. చెట్టుచాటునున్న వ్యక్తి ఆశ్చర్యంగా చూస్తున్నాడు. గొయ్యి తవ్విన వ్యక్తి, గోతిలోని శవ పేటిక మూతను తొలగించాడు. దాన్లోకి తొంగిచూసి, నవ్వుకుని, మెల్లిగా ఆ శవాన్ని ముట్టుకోవటానికి చెయ్యి ముందుకు సాచాడు.

అదేక్షణంలో సమాధి పెట్టెలో వున్న శవం చెయ్యి సన్నగా కంపించసాగింది. ఆ వ్యక్తి అది గమనించలేదు. అతన్ని గమనిస్తున్న ఇద్దరు వ్యక్తులకు కూడా ఆ విషయం తెలిసే అవకాశం లేదు. ఓ సమాధిపైనున్న రాబందు మెడ పొడుగ్గా సాచి, వికృతంగా చూస్తూంది. ఆ విషయం తనకు మాత్రం తెలిసినట్టు ఓ గుడ్లగూబ చేరెడేసి కళ్ళు తెరుచుకుని నిశ్చలంగా కొమ్మపై నిలుచుంది. సమాధి తవ్విన వ్యక్తి చెయ్యి మరింత ముందుకు సాగింది. మరోక్షణంలో అతనిచెయ్యి శవాన్నితాకుతుందనగా, ఎందుకో అతని దృష్టి శవం ముఖం వైపు మళ్ళింది. సన్నని వెలుగు రేఖల్లో శవం కనురెప్పల్లో ఏదో కదలిక! అతనికి నమ్మబుద్ధి పుట్టలేదు. అంతలో నెమ్మదిగా శవం కళ్ళు తెరుచుకుంది!

అంతే...!

కెవ్వుమన్న కేక నిశ్శబ్దాన్ని నిర్దయగా హత్య చేసింది. వేర్వేరుగా అతన్నే గమనిస్తూన్న ఇద్దరు వ్యక్తుల్లోనూ భయం కదలాడింది. ఏం జరిగిందని అడుగుతున్నట్టుగా, సాచిన మెడను దగ్గరికి లాక్కుని, తలను అటూ ఇటూ కదిలించింది రాబందు. రెక్కలు టపటపలాడిస్తూ కొమ్మపైనుండి ఎగిరింది గుడ్లగూబ. సమాధి తవ్విన వ్యక్తి ఒక్క ఉదుటున లేచి పరుగు లంకించుకున్నాడు. చిక్కనైన అతని నీడ మరుభూమిపై కదుల్తూ ఒక్కసారిగా చెదిరిపోయి ఆగిపోయింది. మళ్ళీ భయంకరంగా అరిచాడతను. అట్నించి మరో దిక్కుకు తిరిగి, ప్రాణాలరచేతిలో పెట్టుకుని పారిపోయాడు.

చెట్టు చాటునున్న వ్యక్తి అక్కణ్నించి కదిలి గబగబా నడకసాగించాడు.

వేగంగా వస్తూన్న కారు ఒక్క కుదుపులో ఆగి, రివర్స్‌తీసుకుని, మరింత వేగంగా, వచ్చిన దారేపట్టింది. చచ్చిపోయిన నిశ్శబ్దం ఫీనిక్స్ పక్షిలాగా మళ్ళీ ప్రాణం పోసుకుని స్మశానమంతా ఆవరించుకుంది. కీచురాళ్ళ చప్పుడు దాన్ని చిన్నగా గిల్లి బాధిస్తూంది.

మరో మూల నిలుచున్న వ్యక్తి, తవ్వి తీసిన గొయ్యి వైపు ఒక్కో అడుగువేస్తూ, తదేక దీక్షగా చూస్తున్నాడు. నిర్వికారంగా వున్న కళ్ళు, నిశ్చలంగా చూస్తూ, ముందుకు కదులుతున్నాయి. కొద్ది క్షణాల్లో ఆ సమాధి దగ్గరికి చేరుకున్నాయి.

అప్పటికే శవపేటికలో లేచి కూచున్న శవం లోలకంలాగా నెమ్మదిగా ముందుకూ వెనక్కీ ఊగుతూంది. కస్సుమని శవం గుండెలో ఓ కత్తి దిగింది. చీమ చిటుక్కుమంటే వినిపించేంత నిశ్శబ్దం. నిర్వికారంగా చూస్తూన్న కళ్ళు మూణ్ణాలుగు క్షణాలు ఆ శవాన్ని నిశ్చలంగా చూసి, పక్కకు జరిగాయి.

చిక్కని చీకటి. చీకట్లోకి బ్యానర్ పేరు ఫేడిన్ అయింది. బ్యాక్‌గ్రౌండ్‌లో ఓ అమ్మాయి నవ్వు, సన్నగా, కమ్మగా. ఇప్పుడు పిక్చర్ పైటిల్. గాలిని కోస్తున్నట్టుగా అందెల చప్పుడు. క్రమంగా టైటిల్స్ పూర్తయ్యాయి. ఇంత సేపూ,

బ్లాక్ అండ్ వైట్ నెగెటివ్‌లో, మామూలుసై జులో వున్న పిక్చర్, సడన్‌గా సినిమా స్కోప్‌కు మారి, రంగుల్లోకొచ్చింది. టైటిల్స్ పూర్తయి కథ ప్రారంభమయింది.

మొదట చూపిన కాంపౌండ్‌లోంచి ఓ అమ్మాయి బైటికొచ్చి, సైకిల్ ఎక్కింది. ఆ అమ్మాయి తల్లోని...

★ ★ ★

"టెర్రిఫిక్ బాస్, ఓపెనింగ్ అదిరిపోయింది"

"బ్రహ్మాండం గురూ... థియేటర్లోకొచ్చిన ప్రేక్షకుడు నోరు తెరుచుకుని బిత్తరపోతూ చూస్తుంటాడు"

చక్రవర్తి చిన్నగా నవ్వాడు.

"ఇది ప్రొలోగ్. అంటే, ఈ సన్నివేశం కథ మధ్యలోంచి తీసుకుని, ప్రేక్షకుణ్ణి కట్టిపడెయ్యటానికి ముందుగా చూపిస్తున్నామన్నమాట. ఇలాంటి సంప్రదాయం నాకు తెలిసి మన తెలుగు సినిమాల్లో ఇంతవరకూ రాలేదు. ఇంగ్లీష్ సినిమాల్లో ఏమైనా వుందేమో తెలియదు" వివరించాడు.

"బాగుంది సార్... సరే గానీ ఇదంతా బ్లాక్ అండ్ వైట్‌లో ఎందుకు?" సందేహం వెలిబుచ్చాడు శ్రీరామచంద్రుడు. ఆయన ఆ సినిమాకు నిర్మాత.

"బ్లాక్ అండ్ వైట్‌లో ఎఫెక్ట్‌కోసం నెగిటివ్‌గా చూపిస్తాం. నెగెటివ్ ఎందుకంటే మనుమల పోలికలు స్పష్టంగా తెలియకుండా వుండటానికి. ఇక్కడ ఏ మనిషి ఎవరో ప్రేక్షకులు ముందుగా గుర్తుపడితే తరువాత కథ నడుస్తున్నప్పుడు సస్పెన్స్ పోతుంది మరి"

"బాగుంది సార్" సంతోషం వెలిబుచ్చిన శ్రీరామచంద్రుడు, మిగతా ఇద్దరి వైపూ తిరిగి, "మీరు మధ్యలో కామెంట్స్ చేయకుండా గమ్మున వినండి" అన్నాడు.

"నాతోమాత్రం అలా కుదరదండీ, ముందే చెబుతున్నాను. రైటర్ సార్, మీక్కూడా. నాకేమైనా సందేహాలుంటే ఎప్పటికప్పుడే అడిగేస్తాను. ఏమీ అనుకోవద్దు. లేకపోతే తరువాత చెప్పటానికి నాకు గుర్తుండదు" అన్నాడు గోవిందు.

"భలేవాడివి గోవిందూ. నీ యిష్టం. మన చక్రి ఏమీ అనుకోడు" అన్నాడు లక్ష్మణకుమార్. అతను నిర్మాత శ్రీరామచంద్రుడికి ఏకైక వారసుడు.

"నువు నోర్ముయ్యరా భడవా" సున్నితంగా కొడుకును మందలించిన శ్రీరామచంద్రుడు, చక్రివైపు తిరిగి, "మీరు కానియ్యండిసార్" అన్నాడు.

చిన్నగా నవ్వుకుని మొదలెట్టాడు చక్రి అన బడే చక్రవర్తి.

★ ★ ★

"అలా సైకిల్‌పైన బయలుదేరిన ఆ అమ్మాయి తల్లో ఓ గులాబీ పువ్వుంది. సైకిల్ ముందుకు నడుస్తోంది.

కట్ చేస్తే...

ఓ టీ కొట్టు బోర్డు చూపిస్తాం. 'అమితాబ్ చాయ్ పానీ టీ కొట్టు' అన్న బోర్డు. పేరుకు టీ కొట్టుకానీ ఇక్కడ మందుకూడా దొరుకుతుంది. ఆ కొట్లో అస్తమానమూ ఏవో పందాలు వేసుకుంటూ వుంటారు కస్టమర్లు. మన కథకు ముఖ్యమైన ఇద్దరు- డేవిడ్, బ్రహ్మయ్యలు అక్కడే వుంటారు. ఈ సీన్లో కూడా ఎవ్వరి ముఖాలూ చూపించం కానీ, మాటలు వినిపిస్తూంటాయి, ఓ. బీ. వాయిస్‌లన్నమాట"

"ఓ బీ వాయిస్‌లంటే?"

"ఔట్ బాడీ వాయిస్... అంటే మనిషి కనబడకుండా అతని మాటలు వినబడుతుంటాయి చూడూ, ఆ శబ్దమన్నమాట. ఉదాహరణకు గదిలో మనుమలు మాట్లాడుకుంటుంటే, 'అయ్యగారూ' అని వినిపిస్తుంది. ఆ పిలిచిందెవరో అప్పుడు కనబడదు. మాట్లాడుతున్న మనుమలు అటు తల తిప్పి చూస్తారు. అవసరమైతే, అప్పుడు కెమేరా అటు తిరుగుతుంది. ఆ మనిషి కనిపిస్తాడు. ఇలాగే ఓ పాత్ర మాటలకు ఫీలింగ్స్‌ని మరో పాత్ర నుండి ప్రేక్షకులకు చూపించినప్పుడు కూడా మనకు మాట్లాడుతున్న పాత్ర తెరపైన కనిపించదు. వింటున్న పాత్రే కనిపిస్తుంది. ఇలాంటివి ఓ బీ వాయిస్" వివరించాడు చక్రి.

"అలాగా... మరిప్పుడు ఓ బీ వాయిస్ ఎందుకు? ఈ ఫీలింగ్స్ ఎవరిమీద చూపిస్తాం?"

"ఎవరిమీదా చూపించం. అసలు మనుష లముఖాలు కనిపించవు. అదో టెక్నిక్. చూస్తున్నవాడికి ఇంటరెస్టింగ్‌గా వుంటుంది. ఇక మనకేమో మరో కారణముంది. చెబుతాను గానీ ముందు ఇది వినండి.

'ఛాలెంజ్' అన్నాడొకతను.

'నవ్వాల్ బస్తీమే' అన్నాడింకొకతను.

ఈ పాత్ర డేవిడ్. డేవిడ్ తెలంగాణా యాసలో మాట్లాడుతాడు. తమాషాగా వుంటుంది. బావుంటుంది. పోతే, ఇతను కొన్నాళ్ళు హైదరాబాద్‌లో వుండి వచ్చాడని మధ్యలో ఎక్కడో చెప్పిస్తాం. కనుక కథ వైజాగ్ పరిసరాల్లో జరుగుతున్నా డేవిడ్ తెలంగాణా యాస మాట్లాడటానికి రీజన్ ఇచ్చామన్నమాట...

ఓకే... ఇక సీన్లోకొద్దాం. ఒకతను ఛాలెంజ్, అన్నాడు.

'నవ్వాల్ బస్తీమే' అన్నాడు డేవిడ్.

"మన సినిమాలో యివే మొదటి మాటలు. 'ఛాలెంజ్' అన్నమాటతో మొదలవుతుంది సినిమా. సెంటిమెంటల్‌గా చూసుకుంటే ఇది మనందరికీ ఛాలెంజ్ కదా" నవ్వాడు చక్రి.

ముగ్గురూ కుతూహలంగా వింటూండటం గమనించి, కొనసాగించాడు

"'ఉబ్బర్ పందాలు కాదురా, నగం మీసం హడాల్స్' అన్నాడు మొదటి వ్యక్తి..."

"సార్... మా భాష ఇరికించారా" నవ్వాడు గోవిందు.

"అందరికీ అర్థమవుతుందా సార్" అనుమానంగా అడిగాడు శ్రీరామచంద్రుడు.

"ఉబ్బరుబ్బర్- అన్నప్పుడల్లా 'ఉట్టినే' అని అర్థమవుతుంది. ఇక 'హడాల్స్' అంటే ఊత పదం అనుకుంటారు. నెల్లూరు, ఒంగోలు, గుంటూరు, ఖమ్మంలో కూడా చాలా మంది వాడుతారివి. తెలిసినవాళ్లకు సరదాగా వుంటుంది. తెలియని వాళ్లకు నవ్వొస్తుంది. ఈ పాత్ర పేరు బ్రహ్మయ్య. ఎప్పుడు కనిపించినా ఫుల్లుగా మందుకొట్టి కనిపిస్తాడు. ఉబ్బర్, హడాల్, టర్కీ మూడూ ఊతపదాలు"

"టర్కీ కూడా పెట్టావా చక్రీ"

'టర్కీ' అంటే వాళ్ళ భాషలో 'అమ్మాయి' అనర్థం. అందరూ సన్నగా నవ్వుకున్నారు.

"అసలు ఈ ఊత పదాలు సినిమాల్లోనే వుంటాయి, ఎందుకు బాసూ?" ప్రశ్నించాడు లక్ష్మణకుమార్.

"సినిమాల్లోనే కాదు బాసూ, చాలామంది ఊతగా కొన్ని పదాలు వాడుతుంటారు. అందులో తమాషాగా వున్నవి నవ్వు పుట్టిస్తాయి. ఒకాయనకి 'అదే పది వేలు' అనటం అలవాటు. ఆయన కొన్న లాటరీ టిక్కెట్‌కు ఒక్క నెంబర్ తేడాతో పదిలక్షల బహుమతి తప్పిపోయి, లక్షరూపాయల బహుమతి వచ్చిందట. ఆ విషయమై ఓ మిత్రుడు సానుభూతి చూపించాడు.

'లక్షైనా వచ్చింది... అదే పదివేలు' అన్నాడాయన. ఆ మాట తమాషాగా వుంది. ఆయన భావంలో అదే ఎక్కువ అనర్థం. కానీ మాట చూస్తే తక్కువని బాధ పడుతున్నట్టు స్ఫురిస్తుంది. ఇంతకన్నా ఘోరం 'ఏదో మీ దయవల్ల' అనే మాట 'ఏమోయ్... కొడుకు పుట్టాడట కదా' అంటే, 'ఏదో మీ దయవల్ల' అన్నాడనుకోండి, అలవాటుగా..."

అందరూ నవ్వారు. మళ్ళీ కొనసాగించాడు చక్రి

"ఇక సినిమాల విషయానికొస్తే, మన లక్ష్మణకుమార్ అనే 'బాసూ' అనేది సినిమాల నుండి అయిన అలవాటే. గోవిందు అనే 'గురూ' కూడా 'పాతాళభైరవి' లో ఎస్వీ రంగారావును పద్మనాభం సంబోధించినదే. జనంలోకి అంతలా పాకిపోయింది. ఆకట్టుకునే ఊత పదాలతో నిలిచిపోయిన పాత్రలూ, వన్నె పెరిగిన పాత్రలూ మాత్రమేగాక జాతీయాలుగా భాషలో కలిసిపోయినవీ వున్నాయి. ఉదాహరణకు, 'బుద్ధిమంతుడు' లో అల్లురామలింగయ్య మాట, 'అమ్యామ్యా' ఈ స్టైయిల్లో మరో ప్రయోగంవుంది. కామెడీ క్యారెక్టర్ వృత్తిని బట్టి, ప్రతిచోటా వృత్తిపరమైన మాటలతో సంభాషణలు రాయటం. ఉదాహరణకు ఆ పాత్ర స్టేషన్ మాస్టరనుకోండి... మీ అమ్మ నడక గూడ్సు బండే... ఔటర్ సిగ్నల్ దగ్గరాగిన ట్రెయిన్లా ఎందుకలా అరుస్తావ్....? మీ పెళ్ళికి వచ్చినా గ్రీన్ సిగ్నలివ్వను... ఇలా వుంటాయి. ఇవి మోతాదు మించితే విసుగు పుట్టించే ప్రమాదం కూడావుంది. ఇక హాస్యపాత్రలకే కాక

విలన్ పాత్రలకూ కొన్ని ఊత పదాలు వాడుతారు. ఈమధ్య వచ్చిన 'స్పాట్‌పెట్ట' అనే మాట ఎంతగా పేలిందో మీకు తెలుసు. అవసరాన్ని బట్టి వాడిన ఊతపదాలు, ప్రేక్షకుణ్ణి ఆకట్టుకుంటే అటు పాత్రా నిలబడుతుంది. ఇటు ప్రేక్షకులకూ ఆసక్తిగా వుంటుంది''

''ఒరేయ్... రూం సర్వీసుకు ఫోన్ చేసి టీ చెప్పరా'' కొడుకుని పురమాయించాడు శ్రీరామచంద్రుడు.

ఐతే... ముందుగా తనే ఫోన్ అందుకుని టీ పంపించమని చెప్పాడు గోవిందు. అతనా సినిమాకి ప్రొడక్షన్ కంట్రోలర్. నిర్మాతకు బంధుత్వంలో దూరం వాడు. పరిచయస్తుల్లో దగ్గరివాడు. ఒకటి, రెండు సినిమాలకు పని చేసి, శ్రీరామచంద్రుణ్ణి సినిమా నిర్మాణంలోకి దింపింది అతనే. పూర్తి పేరు గోవిందరావ్. కానీ అందరికీ 'గోవిందు', 'గోవిందుగారు' అనటం అలవాటు.

గోవిందు ప్రోద్బలంతో ఓ సినిమాలో నాలుగు లక్షలు ఫైనాన్స్‌గా పెట్టాడు శ్రీరామచంద్రుడు. సినిమా ఫైనాన్స్‌లో వున్న ఆకర్షణేమిటంటే, అక్కడ మూడు నెలలకో టర్మ్. వడ్డీ నెలవారీగాకాక, టర్మ్‌వారిగా తీసుకుంటారు. అంటే, మామూలుగా నెల పూర్తికాకపోయినా నెల వడ్డీ వసూలు చేసినట్టు, టర్మ్‌లో ఎన్ని రోజులైనా సరే, పూర్తి టర్మ్ వడ్డీవసూలు చేస్తారు. అంటే మూడు నెలలకు ఓ టర్మ్ వడ్డీ కట్టిన నిర్మాత, ఆపైన మళ్ళీ ఎన్ని వారాలు గడిచినా సరే... మూణ్ణెల్లలోగా పూర్తి టర్మ్ వడ్డీ కట్టాలన్నమాట. కొందరు కన్సెషన్ ఇస్తారు, కొందరు ఇవ్వరు. అవన్నీ ఫైనాన్సియర్‌కూ, నిర్మాతకూ మధ్య వున్న సంబంధాలపైనా, సినిమా అమ్ముడయ్యే పద్ధతిపైనా ఆధారపడి వుంటాయి. వడ్డీకాక, ఒక్కోసారి అసలు కూడా కొన్ని సినిమాలమీద పోగొట్టుకున్న ఫైనాన్సియర్లూ వున్నారు.

సినిమాలో తొలిసారిగా డబ్బుపెట్టిన నాలుగో నెలకల్లా అసలూ, వడ్డీ కలిసి ఐదులక్షలు రావటంతో, గోవిందు మాటలకు ఉత్సాహం తెచ్చుకుని నిర్మాతగా అడుగేయటానికి పూనుకున్నాడు శ్రీరామచంద్రుడు. అదే సినిమాకి చక్రి మాటల రచయిత. సాధారణంగా మాటల రచయితలు షూటింగ్‌కు సెట్స్‌పైకి వెళ్ళరు. ఐతే... కొందరు దర్శకులు, అప్పటికప్పుడు తమకొచ్చే ఆలోచనలు కలుపుకుని, ఎప్పటికప్పుడు సంభాషణలు రాయించుకుంటారు. దర్శకుడూ అలాంటివాడే కావటంవల్ల షూటింగ్ జరిగినన్ని రోజులూ చక్రి లొకేషన్‌లోనే వుండాల్సొచ్చింది. ఆ సినిమాకు గోవిందు ప్రొడక్షన్ మేనేజర్. ఫైనాన్సియర్ హోదాలో లక్ష్మణకుమార్ కూడా లొకేషన్ కొచ్చాడు. ముగ్గురూ, రెండు మూడేళ్ళు అటూ ఇటూగా సమవయస్కులు కావటంతో పరిచయం బలపడింది. శ్రీరామచంద్రుడు తీయబోయే సినిమాకి చక్రిని కథ రాయమన్నారు. చక్రి ఓ కథ తయారుచేశాడు. మద్రాసులో హోటల్లో రూం తీసుకుని కథ విషయం చర్చలు మొదలెట్టారు.

నిర్మాతగా తనకూ, ప్రొడక్షన్ కంట్రోలర్‌గా గోవిందుకూ మొదటి సినిమాకనుక, సినిమా పూర్తయేవరకూ ప్రతి పనిలోనూ సలహాలిస్తూ తమతోనే వుండాలని శ్రీరామచంద్రుడు చక్రిని కోరాడు. చక్రి అప్పుడప్పుడే పేరులోకి వస్తూన్న రచయిత కనుకా, అలాంటి పరిచయాలు తనకూ వృత్తిపరంగా మంచిది కనుకా సమ్మతించాడు. స్నేహకారణంగానో, కృతజ్ఞత కారణంగానో, మంచితనం కారణంగానో, మొత్తానికి ప్రతీవిషయం వాళ్ళకు ఓపిగ్గా వివరిస్తూ పనులు జరిపిస్తున్నాడు చక్రి.

గోవిందు సలహా కారణంగా తను సినిమాల్లోకి దిగినందున అతని మాటను దాదాపుగా వేదవాక్కుగా పాటిస్తాడు శ్రీరామచంద్రుడు. ఐనా... డబ్బు విషయాల్లో అతన్ని పూర్తిగా నమ్మక, ప్రతీవిషయం చక్రినడిగి, వివరాలు తెలుసుకుని, గోవిందు మాటల్ని అనుసరిస్తుంటాడు. గోవిందు ఈ విషయం కనిపెట్టాడు. సాధారణంగా ప్రొడక్షన్‌లో పనిచేసే వాళ్ళంతా వ్యవహారదక్షులూ, లౌక్యంగా పనులు జరిపించి, జరుపుకునేవారూ అయివుంటారు. ఈ విషయంలో గోవిందు ప్రత్యక్షానుభవం తక్కువైనా చాలా తలపండిన వాడు. అందుకే శ్రీరామచంద్రుడికీ, ఆయన కొడుక్కీ నిర్మాతలనే గౌరవం ఇస్తూ, వాళ్లలోని అహాన్ని సంతోషపరుస్తూ, వాళ్ళకు అంతవరకూ తెలియని హోదానీ గుర్తుచేస్తూ, వ్యవహారం నడిపిస్తు





న్నాడు. చక్రిని 'నువ్వు' అనే పిలుస్తాడు కానీ, అతన్నీ తన దారిలోకి తెచ్చుకోవడానికి, అప్పు డప్పుడూ అతన్ని 'రైటర్‌సార్' అని మర్యా దగా సంబోధిస్తూ ఇతర్లముందు మీరు, గారు వంటి విశేషాణాలతో గౌరవిస్తుంటాడు. కొన్ని సినిమాలకు పనిచేసున్నందున, గోవిందు ప్రవ ర్తనలాంటిది అలవాటైపోయిన చక్రి అవేం పట్టించుకోడుగానీ నిర్మాతలిద్దరికీ అతని ప్రవ ర్తన చాలా సంతోషం కలిగిస్తూంటుంది. అందుకే, తను కొడుకుతో టీ చెప్పమని అలవా టుగా చెప్పినా, గోవిందు తనంత తానుగా చెప్పినందుకు శ్రీరామచంద్రుడు లోలోపల చాలా సంతోషించాడు. అతను సంతోషిస్తాడని తెలిసే గోవిందు అలా చెప్పాడు కూడా.

గోవిందు ఫోన్ పెట్టేయగానే చక్రి సిగరెట్ వెలిగించుకున్నాడు. గోవిందు కూడా సిగరెట్ వెలిగించాడు.

"మన రైటర్ సార్‌కు మందు అలవాటు లేదు కనుక బతికిపోతున్నాం. ఆయన టీ, కాఫీ, సిగరెట్లు ఎన్ని తాగితే మాత్రం మందు బిల్లుకు సరిపోతుంది" అన్నాడు గోవిందు.

"మీకు అలవాటు లేక, మేమూ మానేయా ల్సొచ్చింది" నవ్వుతూ అన్నాడు శ్రీరామ చంద్రుడు.

"మీరు తాగండి సార్ మిమ్మల్నొద్దన్నానా" తనూ నవ్వుతూ అన్నాడు చక్రి.

"ఇప్పుడు పట్టపగలు మందెందుగ్గానీ, కథ కానీ చక్రీ" అన్నాడు లక్ష్మణకుమార్.

"టీ తాగి, కథ మొదలెడదాం గానీ, ఆలో పల మరికొన్ని సంగతులు చెబుతాను కథ గురించే. బ్రహ్మయ్య కామెడీ పాత్ర. డేవిడ్ తెలంగాణా యాసతో నవ్విస్తాడు. ఇకపోతే, అమితాబ్, అంటే టీ కొట్టు ఓనరు. అది మరో కామెడీ పాత్ర"

"మనకు అమితాబెందుకు? చిరంజీవో, నాగార్జునో అని పెట్టుకోవచ్చు కదా?"అడిగాడు గోవిందు.

"అదే చెబుతున్నా... ఈ అమితాబ్, ఆ అమితాబ్ అభిమాని. ఈ పాత్ర వేసేదెవరో తెలుసా? మూడడుగుల మునెయ్య"

"పొట్టి మునెయ్యా!"

"అవును... అదే ఫన్నీగా వుంటుంది. త్రూ అవుట్ అమితాబచ్చన్ డ్రెస్సులు వేసుకుంటా డు పొట్టి మునెయ్య. ఒక్కోసీన్లో ఒక్కోడ్రెస్. అతని హొటల్లో వర్కర్లు కూడా మరుగుజ్జులే. వాళ్ళూ అదే డ్రెస్సు వేసుకుంటారు. మూడు మెట్లున్న బల్లతెచ్చి, టేబుల్ పక్కన వేసుకుని, సర్వ్ చేయటం, క్లీన్ చేయటం చేస్తుంటారు. ఇక మన అమితాబ్ అతను అమితాబచ్చన్ అభిమాని కదా. ఒక్కో అమితాబ్ పాటొకటి, సందర్భానికనుగుణంగా పాడుతుంటాడు. వీలుంటే, ఆ పాటమీద అమితాబచ్చన్ వేసిన స్టెప్స్ కూడా వేయించొచ్చు"

"టెరిఫిక్ బాస్"

"బ్రహ్మాండంగా వుంది"

"భలే ఫన్నీగా వుంది సార్"

అందరూ మెచ్చుకున్నారు. అంతలో టీలు రావటంతో, అందరూ టీలు తాగుతూ, ఆ సీన్లు ఎంతలా పండుతాయో, ఎలా నవ్విస్తాయో చెప్పుకున్నారు. టీ పూర్తి చేసి, ఫ్రెష్‌గా మరో సిగరెట్ వెలిగించుకుని, కథ మొదలెట్టాడు చక్రి.

"సరే... జూలీ అక్కడ అలా బయలు దేరింది. ఇక్కడ టీ కొట్లో సీన్... చెప్పలేదు కదూ, మన హీరోయిన్ పేరు జూలీ... జూలీకి క్రితం రోజు గులాబీ పువ్వు పెట్టుకురమ్మని తాను చెప్పాననీ, ఇప్పుడు పెట్టుకు రాకపోతే సగం మీసం తీసేస్తాననీ పందెంకాశాడు డే విడ్. పందెం సంగతైపోగానే 'ఖామూష్' అన్నా డు డేవిడ్. అంటే డేవిడ్ గొంతు విని పించింది. అంతసేపూ, టీ కలపటం, డబ్బు లు తీసుకోవటం, మందుపోసివ్వటం, వేర్వేరు యాంగిల్స్‌లో టీషాప్, ఇలా దృశ్యాలు చూ పిస్తూ, వాటిమీద మాటలు పోస్ట్‌చేస్తామన్న మాట... సరే... డేవిడ్ 'ఖామూష్' అనగానే అంతా నిశ్శబ్దంగా ఉండిపోయారు. 'నేను పాట పాడుత' అన్నాడు డేవిడ్ వెంటనే...

'జూలీ...ఐ లవ్ యూ' - హిందీ సినిమా పాట విజిల్ మొదలయింది.

వీధి మలుపులోంచి, ఆ వీధిలోకి తిరిగింది సైకిల్ మీదొస్తున్న జూలీ.

నెక్స్ట్ క్లోజ్ షాట్‌లో తల్లోని గులాబీ పువ్వు కనిపిస్తుండగా, కెమేరావైపు హైస్పీడ్‌లో తిరి

గింది జూలీ. సైకిల్ బ్రేక్‌వేసి, తలెగరేసి, జుట్టు వెనక్కేనుకుంది. ఇదీ హైస్పీడ్‌లోనే. ఒక్క క్షణం ఆలోచించి, చిలిపిగా నవ్వుకుని, తల్లోని గులాబీ తీసి, బ్యాగ్‌లో వేసుకుంది. సైకిల్ హైస్పీడ్‌లో ముందుకు కదిలింది. షాప్ గుమ్మం నజెషన్‌లో, షాప్ ముందు బ్రేక్‌వేసి, చేతివేళ్ళు జుట్టులోకి పోనిచ్చి, చిన్నగా నవ్వి, ముందుకు కదిలింది...''

''షాప్ గుమ్మం నజెషన్‌లోనా, అంటే ఏంటి బాస్?'' లక్ష్మణకుమార్.

''సింపుల్‌గా చెప్పాలంటే, గుమ్మంలో కెమేరా పెడతామన్నమాట. అక్కణ్ణించి జూలీ కనిపిస్తుంది. తెరనిండుగా ఓ మనిషో, వస్తువో వుండగా, ఆ పక్కనించి కెమేరాకు దూరంగా వున్నవాళ్ళు కనిపిస్తుంటారు. దీన్నే ఆ మనిషి లేదా వస్తువు నజెషన్‌లో చూపిస్తున్నామంటారు.''

''అవునుగానీ జూలీ రావటం హైస్పీడ్‌లో బాగుండదు బాస్. పిచ్చి పిచ్చిగా, జోకింగ్‌గా వుంటుంది''

లక్ష్మణకుమార్ మాటవిని, చిన్నగా నవ్వి, వివరించాడు చక్రి

''హైస్పీడంటే వేగంగా కదలటం కాదు. సాధారణంగా ప్రేక్షకులు దీన్ని 'స్లోమోషన్' అంటారు. గాల్లో తేలుతున్నట్టుగానో, నెమ్మదిగా కదిలినట్టో అనిపిస్తుంది. దీన్ని హైస్పీడ్‌లో చిత్రిస్తారు. మామూలుగా కెమేరా సెకనుకు 24 ఫ్రేములు చిత్రిస్తుంది. ప్రొజెక్టర్‌లో కూడా సెకనుకు 24 ఫ్రేములు కదులుతాయి. ఇది మామూలుగా కనిపిస్తుంది. హైస్పీడ్‌లో చిత్రించినప్పుడు కెమేరా సెకనుకు 32 ఫ్రేముల్లో, 48 ఫ్రేముల్లో, అవసరాన్నిబట్టి తిరుగుతుంది. ఐతే సినిమా చూపించే ప్రొజెక్టర్ వేగంలో మార్పుండదు. కనుక కెమేరా ఒక సెకన్లో చిత్రించిన 32 ఫ్రేముల్లో, 48 ఫ్రేముల్లో తెరమీద కనబడటానికి సెకనుకన్నా ఎక్కువ నమయం పడుతుంది. అందువల్ల కదలికలు 'స్లో'గా కనిపిస్తాయి. దీన్నే మీరు 'స్లోమోషన్' అంటారు, మేం 'హైస్పీడ్' అంటాం... తమాషా సన్నివేశాలు వేగంగా కదులుతున్నట్టు కనిపించే వాటిని కెమేరా 'స్లో మోషన్' లో అంటే సెకనుకు 16 ఫ్రేములు లేదా 12 ఫ్రేములు చిత్రిస్తే, అది తెరపైన వేగంగా కనిపిస్తుంది. అంటే హైస్పీడ్‌లో తీస్తే కదలికలు నిదానంగా, ప్రతీ కదలికా స్పష్టంగా, మనసుకు హత్తుకునేట్టు కనిపిస్తుంది. ఇక ఈ సీన్లో ఇందాక ఓ బీ వాయిస్‌లెందుకని అడిగారు కదూ. ఎందుకో అర్థమయింది గదా. ప్రేక్షకులకు కనిపించే మొదటి ముఖం హీరోయిన్ జూలీది. హీరోయిన్ ఇంట్రడక్షన్ హైస్పీడ్‌లో, బ్యాక్ గ్రౌండ్‌లో 'జూలీ... ఐ లవ్ యూ' పాట విజిల్‌తో, చాలా ఇంప్రెసివ్‌గా వుంటుంది.

సరే... కథలోకి వద్దాం! జూలీ కదిలి వెళ్ళగానే కట్ చేస్తే...''

''మాటిమాటికీ 'కట్ చేస్తే' అంటున్నారు. అంటే ఏంటిసార్?''

''అంటే... సీన్ మారిందన్నమాట. ఇక్కడ కట్ చేస్తే, నెక్స్ట్ సీన్లో కొచ్చామని అర్థం. సరే... కట్ చేస్తే క్లోజ్ షాట్‌లో డేవిడ్ నగం మీసం గొరుగుతూ బార్బర్ ఓ బీ వాయిస్‌లో అంటాడు. అంటే బార్బర్ కనిపించడు. మీసం గొరుగుతున్న బార్బర్ మాటలు వినిపిస్తున్నాయి-

''మా గొప్పగా పందెం కాయటానికి ఇదేమైనా అర్ధరాజ్యమా బాబూ, అర్ధమీసం'' అన్నాడతను.

చిన్న పంచ్, పంచ్ అంటే చమత్కారమైన మాట. మామూలుగా 'టిట్ ఫర్ టాట్' లాగా చెప్పేసమాధానాలకు 'మంచి పంచ్ పడాల్సార్' అని చెబుతుంటారు డైరెక్టర్లు. డేవిడ్ నగం మీసం ప్రహసనం ఐపోగానే కట్ చేస్తే

★ ★ ★

ఓ మధ్యతరగతి ఇల్లు. ప్రేమ్ అనే జర్నలిస్టూ, అతని చెల్లెలూ వుంటున్నారా ఇంట్లో. ఆ అమ్మాయి పేరు ప్రియ. పెళ్ళయిందిగానీ భర్త మిలిటరీలో వుండటంవల్ల, వదిలేసిన చదువు కొనసాగిస్తోంది. ఆమె జూలీకి స్నేహితురాలు, వయసులో కాస్త పెద్దదైనా, జూలీ క్లాస్‌మేట్.

హెడ్‌లైన్స్‌లోవున్న యుద్ధం వార్తలు చూసి, కోపంగా పేపర్ విసిరికొట్టి, తనకు తనే గట్టిగా అనుకోసాగింది

''అసలు మనుషులు యుద్ధాలెందుకు చెయ్యాలి? నరజాతి చరిత్ర నమస్తం రణరక్త





ప్రవాహసిక్తంగానే వుండాలా? యుద్ధాలు లేని సమాజమే రాదా?'' అని.

ఆక్రోశంతో ఉపన్యసిస్తున్న ప్రియ, తలమీద మొట్టికాయ పడగానే ఉలిక్కిపడి, తల తడుముకుంటూ, అన్నను చూసి నాలిక్కరుచుకుంది.

''నీ మొగుడు మిలటరీలో వున్నాడు గనుక యుద్ధాలొద్దా? అసలు చిన్నప్పుడు యుద్ధాలంటే ఎంత పడిచచ్చేదానివి''

ప్రేమ్ మాటలకు, జూలీ సైకిల్ బెల్‌తో అంతరాయం కలిగింది. గుమ్మంలో బ్రేక్‌వేసి, ఆగిన జూలీని చూసి, నిట్టూర్చాడు.

''సరే... బయల్దేరు. ఇల్లయినా ప్రశాంతంగా వుంటుంది'' అన్నాడు చెల్లెలితో, నవ్వుతూ

★ ★ ★

''కట్ చేస్తే...''

''బ్యాక్‌గ్రౌండ్‌లో డ్రమ్‌రోల్స్‌లాంటివి వినిపిస్తుండగా, టెన్షన్ బిల్డప్‌లో పరిగెడుతున్న ఓ దొంగ కాళ్ళు, ఆ వెనకే వస్తున్న ఓ ఇన్‌స్పెక్టర్ కాళ్ళు, వాళ్ళిద్దరి వెనకాలా ఓ పావురం ఎగిరొస్తూంది. దొంగ కాళ్ళు ఓ పొదలోకి దూరాయి. ఇన్‌స్పెక్టర్ కాళ్ళు తచ్చాడుతున్నాయి. పావురం పొదపైన వాలింది. పోలీసు కాళ్ళు పొదవైపు నడిచాయి. చటుక్కున ఆ దొంగ కాలర్ పట్టుకుని పైకెత్తిన ఆ పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఆరేళ్ళ జూలీ, ఆ దొంగ పదేళ్ళ విక్రమ్. ఆ షాట్‌నలాగే ఫ్రీజ్‌చేస్తాం. అంటే అది ఫోటో అయిందన్నమాట. ఆ ఫోటోనుండి వైడ్‌చేస్తే, దాన్ని ఇన్‌స్పెక్టర్ డ్రెస్‌లోవున్న విక్రమ్ చూస్తున్నాడు. అంటే, ఆ ఫోటోలోని ఫ్లాష్‌బ్యాక్ కథ యింతసేపూ చూపించామన్నమాట, కాస్త థ్రిల్లింగ్‌గా వుండాలని యిలా మొదలెట్టాం''

★ ★ ★

ఆ ఫోటోనే చూస్తూ బాల్యం గుర్తుతెచ్చుకుంటున్న ఇన్‌స్పెక్టర్ విక్రమ్,

''ఏంటి విక్రమ్, దొంగవు ఇన్‌స్పెక్టర్ వయ్యావు తమాషాగా'' అన్న ఫాదర్ మాటలతో ఈలోకంలోకొచ్చాడు.

చిన్నగా నవ్వి, అడిగాడు-

''ఈ లేడీ ఇన్‌స్పెక్టర్ ఎలా వుంది ఫాదర్''

''మరీ అల్లరిదైపోయిందయ్యా జూలీ'' అన్నాడు ఫాదర్ నిట్టూరుస్తూ.

ఫాదర్ మాటలకు తమ చిన్ననాటి చిలిపి చేష్టలు మెదిలాయి విక్రమ్ మనసులో. గోడపైనున్న ఫోటోవైపు మరోసారి చూసి, క్యాప్ తలపైన పెట్టుకుంటూ సెలవుతీసుకున్నాడు-

''వస్తాను ఫాదర్''

''ఎల్లుండి ఆదివారం కదా. నండే సర్వీస్ తరవాత ఇంట్లోనే వుంటుంది జూలీ'' నన్నగా నవ్వుతూ అన్నాడు ఫాదర్.

జూలీని చూస్తే బాగుణ్ణన్న తన మనసులోని తపనను ఫాదర్ కనిపెట్టడంతో, సిగ్గుపడి, చకచకా బైటికి నడిచాడు విక్రమ్.

జీపుస్టార్ట్ చేసి, రోడ్డుపైకెక్కించాడు.

అతని మనసులో చిన్ననాటి జ్ఞాపకాలు కదలాడసాగాయి.

★ ★ ★

అప్పట్లో ఊరికి చివర జూలీ ఇల్లు, ఆ చివర విక్రమ్ ఇల్లు ఐనప్పటికీ వాళ్ళిద్దరూ మంచి స్నేహంగా వుండేవారు. ఐతే విక్రమ్ ఇంట్లో జూలీ లేదా జూలీ ఇంట్లో విక్రమ్, అదీ కాకపోతే ఇద్దరూ సముద్రం ఒడ్డునో, తోటల్లోనో తిరుగుతూండేవాళ్ళు. అప్పుడు జూలీ ఓ పావురాన్ని పెంచుతుండేది. దాని పేరు రాణి. రాణంటే జూలీకి ప్రాణం. వాళ్ళ ఆటల్లో అదీ ఓ భాగం.

విక్రమ్ ఐదో క్లాసు పూర్తయ్యేసరికి, తరవాత చదువుకు పొరుగూరు వెళ్ళాల్సిరావటంవలనా, అతని అల్లరి తిరుగుళ్ళు ఎక్కువై చదువుమీద శ్రద్ధ తగ్గటంవలనా అతన్ని పట్నంలోని హాస్టల్‌కు పంపించాయి. డిగ్రీ పూర్తవగానే పోలీస్ ట్రైయినింగ్‌కు వెళ్ళి వన్నెండేళ్ళ తరవాత అదే ఊళ్ళోకి అడుగు పెట్టాడు. జూలీ ఇల్లు దాటే తమింటికి వెళ్ళాలి. ఛార్జ్ తీసుకుని, ముందు జూలీ ఇంటికే వచ్చాడు. జూలీ కనిపించలేదు. ఆమెను చూసిగానీ ఇంటికెళ్ళకూడదనుకుని, జూలీ కాలేజీ వైపు దారితీశాడు విక్రమ్. మళ్ళీ చిన్ననాటి సంగతులు.

ఓరోజు స్కూల్ అయిపోగానే పుస్తకాలు ఇంట్లో పడేసి, జూలీ ఇంటికి వెళ్ళేసరికి, రాణి

చచ్చిపోయింది. మునిసిపాలిటీ బండ్లో దాన్ని పడేయబోతుంటే జూలీ చూస్తూ ఏడుస్తూంది. తాను ఫాదర్‌ను ఒప్పించి, జూలీని ఓదార్చి, ఆ సమస్య పరిష్కరించాడు.

ఆ ఊళ్ళో శవపేటికలు తయారుచేయటంలో పేరొందిన వాడు తాగుబోతు బ్రహ్మయ్య. చుట్టు పక్కల పది పన్నెండు ఊళ్ళలో ఎవరికి శవపేటిక అవసరమైనా అతను చేయాల్సిందే. అతనితో చిన్న పెట్టె తయారుచేయించి, పావురాన్ని అందులో పెట్టి, సముద్రం దగ్గర ఓ చోట ఖననం చేసి, దాని సమాధి పక్కన ఓ చెట్టు నాటాడు విక్రమ్!

"విక్రమ్... ప్రతీ సంవత్సరం ఇక్కడికొచ్చి, రాణిని తలచుకోవాలి. ఎప్పుడూ మర్చిపోకూడదు" వెక్కుతూ చెప్పింది చిన్నారి జూలీ.

"రాణంటే నీకిష్టం కదా. నేనూ మర్చిపోను" హామీ ఇచ్చాడు తను.

పట్నంలో వున్నన్ని రోజులూ ఏటా రాణి చనిపోయిన రోజున ఓ పావురాన్ని కొని, దానికి స్వేచ్ఛ ప్రసాదించేవాడు. రాణి సమాధి దగ్గరి చెట్టు చాలా పెద్దదయి వుంటుందిప్పుడు- అనుకుంటూ, కాలేజీ దగ్గరకి రావటంతో గేటు ముందు జీపు నిలిపాడు.

విక్రమ్ జీప్ ఆగుతుండగా, గేట్లోంచి బైటికొచ్చింది జూలీ. సైకిల్ మీద వెళ్ళిపోతున్న ఆ అమ్మాయ్ తన చిన్ననాటి నేస్తం అని చప్పున గుర్తించలేని విక్రమ్, యింటిదారి పడుతున్న విద్యార్థుల్ని ఆసక్తిగా చూస్తూ జీపుకానుకుని నిలుచున్నాడు తాపీగా.

పది నిమిషాల్లో దాదాపు విద్యార్థులంతా వెళ్ళిపోయారు. అప్పుడే సిగరెట్ వెలిగించుకోబోతున్న విక్రమ్ దగ్గరికి, అంతకుముందు నుండీ అతన్ని గమనిస్తున్న వాచ్‌మన్ వచ్చి, సిగరెట్ అడుక్కున్నాడు. ఆ సిగరెట్ వెలిగించుకునే ధైర్యం చేయకుండా, చేతిలో పట్టుకుని ఆరా తీశాడు.

"ఏదైనా కేసు విషయమా సార్, ఆఁ?"

ప్రతి మాటలోనూ "ఆఁ?" అని ప్రశ్నించటమో, "ఆ!" అని ఆశ్చర్యపడటమో, "ఆ..." అని నిట్టూర్పటమో అతని అలవాటు.

సిగరెట్ వెలిగించుకుని, పొగ పీల్చి వదులుతూ తాపీగా బదులిచ్చాడు విక్రమ్-

"ఊహు, సైటు కొట్టడానికొచ్చాను"

గతుక్కుమని, "ఆ!" అని మరోసారి ఆశ్చర్యపడి, జాగ్రత్తగా అన్నాడు వాచ్‌మన్-

"అహాహా, నేనేమైనా సహాయం చేయగలనేమోననీ, ఆఁ?"

"పధ్నాలుగేళ్ళ కిందట..." ఎలా చెప్పాలో తెలియక ఆగిన విక్రమ్ మాటను పూర్తిచేశాడు వాచ్‌మన్.

"తప్పించుకున్న దొంగాండీ? ఆఁ?"

"యస్" నిట్టూర్చాడు విక్రమ్.

"ఫొటో చూపించండి, ఆ... చూస్తాను"

అప్పుడు అర్థమైంది విక్రమ్‌కు, ఇప్పుడు జూలీ ఎలా వుంటుందో తనకు ఖచ్చితంగా తెలియదని, ఆ విసుగును వాచ్‌మన్‌పై ప్రదర్శించాడు.

"ఫొటో లేదండీ" అనేసి, జీపెక్కి, రివర్స్ చేసుకుని వెళ్ళిపోయాడు.

"ఫొటో లేకుండా ఎలా గుర్తుపడతాడబ్బా, ఆఁ?" తనను తనే ప్రశ్నించుకుంటూ బుర్రగోక్కున్నాడు వాచ్‌మన్.



అది మాలినీదేవి ఇల్లు. ఆ ఊరు, ఆ ఊరే కాదు, ఆ చుట్టుపక్కల చాలా ఊళ్ల వాళ్ళకు ఆ ఇల్లు రాజమహల్. అదో అద్భుతం. ఆ ఇంటి అందం... అలంకరణలే కాదు, అందుకు కారణం, ఆమె అభిరుచికూడా. ఆ ఇంట్లో ప్రతి వస్తువు రెండేసి చొప్పున కనిపిస్తుంది. అదో అరుదైన హాబీ. ఏ వస్తువైనా రెండు చొప్పున కొంటుంది మాలిని. రెండూ ఒకే మోడల్, ఒకే రంగు, ఒకే పరిమాణంలో వుంటాయి. రెండు

కార్లు, రెండు టీవీలు, రెండు డైనింగ్ టేబుల్స్, రెండు ఫ్రిజ్‌లు, చివరకు అలంకరణకు తగిలించే షాండిలియర్లు, పెయింటింగులు, ఫొటోలు కూడా రెండేసి వుంటాయాఇంట్లో. కాలగమనంలో, జతలోని ఒక వస్తువు రూపు మార్చుకుంటే దాంతోపాటు రెండోది కూడా స్టోర్ రూంలోకెళ్ళిపోతుంది.

సాయంత్రం ఎనిమిది కావస్తూంది. విక్రమ్ భోజనం చేస్తున్నాడు. మాలిని వడ్డిస్తూంది.

"పనివాళ్ళంతా అదిరిపోయారంటేనమ్ము అత్తమ్మా"నవ్వుతూ అన్నాడు విక్రమ్, జరిగింది మళ్ళీ చెబుతూ.

"నోర్మూయ్యరా భడవా... డ్యూటిలో చేరిన మొదటి రోజే అబద్ధాలా" కసిరింది మాలిని, నున్నితంగా.

"మిమ్మల్ని అరెస్టు చేయాలనే సరికి తెల్లబోయాం అమ్మా" జరిగింది గుర్తుతెచ్చుకుంటూ వివరించాడు సింహాచలం. "ఇన్‌స్పెక్టర్ డ్రెస్సులో విక్రమ్‌బాబుననలు గుర్తుపట్టలేదు"

"ట్రైనింగులో కొంచెం తెలివెక్కువైంది వీడికి"

"మొదటి అరెస్టు నిన్ను చేస్తే బోణీ బాగుండేది కదత్తమ్మా"

"ఊర్కో బాబూ, నువ్వు మరీనూ" వారించాడు సింహాచలం.

ఏనుగు తల ఆకారంలో వున్న మగ్గులోంచి నీళ్ళు వంపుకుంటూ, టేబుల్ చివర అలాంటిదే మరో మగ్గు వుండటం గమనించాడు విక్రమ్.

"ఓహో... ఇంకొకటి అక్కడుందా? ఇదేమిట్రా... ఒక్కటే వుందీ అనుకుంటున్నాను"

"ఎందుకుండదు బాబూ... అమ్మగారు ఏది కొన్నా జత కొనాల్సిందే కదా"

"అవునత్తమ్మా, అన్నీ రెండేసి కొంటావు కదా, మరి నన్ను పెంచుకున్నప్పుడే మరొకర్ని ఎందుకు పెంచుకోలేదు?" చిలిపి సందేహం వెలిబుచ్చాడు విక్రమ్.

అతని మాటకు మరేదో గుర్తొచ్చి ఉలిక్కిపడింది మాలిని- 'ఏమే మాలినీ, అన్నీ రెండేసి కొంటావు, రేపు మొగుళ్ళను కూడా ఇద్దరిని కట్టుకోవుగదా కొంపదీసి-' చాలా ఏళ్ళకింద స్నేహితురాలు సరదాగా అన్నమాట గుర్తొచ్చింది. దాంతోపాటు గతంలోని ఏవో జ్ఞాపకాలు... తన భావాలు అక్కడున్నవాళ్ళకు కనిపించకూడదన్నట్టు వడివడిగా వంటగదిలోకి నడిచింది మాలిని.

★ ★ ★

జేబులో డబ్బులైపోయేదాకా తాగి, టీ తాగుతున్న డేవిడ్ దగ్గరికొచ్చి కూర్చున్నాడు బ్రహ్మయ్య. డేవిడ్ టీ తాగటం పూర్తిచేసి, వక్కపొడి వేసుకుని, సిగరెట్ వెలిగించుకున్నాడు. అతని జేబువంకే చూస్తూ కూర్చున్నాడు బ్రహ్మయ్య. అది గమనించాడు డేవిడ్-

"ఏంది బే... గట్ల జూస్తున్నవ్?" సగం మీసమున్న పై పెదవి తడుముకున్నాడు.

"వన్ పెగ్ హడార్స్, ప్లీజ్" పెదాలు తడుపుకుంటూ బతిమాలుకున్నాడు బ్రహ్మయ్య.

"ఏందీ?" కోపంగా చూశాడు డేవిడ్.

"ఒరే జిఫాల్, టీలూ, సిగరెట్లూ యివన్నీ ఉబ్బరుబ్బర్రా. ఒక్కసారి హడాల్ చేసి చూడూ, ఆ మజా" హితబోధ చేశాడు బ్రహ్మయ్య.

అమితాబ్ తనకు అరువివ్వడనీ, డేవిడ్ అప్పివ్వడనీ కాస్సేపటికి అర్థంచేసుకున్న బ్రహ్మయ్య, డేవిడ్‌ని పందెంలోకి దింపాడు. మిగిలిన సగం మీసాన్ని తడుముకున్న డేవిడ్‌కు ఏదో ఆలోచనొచ్చింది. వెంటనే ఒప్పుకున్నాడు-

"ఇయ్యాల జూలీ పోరి సైకిల్ ఆగబట్టి... వ్వా... ముద్దుబెట్టుకుంట. లేకపోతే సగం మీసం తీసేస్త"

అంతా అదిరిపోయారా పందానికి. అమితాబ్ పాట మొదలెట్టాడు-

"జుమ్మా చుమ్మా దేదే చుమ్మా... జుమ్మా చుమ్మా దేదే చుమ్మా"

డేవిడ్ ఉరిమి చూడటంతో ఠక్కున పాట ఆపేశాడు. అంతా ఉత్కంఠగా ఎదురు చూస్తున్నారు. క్షణాలూ, నిమిషాలూ దొర్లిపోతున్నాయి. సైకిల్‌మీద వెళుతున్న జూలీ, అలవాటుగా టీ కొట్టుముందు బ్రేక్ వేసి, చిన్నగా నవ్వింది. అందరూ డేవిడ్‌వంక చూస్తున్నారు. డేవిడ్ కదలిక లేకుండా కూచున్నాడు. జూలీ కదిలి వెళ్ళిపోయింది. వెంటనే హుషారుగా లేచి

గంతులేసాడు డేవిడ్-

"వున్న నగం మీసం లొల్లిపొయిందీ... హెల్ప్... హెల్ప్..."

అమితాబ్ సీరియస్‌గా చూసి, డేవిడ్ దగ్గరికొచ్చి, మూడు మెట్లబల్ల పైకెక్కి, డేవిడ్ ముఖంలో ముఖంపెట్టాడు

"నగం మీసం అంటే యిదంతా కాదు, ఉన్నదాంట్లో నగం"

★ ★ ★

టీ కొట్టు దాటి యాభై గజాల దూరం వెళ్ళేసరికి జూలీ సైకిల్ టైర్‌కు పంక్చర్ పడింది. నిస్పృహగా చూస్తూ, సైకిల్ దిగింది జూలీ. దగ్గర్లో పంక్చర్ వేసేవాళ్ళెవరూ లేరు. ఏంచేయాలా అని ఆలోచిస్తూ నిలుచుంది.

తనకు మందు దొరికే మార్గంలేక బైటపడ్డ బ్రహ్మయ్య, ఒంటరిగా నిలుచున్న జూలీని చూసి విషయం ఆరా తీశాడు. అతను తెలిసిన వాడే కనుక పది రూపాయలు తీసిచ్చి, సైకిల్ ఇచ్చింది జూలీ. బ్రహ్మయ్య వెళ్ళిపోగానే, వాచీలో టైం చూసుకుని నిట్టూర్చి, రెండడుగులు పక్కకు జరిగి నిలుచుండిపోయింది.

ఆ ఊళ్ళోకెల్లా రద్దీగా వుండే రోడ్డది. వచ్చేపోయే వాహనాలని గమనిస్తూ నిలుచున్న జూలీ, హఠాత్తుగా తన ముందెవరో నిలుచునేసరికి ఉలిక్కిపడి ముందుకు చూసింది.

మోటర్ సైకిల్ బ్రేక్‌వేసి, ఆగి, జూలీనే చూస్తున్నాడో యువకుడు. ఇరవై ఇరవయ్యొయిదేళ్ళ మధ్య వయసుంటుంది. చూట్టానికి చదువుకున్నవాడిలాగే వున్నాడు. మనిషిలో వెకిలిదనం లేదు. కానీ, తననలా పైనించి కిందిదాకా ఎగాదిగా చూట్టం, అందునా, మోటర్ సైకిల్‌మీద వెళుతున్నవాడు ఆగి మరీ చూట్టం ఇబ్బందిగా అనిపించి చూపు మరల్చుకుంది. అతను నన్నగా నవ్వుతూ అక్కణ్ణించి కదిలాడు. 'స్టుపిడ్' లోలోపలే గొణుక్కుంది జూలీ-

రెండు మూడు నిమిషాల తరవాత, అతను యిందాక వచ్చినవైపునుండే మళ్ళీ అదే మోటర్‌సైకిల్‌పై వస్తూ కనిపించాడు. జూలీ ఆశ్చర్యపడింది. అంతలో ఆమెముందు ఆగి, ఎగాదిగా చూసి, కదిలి వెళ్ళి పోయాడు. మండిపోయింది జూలీకి. బ్రహ్మయ్యకోసం చూసింది. మోటర్‌సైకిల్ కనుమరుగయ్యింది. బ్రహ్మయ్య జాడ మాత్రం కనిపించలేదు. విసుగ్గా టైం చూసుకుంటూ ఉలిక్కిపడింది. ఇందాక వచ్చినవైపునుండే మళ్ళీ వస్తూ కనిపించాడు అతను. అంటే, తనను దాటి వెళ్లి, ఎడంవైపు నందులోకి తిరిగి, మళ్ళీ రెండుసార్లు ఎడంవైపు మలుపులు తిరిగి, మళ్ళీ మళ్ళీ ఒకేవైపునుండొస్తున్నాడన్నమాట ఓ నిర్ణయానికొచ్చినట్టుగా, దూరంగా వస్తున్న అతన్నే చూస్తూ వుండిపోయింది.

జూలీ ముందుకు రాగానే మళ్ళీ బ్రేక్ వేశాడతను. చప్పున రెండడుగులు ముందుకు వేసింది జూలీ

"ఏయ్ మిస్టర్... ఇక్కడేమైనా స్పీడ్ బ్రేకరుందా? ఇక్కడికి రాగానే మోటర్ సైకిల్ ఆగిపోతూంది?"

అతను సిగ్గుపడ్డట్టు కానీ, తప్పు చేసినట్టు కానీ కనిపించలేదు. జూలీ ప్రశ్నకు బదులుగా నన్నగా నవ్వాడు. నవ్వి, స్పీడ్ బ్రేకరేదీ లేదన్నట్టు తల అడ్డంగా ఊపి, తర్జనితో జూలీ తలపై భాగం వైపు చూడమన్నట్టు చూపించాడు. అనంకల్పితంగా పైకి చూసింది జూలీ.

"stop, look, and proceed

ఆగి, చూచి, వెళ్లండి" - అనే ట్రాఫిక్ బోర్డుందక్కడ.

ఆ బోర్డును చూడగానే అప్రయత్నంగా జూలీ పెదాలపైకి నవ్వొచ్చి నిలుచుంది. జూలీ నవ్వటంతో అతనికి మరింత హుషారొచ్చింది

"అయామ్ మురళి... బై" అంటూ బ్రేక్ పైనించి కాలు తీశాడు.

చురుగ్గా చూసింది జూలీ. అప్పటికే మురళి వెళ్ళిపోయాడు. తనలోతను నవ్వుకుంటూ, ఆ బోర్డును మరోసారి చూసి, దానికి దూరంగా జరిగింది. మురళి మళ్ళీ రాలేదు. అతన్ని ఎప్పుడూ చూసిన గుర్తులేదు. ఊరికి కొత్తగా వచ్చాడేమో, లేక ఏదో పనిమీద వచ్చాడేమో అనుకుంది.

మరో పదినిముషాలకు పట్టి చేతుల్తో, తూలుతూ వస్తున్న బ్రహ్మయ్య కనిపించాడు. అత





ను దగ్గరికి రాగానే కంగారుగా అడిగింది

"బ్రహ్మయ్యా, సైకిలేది?"

ఓసారి జూలీని చూసి, ఏదో చెప్పబోయి చెప్పలేక, ముందుకు అడుగేయబోయి, టప్పున తూలి ఫుట్‌పాత్‌పైన పడ్డాడు బ్రహ్మయ్య. పడిన వాడు లేచే ప్రయత్నమేదీ చేయకుండా అలాగే నిద్రలోకి జారిపోయాడు. నిస్పృహగా చూసి తల బాదుకుని, నిస్సహాయంగా క్రాస్ చేసుకుంటూ దేవుణ్ణి తలుచుకుంది జూలీ.

★ ★ ★

"సంఘమునకు రాని వారిని, రాలేనివారిని సైతం దీవించి స్వస్థపరచుము- ఆమెన్"

అందరూ "ఆమెన్" అని పలికారు. అందులో ఓ గొంతు కాస్త పెద్దగా వినిపించింది. రెండుమూడుసార్లు అలా వినిపించటంతో వెనక్కి తిరిగి చూసింది జూలీ. తననే దొంగ చూపులు చూస్తున్న మురళి కనిపించాడు.

ముందు రోజు జరిగిన సంఘటన గుర్తొచ్చింది జూలీకి. అతను తననాకర్షించటానికి ప్రయత్నిస్తున్నాడన్నమాట. అలా అనిపించగానే కళ్ళు మూసుకుని, ప్రార్థించుకుని, లేచి చర్చ్‌లోంచి బైటపడింది.

సండే సర్వీస్ అయిపోగానే చాలామంది వెళ్ళిపోయారు. వేదికపైన ఫాదర్, మరికొందరు మాత్రం, కళ్ళు మూసుకుని తమలోతాము ప్రార్థించుకుంటున్నారు. మరి కాసేపటికి ఫాదర్ కళ్ళు తెరిచి చూసేసరికి అక్కడ మురళి ఒక్కడే కళ్ళు మూసుకుని ప్రార్థన చేసుకుంటూ కనిపించాడు. అతను ఆ చర్చ్‌కు రావటం తొలిసారని గ్రహించాడు ఫాదర్. అంతకన్నా, పాతికేళ్ళుకూడా లేని ఆ యువకుడిలో అంత భక్తి భావం వుండటం ఆయనకు సంతోషం కలిగించింది. అతన్నే చూస్తూ నిలుచున్నాడు.

★ ★ ★

ఆరోజు విక్రమ్ భోజనానికొస్తాడని ఫాదర్ చెప్పిన విషయం గుర్తుంది జూలీకి. వంటలో సహాయంకోసం, చర్చ్‌నుండి ఇంటికెళుతూ ప్రియను తీసుకుని వెళ్ళింది.

వాళ్ళిద్దరూ ఇల్లు చేరిన గంటకల్లా విక్రమ్ వచ్చాడు. అతనికారు చప్పుడు వినగానే ఓ చిలిపి ఆలోచనొచ్చిన జూలీ-

"ఒక్కనిముషం, వస్తున్నాను... కూచోండి" అని లోపల్నించే చెప్పింది.

పన్నెండేళ్ళ తరువాత తన చిన్ననాటి నేస్తాన్ని చూడబోతున్నానన్న ఉద్వేగం విక్రమ్‌లో వుందిగానీ, జూలీలో చిలిపితనం మాత్రమే వుంది.

ఫాదర్ యింకా రాలేదు కనుక తనలా నటించమని ప్రియకు చెప్పి, బలవంతంగా ఒప్పించి ఆమె చేతికి టీ కప్పు యిచ్చి, ముందు గదివైపు తోసింది ప్రియని. ఆఖరి క్షణంలో గుర్తొచ్చి, ప్రియ నుదుటవున్న బొట్టు స్టిక్కర్ తీసేసి, ధైర్యంగా భుజం తట్టింది. ప్రియ హాల్లోకి వెళ్ళింది బెరుగ్గా. పక్కగదిలోకొచ్చి, తమాషాను చెవులారా వింటూంది జూలీ.

టీ కప్పుతో అడుగుపెట్టిన ప్రియని చూసి చటుక్కున లేచి నిలుచున్నాడు విక్రమ్. విస్మయంగా కుతూహలంగా ఆమె వైపు చూస్తూండిపోయాడు.

"హ...హలో" పలకరించింది ప్రియ.

"మీరు... నువ్వు... జూలీ?" తడబడ్డాడు విక్రమ్.

"యస్.. నేనే జూలీ?" టక్కున చెప్పింది ప్రియ. చెబుతూ గోడమీది ఫొటో వంక చూస్తున్న విక్రమ్‌ని పరీక్షగా చూసింది. ఐదడుగుల తొమ్మిదంగుళాల ఎత్తు, కండలు తిరిగిన దేహం, చురుకైన కళ్ళు, వంకీలు తిరిగిన పోలీసు మీసం... అతణ్ణి చూడగానే తనున్న పరిస్థితి మరిచిపోయింది ప్రియ. మిలటరీలో వున్న తన భర్త గుర్తొచ్చి మనసు తీయగా మూలిగింది.

"చాలా మారిపోయావు జూలీ" సిగ్గుపడుతున్న ప్రియను అప్పుడు పలకరించాడు మళ్ళీ "బావున్నావా?"

"మీరే చెప్పాలి, బావున్నానా?"

"మీరు అని కొత్తగా పిలుస్తున్నావేంటి?"

"ఆ మొదటిసారికదా" కంగారులో అనేసి, సర్దుకుంది ప్రియ- "అంటే, చాలా రోజుల తరువాత కలుసుకున్నాంకదా..."

"ఇన్నేళ్ళలో నేనెప్పుడైనా గుర్తొచ్చానా జూలీ?"



"ఎలా వస్తారు? మీరిలా వుంటారని నాకేం తెలును" అనేసి నాలిక్కరుచుకుంది ప్రియ- "అంటే, అదే, మీ పర్సనాలిటీ, మగతనం నిండిన ఆ చూపులు, ఆ మీసం, అచ్చం నేను కలలు కన్న రాకుమారుడిలా వున్నారని ఎలా తెలుస్తుంది?"

ప్రియ ధోరణి అప్పటికి గమనించాడు విక్రమ్. అతనికి అయోమయంగా అని పించింది. ఆశ్చర్యంగా అడిగాడు.

"జూలీ, అసలు నువ్వేం మాట్లాడుతున్నావో అర్థం కావటంలేదు"

లోపల్నించి వింటున్న జూలీ, ప్రియ మాట లకు తలబాదుకుంది. ఆమెను లోపలికెలా పిలవాలా అని ఆలోచిస్తూంది. అంతలో సంభాషణ మళ్లీ కొనసాగింది.

"అయ్యో... టీ తీసుకోండి... తీసుకోండి. టీ కూడా వయసులాటిదే కదూ! వేడిగావున్నప్పు డే రుచిగా వుంటుంది"

"నేను మళ్ళీ వస్తాను జూలీ"

"విక్రమ్... ఎంతసేపైంది నువ్వొచ్చి? అప్పు డే వెళతానంటున్నావు..." ఫాదర్ గొంతు విన గానే కంగారుపడింది జూలీ. కానీ చేసేదేం లేక లోపల వుండిపోయింది.

ఫాదర్‌ని చూడగానే తలదించుకుంది ప్రియ. లోపలికి వెళ్ళబోయింది.

తాను జూలీ అనుకుంటున్న ప్రియ ప్రవ ర్తన కారణంగా వెళ్లాలనుకుంటున్నానని చెప్ప లేని విక్రమ్ తడుముకున్నాడు.

"ఏం లేదు ఫాదర్... కాస్త పనుందని వెళతా నంటున్నాను"

"భోజనం చేసి వెళ్లొచ్చుగదా" విక్రమ్‌కు నచ్చి చెప్పి, లోపలికి వెళ్లబోతున్న ప్రియను అడిగాడు ఫాదర్- "ఏమ్మా ప్రియా... జూలీ లేదా?"

విక్రమ్... ప్రియ వైపు ఆశ్చర్యంగా చూశా డు.

"ఫాదర్... ఈ అమ్మాయి... జూలీ కాదా?"

"సారీ ఫాదర్... సారీ విక్రమ్ గారూ" అనేసి లోపలికెళ్ళింది ప్రియ.

"దీని అల్లరికి అంతులేకుండా పోతూంద య్యా" నిస్సహాయంగా నిట్టూర్చి, జూలీని పిలిచాడు ఫాదర్... కాస్త కోపంగా- "జూలీ... రా యిలా"

దగ్గరవుతున్న అందెల రవళి విని, కుతూ హలంగా గుమ్మం వైపు చూశాడు. ఒక అంద మైన చెయ్యి గుమ్మం పక్కనుండి వచ్చి, కర్టె న్‌ని లాగి గుమ్మాన్ని కప్పేసింది. మళ్లీ రెండ డుగులు వేసినట్టు గజ్జెల చప్పుడు విని పించింది. కర్టెన్ కిందనుండి, అవల వైపు నిలుచున్న జూలీ కాళ్లు, వాటికున్న అందెలూ కనిపిస్తున్నాయి. ఏమిటని అడిగినట్టు ఒక కాలి గజ్జెలు ఘల్లు, ఘల్లుమని మోగాయి. వస్తున్న నవ్వుని అపుకున్నాడు ఫాదర్. 'ఘల్లు ఘల్లున గుండె ఝల్లన కదలి ఆడెను కన్నెకా ళ్లు' విక్రమ్‌కు గుర్తొచ్చింది.

"భయం చాలుగానీ రా యిలా" అన్నాడు ఫాదర్.

నెమ్మదిగా కర్టెన్ పక్కకు జరిగింది. జరుపు తున్నవి అందమైన చేతి వేలికొనలు-మెల్లమె ల్లగ హృదయవీణను మీటగలవీ లేత వేళ్లు... జరుగుతున్న తెర చాటు పూర్తిగా తొలగింది- 'మబ్బు విడిచిన చంద్రబింబం మగువ చక్కని వదనము-పూర్ణిమ నీవు, పొంగే కడలిని నేను' ఎక్కడో విన్న కవిత్వం అంచెలంచెలుగా గుర్తొస్తూంది విక్రమ్‌కు.

భయం తెచ్చి పెట్టుకుని, తల దించు కుంది జూలీ-

"హలో గుడ్ మార్నింగ్ విక్రమ్"

"హలో" జాగృత స్వప్నంలో ఊగులాడుతు న్నాడు విక్రమ్.

"అయాం సారీ విక్రమ్" మెల్లిగా తల పైకెత్తి మెల్లెకళ్ళు పెట్టింది.

"అనుకోకుండా అటుచూసిన ఫాదర్ ఫక్కున నవ్వాడు. విక్రమ్ కూడా నవ్వాపుకోలేక పోయాడు. జూలీ జత కలిపింది. క్రమంగా నవ్వుల స్థాయి పెరిగింది.

కిటికీలోంచి విక్రమ్‌ను చూస్తూన్న ప్రియకు గుండెలో గులాబీ ముల్లు గుచ్చుకున్న భావన. ఏవో లోకాల్లో తేలుతూ తమకంగా కళ్ళు మూసు కుంది.

★ ★ ★

ఇంటిదారి పట్టిన విక్రమ్ మనసు గాల్లో




తెలిపోతూంది. ఇన్నేళ్ల తరవాత కలిసినా జూలీ తన మీద ట్రిక్స్ ప్రయోగించింది. అంటే తనను జూలీ మరచిపోలేదు. తన మనసులో జూలీకున్న స్థానమే తనకు ఆమె మనసులో వుండి వుంటుందన్న తలపు అతన్ని ఉక్కిరి బిక్కిరి చేసింది.

రోడ్డు గానీ, పరిసరాలుగానీ, ఏవీ కనిపించ టంలేదు. ఇంటికిచేరి కారు ఆపటం, బూట్లు విప్పకుండానే తన గదిలోకి వెళ్లడం ఏదీ గుర్తులేదు. గదిలోవున్న టేప్ రికార్డర్ ఫుల్ వాల్యూమ్‌లో పెట్టి దాన్ని ఆన్ చేశాడు.

చౌరాసియా బాసుర్, అసుర సంధ్యవేళ ఉషోదయాన్ని లాక్కొస్తోంది. విక్రమ్ మనసు వలపు ప్రభాత తుషార ప్రభావంలో పులకించి పోతూంది. చురుకుమంటున్న అరుణకిరణా లకు కరిగిపోతూంది. ఝరీ సరితమై శివమె త్తిన శిఖలెత్తిన తరంగ సదృశ్యమై నాట్యం చేస్తోంది. ఇల్లంతా మార్మోగిపోతున్న వేణునాద నిస్వనానికి మాలినీదేవి అచ్చెరువంది తొంగి చూసింది. వంటగదిలోవున్న వంట గత్తెనుండి గేటు దగ్గరున్న గూర్ఖావరకూ దానివెన్క పక్షీంద్రుడును, వాని వంచను భగటీ శంఖ చక్రనికాయంబును అన్నట్టుగా ఒకరివెనుక మరొకరువచ్చి విక్రమ్ గదిముందు సోలువుల్లో నిలుచున్నారు.

కాస్సేపటికి అనుకోకుండా గుమ్మంవైపు తల తిప్పిన విక్రమ్ మాలినిని గమనించి చటు క్కున నాట్యం ఆపేశాడు. సిగ్గుతో ముడుచుకు పోతూ టేప్‌రికార్డర్ బటన్ నొక్కాడు.

నిశ్శబ్దం... ఆశ్చర్యంగా గదిలోకి తొంగి చూ స్తున్న పనివాళ్ళు కనిపించేసరికి మరింత యిబ్బంది పడ్డాడు. ఏం చేయాలో తెలియక, చటుక్కున మోకాళ్ల మీద కూచుని మాలిని కాళ్ళు కళ్ల కద్దుకున్నాడు. మరింత అయోమ యంలో పడిన మాలిని అప్రయత్నంగా విక్రమ్ తలపై చేయివుంచి దీవించింది.

★ ★ ★

కాంపౌండ్‌లోకి ప్రవేశించిన జూలీ ఆశ్చ ర్యంగా చూసింది.

వాకిట్లో ఫాదర్ ముందు కూర్చుని బైబిల్ వింటున్నాడు మురళి. పోస్ట్ బాక్స్‌లోని ఉత్తరా లు తీసుకుని, తిన్నగా లోపలికెళ్లింది. ఫాదర్ కంఠం పెరట్లోకి వెళ్లేదాకా వినిపిస్తూనేవుంది.

డ్రెస్సు మార్చుకుని, అద్దం దగ్గరికొచ్చింది జూలీ. మురళి మాటలు వినిపిస్తున్నాయి.

"బైబిల్‌లో దేవుని ప్రేమను గురించి ఏమని చెప్పారు ఫాదర్?" అతని మాటలు వినగానే కోపంగా బైటికొచ్చింది.

"దేవుడు ప్రేమ స్వరూపి. ప్రేమలేనివాడు దేవుని ఎరుగడు..." ఫాదర్ మాటలకు జూలీ అడ్డుతగిలింది.

"మీ బైబిల్ పఠనానికి ఓ స్థలమూ, ఓ వేళా లేవా?"

"దేవుని మాటలు స్మరించుకోవటానికి ఏ స్థలమైనా అనువే, ఏ వేళైనా సబబే తల్లీ" జూలీ కోపానికి ఆశ్చర్యపడినా ప్రశాంతంగా బదులిచ్చాడు ఫాదర్.

తన్నుకొస్తున్న నవ్వు ఫాదర్‌కు కనిపించ కుండా వుంచుకోవటానికి చాలా శ్రమ పడ్డాడు మురళి. ఫాదర్ వైపు నిరసనగా చూసి విస విసా సైకిల్ దగ్గరికి నడిచింది జూలీ.

"దేవుని ప్రేమించువాడు తన సహోద రుని కూడా ప్రేమింపవలెనను ఆజ్ఞను మన మాయనవలన పొంది యున్నామని చెప్పబడి యున్నది"

సైకిల్‌పై గేటు దాటింది జూలీ. మురళి తన వెంట పడుతున్నాడని స్పష్టమయింది. ఐతే అతని మనసులో ఏముందో మాత్రం తెలియదు. ఏమున్నప్పటికీ తన యిష్టాయిష్టా లతో నిమిత్తం లేకుండా తన వెంటపడటం చిరాగ్గా అనిపించింది. ఇలా ఆలోచిస్తూ వెళు తున్న జూలీకి ప్రజ్ఞ ఎదురయింది. స్నేహితు రాల్ని చూడగానే మనసు కాస్త కుదుట పడింది.

"నీ దగ్గరికే వస్తున్నానే. బైబిల్‌లో దేవుడు ప్రేమ గురించి ఏం చెప్పాడో తెలుసుకుందా మనీ..."

ప్రజ్ఞ మాటలు విని బిత్తరపోయింది జూలీ.

"మోసెస్‌ని లవ్ చేస్తున్నాను... ఐనా ప్రే మకు మతాలేంటి చెప్పు" జూలీ భావాలు గమనించకుండా చెప్పుకు పోయింది ప్రజ్ఞ.

సీరియస్‌గా సైకిల్ స్టాండ్‌వేసి, నిదానంగా

చెప్పింది జూలీ.

"ప్రేమ మత్సరపడదు, ప్రేమ డంబముగా ప్రవర్తింపదు, అది ఉప్పొంగదు, అమర్యాదగా నడవదు, స్వప్రయోజనమును విచారించుకొనదు, త్వరగా కోపపడదు, అపకారమును మనస్సులో ఉంచుకొనదు" చెప్పేసి, అయోమయంగా చూస్తున్న ప్రజ్ఞను వదిలేసి, సైకిల్ తీసుకుని బయలుదేరింది.

★ ★ ★

పోలీస్ స్టేషన్‌లోకి హడావిడిగా ప్రవేశించింది ప్రియ. ఎదురుగా విక్రమ్ కనిపించక పోవటంతో రైటర్‌వైపు తిరిగింది.

"ఇన్‌స్పెక్టర్ గారు లేరా?"

"లోపలున్నారండీ... మీకేను ఏమిటండీ... పాపం"

"పర్సుపోయింది" విచారం నటిస్తూ చెప్పింది ప్రియ.

"పాపం... ఎక్కడండీ" సిన్సియర్‌గా అడిగాడు రైటర్.

లోపల టిఫిన్ చేసి, చెయ్యి కడుక్కుంటున్న విక్రమ్‌కు మాటలు వినిపిస్తున్నాయి.

"సినిమా థియేటర్లోనండీ" బదులిచ్చింది ప్రియ.

లోపల్నుంచి రాబోయిన విక్రమ్, ప్రియని చూసి ఆగిపోయాడు.

ప్రియ సమాధానం విని కాస్సేపు బుర్ర గోక్కున్నాడు రైటర్.

"అదేంటండీ పాపం, పర్సు తీస్తుంటే మీకు తెలియలేదా?"

అప్పుడే స్టేషన్‌లో కొస్తున్న ప్రేమ్‌ని పలకరించాడు విక్రమ్, ఆఫీస్ రూంలోకొస్తూ-

"హల్లో ప్రేమ్"

"హల్లో సర్"

అన్న గొంతు వినగానే ఉలిక్కిపడి, లేచి నిలుచుంది ప్రియ. మరుక్షణంలో తేరుకుంది.

"ఫస్ట్ క్రైం న్యూస్ అన్నయ్యా... నా పర్సెవరో కొట్టేశారు. రాసుకో" కొరకొరా విక్రమ్ వైపు చూసింది. "ఆడవాళ్ల ధన, మాన, ప్రాణాలకు రక్షణ లేకపోతే మగాళ్లకు అంతంత పెద్ద మీసాలెందుకూ? దమ్ములేని మీసం తెగ బారెడనీ" అనేసి బైటికి నడిచింది.

★ ★ ★

"ప్రియ కేరెక్టర్ ఎవరేస్తారు గురూ" ప్రశ్నించాడు గోవిందు.

"ప్రేక్షకులకు బాగా పరిచయం వుండి, చిన్నచిన్న పాత్రలువేసే అమ్మాయి అయితే బావుంటుంది" బదులిచ్చాడు చక్రి.

"ఎవరైతే బావుంటుందో చెప్పు బాస్. కేరెక్టర్ మాంచి రసపట్టులో వుంది" అన్నాడు లక్ష్మణ కుమార్.

"మనం అనుకోగానే ఏమయింది. ముందుగా డైరెక్టర్‌ని నిర్ణయించుకుని, ఆయన అభిప్రాయం కూడా తెలుసుకోవాలి కదా"

"జయలలిత ఎలావుంటుంది?" శ్రీరామచంద్రుడు అడిగాడు.

"సెక్స్ యాక్టర్స్‌కాదు కావలసింది. అప్పుడు కేరెక్టర్ తుస్సుమంటుంది. పాత్ర స్వభావం ఐతే పాత్రలో, కాకుంటే పాత్రను ధరించే నటుడిలో ఏదో ఒక చోట కనిపించాలి. మరో విషయమేమిటంటే ప్రియ పాత్ర వ్యాంప్ కాదు. మరో సన్నివేశంలో ప్రియ బస్టాపులో నిలబడుంటుంది. ఓ పదేళ్ళ కుర్రాడు చినిగిపోయిన చొక్కా, జారిపోతున్నలాగూతో అడుక్కుంటుంటాడు. ప్రియ దగ్గరికొచ్చి ఓవది పైసలియ్యండి మేడమ్- అనడుగుతాడు.

వాణ్ణి ఎగాదిగా చూసి ఆ జారిపోతూన్న లాగూ సరిగ్గా కట్టుకుంటానంటే రూపాయిస్తానంటుంది ప్రియ.

వాడొప్పుకుని సరిగ్గా కట్టుకున్నాక, రూపాయిస్తూ అడుగుతుంది- "అవునూ, ఈ రూపాయితో ఏం చేద్దామనుకుంటున్నావ్" అని.

రూపాయి తీసుకుని జాగ్రత్తగా పట్టుకుని "ఏం లేదు మేడమ్, మీరా చీర బొడ్డుమీదికి కట్టుకుంటానంటే మీకే యిద్దామనుకుంటున్నాను అంటాడు వాడు..."

గొల్లున నవ్వారు ముగ్గురూ.

"ఇదింకా బాగా పేలుతుంది. కానీ మన కథలో సెట్‌కాదు. ఇలాంటి చిలిపి సన్నివేశాలు ఒక ప్లస్‌పాయింట్ అవుతాయి కానీ, అవే ముఖ్యం కాదు. ఏది చేసినా, ఎన్ని చేసినా మన కథకు దూరంగా వెళ్ళకూడదు. అప్పుడే




బాగుంటుంది. ఓ సెపరేట్ సెక్స్‌ట్రాక్, సెపరే ట్‌కామెడీ ట్రాక్, సెపరేట్ సెంటిమెంటల్ ట్రాక్ ఇలాంటి దానికోసం హీరోల చెల్లెళ్ళుంటా రు, ఓ సెపరేట్ ఫైట్ ట్రాక్- ఇలా కాకుండా ప్రతీదీ దండలో దారంలాగా కలిసిపోవాలి. ఉన్న పాత్రల్నే వేర్వేరుగా మలుచుకుని కథగ మనంలోనే హాస్యం, శృంగారం కలిపేసు కుంటూ సన్నివేశాలు రూపొందించుకోవాలి. అప్పుడు చూసేవాడికి బోర్ కొట్టదు. సినిమా చూస్తున్న వాడికి చూస్తున్నంత సేపూ తాను థియేటర్లో వున్నానన్న విషయం గుర్తుకు రాకూ డదు. అదే ఫార్ములా, అంతే"

"ఏదో శవం అన్నారు, గొయ్యి అన్నారు, శవాన్ని చంపటం అన్నారు. కథ చూస్తుంటే లవ్ ట్రాక్‌లో నడుస్తూంది..." శ్రీరామ చంద్రు డు సందేహంవెలిబుచ్చాడు.

"కొంచెం ఓపికపట్టండి... యిక కథలో కొ ద్దాం... ప్రియ పోలీస్ స్టేషన్ కొచ్చింది. అక్కడి దాకా వచ్చాం కదూ. ఆ అమ్మాయి విక్రమ్‌కు జూమ్ వేసింది. అది తెలపటానికి ఈ సీన్. అక్కడ కట్ చేస్తే యిక మురళి లవ్ ట్రయ ల్స్, మాంటేజెస్..."

"మాంటేజెసా? అంటే?"

"సంభాషణలు లేకుండా వుండే చిన్నచిన్న సీన్లు... పది యిరవై సెకన్లు వుంటాయి. వీటికి బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్, అంటే బీజీయంకు ప్రాణం. మరీ ముఖ్యంగా లవ్‌సీన్స్ మాంటే జెస్ తీసినప్పుడు. ఈ సీన్స్ ఎప్పుడు వచ్చినా ఒకటే బీజీయమ్ వినిపిస్తారు. దాంతో మన సుకు హత్తుకుంటాయి సీన్లు. సరే, మాంటే జెస్‌లో కొద్దాం..."

"బాసూ, జూలీ, మురళిని లవ్ చేస్తుందా, విక్రమ్‌ను లవ్ చేస్తుందా?"

"నన్నడిగితే డేవిడ్‌ని పెళ్లి చేసు కుంటుంది. లేకపోతే వాడెందుకూ మధ్యలో అంతేనా గురూ?"

"తినబోతూ రుచడగటం ఎందుకు? వినండయ్యా బాబూ...

కాలేజ్‌లోంచి బైటికొచ్చి, సైకిల్ తీసుకోబో యిన జూలీకి, హ్యాండిల్‌పైన గులాబీ పువ్వు కనిపించింది. దాన్ని తీసి ఏసిరేయబోయింది గానీ, అక్కడే ఆడుకుంటున్న వాచ్‌మన్ మనవ రాలిని చూసి, ఆ పిల్లకిచ్చి, సైకిల్ తీసుకుని బైటికి నడిచింది.

కట్ చేస్తే

ఇంటిదగ్గర, సైకిల్ స్టాండ్ వేసి, లెటర్ బాక్సులోంచి ఉత్తరాలు తీసుకుని యింట్లోకెళ్ళి ంది. ఈ లెటర్ బాక్సుతో మనకు తరవాత చిన్న పనుంది. అందుకే ముందుగా రెండు, మూడుసార్లు చూపిస్తాం... సరే, నెక్స్ట్ కొస్తే చర్చ్‌లో ప్రార్థించుకుంటున్న జూలీ, ప్రార్థన పూర్తై కళ్ళు తెరిచి చూసేసరికి, పక్కనే కళ్ళు మూసుకుని కూచున్న మురళి కనిపించాడు. లేచి బైటికొచ్చింది. సైకిల్ తీసుకోబోయే సరికి సీటుపైన చిన్న స్లిప్ కనిపించింది. దాంట్లో-

"నిన్ను వలెనే నీ పొరుగువానిని ప్రేమించు ము" అని రాసుంది.

చదువురాని ప్రేక్షకుల కోసం ఈ మాటల్ని మురళి గొంతుతో వినిపిస్తాం.

ఆ కాగితాన్ని నలిపి పడేసి, సైకిల్ తీసింది.

మురళి సజెషన్‌లో జూలీ సైకిల్ పైన వెళుతూంది. అంటే మురళి ఆమెను గమని స్తున్నాడన్న మాట. కట్ చేస్తే...

సన్‌సెట్, బీచ్ లొకేషన్లో జూలీ, ప్రియా ఏదో మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. హఠాత్తుగా ఆగిపోయింది జూలీ. ఆమె చూస్తున్న వైపే ప్రియకూడా దృష్టిసారించింది.

స్టాప్, లుక్, అండ్ ప్రొసీడ్ అన్న అక్షరాలు యింగ్లీష్‌లో రంగురంగుల గులకరాళ్లతో భారీ అక్షరాల్లో పేర్చివున్నాయి. ఇద్దరూ దగ్గరికెళ్లా రు. అక్షరాల మధ్య ఆకు దొన్నెల్లో గులాబీలు న్నాయి..."

"బాసూ, బాలచందరా, భారతీరాజానా?"

"బాసూ, నోర్మూసుకుని విను. ప్రియ ఓ పువ్వు తీసుకో బోతే, ఆమెను వారించి, బల వంతంగా అక్కణ్ణించి లాక్కెళ్ళింది జూలీ. ఇద్దరూ ఫ్రేమ్ ఔట్ అయ్యారు. మెల్లగా ప్యాన్ అయింది కెమెరా. ఓ కొండరాయి దగ్గరికొచ్చి ఆగింది. దాని పక్కనుండి ముందు కొచ్చిన మురళి నిస్సహాయంగా చూస్తున్నాడు.

కట్ చేస్తే,

కాలేజీలోంచి బైటికొచ్చిన జూలీ అనుకోకుండా ఎడంవైపుకు చూసింది. అక్కడ 'జూలీ' సినిమా పోస్టర్ కనిపించింది. ఆ పక్కనే కాంపౌండ్ వాల్ మీద 'నిన్ను చాలా' అన్న అక్షరాలు...

ఆసక్తిగా ఆ అక్షరాలను అనుసరిస్తూ నడవసాగింది జూలీ. సింగిల్ ట్రావెల్ షాట్ వేసుకుంటే బాగుంటుంది. జూలీ వెళుతూంటే ఆమె వెంటే కెమేరా వెళుతూంటుంది. దీనికోసం మంచి కాంపౌండ్ వాల్వున్న కాలేజ్ లాంటి బిల్డింగ్ పట్టుకోవాలి. మనక్కావలసింది ఎక్స్టీరియరే గనుక లోపల ఏ ఆఫీసున్నా ఫర్వాలేదు...

నరే 'నిన్ను చాలా' అని చూస్తూ వెళ్లిన జూలీకి 'చాలా చాలా చాలా' అలా చాలా చాలాలు కనిపించాయి. ఆ చాలాలన్నీ ఐపోయి, మళ్ళీ గేటు దగ్గరికొచ్చేసరికి స్థలంలేక ఒక మూల చిన్నగా 'ప్రేమిస్తున్నాను' అని రానుంది. మధ్యలో గోడకెక్కడైనా పగులుంటే, ఆ పగులు చుట్టూ 'అంతరాయానికి చింతిస్తున్నాను' అని టీవీ భాషరానుకోవచ్చు. తమాషాగా వుంటుంది... అప్పుడే బైటికొచ్చిన ప్రియ ఏమిటని అడగ్గా, ఏమీ చెప్పకుండా బయలుదేరుతుంది జూలీ. షరా మామూలుగా ఓ చెట్టు చాటునుండి ముందుకొచ్చిన మురళి నిస్పృహగా చూస్తుంటాడు...

కట్ చేస్తే...

ఇంటి దగ్గర పోస్ట్ బాక్సులోంచి ఉత్తరాలు తీసుకుని ఫాదర్కు ఒకటిచ్చి, ఏదో అడిగితే నమాధానం చెప్పి లోపలికెళుతుంది జూలీ.

కట్ చేస్తే...

క్రిస్మస్... చర్చిలో క్రిస్మస్ నంబరాలు... మురళి, ఫాదర్కు నమస్కరించాడు. గ్రీటింగ్స్ చెప్పాడు. జూలీ వైపు తిరిగే సరికి ఏదో పనికల్పించుకుని వెళ్ళిపోతుంది. దెబ్బతిన్నట్టు అలాగే చూస్తూండిపోయిన మురళి, ఏదో స్ఫురణకొచ్చినట్టు చూసి, సన్నగా నవ్వుకుని, అక్కణ్ణించి కదుల్తాడు... కట్ చేస్తే, "ఎర్లీ మార్నింగ్.. సన్ రైజ్..."

"సార్, సన్రైజ్ షాట్స్ ఎక్కువైతే ఖర్చు పెరుగుతుంది" అడ్డుపడ్డాడు గోవిందు.

"అయితే, సినిమా మొత్తం యింట్లో తీసుకో" ఎగతాళిగా అన్నాడు చక్రి.

సన్రైజ్ అలవెన్స్ గురించి చక్రికి తెలుసన్నమాట అనుకుని, సర్దుకున్నాడు గోవిందు- "అదికాదు సార్... వీలైతే తగ్గించుకుంటే బావుంటుందని. ఎంత వీలైతే అంత కాస్టాఫ్ ప్రొడక్షన్ తగ్గించుకునేందుకు చూసుకోవాలి కదా. ఏం చేసినా మనమంతా నిర్మాత క్షేమం ఆలోచించాలి కదా"

"సన్రైజ్ సీన్స్కు ఖర్చెక్కువెందుకు? వెలుగు సరిపోకపోతే, మళ్ళీ మళ్ళీ తీస్తారా?" ప్రశ్నించాడు లక్ష్మణకుమార్.

"కాదు, సన్రైజ్ షాట్ తీస్తే, యూనిట్ అందరికీ అదనంగా బేటా యివ్వాలి. అది ఆ సన్రైజ్ షాట్కే పరిమితం. తరవాత మామూలుగా తీసుకునే సీన్స్కు మళ్ళీ మామూలుగా కాల్షీట్ లెక్కబెట్టుకోవాలి"

"ఎందుకలా?"

"ఏం లేదు... మామూలుగా సిటీలో వున్నప్పుడు మామూలు కాల్షీట్కైతే ఏడున్నర, ఎనిమిదికి బయలుదేరాల్సిన వర్కర్లు, సన్రైజ్ షాట్ కోసం పొద్దున్న ఏ మూడున్నరకో బయలుదేరాలి. నిద్రవుండదు. అందుకని అదనంగా ఓ బేటాయిచ్చే వారు. ఐతే యిప్పుడు ఔట్డోర్లో షూటింగ్వున్నా ఆ సంప్రదాయం అలాగే నడుస్తూంది" వివరించాడు చక్రి. "అలాగే క్రేన్. క్రేన్ ఆపరేటర్లు యూనిట్లో కలవరు. మామూలుగా క్రేన్తో పనైపోగానే వాళ్ళకు పేకప్ చెప్పెయ్యాలి. అలా చెప్పకపోతే, కాల్షీట్ టైం పూర్తయి, అప్పుడు క్రేన్ వాడుకోకపోయినా నరే, వాళ్లకు నగం బేటా యివ్వాల్సుంటుంది అదనంగా"

"అమ్మో, సినిమాల్లో చాలా నేర్చుకోవాలి" అన్నాడు లక్ష్మణకుమార్.

"బడుద్ధాయ్... మరి యిన్నాళ్ళు షూటింగులో వుండి ఏం చేశావ్" ప్రశ్నించాడు శ్రీరామచంద్రుడు.

"అవన్నీ చూసుకోవటానికి నేనున్నాను కద్సార్" కల్పించుకున్నాడు గోవిందు.

"నిజమే కానీ యిలాంటివన్నీ నిర్మాతకూ, దర్శకుడికీ తెలిసుండటం కూడా ముఖ్యం.





ఇవ్వాళ షాట్‌కు మూడొందల కార్లు కావాలి- అని డైరెక్టర్ అనగానే తలూపటం కాకుండా థర్టీఫైవ్ ఎమ్మెమ్ సినిమాలో మూడొందల కార్లు ఎఫెక్టివ్‌గా చూపించలేంకదా. యాభైకార్లు సరిపోతాయి కదా- అనే ఆలోచనా, దాన్ని డైరెక్టర్ నొచ్చుకోకుండా ఆయనకు చెప్పి ఒప్పించే నేర్పూ నిర్మాతకుండాలి. మాస్క్ షాట్, అంటే డబుల్ యాక్షన్ తీసేది, తీసేటప్పుడు బ్లాక్ పేపర్, గమ్‌టేప్ లేక గంటలు గంటలు షూటింగ్ ఆగిన సందర్భాలెన్నో వున్నాయి. మాస్క్ షాట్‌కు బ్లాక్ పేపర్, గుమ్ టేప్ కావాలనే విషయం నిర్మాతకు కనీసం తెలిసుంటే ప్రొడక్షన్ మేనేజర్‌ను ముందుగా హెచ్చరించగలడు. అందుకే నన్నడిగితే, కొత్త నిర్మాతలు నేరుగా సినిమా రంగంలోకి దిగకుండా చిన్నపాటి ట్రెయినింగ్ చేస్తే బావుంటుంది''

''మాకు ట్రెయినింగా? బలేవారు సార్. డబ్బులు పెట్టేటప్పుడు ఒకసారికి నాలుగు సార్లు ఆలోచించుకుని,వదిహేనుఅడిగినచోట వరకిస్తే సరిపోతుంది'' తేలిగ్గా తీసేశాడు, శ్రీరామచంద్రుడు.

''అసలు వరక కూడా అవసరం లేనిచోట పాతికడిగితే ఆ విషయం ఎలా తెలుస్తుంది? ఒక్కోచోట గీచి బేరమాడితే బెడిసి కొడుతుంది. అందుకే ప్రతీ డిపార్టుమెంటు గురించీ ప్రాథమిక విషయాలైనా తెలుసుకోవటం నిర్మాతకే మంచిది...'' సిగరెట్ వెలిగించుకుంటూ అన్నాడు చక్రి.

ఈ విషయాలన్ని తరవాత మాట్లాడుకుందాం. ముందు కథ వినండి... ఆ ఎక్కడున్నాం? క్రిస్మస్ సంబరాల దగ్గర్నించి మురళి బైటికొచ్చాడు. కట్ చేస్తే, ఎర్లీ మార్నింగ్ జూలీ ఇంటికొచ్చాం...

వేడుక అయిపోయి ఇంటికొస్తున్నారన్న మాట. జూలీ, ఒకరిద్దరు స్నేహితులూ, ఫాదర్ గేటు దగ్గర నిలుచుని ఇంకా ఏదో మాట్లాడుకుంటున్నారు. ఒకమ్మాయి చూపించగా ఆశ్చర్యంగా వాకిట్లోకి చూసింది జూలీ. అందరూ తొంగిచూశారు. గబుక్కున గేటు తీసుకుని లోపలికి అడుగుపెట్టింది జూలీ.

'విష్ యూ హ్యాపీ క్రిస్మస్' అన్న ఇంగ్లీమ అక్షరాలు వాకిలి నిండుగా, రకరకాల పళ్లతో పేర్చి వున్నాయి. లోయాంగిల్‌లో కెమేరా ఆ ముగ్గుమీద ప్యాన్ అవుతూంది. వోకల్ బిజీయమ్, కోరస్‌లో... అక్కడో చిన్న కాగితంపైన ఓ సందేశం రాసుంది. కెమేరా ఆ స్లిప్ దగ్గరికి రాగానే దాని ఎదురుగా వచ్చి నిలుచున్న జూలీ కాళ్లు కనిపిస్తున్నాయి. అంటే ఆ స్లిప్, వెనకవున్న వాళ్లకు కనిపించకుండా అడ్డుగా వుందన్నమాట జూలీ. దాన్లోని మాటలు మురళి వాయిస్‌తో వినిపిస్తున్నాయి.

నిలువెల్లా తూట్లు పొడిచినా పెదవుల కానించుకుని రాగం పలికిస్తావనే ఆశతో ఎదురుచూస్తున్న మురళి

కాగితంలోనేమో 'మురళి' అన్నపేరు బదులు 'పిల్లనగ్రోవి' బొమ్మ గీసుంటుందన్నమాట.

అటూ ఇటూ చూసి, చటుక్కున ఆ కాగితంపైన కాలుమోపి, దాన్ని కాలితో నలిపెయ్యసాగింది జూలీ. ఆమె చర్యకు మురళి రియాక్షన్స్ ప్యారలల్ షాట్స్‌లో చూపిస్తాం.

జూలీ కాగితంపైన కాలుమోపింది.

మురళి ఫీలింగ్ సిల్హౌట్‌లో.

కాగితాన్ని జూలీ నలిపేస్తుంది.

మళ్లీ మురళి ఫీలింగ్స్.

మళ్లీ జూలీ కాలు.

మళ్లీ మురళి బాధ- ఇలా అన్నమాట.

ఏదో అడుగుతున్న స్నేహితురాళ్లకు అన్యమనస్కంగా ఏదో చెప్పింది జూలీ. బరువెక్కిన గుండెతో, తను నలిపేసిన కాగితాన్ని వాకిట్లోని ముగ్గునూ మార్చి, మార్చి చూస్తూ ఇంట్లోకి నడుస్తుంది.

కట్ చేస్తే...

మరునాడెప్పుడో అన్నమాట. లొకేషన్ మళ్లీ జూలీ యిల్లే. కాలేజ్‌నుండి ఇంటికొచ్చిన జూలీ సైకిల్ దిగబోతూ ఆశ్చర్యంగా చూసింది. లోగిట్లోని చెట్టుకు డజన్లకొద్దీ పిల్లనగ్రోవులు వేళ్లాడుతున్నాయి... కొన్ని నిలువుగా, కొన్ని అడ్డంగా ఉయ్యాల బల్లల్లాగా... వాటిమీద చిలుకలు, రంగురంగుల లవ్‌బర్డ్స్ ఉయ్యాలలూగుతున్నాయి. పోస్ట్‌బాక్స్‌లోంచి ఉత్తరాలు తీసుకుని, గుమ్మం దగ్గరి బల్లమీద వాటిని

విసుగ్గా పడేసి, లోపలికి నడుస్తూంది. నెక్స్ట్ సీన్‌లో కొస్తే...

కన్నున మట్టిలోకి గునపం దిగింది. జూలీ గునపంతో తవ్వుతూంది. చూస్తూన్నవాడికి ఏమీ అర్ధంకాదు. చెమట తుడుచుకుంటూ గునపంతో తవ్వుతూంది. కాస్సేపటికి ఫెళ్లున ఓ సీసా పగిలింది. ఫెళ్లు, ఫెళ్లున సీసాలు బద్దలు కొడుతూంది...

మొక్కలు నాటినట్టుగా వరుసగా ఏవో నాటుతుంది. ఏం నాటుతూందో ఎక్కడ నాటుతూందో అర్థంకాదు. గోడబైటినుండి ఆశ్చర్యంగా చూస్తూన్న ఫాదర్‌తో నవ్వుతూ ఏదో చెప్పింది. అప్పుడు చూపిస్తాం, ప్రహరీ గోడ మీద అంచున గాజుముక్కలు నాటివున్నాయి. మురళి గోడదూకి వచ్చి ముగ్గులేయటం, పిల్ల నగ్రోవులు కట్టటం లాంటివి చేయకుండానన్న మాట... సన్నగా నవ్వుకుంది... కట్ చేస్తే...''

''చిన్న డౌట్ గురూ... క్రిస్మస్ దగ్గర ఓ పాట పెట్టుకోవచ్చుగదా?'' ప్రశ్నించాడు గోవిందు.

''నేనూ ముందు అక్కడే పెడదామనుకున్నాను. క్రిస్మస్ పాట, మన వాళ్లకు వెరైటీగా వుంటుంది కూడా. అయితే ఆ పాటలో ఏమీ చూపించలేం. అందుకే న్యూఇయర్‌డే సాంగ్ పెట్టాను. ఈ పాటలో అయితే జూలీకీ, ప్రియాకూ గ్లామరస్ డ్రెస్సు వేసుకోవచ్చు. ప్రేమలు చూపించుకోవచ్చు. బ్రేక్‌లు, షేక్‌లు, కుప్పిగంతులూ ఏవైనా చూపించొచ్చు'' వివరించాడు చక్రి.

''నువ్వూరుకోవోయ్'' గోవిందును కసిరాడు లక్ష్మణకుమార్ ''మన బాస్‌కు నీకన్నా బాగా తెలుసు''

''అలా అనకు. సినిమాలో ఎవరైనా ఏదైనా చెప్పొచ్చు. దేనికైనా ఒక తలకాయకన్నా నాలుగు తలకాయలు మంచిది. చర్చించటంలో తప్పేంలేదుకదా''

''అవున్సార్. అది కూడా కరెక్టే... న్యూయియర్‌డే సాంగంటే ప్రతీ సంవత్సరం జనవరి ఫస్ట్‌కు మన పాట తప్పకుండా మోగుతుందన్నమాట. బావుంది సార్. కానీయండి'' మెచ్చుకున్నాడు శ్రీరామచంద్రుడు.

మళ్ళీ మొదలెట్టాడు చక్రి

★ ★ ★

సూర్యోదయం కాబోతూంది. కొత్త బట్టలు తొడుక్కున్న జూలీ, ముందు గదిలో వున్న ఫాదర్ దగ్గరికొచ్చింది.

''హ్యాపీ న్యూయియర్ ఫాదర్'' గ్రీటింగ్స్ చెబుతూ, వంగి ఫాదర్ కాళ్లకు నమస్కరించింది.

''హ్యాపీ న్యూ ఇయర్... గాడ్ బ్లెస్ యూ'' దీవించాడు ఫాదర్.

''జస్ట్ ఫైవ్‌మినిట్స్... నేనూ మీతోపాటే వస్తాను'' చెప్పి, ముస్తాబుకు మెరుగులు దిద్దుకోవటానికి లోపలికెళ్ళింది జూలీ.

నవ్వుకుంటూ గుమ్మంలోకి నడిచిన ఫాదర్‌కి, ఓ కారూ, ఓ మోటర్‌సైకిల్ ఒకేక్షణంలో తమ ఇంటిముందు ఆగటం కనిపించింది. కార్లోంచి విక్రమ్ దిగాడు. ఫ్లవర్‌బొకే తీసుకుని లోపలికొచ్చాడు. మోటర్‌సైకిల్‌కు స్టాండ్ వేస్తున్నాడు మురళి.

చేతిలోని ఫ్లవర్‌బొకేను తప్పనిసరిగా ఫాదర్‌కిచ్చి, గుమ్మంలోంచి లోపలికి తొంగిచూస్తూ

''హ్యాపీ న్యూ ఇయర్ ఫాదర్'' చెప్పాడు విక్రమ్.

''గాడ్ బ్లెస్ యూ. హ్యాపీ న్యూయియర్... జూలీ లోపలుంది, వెళ్లు'' అన్నాడు ఫాదర్.

విక్రమ్ లోపలికెళ్లగానే, అతనిచ్చిన ఫ్లవర్ బొకేని పక్కనున్న బల్లమీద పెట్టేసిన ఫాదర్‌కు, గేటు బైటే సందిగ్ధంగా నిలుచున్న మురళి కనిపించాడు. నవ్వుతూ అతన్ని పిలిచాడు.

''మురళీ... రా బాబూ''

''గుడ్‌మార్నింగ్ ఫాదర్'' విష్‌చేసి లోపలికొచ్చాడు మురళి. తిన్నగా ఫాదర్ దగ్గరికొచ్చి, వంగి ఆయన కాళ్లు కళ్లకద్దుకున్నాడు. మురళి చేతిలో ఒకేఒక గులాబీ వుంది. దాన్ని ఫాదర్ చేతిలో భక్తిపూర్వకంగా వుంచాడు.

''గాడ్ బ్లెస్ యూ, హ్యాపీ న్యూయియర్'' దీవించాడు ఫాదర్.

అప్పుడే గుమ్మంలోంచి బైటికొచ్చింది జూలీ. లోపలికెళ్లిన విక్రమ్ మరో గదిలోకెళ్లటంవల్ల, అతనికి కనిపించకుండానే వచ్చేసింది జూలీ.

''ఇక నీ స్నేహితుల్ని తట్టుకోవటం నావల్ల

కాదు'' జూలీని చూసిన ఫాదర్ తన చేతిలోని గులాబీని జూలీ చేతిలో వుంచాడు.

కండువా తెచ్చుకోవటానికి ఫాదర్ లోపలికెళ్లాడు. గులాబీ మురళి ఇచ్చిందని తెలియని జూలీ దాన్ని మామూలుగా జడలో పెట్టుకుంది. మురళి కళ్లు విచిత్రంగా మెరిశాయి.

''విష్ యూ హ్యాపీ న్యూయియర్ జూలీ''

అప్పుడు లోపల్నించి బైటికొచ్చిన విక్రమ్ గమ్మున గుమ్మంలో ఆగిపోయాడు.

''థాంక్యూ, సేమ్ టూయూ'' మురళికి చెప్పిన జూలీ, అప్పుడు విక్రమ్‌ని గమనించింది. ''హలో ఇన్‌స్పెక్టర్ విక్రమ్, హ్యాపీ న్యూయియర్'' నవ్వుతూ చెప్పింది.

''థాంక్యూ, హ్యాపీ న్యూయియర్'' తనూ చెప్పాడు విక్రమ్.

అప్పుడే ఫాదర్ బైటికొచ్చాడు. అందరూ అరుగుమీంచి కిందకు దిగబోతూండగా వినిపించింది పొలికేక

''హ్యాపీ న్యూయియర్''

అందరూ ఉలిక్కిపడి అటు తిరిగారు. డేవిడ్. గేటు మధ్యలో వున్న డేవిడ్ పక్కకు జరిగాడు. అయిదారుమీటర్ల పొడవున్న పెద్ద ఫ్లవర్‌బొకేను పదిమంది మనుషులు మోసుకొస్తున్నారు. జూలీని కిందకు రమ్మని అభ్యర్థించాడు డేవిడ్. అందరూ అరుగుమీది నుండి కిందికి దిగారు, సంభ్రమంగా చూస్తూ. డేవిడ్, జూలీవైపు తిరిగి, సిగ్గుపడుతూ చెప్పాడు.

''బొకే...''

దాన్ని చూపిస్తూ తీసుకోమన్నట్టుగా కళ్ళతోనే అభ్యర్థించాడు జూలీని. మరింత అయోమయంలో పడింది జూలీ.

''అదీ... అక్కడ పెట్టమను''

డేవిడ్ సైగ చేయటంతో దాన్ని అరుగుమీద పెట్టి, మోసుకొచ్చిన వాళ్లు వెళ్లిపోయారు. డేవిడ్ తెచ్చిన దానిముందు అల్పంగా కనిపిస్తున్న తన ఫ్లవర్‌బొకే వంక నిరాశగా చూశాడు విక్రమ్. కనీసం తను జూలీకి గ్రీటింగ్స్ అయినా ముందుగా చెప్పలేకపోయాడు. డేవిడ్‌వైపు రెండుగులు వేసి, అతను తెచ్చిన మహాపుష్పగుచ్ఛాన్ని చూపిస్తూ, గొంతు సవరించుకున్నాడు, మురళి.

''ఇందుకన్నమాట, ఊరంతా తిరిగితే నాకు ఒకే ఒక్క పువ్వు దొరికింది'' అన్నాడు, జూలీ తల్లోని గులాబీవైపు చూస్తూ.

ఉలిక్కిపడింది జూలీ... విక్రమ్, డేవిడ్‌లు అసూయగా మురళివంకా జూలీ తల్లోని పువ్వు వంకా చూడసాగారు. మురళి పెదవులపై నన్నని దరహాసం... ముగ్గురివంకా చూపులు మార్చి, అసంకల్పితంగా తలదించుకుంది జూలీ.

అందరి గుండెల్లోనూ తీక్షణ దంష్ట్ర కాలభైరవాష్టకం మోగుతూంది. కాకపోతే, సున్నితమైన గిటార్ తంత్రుల నిక్వణమై... ఉత్తేజభరిత నిస్వనమయింది.



సముద్రపు ఒడ్డున, పావురాయి సమాధి దగ్గర ఆగిన జీపులోంచి దిగాడు విక్రమ్. అతనూహించినట్టుగా అక్కడ జూలీ కానీ, అప్పటికే జూలీ వచ్చి వెళ్ళిన గుర్తుగా సమాధిపైన పువ్వులుగానీ కనిపించలేదు. ఎదురుచూస్తూ నిలుచున్నాడు.

కొత్త సంవత్సరం వేడుకల తర్వాత జూలీని మళ్లీ చూళ్లేదు. ఆరోజా చాలా సరదాగా గడిచింది. కానీ జూలీ తనతోపాటు మురళినీ, డేవిడ్‌నీ కూడా ఒకేలా చూడటం కాస్త బాధగా అప్పుడనిపించినా, తర్వాత సరిపెట్టుకున్నాడు. ప్రేమ మనసులో వుంటుందిగానీ పదిమందిలో బైటికి రావాలనేం నియమం లేదు కదా.

చిన్నప్పటి ఆటపాటలు గుర్తుకు తెచ్చుకున్నాడు. ముఖ్యంగా పావురాయి చచ్చిపోయిన

రోజు... తనకు బాగా గుర్తుంది...'విక్రమ్, ప్రతీ సంవత్సరం ఇక్కడికొచ్చి రాణిని తల్చుకోవాలి. ఎప్పుడూ మర్చిపోకూడదు' అన్న జూలీ మాటలూ, 'రాణంటే నీకిష్టంగదా, నేనూ మర్చిపోను' అని తనిచ్చిన హామీ, అన్నీ గుర్తొస్తున్నాయి. అరగంట దాటింది. మరో అరగంటకు స్టేషన్‌కు వెళ్ళాలి. ఎస్సై శ్యాం కూడా లేడు. పొరుగూళ్ళో ఎవరో అన్నదమ్ములు కొట్టుకున్న కేసు విషయంలో విచారించడానికి వెళ్లాడు.

జూలీ ఎప్పటికొస్తుందో... అనుకుంటూ, తను తెచ్చిన పువ్వులు జీప్‌లోంచి తీసి, పాపురాయి సమాధిపైన పెట్టి కళ్లు మూసుకున్నాడు. పదిక్షణాలు కూడా గడవలేదు. ఎవరో గట్టిగా పెట్టిన కేక వినిపించి, అప్రయత్నంగా కళ్లు తెరిచి, అటువైపు చూశాడు. వందగజాల దూరంలోంచి ఒకతను పరిగెత్తుకొస్తున్నాడు. ఓ ముగ్గురు వ్యక్తులు మారణాయుధాలతో అతన్ని తరుముతున్నారు. వెంటనే జీప్ దగ్గరికి పరిగెట్టి బెల్ట్ హోల్‌స్టర్‌లోంచి రివాల్వర్‌తీసి గాల్లోకి పేల్చాడు, అటువైపు పరిగెడుతూ.

ముగ్గురు దుండగులూ మరుక్షణంలో మాయమైపోయారు. ఇసుకలో బోర్లా పడిపోయిన ఆ వ్యక్తి లేచికూచున్నాడు. జర్నలిస్టు ప్రేమ్. విక్రమ్‌ని చూడగానే లేచి నిలుచున్నాడు.

"పదండి. మనం అర్జంటుగా వెళ్లాలి. వెళుతూ మాట్లాడుకుందాం" అన్నాడు ప్రేమ్, ఇసక దులుపుకుంటూ.

★ ★ ★

"పక్క ఊరి మోతుబరి నరసింహారావు లేడూ, ఆయన కూతురు ఓ పాలేరు కొడుకుని ప్రేమించింది. నరసింహారావు కూతురికి చెప్పి చూశాడు. ఆ అమ్మాయి విన్లేదు. ఎంతైనా పదూళ్లకు పెద్దమనిషికదా... అమ్మాయి కాళ్ళూ, చేతులూ కట్టేసి పెళ్లి జరిపిస్తున్నాడు. నరే, నేను జర్నలిస్టునని ఆ కుర్రాడు నా దగ్గరికొచ్చి చెప్పుకున్నాడు... కత్తి గొప్పదా, కలం గొప్పదా అని చర్చించకుండా నేను మీ దగ్గరికి బయలుదేరాను. అంతలో ఈ ఎటాక్' జరిగింది వివరించాడు ప్రేమ్.

ఆ అమ్మాయిని ప్రేమించిన కుర్రాణ్ణి దార్లో పిక్ చేసుకుని పెళ్లి జరిగేచోటుకు వెళ్లాడు విక్రమ్. అమ్మాయి మేజర్. కనుక ఆమె కిష్టంలేని పెళ్లి జరిపించకూడదని వివరించాడు. పెద్ద గొడవ జరిగింది. అమ్మాయి తల్లి కూడా కూతుర్ని సమర్థించటంతో పెళ్లికొచ్చిన వాళ్లల్లో సగంమంది అటూ, సగంమంది ఇటూ చేరారు. చివరకు నరసింహారావుని బలవంతంగా ఒప్పించి, అదే మంటపంలో, ఆ అమ్మాయి ప్రేమించినతనికిచ్చి వివాహం జరిపించాడు విక్రమ్.

పెళ్లి తంతు పూర్తవగానే వధూవరులు ముందుగా విక్రమ్ కాళ్లకు నమస్కరించారు. కంగారుగా లేవనెత్తి, వాళ్లను అభినందించి, జాగ్రత్తలు చెప్పి, నరసింహారావును హెచ్చరించి, ప్రేమ్‌తో బయలుదేరి ఊరు చేరుకునేప్పటికి రాత్రి పదిదాటింది.

"ఇద్దరు ప్రేమికుల్ని కలిపారు. ఈ పుణ్యం ఉట్టినేపోదు సార్" చమత్కరించాడు ప్రేమ్, ఇంటికి వెళుతూ.

అతని మాటలకు మళ్లీ జూలీ గుర్తొచ్చింది విక్రమ్‌కు. ఆ రాత్రంతా కలలనిండా జూలీయే.

★ ★ ★

ఆరోజు చర్చికొచ్చి మురళి చెప్పిన మాటలు విని ఆశ్చర్యపోయాడు ఫాదర్. తను కన్‌ఫెషన్ చెప్పుకోవచ్చా అనడిగాడు. నమ్మతించాడు ఫాదర్. ఆయన కన్‌ఫెషన్ ఛాంబర్‌లో కూర్చున్నాడు. మురళి మొదలెట్టాడు

"నేనో అమ్మాయిని ప్రేమించాను. తను నన్ను ప్రేమిస్తూందో లేదో తెలుసుకోకుండా ఆ అమ్మాయిని వెంటపడి వేధించాను. ఆ అమ్మాయి నా ప్రవర్తనకు ఎంత బాధపడిందో అని తలుచుకుంటే, నేను చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం లేదనిపిస్తూంది"

అప్పుడే చర్చ్‌లో కొచ్చిన జూలీ, అనుకోకుండా ఆ మాటలు వింది. ముందుగా మురళి మాటలకు ఆమె హృదయం బరువెక్కిపోయింది. అతనుట్టి అల్లరి చిల్లర ఆకతాయి మాత్రమే అనుకుంది. సరదాగా చేసిన పనికి మనసులో బాధపడ్డాడన్నమాట. పాపం, అనుకుంది. ఆ మరుక్షణం ఆమెకు తను చేసిన పాపం గుర్తొచ్చింది. అప్పటికే మురళి వెళ్ళిపో




# సచిత్ర విచిత్రం

హఠాత్తుగా చూస్తే బొమ్మ అన్పించే ఈ బాలుడు విధివంచితుడే! అయితేనేం? బండెడు సంసార భారాన్ని భుజాన వేసుకొని సాహసంగా జీవనయానాన్ని కొనసాగిస్తున్నాడు. నెల్సన్ అనే పేరుగల ఈ 13 ఏళ్ళ చిరంజీవి ఎత్తు కేవలం ఇరవై అంగుళాలలోపే. బరువు కొద్దిగా అటూ ఇటూగా 6 కేజీలు. శరీరంలోని ఏదో గ్రంథి సరిగా పనిచేయని కారణంగా రెండున్నర సంవత్సరాల వయస్సులో నెల్సన్‌లోని ఎదుగుదల ఆగిపోయింది. ఎన్ని మందులు, మాకులు వాడినా ఫలితం శూన్యం. అదే సమయంలో కన్నతండ్రి నిర్దయగా సంసారాన్ని గాలికి వదిలి మరో అమ్మాయితో వెళ్ళిపోవడంతో నెల్సన్ తల్లి కుంగిపోయింది. దురదృష్టంకొద్దీ అప్పుడే ఆమె ఉద్యోగమూ పోయింది. తల్లి, నలుగురు సోదరులు, సోదరీమణులు ఇంకా ఓ ముసలి మేనమామ ఉన్న ఆసంసార నౌకకు నెల్సనే చుక్కానిగా మారాడు.

శాంటోమిండో నగరవీధులలో ప్రతి రాత్రి అతను నృత్యంచేస్తూ, పాటలు పాడుతూ డబ్బు సంపాదిస్తున్నాడు. రబ్బరుబొమ్మలా కదులుతూ, వింతవింత చేష్టలతో ప్రజల్ని అలరించి, వాళ్ళు అందించే కానుకలతో ఇంటిని గడుపుతున్నాడతను. ఇల్లు గడవడాన్కి అవసరమైన డబ్బుకోసం అవిశ్రాంతంగా ఆయాసం,రొప్పు వస్తున్నా లెక్కచేయక నృత్యం చేయాల్సివస్తోంది. అతనిద్వారా డబ్బు సంపాదించవచ్చని బంధువర్గంలో ఒకరు అతన్ని కిడ్నాప్ కూడా చేశారు. ఎలాగోలా తప్పించుకుని ఇల్లుచేరుకున్నాడతను.

1. నగరవీధులలో తన ఆటపాటలతో ప్రజల్ని ఆకర్షిస్తున్న నెల్సన్.
2. ఏడ్నర్థం అబ్బాయికన్నా చిన్నగా కన్పిస్తున్న నెల్సన్.
3. ప్రదర్శనకుముందు, తల్లి చంకెక్కి ముద్దు పెడుతున్న పదమూడేళ్ల నెల్సన్.



యాడు. ఛాంబర్‌లోంచి లేవబోతున్న ఫాదర్ దగ్గరికి ఒక్క పరుగున వెళ్ళింది.

"ఫాదర్... నేను పాపపరిహారం చేసుకోవాలి"

లేవబోయిన ఫాదర్ మళ్లీ కూర్చున్నాడు.

"ఒకవ్యక్తి ప్రభువుపై విశ్వాసంతో పాపపరిహారం చేసుకుంటూండగా పొంచివిన్నాను ఫాదర్"

చేసిన పాపం మళ్లీ చేయకపోతే క్షమించగలిగే దేవుడు మహనీయుడైతే, చేసిన పాపాన్ని గుర్తించి ప్రాయశ్చిత్తం చేసుకునే మనిషి దేవుడంతటి వాడవుతాడు. పాపం చేయకపోవటమే కాదు, తోటి మానవుణ్ణి సమానంగా, స్వార్థరహితంగా ప్రతి మనిషీ ప్రేమించగలిగిననాడు పాప, పుణ్యాల ప్రసక్తి వుండదు. దేవుని అవసరమూ రాదు.

★ ★ ★

జూలీ, ప్రియ ఇద్దరూ వేరుశెనక్కాయలు తింటూ సముద్రం ఒడ్డున తాపీగా నడుస్తూ ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు. మలిసందె నూరీడు మంకెన పువ్వై సముద్ర కన్యసిగలో నిలిచి, ఒత్తయిన చీకటికురుల్లో ఒదిగిపోతున్నాడు. అలల వలల్తో శిలల్ని పట్టుకోవాలన్న ప్రయత్నం నెరవేరాక సముద్రం నిట్టూర్పుల హోరులతో రొదపెడుతూంది. హఠాత్తుగా అడిగింది జూలీ.

"ప్రియా... ప్రేమంటే ఏమిటే?"

మిలిటరీలో వున్న భర్త గుర్తొచ్చాడు కాబోలు, టక్కున సమాధానమిచ్చింది ప్రియ.

"రెండో ఎక్కమంత ఈజీదీ, రెండో ప్రపంచ యుద్ధమంత భయంకరమైనదీ"

"ఎవరైనా ప్రేమిస్తూంటే ఏంచేయాలి?"

"ఇష్టం లేకపోతే రాఖీ కట్టాలి. ఇష్టముంటే తాళి కట్టించుకోవాలి"

"అసలు... ఇష్టమంటే ఏమిటే?"

"ఏదైనా తింటుంటేనో, తాగుతుంటేనో పొలమారినప్పుడు... ఫలానావారు తలుచుకుంటున్నారూ అని గుర్తు చేసుకుంటాం చూడూ, నిజానికి ఆ ఫలానావారిని మనం గుర్తుతెచ్చుకున్నామన్నమాట. ఎందుకంటే..."

వేరుశనక్కాయ తింటూన్న జూలీకి పొలమారింది. అప్పటికే జూలీ ప్రశ్నలతో కొంత అర్థమైన ప్రియ, జూలీ తలమీద అరచేత్తో తట్టి, బుగ్గమీద చిటికేసి, అడిగింది.

"ఎవరే జూలీ... అంత ఇష్టమైనవాడు?"

"షటప్" చిరుకోపంతో చూసింది జూలీ. ప్రియని బలవంతంగా లాక్కుపోయింది. ఇంకేమీ మాట్లాడనీయకుండా.

★ ★ ★

సైకిల్‌మీద వెళుతున్న జూలీ చటుక్కున ఆగిపోయింది. ఎదురుగా గోడమీద 'స్టాప్, లుక్ అండ్ ప్రొసీడ్' అని రంగురంగుల అక్షరాలతో రాసుంది. అంటే ట్రాఫిక్ సైన్ కాదన్నమాట. అది మురళివనే అని అర్థమైంది. కానీ అలా రాసి, ఏం సాధించాడో అర్థం కాలేదు. మరుక్షణంలో సైకిల్‌వేగం పెంచి అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

మరునాడు మళ్లీ ఇంటికెళుతున్నప్పుడు అక్కడికి రాగానే అటు చూడకూడదనుకుంది. కానీ సరిగ్గా తను మలుపుతిరగాల్సినచోట ఎదురుగా రాసుందది. అయినా, తలదించుకుని వెళ్లిపోదామనుకుంది. కానీ అక్కడికి వెళ్లగానే అసంకల్పితంగా అటు చూడకుండా వుండలేకపోయింది. ఆశ్చర్యం! ఇప్పుడా అక్షరాలు చిన్న సైజులో ఓ మూలనున్నాయి, కంటిన్యూటీ అడ్వర్టైజ్‌మెంట్‌లాగా. నిన్నటి పెద్ద అక్షరాల చోటులో సినిమా పోస్టర్లున్నాయి. 'జూలీ' సినిమా పోస్టర్, దానిపక్కనే 'ఐ లవ్ యూ' సినిమా పోస్టర్... కలిపి చదివితే 'జూలీ, ఐ లవ్ యూ'. బుగ్గల్లోకి వెచ్చటిరక్తం జివ్వున పాకింది. అక్కణ్ణించి కదిలింది. ఎంత ధైర్యం అతనికి. తనను అల్లరిపాలు చేస్తున్నాడు... ఛ ఛ... ఆ సందేశం తనకు తప్ప ఎవరికి తెలుస్తుంది గనుక. అలా ఆలోచిస్తూ ఇంటికెళ్లింది.

మరునాడు మళ్లీ ఇంటికెళ్లేటప్పుడు, మళ్లీ చూసిందక్కడ. ఈసారి మూడు పోస్టర్లు వరుసగా. జూలీ ఆరాధన అంతులేని కథ... అంటే తనను వదలడన్నమాట. తనేం చేయాలి. కాస్సేపు ఆలోచించాక అనిపించింది. అసలేమైనా ఎందుకు చేయాలి. అతనా పోస్టర్లు అక్కడ అతికించినంత మాత్రాన తనకు నష్టమేమిటి?




పోస్టర్ల సందేశం ఆగిపోలేదు. రోజుకో సినిమా పోస్టర్ ద్వారా, రోజుకో సందేశం...

ఓరోజు 'జూలీ', 'ప్రేమ ఎంత మధురం'

మరోరోజు 'జూలీ', 'ప్రేమించి చూడు'

ఇంకోరోజు 'జూలీ', 'ప్రేమించు-పెళ్లాడు'

మరునాడు అక్కడ ఖాళీగా వుంది. ఏమీలేదు. అలవాటైపోయిన జూలీ, అప్రయత్నంగా బ్రేక్ వేసింది. ఎందుకని ఏమీలేదు. అతనికేమైనా అయిందా? ఒంట్లో బాలేదా? ఈ ఊర్నించి వెళ్లిపోయాడా? లేక కొంపతీసి, తన నుండి ఎలాంటి ప్రతిస్పందనా లేకపోవటంతో ఆత్మహత్యగానీ చేసుకున్నాడా... అయ్యో, ఇప్పుడెలా, ఎలా తెలుస్తుంది, అనుకుంటూ అక్కడుండి చేసేదేం లేక భారంగా కదిలింది.

అప్పటిదాకా కొండరాయి వెనుకనుండి జూలీనే గమనిస్తున్న మురళి పెదాలపై సన్నటి నవ్వు వెలిసింది. విజయగర్వంతో కళ్లు మెరిశాయి.

పోస్టర్లెందుకు లేవనే విషయం, మురళికే మయిందనే విషయంతోపాటు, అతనికేమైతే మాత్రం తనకేమిటన్న మరో ఆలోచన... ఉక్కిరిబిక్కిరవుతూంది జూలీ. మనసంతా అదోలా వుంది. నీరసంగా ఇంటిమలుపు తిరిగింది. గోడలన్నీ రంగురంగుల్లో, ఏదో విచిత్రంగా కనిపించాయి. దగ్గరికెళ్లి దిగ్భ్రమతో సైకిల్ దిగింది.

జూలీ. ఇల్లు, ఎదురిల్లు, పక్కిల్లు- అన్ని కాంపౌండ్ గోడలూ సున్నం కనిపించకుండా వున్నాయి. వాటినిండా 'జూలీ' సినిమా పోస్టర్లు... కొన్ని డజన్లు... ఎటు చూసినా జూలీ, జూలీ, జూలీ...

గుండె దడదడ కొట్టుకోసాగింది. తననెవరో కనిపెడుతున్నారన్నట్టు, వీధిలో నడవటానికి ముఖం చెల్లనట్టు, అటూ ఇటూ దొంగచూపులు చూస్తూ, గేట్లోంచి లోపలికెళ్లి సైకిల్ స్టాండ్ వేసి, పోస్టబాక్స్ తెరిచింది. దాన్నిండా వున్న పువ్వులు జలజలా రాలి జూలీ పాదాలపైన పడ్డాయి. గుండె మరింత వేగంగా కొట్టుకోసాగింది. ఉత్తరాలు తీసుకుని, గబగబా వాకిలిగుమ్మం తెరిచింది. గుండె ఆగినంత పనయ్యింది. గది గోడలనిండా, సీలింగ్‌తోసహా జూలీ సినిమా పోస్టర్లు... గచ్చునిండా, గచ్చు కనిపించకుండా వందల సంఖ్యలో పిల్లనగ్రోవులు, చేతిలోని పుస్తకాలు జారిపడ్డాయి గగుర్పాటుతో. మరోసారి ఉలిక్కిపడింది. కళ్లు నులుముకునేసరికి గోడలు మామూలుగానే వున్నాయి. గచ్చు కూడా మామూలుగానే వుంది. నిట్టూర్చి, పుస్తకాలు ఏరుకుని లోపలికి నడిచింది.

ఏపనీ సరిగ్గా చేయలేకపోయింది. మరునాటి పాఠం చదువుకోవటానికి పుస్తకం తెరిస్తే ప్రతి పేజీలోనూ 'స్టాప్, లుక్, అండ్ ప్రొసీడ్'లే కనిపిస్తున్నాయి. పుస్తకం పడేసి, టీవీ ఆన్ చేస్తే టీవీలో 'జూలీ' సినిమా పోస్టర్లే కనిపిస్తున్నాయి. పిచ్చెక్కినట్టుగా వుంది మనసంతా. మంచంమీద వాలి బలవంతంగా కళ్లు మూసుకుంది.

* * *

"కథ బలేవుంది గురూ. అయితే ఇందుకన్నమాట హీరోయిన్ పేరు జూలీ అని పెట్టావు" ప్రశంసించాడు గోవిందు.

"ఈ పోస్టర్లన్నీ దొరక్కపోతే?" అనుమానం వచ్చింది లక్ష్మణకుమార్‌కు.

"ప్రొడక్షన్‌వాళ్లు వున్నదెందుకు?" గోవిందు వైపు చూస్తూ సరదాగా అన్నాడు చక్రి.

"ఇంత మాత్రానికే భయపడతామా గురూ? ఒక్కసారి గుంటూరు వెళ్లానంటే మొత్తం పోస్టర్లు పట్టుకొస్తాను... కాకపోతే 'జూలీ' పోస్టర్లు దొరుకుతాయా అని అనుమానంగా వుంది. చాలా పాత సినిమాకదా. దొరక్కపోతే ప్రింట్ చేయించుకోవాలి" బదులిచ్చాడు గోవిందు.

"ఒకవేళ ఎప్పుడైనా ప్రొడక్షన్‌వాళ్లు ఏదైనా తేలేకపోతే ఏమవుతుంది?" మరో సందేహం వెలిబుచ్చాడు లక్ష్మణకుమార్.

"ఏముంది. ఉద్యోగం ఊడుతుంది" గోవిందుని ఉడికించాడు చక్రి.

"నువ్వన్నది కూడా కరెక్టే గురూ, డైరెక్టరూ, ప్రొడ్యూసరూ ఇద్దరూ తలతిక్కవాళ్లే అయితే, తిట్లతో ఆగిపోకుండా ఉద్యోగం ఊడేదాకా వస్తుంది"

"ఇవన్నీ మీరు ఎట్లా నేర్చుకుంటారు? ఏది కావాలన్నా ప్రొడక్షన్‌వాళ్లే తేవాలా?"

దీనికి సమాధానం చక్రి వివరించాడు.

"ఏది కావాలన్నా తేవటమే కాదు, షెడ్యూలు అనుకున్నది అనుకున్నట్టు జరగటం కూడా ప్రొడక్షన్ డిపార్టుమెంటుదే బాధ్యత. ప్రొడ్యూసరేమో డబ్బులివ్వడు. ముఖ్యంగా ఆర్టిస్టులేమో ఏది తక్కువైనా ఊర్కోరు. మరునాడు షూటింగుకు లేటుగా వచ్చి కసి తీర్చుకుంటారు, లేదా ప్రొడక్షన్ మేనేజర్నో కంట్రోలర్నో చీవాట్లు పెడతారు. వాళ్లవల్ల షూటింగుకు ఇబ్బంది కలిగితే అటు మూడ్ పాడయిందని డైరెక్టరూ, ఇటు టైం వేస్టయిందని ప్రొడ్యూసరూ ఇద్దరూ ప్రొడక్షన్ మేనేజర్నే తిడతారు. కత్తిమీదసాములా వుంటుంది. అందుకు ఓ ప్రొడక్షన్ మేనేజర్ అన్నాడు, ఇది మోస్ట్ థ్యాంక్‌లెస్ జాబ్ అని. ఓరకంగా అది నిజం కూడా. షూటింగ్ సవ్యంగా జరగటానికి ప్రొడక్షన్ మేనేజర్ కష్టపడితేనే అవుతుంది. కానీ అది సాధారణంగా ఎవరూ గుర్తించరు"

"మరి వీళ్లంతా వేరే డిపార్ట్‌మెంటుల్లోకి ఎందుకెళ్లరు చక్రీ?"

"మొదటిది అభిరుచి, రెండోది సామర్థ్యం. వేరే డిపార్టుమెంట్‌లోకి వెళ్లడానికి ఇంటరెస్టుండాలి. ఆ పని చేతకావాలి. అయితే ఈ రెండింటికన్నా ముఖ్యమైంది ఆదాయం. పేరుకు నిర్మాతిచ్చే జీతంకాక సినిమాకో పది, పదిహేనువేలన్నా అదనంగా సంపాదించుకోకపోతే అతను ప్రొడక్షన్ మేనేజర్ కాదు. అలాగే ఓ నలభై యాభైవేలన్నా సంపాదించుకోలేకపోతే అతను ప్రొడక్షన్ కంట్రోలరే కాదు" గోవిందువైపు చూసి నవ్వుతూ అన్నాడు చక్రి.

"గురూ... మరీ అన్యాయంగా మాట్లాడుతున్నావ్"

"ప్రతీ విషయం దగ్గరుండి చూసుకుంటే ఎలా వీలవుతుంది బాస్?"

"అందరూ తింటారని కాదు. కొందరు నిజాయితీపరులూ వుంటారు. అయితే వీలున్నచోటల్లా దండుకోవటమనేది సాంప్రదాయంగా మారిపోయిందికదా, ప్రతీచోటా. అందుకు ప్రొడక్షన్ మేనేజర్లూ మినహాయింపు కాదని అంటున్నానంతే. సరే, ఎంత జాగ్రత్తగా వున్నా ఎలా తింటారనేకదా ప్రశ్న. మొదటివిషయం, జాగ్రత్తగా వుండటం సాధ్యంకాదు. రెండో విషయం, అలా వుంటే పనులు జరక్కపోగా, కష్టాలు ఎక్కువై ఖర్చు ఎక్కువౌతుంది. మూడో విషయం, ఏనా సరే, చేయదలుచుకున్నవాడు చేస్తూనే వుంటాడు. అందుకు ఒకటి, రెండు ఉదాహరణలు చెబుతాను...

లారీడు పువ్వులు కావాలని చెబుతాడు డైరెక్టర్. లారీలో రెండొందల బుట్టలు పడతాయనుకుందాం. తెలివైన నిర్మాత పాతిక బుట్టలు తక్కువ పోయించమని చెబుతాడు ప్రొడక్షన్ మేనేజరుకు. చేతిదురదున్న ప్రొడక్షన్ మేనేజరేం చేస్తాడు, ముప్పై బుట్టలు తక్కువ పోయిస్తాడు. ఐదు బుట్టల డబ్బులు జేబులోకి పోతాయి.

విందుపార్టీలాంటి సీనుంటుంది. రెండొందలమంది జూనియర్ ఆర్టిస్టులు కావాలని చెబుతాడు డైరెక్టర్. సీనుకు నిండుగా కనిపించేంతవరకే చూసుకుంటాడు కానీ, జనాన్ని ఆయన లెక్కపెట్టుకోడు. ఐదుగురో, పదిమందో తక్కువ వస్తారు. నిర్మాత ఖచ్చితంగా లెక్కపెట్టుకున్నాడనుకుందాం... మిగతావాళ్ళేరని అడిగితే ఎక్కడో, ఏ మూలనో వుంటారంటాడు ప్రొడక్షన్ మేనేజర్. వాళ్ళకు డబ్బులిచ్చేటప్పుడు నిర్మాత లెక్కపెట్టాడనుకుందాం. అప్పుడు జూనియర్ ఆర్టిస్ట్ సప్లయర్ని తిడుతుంటాడు ప్రొడక్షన్ మేనేజర్-

"వెధవ, తక్కువ జనాన్ని పంపాడు, వీణ్ణి నమ్మొద్దు" అంటూ.

ఐతే ఆ తర్వాత నిర్మాతని కష్టపెట్టదలుచుకుంటే మార్గాలు కోకొల్లలు... ఉదాహరణగా ఓసారి నిజంగా జరిగింది చెబుతాను. హీరోగారికి వెళ్లే క్యారేజీలో చేపలపులుసులో ఉప్పు నగం వుంది. కోడికూరలో బొద్దింకుంది. ఎలా వచ్చిందో ఎవరికీ తెలియదు. హీరో ఎవర్ని తిట్టినా, అది మనసులో పెట్టుకుంటే మరునాడు షూటింగ్‌కు లేటుగా వస్తాడు. లేదా ఓ పాటు యిరవై టేకులు తింటాడు. మొత్తానికి నష్టపోయేది నిర్మాతే. ఐతే లంచగొండుల్నీ అక్రమంగా సంపాదించేవాళ్లనీ నిర్మాత భరించక తప్పదా అనే ప్రశ్నొస్తుంది. చిన్న విషయాలవరకూ చూసీ, చూడనట్టు ఊరుకోవాలి. ముఖ్యంగా, షెడ్యూల్ ఖర్చు, కాల్‌షీట్ ఖర్చూ, అంచనాకు మించనంతవరకూ ప్రొడక్షన్ మేనేజర్ హద్దుమీరలేదనే అనుకోవాలి.




పనులు హాయిగా జరగటమే కాకుండా, వాళ్ల కు నిర్మాతపట్ల భయమూ, భక్తీ వుంటాయి. ఐనా, యిది తప్పే. ఇలా ఎందుకు చేస్తారయ్యా అని అలాంటివాళ్లనడిగితే - నీతి, నిజాయితీకి రోజులు కావండీ. ఐనా, మా కష్టానికి ఈ జీతమేం సరిపోతుందీ అంటారు. ప్రొడక్షన్ మేనేజర్లుగా వుండి, యిలా సంపాదించి, నిర్మాతలైనవారూ వున్నారు. నిజాయితీగా వుండి నిర్మాతలైనవారూ వున్నారు. హాయిగా, నమ్మకంగా పనిచేస్తూ అలాగే వున్న వాళ్ళూ వున్నారు. అందరి నమ్మకం పోగొట్టుకుని, స్థానం కోల్పోయినవారూ వున్నారు. అది వృత్తిపరంగాకంటే, వ్యక్తిపరంగా ఆధారపడి వుంటుంది''

''బీచ్‌లో కూచుని బీరైనా కొట్టకపోతే బావుండదు'' అన్నాడు లక్ష్మణకుమార్. ఆరోజు చర్చలు బీచ్‌లో జరుగుతున్నాయి. దూరంగా వున్న డ్రైవర్ని పిలిచి, బీర్లూ, తినుబండారాలూ, చక్రికోసం ఫ్లాస్కులో టీ, సిగరెట్లూ తెమ్మని పురమాయించాడు గోవిందు.

''సార్, మీరు చెప్పిన లవ్‌ట్రాక్‌లో నాకో సందేహం వచ్చింది. పోస్టర్లు దొరక్కపోతే ప్రింట్ చేయిద్దామన్నాడు గోవిందు. ఖర్చు సంగతి అలా వుంచండి, మనకే యింత కష్టమైతే, అన్ని పోస్టర్లు మురళికెలా దొరికాయి? అతను జూలీ యింటిగోడలమీదా, ఎదురింటి గోడలమీదా అంటిస్తుంటే ఎవరూ చూళ్లేదా?'' అడిగాడు శ్రీరామచంద్రుడు.

''నిజమే... కానీ సినిమా కథకు, అలా చెప్పాలంటే, ఏ కథకైనా ఒక సడలింపు వుంది. వేర్ దెరీజ్ డ్రామా, దెరీజ్ నో లాజిక్. నాటకీయమైన సన్నివేశం మనసుకు హత్తుకునేట్టుగా వున్నప్పుడు తర్కంకోసం చూడనవసరంలేదు. ఎందుకంటే సినిమా సామాన్యమైన ప్రేక్షకుడికి వినోదం కలిగించడానికే గానీ విమర్శకులకోసం, మేధావులకోసం కాదు. నాలుగు డబ్బులు పెట్టి సినిమా తీసే నిర్మాతకు లాభం రావాలి. నాలుగు రూపాయలు పెట్టే ప్రేక్షకుడికి వినోదం కావాలి. అంతకన్నా పెద్ద పరమార్థం ఏమీ లేదు, సినిమాల్లో. అంతగా ఆలోచిస్తే, నిర్మాతగానీ, దర్శకుడుగానీ తనకున్న అభిరుచికొద్దీ తీసుకుంటే చాలు.

చాలామంది అంటుంటారు, సినిమాలు చెడగొడతాయని. అలాంటప్పుడు బాగుచేయాలి కూడా. మరి సినిమాలు చూసి బాగుపడినవాళ్లెవరున్నారు? 'మాలపల్లి' సినిమా అంటరానితనాన్ని నిర్మూలించిందా? 'వందేమాతరం' సినిమా మన ప్రజలకు దేశభక్తినేర్పిందా?

ఏ కళారూపమైనా మనసులో అంతర్లీనంగా వున్న స్వభావానికి ప్రేరణ కలిగిస్తుందేకానీ, కొత్తభావాలని ప్రవేశపెట్టలేదు.

సినిమాద్వారా మనమేదో సందేశం యివ్వాలనుకుంటే, అసలా సందేశం సరైనదేనని ఎవరు చెబుతారు? మన భావాలను యితరులనెత్తిన రుద్దే హక్కు మనకేం వుంది? ఉదాహరణకు, పరాయి స్త్రీని అపహరించితే అంతం తప్పదనే నీతిచెప్పటానికి రామాయణం కథ చెబితే, అసలు పరాయి స్త్రీని అపహరించే మార్గం నేర్చుకున్నానని ఒకడనవచ్చు.

ఇక ప్రతీ లాజిక్ ఆలోచించి, మేధావుల కోసం సినిమాలు తీసేవాళ్ళున్నారు. అవి సామాన్య ప్రేక్షకుడికి అర్థంకావు. వాటిని చూడడు. చిన్నప్పుడెప్పుడో చదువుకున్న ఒక కథ చెబుతాను.

ఒకడు దేవుడికోసం తపస్సుచేసి, ప్రత్యక్షమైనాక తన యిల్లంతా బంగారుమయం చేయమన్నాట్ట. అలాగే అయినాక, ఆ బంగారాన్ని తనకు తప్ప యితరులకు మామూలుగానే కనిపించేట్టు చేయమన్నాట. అలాగే అయింది.

ఈ సినిమాలూ వాడి బంగారంలాంటివే. వాడికే బంగారంలా కనిపిస్తాయి. ఇతరులకు అలా కనిపించదు. దానివల్ల వాడికీ ప్రయోజనం లేదు. ఆ బంగారాన్ని గుర్తించలేకపోవటం ఎదుటివాళ్ల తప్పుకూడా కాదు.

లాజిక్కులు లేని సినిమాలు మన సినిమాల్లో చూస్తుంటాం.

అప్పటివరకూ విలన్ స్థావరం ఎక్కడుందో ఎవ్వరికీ తెలియదు. ఆ స్థావరంలో విలన్, హీరోయిన్ని రేప్‌చేస్తుంటాడు. అప్పుడు హీరో వూడిపడతాడు. అంతే, అలా రావాలి. ఇక్కడ లాజిక్ లేదు. కానీ ఎవరికీ గుర్తురాదా విషయం. మన హీరోయిన్ పేరు జూలీయే

ఎందుకుండాలి? వీలుకోసం. మీరంతా 'ప్రతిఘటన' సినిమా చూసేవుంటారు. అందులో విలన్ పార్టీ గుర్తు గొడ్డలి కాకపోతే మరి విలన్ని హీరోయిన్ ఎలా చంపేది? ఎవరికైనా వచ్చిందా సందేహం? వచ్చినా ఆ సినిమాకి అవకాశం ఏమీ జరగలేదు. ఎందుకని? అక్కడ డ్రామా వుంది. లాజిక్ గురించి ఆలోచించేంత వ్యవధి ప్రేక్షకుడికి రాదు.

మరో మంచి ఉదాహరణ చెబుతాను. ఇప్పుడు నడుస్తున్న 'గ్యాంగ్‌లీడర్'... చిరంజీవిని కోర్టులో, పోలీసుల్నించి, తప్పించి, కార్లో తీసుకెళుతుంది విజయశాంతి. కొంతదూరం వెళ్లాక చిరంజీవి అడుగుతాడు-

'నీకీ కారూ పిస్టల్ ఎక్కడివీ' అని.

'నేను రావుగోపాలరావు కూతుర్ని' అంటుంది విజయశాంతి.

హీరోతోపాటు ప్రేక్షకులూ కన్విన్స్ అయ్యారు. కానీ లాజిక్‌కు అందని విషయం ఏమిటంటే, ఆ వెంటనే చెబుతుంది విజయశాంతి 'తన తల్లిని రావుగోపాలరావు మోసంచేసి గర్భవతిని చేస్తే, ఆమె తనని కని చచ్చిపోయిందనీ, అందుకే తన తండ్రిమీద పగతీర్చుకోవటానికి చిరంజీవికి సహాయం చేస్తున్నాననీ.

అంటే ఆమె రావుగోపాలరావు దగ్గర పెరగలేదు. కనుక అతని డబ్బుకూ ఆమెకు సంబంధం లేదు. అయితే ఆమెకు కారూ, తుపాకీ ఎక్కణ్ణుంచి వచ్చాయన్నది లాజిక్.

మరో విషయం తల్లి చిన్నప్పుడే చచ్చిపోతే, అనాధాశ్రమంలో పెరిగిన విజయశాంతికి ఆమె తల్లి మోసగింపబడిందనీ, ఆ మోసం చేసింది రావుగోపాలరావనీ ఎవరు చెప్పినట్టు? ఈ సందేహాలన్నీ రాకుండా ఎక్కడికక్కడ ప్రేక్షకుణ్ణి ఒప్పిస్తూ, కదలకుండా కూర్చోబెట్టే టెంపోను మెయింటెయిన్ చేశాడు దర్శకుడు. అది దర్శకుడి తప్పుకాదు, ఓ రకంగా గొప్పతనం''

మరో ఉదాహరణ - 'విచిత్రబంధం' సినిమాలో వాణిశ్రీ తమ్ముడు విశ్వేశ్వర్రావ్. సినిమా మొదలైనప్పుడు ఎంత వున్నాడో, వాణిశ్రీకి కొడుకు పుట్టి, ఆరేళ్లవాడైనా అంతే వుంటాడు. ఈమాత్రం ఆదుర్తిలాంటి దర్శకుడికి తెలియదా? తెలుసు. అయితే, ముందు చూపించిన విశ్వేశ్వర్రావ్‌ను మార్చి తర్వాత మరో నటుణ్ణి, అంటే లాజిక్కుకు సరిపోయేంత వయసున్న నటుణ్ణి పెట్టారనుకోండి

అతనెవరు, విశ్వేశ్వర్రావే మయ్యాడు లాంటి సందేహాలు సామాన్య ప్రేక్షకుడికి కలిగి చిరాకుపెడతాయి. అందుకని ప్రేక్షకుణ్ని తికమక పెట్టే విషయాల జోలికి వెళ్ళకూడదు. తప్పనిసరిగా లాజిక్‌కోసం చూడకూడదు.

కొందరు విమర్శకులు అడుగుతుంటారు 'హీరో ఉద్యోగమేమిటి? హీరోయిన్ పాటలకే పరిమితమయిందేమిటి' లాంటి ప్రశ్నలు. రెండున్నర గంటల సినిమాలో అవసరమైన విషయాలే చూపిస్తారు. అనవసరమైన విషయాల జోలికి పోరు. అందుకే మన కథలో కూడా ప్రేమ్, ప్రియలకు తల్లిదండ్రుల్లేరు. వాళ్లవల్ల మన కథకు అదనపు ప్రయోజనం లేదు. లాజిక్‌కోసం ఆ పాత్రల్ని పెడితే, వాళ్ళు మధ్యలో అడ్డుతగుల్తుంటారు''

డ్రైవర్ తిరిగి రావడంతో ఆపేశాడు చక్రి. బాటిల్స్ ఓపెన్‌చేసి సర్దుకునేసరికి అరగంటయింది. ఎవరి పానీయం వారు చప్పరిస్తూ మళ్ళీ మొదలెట్టారు.

"మన కథ చిన్న మలుపు తిరుగుతుందిక్కడ. ఆ సీన్‌లోకి ఇదేవరసలో వెడితే అంత ఎఫెక్ట్ రాదు. మొనాటనస్‌గా అనిపిస్తుంది. అంచేత చిన్న జోక్‌తో ఈ సీన్‌ను అటు మలుపుతిప్పుతాం. ఈ సీన్లో గెస్ట్ ఆర్టిస్ట్‌గా బ్రహ్మానందంని పెడితే బావుంటుందనుకుంటాను''

"గెస్ట్‌గానా? ఇంత చిన్న వేషం వేస్తాడా బ్రహ్మానందం?''

"అది మన ప్రొడక్షన్‌వారి అప్రోచ్‌మీదా, డైరెక్టర్ ఆయన్ని ఒప్పించటంమీదా ఉంటుంది. ఈ సీన్లో వచ్చే ఈ పాత్ర రియాక్షన్స్ ఎంత బావుంటే సీన్‌లో కామెడీ అంత పండుతుంది. అందుకని బ్రహ్మానందం పేరు చెప్పాను. ఇక సీన్లోకెడితే...

మన తాగుబోతు బ్రహ్మయ్యకు మందు సరిపోదు. జేబులోనేమో డబ్బుల్లేవు. ఎవరూ పందెం కాయలేదు. మూతిమీద మీసమున్న మగాడే లేడా అని అరుస్తుండగా, అప్పుడే టీ





కొట్లోకి అడుగుపెట్టిన సినిమా నటుడు బ్రహ్మానందం - 'నీ యంకమ్మా... ఏంటి పందెం' అంటాడు.

ఊరిబైట జరగాల్సిన షూటింగ్ కేన్సిలైతే అలా ఊళ్ళోకొచ్చాడన్నమాట.

కన్నును పన్నుకానించాలని పందెం.

నావల్ల కాదు, నువ్వానిస్తావా అంటాడు బ్రహ్మానందం.

మూడు పెగ్గులు పందెం.

బ్రహ్మయ్య తన కుడికన్ను ఊడబెరికి పళ్లకు ఆనించి పందెం గెలుస్తాడు. అది గాజుకన్నని ఆ ఊరివాళ్లకు తెలుసు. కొత్తవాళ్ళు బోల్తాపడుతుంటారు. ఆ మూడు పెగ్గులూ తాగేసి, మళ్ళీ మొదలెడతాడు బ్రహ్మయ్య.

ఈసారి ఎడమకన్ను పన్నుతాకిస్తానంటాడు.

రెండుకళ్ళూ గాజుకళ్ళుండవుగదాని ధైర్యంగా పందెం కాస్తాడు బ్రహ్మానందం. అమితాబ్, బ్రహ్మయ్యను వారిస్తాడు కానీ అతను వినడు. ఈసారి కట్టుడు పన్ను తీసి, ఎడమ కన్నుకానించి మళ్ళీ పందెం గెలుస్తాడు బ్రహ్మయ్య. బ్రహ్మయ్య భావకూ, తెలివికీ బ్రహ్మానందం రియాక్షన్స్ బ్రహ్మాండంగా వుంటాయి.

అంతలో రోడ్డుమీద జూలీ నడిచి వెళ్లటం చూసి, డేవిడ్‌కు చెబుతాడు బ్రహ్మయ్య. వెంటనే లేచి వెళ్ళిపోతాడు డేవిడ్. ఆ తర్వాత మళ్ళీ మొదలెడతాడు బ్రహ్మయ్య.

'కన్నుకు ముక్కు తాకిస్తాం బాబూ' అంటూ.

అంతే... అతని ధాటికి అమితాబ్‌తప్ప అందరూ స్టాప్ బ్లాక్‌లో మాయమవుతారు. ఈ సీన్ యిక్కడ కట్ చేసుకుంటే, తోటలోకెళతాం...

నడిచి వెళుతున్న జూలీకి ఓ చెట్టుకాండానికి సెలోఫోమ్ టేప్‌తో అతికించిన గులాబీ కనిపిస్తుంది. ఎవరైనా చూస్తున్నారేమోనని అటూ, ఇటూ చూస్తుంది. గబుక్కున ఓ చెట్టు చాటుకు తప్పుకున్నాడు డేవిడ్.

ఆ పువ్వు తీసి బ్యాగ్‌లో వేసుకొని ముందుకు నడిచింది జూలీ.

రెండోచెట్టుకు మళ్ళీ పువ్వు. దాన్ని కూడా తీసుకుంది.

ఆమెకు కనిపించకుండా, చెట్లచాటున అనుసరించి వస్తున్నాడు డేవిడ్. అలా వరుసగా ఐదారు పువ్వులు కలెక్ట్ చేసుకుంటూ వెళ్ళిన జూలీ, మరో పువ్వును లాగుతుండగా, దానికున్న ముల్లు కన్నున వేల్లోకి దిగి, నెత్తురు చిమ్మింది. మరో చెట్టుచాటునుండి అప్పుడు ముందుకొచ్చాడు మురళి. గబుక్కున ఆమె వేలు నోట్లో పెట్టుకుని రక్తం ఆపి, కిందపడిన పువ్వు తీసి అందిస్తూ క్షమాపణ చెప్పాడు.

'సారీ, వెరీ సారీ... అయామ్ ఫూల్. పువ్వులు పెట్టినవాణ్ణి ముల్లు చూసుకోవద్దూ' అంటుండగా, 'ఏందిరా సారీ' అంటూ వచ్చాడు డేవిడ్. గిల్లికయ్యం పెట్టుకుని, మురళిని తుక్కుకింద కొట్టాడు. నిస్సహాయంగా నిలుచుంది జూలీ. ఎన్నిదెబ్బలు తిన్నా తన చేతిలోనే వుండిపోయిన పువ్వుమాత్రం నలగకుండా చూసుకున్నాడు. అతికష్టంగా లేచి నిలుచుని ఆ పువ్వును జూలీకందించాడు. నీళ్ళు నిండిన కళ్లతో ఓదార్పుగా చూస్తూ, అతనికంటిన మట్టినీ, రక్తాన్నీ తన పైటతో తుడుస్తుంది జూలీ. తూలిపడబోతున్న మురళికి ఆసరా ఇచ్చి, అతని చేతిని తన భుజంపైన వేసుకుంది. అది చూసి నిశ్చేష్టుడైన డేవిడ్, గమ్మున అక్కణ్ణించి కదిలి వెళ్ళిపోయాడు. కట్ చేసుకుంటే సాంగ్‌లోకెళ్ళిపోతాం''

''అంటే విక్రమ్ పని అయిపోయినట్టేనా బానూ?''

''అంటే జూలీ, మురళిని పెళ్ళిచేసుకుంటుంది అనుకుంటున్నావా? జూలీ డేవిడ్‌ని పెళ్ళిచేసుకుంటుంది. అంతేకదా గురూ?''

''నాకైతే విక్రమ్‌ని చేసుకుంటుందని పిస్తోంది. అందుకే విక్రమ్‌ని జంటిల్‌గా చూపించినట్టుంది. అంతేకద్సార్?''

అందరి ప్రశ్నలకూ జవాబుగా చిన్నగా నవ్వాడు చక్రి.

★ ★ ★

వంటగదిలో వున్న మాలినిదగ్గరకొచ్చి, అతి వినయంగా ఆమెకు సహాయం చెయ్యసాగాడు విక్రమ్. ముందుగా ఆశ్చర్యపోయినా, విషయమేమిటో అతనే చెప్పాలన్నట్టు, గమ్మునుండిపోయింది మాలిని. కాస్సేపటికి, మెల్లిగా పిలిచాడు.

"అత్తమ్మా..."

ఓసారి విక్రమ్‌వైపు చూసి, విననట్టుగా తన పనిలో మునిగిపోయింది మాలిని. కాస్సేపు అర్థంకాక మనసులోనే తికమకపడ్డాడు. మళ్ళీ గారాబంగా పిలిచాడు.

'అత్తమ్మా' గొంతు సవరించుకుని, మొదలెట్టాడు "ఏంలేదు, కులమతాలమీద నీ అభిప్రాయమేమిటి?"

అతని ప్రశ్న విని, భారంగా నిట్టూర్చింది మాలిని.

"ఇంతసేపు కాకాపట్టిన నీ వయసు కుర్రాడు అడగాల్సిన ప్రశ్న... ఫలానా అమ్మాయి మీద అభిప్రాయమేమిటీ అనుండాలిగానీ, కులమతాలేంట్రా?"

"మనుమలు, మనుమల్ని గుర్తించుకుంటున్నది వాటితోనే కదత్తమ్మా... అసలు మనసులకు లేని మతం..."

"... మనువులకు మాత్రం ఎందుకుండాలంటావ్?" అతని మాటను పూర్తిచేసింది మాలిని.

తను వివరించకుండానే ఆమె అర్థంచేసుకోవటంతో ఆశ్చర్యపోయాడు విక్రమ్. అతనా ఆశ్చర్యంలోంచి తేరుకోకముందే ప్రశ్నించింది మాలిని.

"అయితే, మాట్లాడి, ముహూర్తాలు పెట్టించేయమంటావా?"

"థాంక్యూ అత్తమ్మా" ఆనందంగా అన్నాడు విక్రమ్.

★ ★ ★

"పడుకుంటే నా కలలోకొచ్చి నిద్రపోనీయటంలేదు నువ్వు. ఓ కుర్రాడి కల్లోకి పెళ్ళికాని అమ్మాయి అంత ధైర్యంగా వచ్చినప్పుడు, ఆ అమ్మాయి గదిలోకి కుర్రాడు వస్తే తప్పేంటంట?"

"అంతపని మాత్రం చెయ్యకు బాబూ... మామూలుగానే ప్రేమ వివాహాలు పెద్దవాళ్లొప్పుకోరు... మురళీ"

"నాకెవరూ లేరు... చెప్పానుగదా"

"నాకున్నారు గదా. అందునా మనిద్దరి మధ్యా మహమ్మారిలాంటి మతం"

"మనకి మధ్యనో మతం కూడా అడ్డంకిగా వుంది కదూ..."

"కాదా మరి"

"ఒకే జూలీ... రేపటితో ఆ అడ్డంకి తొలగిపోతుంది"

"ఏంటీ?"

"యస్... నేను బాప్టిజమ్ తీసుకుంటాను"

"మురళీ!"

"నా తల్లిదండ్రులెవరో నాకు తెలియదు. మురళి అన్న పేరును బట్టి తప్పితే నా మతమేంటో నాకు తెలియదు. ఐనా ఏ మతంలోనైనా దేవుడొక్కడే కదా?"

జూలీ కళ్ళు చెమ్మగిల్లాయి. నవ్వినా, ఏడ్చినా మాత్రమే కాదు, మాటకందని భావం మనసును ఉక్కిరిబిక్కిరి చేసినప్పుడు కూడా కన్నీళ్ళే వస్తాయి...

★ ★ ★

సాయంకాలంవేళ, యింటిముందు చెట్ల కింద కుర్చీలు వేసుకుని, కూచుని మాట్లాడుకుంటున్నారు ఫాదర్, జూలీ. అప్పుడొచ్చాడు మురళి. కాస్సేపు పిచ్చాపాటీ కబుర్లయ్యాక ఫాదర్‌ని ప్రశ్నించాడు మురళి.

"కుల, మతాలమీద మీ అభిప్రాయమేమిటి ఫాదర్?"

"అవి మనుమలు గీసుకున్న గిరులు బాబూ... దేవునిదృష్టిలో అందరూ సమానమే. వేర్వేరు నదులన్నీ సముద్రంలోనే కలిసినట్టు అన్ని ప్రార్థనలూ ప్రభువుకే చేరుకుంటాయి. ఎన్ని పేర్లుపెట్టి పిలిచినా దయామయుడైన ఆ తండ్రి ఒక్కడే"

"మరి మతాంతర వివాహాలమీద మీ అభిప్రాయమేమిటి ఫాదర్?"

"మనిషిని మనిషి మతం పేరుతో వేరుచేసుకుంటున్నాడు కానీ వివాహానికీ మతానికీ సంబంధంలేదు బాబూ"

"మరి ఓ మతంలోని అమ్మాయిని మరో మతం అబ్బాయి పెళ్ళిచేసుకుంటానంటే ఒప్పుకోరెందుకు?"

"అజ్ఞానంతో"

"ఒకవేళ ఆ అబ్బాయి, ఆ అమ్మాయి మతంలోకి మారాడనుకోండి. అప్పుడు?"





"అంత గొప్ప ప్రేమకు అడ్డుచెప్పగోరేవాళ్ళు మూర్ఖులనుకోవాలి?"

"మరి... మరి... జూలీకోసం నేను మతం మార్చుకున్నాను..."

చిన్నగా నవ్వాడు ఫాదర్

"నిన్ను నేను ఎప్పట్నించో గమనిస్తున్నాను. కానీ అమ్మాయి మనసులో ఏముందో తెలీదు కదా. జూలీ పెళ్ళివిషయంలో నామాట సాగాలనే ఆలోచన నాకెప్పుడూ లేదు... నువ్వు రాకముందే, యివాళిక్కడ మూడోకుర్చీ వేయటంతోనే నాకు అర్థమయింది"

సిగ్గుతో తలవంచుకుంది జూలీ.



**చర్చ్** అలంకరించి హడావిడిగా వుంది. దాదాపు అందరూ లోపలే వున్నారు, డేవిడ్, బ్రహ్మయ్య, అమితాబ్‌లు తప్ప. గోడని పిడికిలితో గుద్దుతూ మౌనంగా రోదిస్తున్నాడు డేవిడ్. ఏం చేయాలో తెలియక అయోమయంగా చూస్తూ నిలుచున్నారు బ్రహ్మయ్య, అమితాబ్‌లు. డేవిడ్ కళ్ళనుండి ధారగా నీరు కారుతూంది. నిస్సహాయంగా గోడకానుకుని నిలుచున్నాడు. అతని పక్కనే గోడమీద రాసుంది

"దుఃఖపడువారు ధన్యులు, వారు ఓదార్చబడుదురు"

"డేవిడ్, ఒరేయ్, తప్పురా... శుభమా అని పెళ్ళి జరుగుతుంటే ఏడవొద్దురా" ఓదార్చుతూ, అతన్ని నవ్వించే ప్రయత్నం చేశాడు బ్రహ్మయ్య "ఒరేయ్ జిఫాల్, ఈ ప్రేమలన్నీ ఉబ్బరుబ్బర్రా"

"రోతే, రోతే, హస్నా సీఖో...

హస్తే, హస్తే, రోనా ..." చిన్నగా పాడుతూ, డేవిడ్‌ని బైటికి తీసికెళ్ళాడు అమితాబ్. బ్రహ్మయ్యా కూడా వాళ్లననుసరించాడు.

★ ★ ★

ఏడుస్తూ దాన్లోంచి నవ్వటం నేర్చుకో. అంతేకానీ నవ్వుతూ, నవ్వుతూ మాత్రం ఏడవకూడదూ - అని ఆ పాట భావం. అమితాబ్ ఆ పాట పాడుతుండగా, చర్చ్‌లోపలికెళితే, విక్రమ్ కనిపించాడు. అతను నవ్వుతున్నాడు. మనసులో బాధపడుతున్నా నవ్వటం నేర్చుకున్నాడని అర్థమవుతూనేఉంది.

జూలీ, మురళిల పెళ్ళితంతు పూర్తయింది. ఇద్దరూ ఉంగరాలు మార్చుకోగానే ఇప్పుడు వరుడు. వధువును ముద్దుపెట్టుకొనవచ్చును అని చెప్పాడు ప్రీస్ట్.

తన ముఖాన్ని రెండుచేతుల్లోకి తీసుకుని, ముద్దుపెట్టుకోవటానికి ముందుకొస్తున్న మురళిని చటుక్కున రెండుచేతుల్తో తోసేసింది జూలీ, 'ఛీ, ఎంగిలి' అంటూ.

సీన్లో పాత్రలతో పాటు, ప్రేక్షకులు కూడా తెల్లబోతారు. అది సాంగ్ లీడ్ అన్నమాట. ఇక సాంగ్‌లోకొస్తే ముద్దంటే ఎంగిలన్న అమ్మాయిని, పాపం, శోభనందాకా లాక్కొచ్చేసరికి తలప్రాణం తోకకొస్తుంది మురళికి. ఆ యిద్దరి శోభనం జరిగేనరికి పల్లవితోపాటు, మొదటి చరణం పూర్తవుతుంది. రెండోచరణంలో జూలీకి నెలతప్పింది. దంపతులిద్దరూ ఫాదర్ దగ్గర సెలవు తీసుకుని, తరలివెళ్ళిపోయేసరికి పాట పూర్తయిపోతుంది

★ ★ ★

కథ అందరికీ నచ్చింది కానీ డైరెక్టర్ ఎన్నిక తేలలేదు. ముఖ్యపాత్రలు నాలుగూ కొత్తవాళ్ళుగానీ, చిన్నవాళ్ళుగానీ వేయాలనీ, మిగతా పాత్రల్లో ఎస్టాబ్లిష్డ్ ఆర్టిస్టులే వుండాలనీ అనుకున్నారు. కనుక సినిమాకు ఫైనాన్స్ రావాలంటే, బిజినెస్ కావాలంటే మంచిపేరున్న దర్శకుడు కావాలి.

సాధారణంగా సినిమాకు అంచనా వేసుకున్న బడ్జెట్‌లో 5 శాతంనుండి 20 శాతందాకా, ఆయా నిర్మాతలను బట్టీ, సినిమానుబట్టీ





నిర్మాత సొంతడబ్బు వెచ్చిస్తుంటారు. మిగతా దాంట్లో కొంత బిజినెస్ అడ్వాన్సుల రూపంలో వస్తుంది. ఇది కూడా నిర్మాతనూ, సినిమానూ బట్టి వుంటుంది. చిన్న నిర్మాతలకు అడ్వాన్సుగా వచ్చేది తక్కువ. మామూలుగా, చూసుకుంటే, నటీనటుల్నీ, దర్శకుణ్ణీ అనౌన్స్ చేసుకుని, రీరికార్డింగ్ చేసుకుంటే, రికార్డింగ్ రోజునే నైజాం, సీడెడ్ ప్రాంతాల్లో బిజినెస్ ఒప్పందాలు పూర్తై కొంత అడ్వాన్సు నిర్మాతకు అందుతుంది. చిన్న సినిమాలకు నైజాం, సీడెడ్ ఏరియాల బిజినెస్ తక్కువగా వుంటుంది. అనుకున్న మొత్తంలో 15 శాతం నుండి 40 శాతం వరకూ అంచెలవారీగా నిర్మాతకు చెల్లించి, ఫస్టకాపీ వచ్చాక మిగతా సొమ్ము కట్టి, తమ తమ ఏరియా ప్రింట్లు తీసుకుంటారు పంపిణీదారులు. చిత్రనిర్మాణం సవ్యంగా జరుగుతున్న పక్షంలో చిన్న నిర్మాతలకు లక్షన్నరనుండి నాలుగులక్షల వరకూ ఈమధ్యకాలంలో అంచెలవారీగా అందుతుంది. అంతకన్నా ఎక్కువ రాదు.

ఇక ఆడియో రైట్స్. అంటే సినిమా పాటల క్యాసెట్స్ కంపెనీవాళ్ళిచ్చేది. మొత్తం ఒప్పందం హీరోపైనా, సంగీత దర్శకుడిపైనా ఆధారపడి పదివేలనుండి నలభైవేలవరకూ వుంటుంది. పెద్ద హీరోలూ, పెద్ద సంగీత దర్శకులూ వున్నప్పుడు ఈ మొత్తం లక్షల్లో వుంటుంది. ప్రస్తుతానికి పెద్ద సినిమాల సంగతి వదిలేస్తే వీడియో రైట్స్. ఈ సొమ్ము ముప్పై, నలభై వేలనుండి ఒక్కోసారి లక్ష దాటుతుంది. డబ్బింగ్ మార్కెట్ ఎక్కువైన దగ్గర్నించీ సినిమా నిర్మాణం ప్రారంభదశ నుండే డబ్బింగ్ బిజినెస్ కూడా జరుగుతుంది. డబ్బింగ్ చేయబడే భాషలో ఆయా హీరో, హీరోయిన్లు, దర్శకులకున్న క్రేజ్‌నుబట్టి, ముఖ్యంగా వాళ్ళున్న డబ్బింగ్ సినిమాలకు ఈమధ్య కాలంలో జరిగిన బిజినెస్‌ని బట్టి వుంటుంది డబ్బింగ్ రైట్స్ సాధారణంగా మూడు నుండి ఎనిమిది, పదిలక్షలదాకా పలుకుతాయి. అయితే యిందులో నిర్మాతకు అడ్వాన్సుగా ముట్టేది చాలా తక్కువ.

అసలైన బిజినెస్ ఆంధ్రా ఏరియాది. ఒక సినిమాకు జరిగే బిజినెస్‌లో ముఖ్యమైన భాగం, సుమారు 65 శాతం అయ్యేది ఆంధ్రా ఏరియాల్లోనే. ఇందులో వున్న మరో చిక్కు యిది ముక్కలుగా కూడా జరుగుతుంది. జిల్లాలవారీగానూ, ఒక్కో ప్రాంతానికీ వేర్వేరుగా కూడా బిజినెస్ చేసుకోవచ్చు. అసలు ఏరియాలవారీ అమ్మకానికొచ్చిన తరువాత వేర్వేరుగా కొనటమే ఎక్కువయింది. చిక్కులమయంగానూ, ప్రధానమైనదిగానూ వున్నందునే ఈ బిజినెస్ ఒకపట్టాన పూర్తవదు. ఇది పూర్తయితే చాలా సులభంగా మూడునుండి ఆరులక్షలదాకా ముందుగానే (అంచెలవారీగా) నిర్మాతకు ముడుతుంది. నిర్మాణం సులువుగా పూర్తవుతుంది. కానీ అవదు, కొన్నిసార్లు. ముఖ్యంగా కొత్తనిర్మాతల సినిమాలకు.

కొందరు నటులూ, సాంకేతిక నిపుణులూ తమ పారితోషికాల్లో కొంతభాగం సినిమా పూర్తయ్యాక తీసుకోవటానికి ఒప్పుకుంటారు. అంటే ఇలాంటివాళ్ళవలన నిర్మాతకు తాత్కాలికంగా కొంత ఖర్చు తగ్గిందన్నమాట. కొన్ని ఔట్‌డోర్ యూనిట్లవాళ్లు కూడా ఇలాగే ఒప్పుకుంటారు.

అన్ని ఏరియాల బిజినెస్ పూర్తయి, అందరూ సహకరిస్తే షూటింగ్ పార్ట్‌వరకూ తన పెట్టుబడితో పూర్తిచేసుకుంటే అది చాలా గొప్ప సంస్థ అనే చెప్పుకోవాలి. సాధారణంగా చిక్కులన్నీ షూటింగ్‌లోనే వస్తాయి. అది పూర్తయితే మిగతావన్నీ అంత కష్టం కాదు. కానీ కష్టాలన్నీ షూటింగ్ పూర్తవటానికే. ఇక అన్ని ఏరియాల బిజినెస్ పూర్తవని నిర్మాత విషయం... అలాగే షూటింగ్ పూర్తయినాక ఖర్చుల విషయం... ఇక్కడే ఫైనాన్షియర్ రంగంలోకొస్తాడు.

సాధారణంగా ఎంత పెద్ద నిర్మాతైనా ఫైనాన్స్ లేకుండా సినిమా తీయడు. వడ్డీ వస్తుందికదాని ప్రతీ సినిమాకూ అడిగినంత సొమ్ము ఇవ్వరు ఫైనాన్షియర్లు. సాధారణంగా ఆ సినిమా హీరో, దర్శకుడూ, నిర్మాతలను బట్టి ఇస్తుంటారు. తను ఇస్తున్న డబ్బు షూటింగ్‌కు సక్రమంగా ఉపయోగపడుతున్నప్పుడే, కనీసం అలా అనిపించినప్పుడే మరో వాయిదా ఇస్తుంటారు. కొత్త నిర్మాతలకు రికార్డింగ్ పూర్తయి, కనీసం వారంరోజుల షూటింగ్ పూర్తయితే తప్ప మొదటి వాయిదా ఫైనాన్స్ చేతికందదు. హీరో, డైరెక్టర్‌ని బట్టి, మిగతా వివరాలనుబట్టీఆసినిమాఎంతవరకుబిజినెస్

అవడానికి అవకాశం వుందని అంచనా వేస్తారో అందులో 30 శాతం నుండి 60 శాతంవరకూ, అంచెలవారీగా ముందుగా వడ్డీ మినహాయించుకుని ఇస్తారు ఫైనాన్స్.

తమ సినిమాలో అంతా చిన్నవాటులే అనుకోవటంవల్ల, దర్శకుడి పేరుమీద ఆధారపడి ఫైనాన్స్ రావాల్సి వుంటుందని నిర్ణయించుకున్నారు, శ్రీరామచంద్రుని సినిమాకు. అలాంటి దర్శకులంతా చెప్పినట్టు వినరు. కథ మారుస్తారు. బడ్జెట్ పెంచుతారు. పోనీ కథ మార్చకుండా, బడ్జెట్ పెంచకుండా తీసే దర్శకులను పెట్టుకుందామంటే, వాళ్లవలన కావలసినంత ఫైనాన్స్ రాదు. చాలా విధాలుగా తర్కించుకున్న మీదట ఒక నిర్ణయానికొచ్చారు. ఒక సుమారు హీరోని పెట్టుకుని, దర్శకత్వ బాధ్యత చక్రికి అప్పగించాలని.

''నేనింకా రచయితగానే నిలదొక్కుకోలేదు. దర్శకత్వం చేస్తానంటే హీరోలు ఒప్పుకోకపోవచ్చు. మీకూ బిజినెస్‌కు ప్లస్ పాయింట్ కాదు. ఫైనాన్షియర్ ఒప్పుకోకపోవచ్చు. అందరమూ కొత్తవాళ్లమే గనుక కథాబలంమీద ఆధారపడాలి. తప్పులేదు. కానీ సినిమా విజయవంతమవటానికి చాలా కారణాలుంటాయి. వర్షాల మూలంగా, కర్ఫ్యూల మూలంగా, పోటీగా వచ్చిన పెద్ద సినిమాల మూలంగా అన్ని రకాలుగా బాగుండీ విజయవంతం కాలేకపోయిన సినిమాలెన్నో వున్నాయి. మీ మొదటి సినిమా సక్సెస్ అయినాక, రెండో సినిమాకు ఆలోచిద్దాం నా దర్శకత్వం విషయం'' అన్నాడు చక్రి.

''మేం అన్నీ కనుక్కున్నాం. మేం చెబుతున్న హీరోల్లో ఏ ఒక్కరున్నా, కొత్త దర్శకుడైనా సరే, అతనితో మాట్లాడి ఫైనాన్స్ ఇస్తామన్నారు ఫైనాన్సియర్లు. బిజినెస్ విషయానికొస్తే, మహా మహా సినిమాలు కూడా ఫస్ట్‌కాపీ కూడా చూడకుండా ఆంధ్రా ఏరియా ఎవరూ కొనటంలేదు. నువు రాసిన స్క్రిప్టు చాలా బాగుంది. ఈమధ్య ఇలాంటి కథ రాలేదు. నీకు దర్శకత్వం ఏమీ చేతకాకపోయినా సినిమా ఫెయిలయ్యే సమస్య లేదు. పైగా నువ్వు చెయ్యగలవనే నమ్మకం మాకుంది. నువ్వే దర్శకుడివైతే మాకు అన్నివిధాలా ధైర్యంగా వుంటుంది. అంతగా కావాలంటే మంచి అసిస్టెంట్లను పెట్టుకో అంతే''

''మీరు ఓ నిర్ణయానికొచ్చినట్టు కనిపిస్తూంది. ఇదే అవకాశం ఏ రామానాయుడో, రామోజీరావో ఇస్తే కళ్లు మూసుకుని ఒప్పుకునే వాణ్ణి. కానీ ఇక్కడ మీరూ కొత్తే, నేనూ కొత్తే. పైగా నాకు దర్శకుణ్ణి కావాలని వుంది. కానీ ఇలా కాదు. నా మొదటి సినిమాలో ఏ విషయమూ రాజీపడకుండా, నేను అనుకున్నది అనుకున్నట్టుగా తీసే స్వతంత్రం కావాలి నాకు. అదిక్కడ వీలుపడకపోవచ్చు. నన్ను బలవంతపెట్టకండి'' సున్నితంగా వారించాడు చక్రి.

అప్పుడు శ్రీరామచంద్రుడు మొదలెట్టాడు

''మీరు ఊరెళ్ళిన వారంరోజులూ మేం చాలా విషయాలు ఆరాతీశాం, తెలుసుకున్నాం. మొదటి సినిమా పెద్దవాళ్ల చేతుల్లో పెట్టి, బిజినెస్ చేసుకున్నాక, అది ఫెయిలయితే, రెండో సినిమాకు బిజినెస్ ఆఫర్లు రావు. అంతకన్నా మొదటి సినిమా అనుకున్నది అనుకున్నట్టుగా చక్కగా తీసి, అందులో రూపాయి మిగుల్చుకోకపోయినా ఫరవాలేదు. సినిమా నిలబడితే రెండో సినిమాకు మంచి బిజినెస్ అవుతుంది. నేను కలకాలం ఈ పరిశ్రమలో నిలబడదామనుకుంటున్నా. మీ సామర్థ్యంమీద నాకు నమ్మకం వుంది. ఇక స్వతంత్రమంటే, మీకే టెక్నీషియన్ కావాలంటే ఆయన్నిస్తాను. పెద్ద టెక్నీషియన్లవల్ల బిజినెస్‌కు ప్లస్‌పాయింట్స్ పెరుగుతాయి. ఇక ఖర్చంటారా మీరు ఏం ఖర్చుచేసినా క్వాలిటీ కోసమే చేస్తారని ఇన్నాళ్ల పరిచయంతో అర్థమయింది. మీకు మంచి అవగాహన వుంది. మాకు మీ మీద నమ్మకం వుంది. సంకోచించకుండా ఒప్పుకోండి.''

''పిలిచి పిల్లనిస్తామంటే ఇదవుతావేంటి బాసూ''

''సరేనను గురూ... ఇందులో నష్టం వుంటే నేను మాత్రం ఆలోచించనా''

''సరేననటానికేముంది. సరే... మీకు ఇందులోని కష్టనష్టాలు అర్థమైతే చాలు. అయినా ఒక విషయం చెబుతున్నాను గుర్తుంచుకోండి. రికార్డింగ్ పూర్తయి, మనం షూటింగ్ స్టార్ట్ చేసేవరకూ నా పేరు ప్రకటించవద్దు. అందువల్ల మళ్లీ ఆలోచించుకోవటానికి మీకు అవకాశం




వుంటుంది. అలా మరో దర్శకుణ్ణి మీరు పెట్టు కున్నా నాకూ నష్టం వుండదు''

''అలాంటి అవకాశం లేదు బాసూ. సారీ... డైరెక్టర్ సార్''

''థాంక్యూ''

★ ★ ★

ప్రేక్షకుల్లో ఓమాదిరి పేరున్న నిర్మాతా, ఓమాదిరి పేరున్న దర్శకుడూ అయితే మన కథ 20 లక్షల్లో పూర్తయి. ఫస్టుకాపీ చేతికి తెచ్చుకోవచ్చు. కనీసం బిజినెస్ ప్రాబ్లం లేనంత పేరున్న నిర్మాతయినా, నాలాంటి దర్శకుడుంటే మరో 2, 3 లకారాలు అటూ, ఇటూగా పూర్తిచేయొచ్చు. ఇక్కడ ఇద్దరమూ కొత్తవాళ్లమే. కనుక కాస్త పేరున్న హీరో అవసరం. ఆయనకే 3 నుండి 5 దాకా అవు తుంది. మిగతా ఆర్టిస్టులకూ 2 వరకూ అవు తుంది.

ఎంత కాదనుకున్నా మన కథలో సస్పెన్స్ కూడా ముఖ్యమైన భాగమయింది. మనలాంటి కొత్తవాళ్లున్నప్పుడు సినిమా రెండోవారం దాకా నిలబడాలంటే ఇదీ ఒక సమస్యే. సినిమా చాలా బాగుందని ప్రేక్షకుడికి అనిపించాల న్నా, సస్పెన్స్ తెలిస్తే తెలిసింది మరోసారి సినిమాకు వెళదాం అని ప్రేక్షకుడు అనుకోవా లన్నా అదనపు ఆకర్షణలుండాలి. ప్రతిసీనూ 'సరిపోతుందిలే' అన్న స్థాయిలోకాక 'చాలా బాగుంది' అనేటట్టు తీయాలి. మరికొన్ని అద నపు ఆకర్షణలుండాలి.

మొదటిది పాటలు. ముందుగా 3, 4 పాట లు సరిపోతాయనుకున్నాం. కనీసం ఆరు పాట లుండాలి. అవి హిట్ కావాలి. చిత్రీకరణలో చాలా బాగుండాలి. కథ సుమారుగా వుండి పాటలతో బాగా నడిచిన సినిమాలున్నాయి. కథ చాలా బావున్నప్పుడు కూడా పాటల్ని నిర్లక్ష్యం చేయనవసరంలేదు, నిజంగా అనవ సరపు ఖర్చు అనుకుంటే తప్పు. ఇక మనమైతే వీలైనన్ని ప్లస్‌పాయింట్స్ వుంచుకోవాలి.

''మన కథలో లవ్‌సీన్స్, టెన్షన్ బిల్డ్ చేసే సీన్స్ కొల్లలుగా వున్నాయి. వీటికి రీరికార్డింగ్ ప్రాణం''

''రీరికార్డింగ్ అంటే ఏంటి బాసూ? పాటల న్నీ ముందుగానే రికార్డింగ్ చేసు కుంటాంగదా?'' ప్రశ్నించాడు లక్ష్మణకుమార్.

''బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌నే రీరికార్డింగ్ అంటారు. పాటల పేరుతో ఒకసారి రికార్డింగ్ పూర్తవుతుందిగదా. సినిమా పూర్తయ్యాక సన్ని వేశాల కనుగుణంగా వినిపించే నేపథ్య సంగీతం రికార్డు చేస్తారు. అంటే మరొక రికా ర్డింగ్. కనుక దీనికాపేరు వచ్చివుంటుంది''

''అంతేనా? మా ఊళ్లో మా ఫ్రెండ్స్ టీవీ సింగిల్ ఎపిసోడ్స్ తీశారు. దానికి నాలుగైదు మ్యూజిక్ క్యాసెట్లు తెచ్చి, బ్యాక్‌గ్రౌండ్‌లో కలిపేశారు''

''మనం అలా చేయాలనుకుంటే చేయొ చ్చు. కానీ క్వాలిటీ వుండదు. ఎందుకూ అనడి గితే నీకిప్పుడు 'శిశుర్వేత్తి, పశుర్వేత్తి' దగ్గ ర్నించి మొదలెట్టి, సంగీతంతో రోగాలు నయం చేయవచ్చువరకూ ఎన్నో చెప్పాలి''

''దానికీ, సినిమాలకూ సంబంధమేంటి గు రూ?''

''ఎంతోవుంది గురూ... మన జీవితంలో సంగీతానికెంతో ప్రాముఖ్యత వుంది. మన గుండె చప్పుడులో కూడా ఒక లయ వుంది. పసిపాప జోకొట్టటంలోని లయకు సమ్మోహితు డై నిద్రపోతాడు. ఏడ్చే పాపకు తల్లి లాలిపాట పాడి నిద్రపుచ్చుతుంది. పెళ్లిరోజున బ్యాండు మేళం ఒకరకంగా వాయిస్తే, చావురోజున మరో రకంగా వాయిస్తారు. దేవుడి మంగళహారతికీ, భజన పాటకీ ఎంతో భేదం వుంది. సమావేశా ల్ని 'వందేమాతరం'తో మొదలెట్టి, 'జనగణ మన'తో ముగిస్తాం. బరువులెత్తే కూలీలు అలుపు మరిచిపోవటానికి ఓ రకంగా పాడు కుంటే, నాట్లేసే పల్లెయువతులు మరో రకంగా పాడుకుంటారు. ఇన్ని రకాలుగా, ఇన్ని సంద ర్భాలలో వున్న సంగీతాన్ని సినిమాలో కూడా ఒక పద్ధతి ప్రకారం ఉపయోగించుకోవాలేగానీ ఏదో శాస్త్రానికి చేసినట్టు కాదు. అసలు రాజులు అంతరించిపోయాక సంగీతాన్ని ప్రజలకు అందుబాటులోకి తెచ్చింది సినిమాలేకదా. అందులో మనం చూపించే ప్రత్యేకత చూ పించాలి''

''నిజమే గురూ... నాకు తెలియకన్నాను. సింగిల్ ఎపిసోడ్‌కూ, సినిమాకూ తేడా లేదూ?''



"ఎంతమాత్రమూ లేదు. అది చిన్న తెర మీద చిన్న సినిమా అయితే, ఇది పెద్ద తెరమీద ఎక్కువ నిడివి వున్న సినిమా. అంతే తేడా. మన లక్ష్మణ్ అన్నట్టు 'ట్రాక్స్'తో రీరికార్డింగ్ చేస్తున్నవాళ్లూ వున్నారు. కానీ అన్నిచోట్లా. పనికిరాదు"

"ఎందుకని బాసూ?"

"సంభాషణలమీద ఎక్కువగా ఆధారపడిన సినిమాకు, మొక్కుబడిగా ఏదో ఒక సంగీతం వాడుకోవచ్చు. విషాదంలో వయొలిన్, సంతోషంతో సితార, ఎవరైనా చచ్చిపోయినప్పుడు సన్నాయి, పల్లెటూళ్ల ఔట్‌డోర్ చూపించగానే ఫ్లూట్ ఇలా నిర్ణయం చేసుకుని వినిపిస్తే, చూసేవాడికి రొటీన్‌గా వుంటుంది. ఓ సన్నివేశం కంటికింపుగా కనిపించటానికి ఎంత కృషిచేసి చిత్రీకరించినా, దానికి అంతే ప్రత్యేకమైన నేపథ్య సంగీతం వినిపించనప్పుడు, ఆ సన్నివేశం ఆకట్టుకోవలసినంతగా ఆకట్టుకోదు.

ముఖ్యంగా సినిమాను దృశ్య ప్రధానంగా చిత్రించాలి. ఆ దృశ్యంలోని మూడ్‌ని ఇంతకు ముందు ఎన్నో సినిమాల్లో ప్రేక్షకులు చూసివుండవచ్చు. అందుచేత చిత్రీకరణలో సృజనాత్మకత చూపించి మంత్రముగ్ధుల్ని చేయటానికి ప్రయత్నిస్తాడు దర్శకుడు. దృశ్యంలో వుండే ఆ ప్రత్యేకత, సంగీతంలో కూడా వున్నప్పుడే మరింత ఆకర్షణీయంగా రూపొందుతుంది సన్నివేశం. మరీ ముఖ్యంగా హారర్ సన్నివేశాలు, ప్రేమ సన్నివేశాలూనూ. ఒక మంచి దర్శకుడు కెమేరాను ఎంత నేర్పుగా ఉపయోగించుకుంటాడో, సంగీతాన్ని అంత నేర్పుగా ఉపయోగించుకుంటాడు.

ఒక్క సంగీతమే కాదు, ప్రతి శబ్దమూ ముఖ్యమైనదే. పుస్తకం తిరగేయటం, ఉయ్యాల బల్ల వూగటంలాంటి శబ్దాలను జోడించటాన్ని మిక్సింగ్ అంటారు. హాలీవుడ్‌లో ఈ మిక్సింగ్‌కోసం ఆడియోగ్రఫీ నిపుణులుంటారు. ఇలాంటి నిపుణుల్ని మనవాళ్లు కూడా ఈమధ్యనుండీ వినియోగించుకుంటున్నారు. దృశ్య ప్రధానమైన సినిమాలో శబ్దం కూడా చాలా ముఖ్యమైందే. కనుక మనం ఎవరో తయారుచేసుకున్న ట్రాక్స్ వాడుకోవటంకన్నా రీరికార్డింగ్ చేసుకోవటం మంచిది. కాకపోతే ఆడియోగ్రఫీకి ప్రత్యేక నిపుణులు అవసరంలేదు మనకు"

"అవును గురూ, పాటలకంటే ట్యూన్స్‌తో చూసుకుంటారు ముందుగా. బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ అయితే సన్నివేశాన్ని బట్టి చూసుకుంటారు. మరి టైటిల్స్ అప్పుడు వినిపించే సంగీతం ఎలా?"

"నువ్వాగు గోవిందూ, టైటిల్స్ మ్యూజిక్ ఎలా వాయిస్తారంటే టింగ్ టింగ్ టింగ్, టయ్‌టుయ్ అని డైరెక్టర్ నోటితో చెబితే మ్యూజిక్ డైరెక్టర్ విని వాయిస్తాడుగానీ ఈ ఆడియోగ్రఫీ ఏంటి? పుస్తకం తిరగేయటం, ఉయ్యాలబల్ల ఊగటం ఇలాంటివన్నీ జోడించటమేంటి? నాకర్థంకాలేదు. మామూలుగా అవన్నీ శబ్దాలు వాటికవే వస్తాయికదా?" సందేహం వెలిబుచ్చాడు లక్ష్మణకుమార్.

"లక్ష్మణ్, నువ్వన్నట్టు మామూలుగా షూటింగ్ చేసుకుంటున్నప్పుడు దేని శబ్దం దానికొస్తుంది. డైలాగ్స్‌తోపాటు అవన్నీ రికార్డవుతాయి. కానీ ఆ శబ్దాలు పనికిరావు. ఒక్కోసారి సరిపోవు" చెప్పాడు చక్రి.

"సరిపోవా? అంటే"

"వికోవజ్రదంతి అడ్వర్టయిజ్‌మెంట్ చూశారా మీరు? అందులో యాపిల్ కొరకడం, వచ్చిపోక కొరకడం, చెరకుగెడ చెక్కు నోటితో లాగటం గుర్తున్నాయా?"

"అవునవును... బలేవుంటుంది బాస్. వళ్లు గట్టిగా వున్నాయని అవన్నీ చూపిస్తాడు కానీ ఆ శబ్దాలన్నీ వింటుంటే ఎప్పుడెప్పుడు మనం బైటికెళ్లి అవన్నీ కొరుక్కుతిందామా అనిపిస్తుంటుంది"

"ఆ శబ్దాలన్ని మిక్స్ చేసినవే. అలా మిక్స్ చేయటానికి ఓ నిపుణుడుంటాడు. ఆ శబ్దాలని ఆయన ప్రత్యేకంగా సృష్టించి వాటిని కలుపుతాడు"

"ఏంటీ? సృష్టిస్తాడా? అంటే మళ్లీ కూచుని యాపిల్ కొరుకుతాడా? ఏం, ముందుగా కొరికిందే వుందికదా?"

"లక్ష్మణ్... నువ్వు మధ్యలో కల్పించుకోకుండా వుంటే వివరంగా చెబుతాను. తరవాత





ఏదైనా అర్థం కాకుంటే అడుగు. కొన్ని శబ్దాలు సినిమాలో ప్రత్యేకంగా వినిపించాల్సివస్తుంది. ఉదాహరణకు ఓ దొంగను ఓ పోలీస్ అనుసరిస్తున్నాడు. దొంగ నిర్మానుష్యంగా వున్న ఓ బంగాళాలోకి ప్రవేశించి దాక్కున్నాడు. పోలీస్ కూడా అందులోకి వచ్చి అతన్ని వెతుకుతుంటాడు. ఇలాంటి సీన్లో అడుగుల చప్పుడును వినిపిస్తుంటారు. నున్నటి గచ్చుమీద బూట్లతో పరుగెత్తుకు రావటం, నెమ్మదిగా నడుస్తూ అటూ ఇటూ చూడటం, మెల్లెక్కడంలాంటి శబ్దాలన్నీ ప్రామినెంట్‌గా వినిపిస్తూ టెన్షన్ కలిగిస్తుంటాయి. ఆ నిశ్శబ్దంలో ఆ కాలికదలికల చప్పుడే భయంకరంగా వుంటుంది. ఈ చప్పుడు షూటింగ్‌లో రికార్డు చేసింది కాదు. అందుకు మొదటి కారణం షూటింగ్‌లో రికార్డు చేసినవేవీ పనికిరావు. ఆగు, ఎందుకు పనికిరావో తరవాత చెబుతాను. ముందుగా ఇది కానీ. ఇక రెండో కారణం అప్పుడు వచ్చిన శబ్దం మనకు కావలసిన ఎఫెక్ట్‌లో వుండకపోవచ్చు. ఉండకపోవచ్చునేంటి, ఉండదు కూడా. సహజంగా వచ్చే శబ్దం పరిమాణం, స్వభావం సినిమాల్లో ఎఫెక్టులకు సరిపోవు. అందుకే ఈ శబ్దాలన్నీ మళ్లీ తయారుచేసి కలుపుతారు. ఇందుకు ఈ నిపుణులు నానాశ్రమలూ పడతారు. వాళ్ల పరికరాలు చూస్తే ఒక్కోసారి నవ్వొస్తుంది.

ఇందాక చెప్పిన బూట్ల చప్పుడులాంటి దానికోసం ఎండిపోయిన కొబ్బరి చిప్పల్లాంటివి వాడుతారు. కొబ్బరి కాదు, మనం పడేసే కొబ్బరిటెంక. దాంతో నేలమీద నడిచినట్టూ, పరిగెత్తినట్టూ చేతుల్తో కొడతారు. అందుకే మనం చాలా తమాషాగా అనిపించే ఆ శబ్దాలకు థ్రిల్ ఫీలవుతాం. ఆయా సన్నివేశానికనుగుణమైన మూడ్ కోసం ఇలా చేస్తారు. ఓ అమ్మాయి తన లవర్ ఇచ్చిన లవ్‌లెటర్ మడతలు విప్పి చదువుతున్నప్పుడు ఆ కాగితం చేసే చప్పుడుకు అంత ప్రాధాన్యత లేదు. ఎందుకంటే, ఆ ఉత్తరంలో ఏమున్నదో, అదే ముఖ్యమైనది. ఇలాంటప్పుడు ఆ అమ్మాయి ఉత్తరం మడతలు విప్పే శబ్దం మామూలుగానే వుంటుంది. అదే శబ్దం మరో సీన్లో అవసరం కావచ్చు. అంటే...

ఓ పేరుమోసిన హంతకుడు ఒకాయన్ని ఫలానారోజు సాయంత్రం 5-00 గంటలకు చంపుతానని బెదిరించాడు. ఆయన ప్రాణాలు బిగపట్టుకుని కూర్చున్నాడు. సరిగ్గా సాయంత్రం 4-55కు హఠాత్తుగా ఫోన్ మోగింది. నీ ఇంట్లో భగవద్గీత పుస్తకంలో ఓ సందేశం వుంది. చదువుకో... ఆ ప్రకారం చేయకపోతే అయిదు నిమిషాల్లో నీ చావు తప్పదు- అని ఫోన్లో ఎవరో చెప్పారు. అప్పుడు అతను ర్యాక్‌లోంచి పుస్తకాలు లాగటం, అవి అటూ ఇటూ పడటం, భగవద్గీత తీయటం, అందులోంచి కాగితం తీయటం ఇవన్నీ ఆయనతోపాటు, థియేటర్లో కూచుని చూస్తున్న ప్రేక్షకులకు కూడా టెన్షన్‌గా వుంటుంది. ఈ టెన్షన్ని మరింతగా మనసుల్లపై ప్రభావితం చేయటానికి ఆ కాగితం మడతవిప్పే చప్పుడును ప్రత్యేకంగా వినిపిస్తారు. ఇలాంటప్పుడు జిలాటిన్ పేపర్‌లాంటి దాన్ని వాడి, ఆ ఎఫెక్ట్ కలిగిస్తారు. మామూలుగా మనం కాగితం మడతలు విప్పినప్పుడు వచ్చే శబ్దం అంత స్పష్టంగా వుండకపోవచ్చు. వున్నా అది షూటింగ్ చేసినప్పుడు వచ్చే శబ్దం గనుక పనికిరాదు..."

"చక్రీ... ప్లీజ్..."

"అంత భయం నటించడమెందుకు? ఏంటి?" నవ్వుతూ అన్నాడు చక్రి.

"ఏంలేదు... బూట్లతో నడిచే శబ్దం కొబ్బరి చిప్పలతో చేస్తారా? నిజంగానా?"

"నిజంగానే... అసలీ శబ్దాలు పుట్టించటానికి వాళ్లుపడే అవస్థలూ, చేసే పనులూ, ఉపయోగించే పరికరాలూ చూస్తే, తెలియనివాళ్లకు నవ్వొస్తుంది. పిచ్చివాళ్లేమోనని కూడా అనిపిస్తుంది. సడన్‌బ్రేక్‌తో కారు ఆగినప్పుడు కీచుమని టైర్లు రాచుకోవటం వుందనుకో. దీనికోసం ప్లాస్టిక్ సబ్బు డబ్బాను బోర్లించి, నున్నటి గచ్చుమీద బలంగా లాగుతారు. ఉయ్యాలబల్ల ఊగటం వుందనుకో. ఆ చప్పుడుకోసం కొబ్బరితురిమే వంటింటి పరికరం వాడుతారు. దాన్ని అటూ ఇటూ కదిలిస్తే వచ్చే చప్పుడే ఉయ్యాలబల్ల ఊగేటప్పుడు మనకు సినిమాల్లో వినిపించేది. ఇలాంటి శబ్దాలన్నీ కలిపి సౌండ్ ట్రాక్‌లో మళ్లీ జోడించటమే మిక్సింగ్. ఇలాంటి పరికరాలేకాక ముందుగా రికార్డుచేసి పెట్టుకున్న కొన్ని వందల శబ్దాలు కూడా వాళ్ళ

దగ్గరుంటాయి. అయితే మొన్నమొన్నటివ రకూ ఈ పని ఇలా రొటీన్‌గానే చేసేవాళ్లు మనవాళ్లు. తెలుగులో మొదటిసారిగా ఈ పనిని మరింత ప్రత్యేకంగా చేయటానికి ఒక డైరెక్టరాఫ్ ఆడియోగ్రఫీని వాడుకున్నది 'శివ' సినిమాలో. సినిమాలో సంభాషణలుకాక ఇతర త్రా వినిపించే ప్రతి శబ్దమూ, అంటే రీరికా ర్డింగ్‌తోసహా ఆయన పర్యవేక్షణలో జరుగు తుంది''

''మనది కూడా సస్పెన్స్ సినిమాకదా. మన మూ వాడుదామా గురూ'' ఉత్సాహంగా అడి గాడు గోవిందు.

''బాబూ ముందుగా మన బడ్జెట్ చూసుకో వాలి. తరవాత డైరెక్టర్ అభిప్రాయం తీసుకో వాలి. నన్నడిగితే మనకు అనవసరం'' బదులి చ్చాడు చక్రి, నవ్వుతూ.

''మన సినిమా కూడా 'శివ'లాగా హిట్టవు తుంది బాసూ. నువ్వేకదా డైరెక్టర్‌వి''

''లక్ష్మణ్ బాసూ 'శివ' సినిమా హిట్ట యింది. ఒక్క ఆడియోగ్రఫీతోనే కాదు. అది దానికో ప్లస్‌పాయింటు, అంతే. అలా అను కుంటే ఇంగ్లీషు, హిందీ సినిమాలవాళ్లు ఎప్ప టినుంచో అలవాటుపడ్డారు దీనికి. మరి, ఆ సినిమాలన్నీ హిట్ అవటం లేదెందుకని? అదీగాక, మన థియేటర్లన్నీ అంత చక్కటి సౌండ్‌సిస్టమ్‌తో ఎక్విప్ అయిలేవు. అలాంట ప్పుడు చేసిన శ్రమంతా ప్రేక్షకులందరికీ అందదు. సినిమా వాళ్లలో ఇదో దరిద్రం వుంది. ఓ సినిమా హిట్ అయితే దాని కారణాల్ని ఇలా ఏదో ఓ విషయానికి అంటగట్టే స్తారు. లేదా హీరోకు అంటగడతారు. 'శంకరా భరణం' హిట్ అయిందని వరుసగా సంగీత ప్రధానమైన సినిమాలు, 'ప్రేమఖైదీ' హిట్ అయిందని వరుసగా ప్రేమకథలూ, ఓ హీరో సినిమా హిట్ అయిందని ఆయన కోసం పోటీపడి రెమ్యునరేషన్లు పెంచేయటం, హిందీ మ్యూజిక్ డైరెక్టర్‌ని పెడితే హిట్ అవుతుందనుకోవటం, టైటిల్లో ముందుగా ఫలానా అక్షరం వుంటే హిట్ అవుతుందనుకో వటం, ఫలానారకంగా టైటిల్ వుంటే హిట్టవు తుందనుకోవటం ఇదంతా నాన్సెన్స్. ఒక వెరైటీ కథ, కనీసం ఈ మూడు నాలుగు సంవత్సరాలలో రానితరహా కథ తీసుకుని, దాన్ని మరోవిధంగా ప్రజెంట్‌చేసి, ప్రతీ అంశ మూ మనసుపెట్టి మెరుగుపరిచి, జాగ్రత్తగా తీస్తే, పెద్ద హిట్ కాకపోయినా, ఎక్కువ నష్టం రాదు. ఈ పద్ధతిలో, సినిమానూ వ్యాపారంగా చేసుకుని నిలబడితే, హాయిగా నిలదొక్కుకోవ చ్చు. ఒకటీ, అరా ఫెయిల్యూర్స్ ఎక్కడైనా వుంటాయిగదా. అంతేకానీ, 'శివ' హిట్టయింది సౌండ్స్‌తోనే అనుకుని, అదొక్కటే ముఖ్యం అనుకుంటే, ఆ తర్వాత అదే ఎఫెక్ట్స్‌తో వచ్చిన మిగతా సినిమాలన్నీ ఎందుకంత హిట్ కాలేదు? కొన్ని ముంచేశాయి కూడా కదా? ఎందుకు మరి?''

''నిజమే సార్... పాతకాలంలోలాగా ఒక పద్ధతిలో నిర్మిస్తున్నవాళ్లతో ఫెయిలైనవాళ్లు ఇప్పుడెవరూ లేరు. ఇప్పుడు ఇలా తీస్తున్న వాళ్లను చూసి, మిగతా వాళ్లెందుకు తెలుసుకో రో'' అన్నాడు శ్రీరామచంద్రుడు.

''షూటింగ్‌లో రికార్డు చేసినవి పనికిరావు. ఎందుకో తర్వాత చెబుతానన్నావు'' గుర్తుచేశా డు లక్ష్మణకుమార్.

''చెప్పాలన్నమాట'' రెట్టిస్తున్నట్టుగా నవ్వి, సిగరెట్ వెలిగించుకున్నాడు చక్రి.

''చెప్పు బాసూ... అసలివన్నీ నేర్చుకోవాలని నువ్వే అన్నావు''

''చిరంజీవి డబ్బింగ్ చెబుతున్నారు-లాంటివి సినిమా పేపర్లలో మీరు చదివే వుంటారు. భాష తెలియని నటులంటే సరే, వాళ్లకు ఎవరో మాట్లాడాలి గనుక డబ్బింగ్. మరి చిరంజీవి తనకుతానే డబ్బింగ్ చెప్పుకో వటం ఎందుకు?''

''నిజమే... నేను చాలాసార్లు పేపర్లలో చూశా ను ఎందుకు?''

''ఎందుకంటే ఇంతకుముందు మనకు 'మిచెల్' కెమేరాలుండేవి. అవి నిశ్శబ్దంగా పనిచేసేవి. అందువల్ల షూటింగ్‌లో నటీనటు లు నటిస్తూ మాట్లాడిన మాటలు అప్పుడే రికార్డయిపోయేవి. వాటిని అలాగే ఉపయో గించేవారు. కానీ ఔట్‌డోర్స్‌లో తీసినప్పుడు అనేక ఇతర శబ్దాలు వస్తుంటాయి. అందువల్ల అప్పుడు రికార్డు చేసిన శబ్దాలు మనకిప్పుడు పనికిరావు. ఇప్పుడు డబ్బింగ్ అవసరం




వస్తుంది. అందుకే అప్పట్లో ఔట్‌డోర్స్ తక్కువగా వుండేవి. అందుకు మరో కారణం మిచెల్ కెమేరా చాలా బరువైనది. ఆ తరవాత ఆ రిఫ్లెక్స్ కెమేరాలొచ్చాయి. ఇవి చాలా తేలికైనవి. అవసరం వచ్చినప్పుడు దాన్ని భుజంమీద పెట్టుకుని కూడా షూట్ చేయవచ్చు. పైగా మిచెల్ కెమేరాలో లేని చాలా సౌకర్యాలు దీన్లో వున్నాయి. కానీ ఆ రిఫ్లెక్స్ కెమేరాలో ఫిల్మ్ తిరుగుతున్నప్పుడు శబ్దం వస్తుంది. అందువల్ల, నిశ్శబ్దంగా వున్న స్టూడియోలో షూట్ చేసుకున్నప్పటికీ, రికార్డ్ చేసిన శబ్దంతో మాటలతో పాటు కెమేరా తిరిగే చప్పుడూ వస్తుంది గనుక, మాటలన్ని మళ్లీ మాట్లాడుకుని రికార్డు చేసుకోవాలన్నమాట. దీన్నే డబ్బింగ్ చెప్పటం అంటారు. తాము నటించిన సన్నివేశం ఎదురుగా తెరపై చూస్తూ, అందుకనుగుణంగా చెబుతారు. ఓసారి చెప్పింది బాగా రాకపోతే మళ్లీ చెప్పుకోవచ్చు''

''ఇలా అయితే డబ్బింగ్ ఎన్ని రోజులవుతుంది?''

''ఎప్పుడో తప్ప 5, 6 రోజులు దాటదు''

''భాష రానివాళ్లకు ఎవరో డబ్బింగ్ చెబుతారుకదా? వీళ్ళూ నటులేనా అంటుంటారు కొందరు- అంతే అనుకోవాలా బాస్?''

''మొదట్లో పాటలు కూడా ఎవరికి వాళ్లు పాడుకునేవాళ్లు. మాటల్లాగే పాటలు కూడా అప్పటికప్పుడే రికార్డయ్యేవి, మ్యూజిక్‌తోసహా. కలకత్తాలో షూట్ చేసిన ఓ సినిమాలో ఈల పాట రఘురామయ్యగారు నారదుని వేషంలో ఓ పాట. మరీ కుడిచెయ్యి ఎక్కువగా వూపావయ్యా, అంత ఓవర్‌ఏక్షనా అని ఒకాయన అడిగితే, ఈ స్టూడియోలో దోమలు ఎక్కువ బాబూ. పాడుతున్నప్పుడు నోట్లోకి వెళ్లకుండా చేత్తో అభినయిస్తున్నట్టుగా వాటిని తోలాల్సివచ్చింది అని బదులిచ్చాట్టాయన.''

ముగ్గురూ నవ్వారు.

''అలా వుండేవి అప్పటి పాట్లు. అప్పట్లో పాడటం వచ్చినవాడే నటుడు. ఆ తరవాత ప్లేబాక్ సింగర్సొచ్చారు. ఈ టెక్నిక్ అంటే పాటలు ముందుగా రికార్డ్ చేసుకుని, షూటింగ్ చేసుకుని, సౌండ్ ట్రాక్‌తో కలుపుకోవటం వచ్చింది గనుక ఆ పద్ధతి పాపులర్ అయింది. పాట రానివాడు కూడా నటుడా అని అప్పట్లో అనుకునేవారు. కానీ పాట రాకపోయినా, మహానటులనిపించుకున్నవాళ్లు ఎంతోమంది వచ్చారు మరి. వాళ్లతోపాటు నటించటం రాని, ఇష్టంలేని, అవసరం లేని ఎందరో గాయకులూ వచ్చారు మరి.

అలాగే ఫైట్స్‌లో డూప్‌లు. ఫైటింగ్ రానివాళ్లు వచ్చినా అన్నీ చేయటానికి రిస్క్ తీసుకుని వాళ్ల బదులు మరొకరు చేస్తే, నటులే అవన్నీ చేసినట్టుగా ప్రేక్షకుడు భావించి, స్వీకరిస్తున్నారుకదా.

డబ్బింగ్ విషయమూ అంతే. భాషరాని నటులు అరువుగొంతుతో నటించినంత మాత్రాన, నటన వాళ్ళది కాకుండాపోదుకదా. అంతేగాక ఓ మంచి నటుడికి గొంతు బావుండకపోవచ్చు. అలాంటప్పుడు 'పాడరాని నటులలాగే' వాళ్లూ మరొకరి గొంతు ఉపయోగించుకోవటం తప్పేమీ కాదు. అలాంటి వాళ్లలో ప్రసిద్ధులైనవాళ్లు మన తెలుగులో కూడా వున్నారు మరి. కొన్నాళ్లు పోతే డాన్సుల్లో కూడా డూప్‌ను వాడుతారేమో అని కొందరు జోకులేశారు.

కానీ ఓ వర్ధమాన నటుడికి మొన్న ఒక పాట్‌లో చేతకాక డూప్‌ను వాడారు. త్వరలో మీరు వెండితెరపై చూసి, ఆ నటుడే ఆ డ్యాన్స్ చేశాడనుకుంటారు. విమర్శించేవాళ్లు విమర్శిస్తూనే వుంటారు. జరిగేది జరుగుతూనే వుంటుంది. ఎక్కణ్ణించో ఎక్కడికో వెళ్ళిపోయాం. ముందు మన విషయాలు పూర్తికానియండి''

''గురూ... గురూ నేనడిగిన టైటిల్స్ మ్యూజిక్స్ విషయం ఒక్కటి చెప్పు గురూ'' రిక్వెస్ట్ చేశాడు గోవిందు.

''నిజంగా ఇది నాకు తెలీదు. మామూలుగా అయితే సినిమా థీమ్‌ను బట్టి టైటిల్స్‌కు బిజీయమ్ సమకూర్చుకుంటారు. కానీ నాకు ఈ టైటిల్స్ మ్యూజిక్ అంటే ఇష్టంలేదు'' అన్నాడు చక్రి.

''అదేంటిగురూ... మన టైటిల్స్‌కు బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ వుండదా?'' ఆశ్చర్యపోయాడు గోవిందు.

"వుండదు" చిన్నగా నవ్వాడు చక్రి.

"మరెలా బాస్?"

"ఆ ఖర్చు మిగులుతుంది, ఊర్కోరా?" కొడుకుని మందలించాడు శ్రీరామచంద్రుడు.

"అబ్బా, ఖర్చుకాదు నాన్నా. బడ్జెట్ వేసుకున్నాక అందులో పూర్తిచేయటం డైరెక్టర్ బాధ్యత. అసలు టైటిల్స్‌కు మ్యూజిక్ ఎందుకొద్దో నాకర్థంకాలేదు. అది తెలుసుకుందామని" సంజాయిషీ ఇచ్చుకుని, ప్రశ్నార్థకంగా చక్రి వైపు చూశాడు లక్ష్మణకుమార్.

"అసలు టైటిల్స్ ఎందుకేస్తారు?" ప్రశ్నించాడు చక్రి, సమాధానం చెప్పకుండా.

"ఎందుకేంటి? సినిమాలో పనిచేసిన వాళ్ళ పేర్లు ప్రేక్షకులకు తెలియాలని"

"గుప్పెడు మనసు సినిమాలో చేతులతో నీడ బొమ్మలు చేస్తుంది సరిత. ఈ బొమ్మలు ప్రేక్షకుల్ని బాగా ఆకర్షించాయి. వాటితోపాటే టైటిల్స్ కూడా చూపించారు. దీనివల్ల, నీడల బొమ్మలపై దృష్టి కేంద్రీకరించిన ప్రేక్షకులు టైటిల్స్‌ని చదవలేకపోయారు. ఓరకంగా ఇది పొరపాటు అన్నాడు ఆ సినిమా దర్శకుడు బాలచందర్. ఎంతో శ్రమపడిన కళాకారులకు గుర్తింపునివ్వటానికి, కొంత ఖర్చు కూడా వెచ్చించి టైటిల్స్ చూపిస్తున్నాం కదా?"

"పోబానూ... టైటిల్స్ చూపించటం కూడా ఓ ఖర్చేనా?"

"పిచ్చివాడా... సుమారు 200 నుండి 300 అడుగుల నిడివి టైటిల్స్, ఓ 30 ప్రింట్లపై లెక్కేస్తే, నెగెటివ్గా, పాజిటివ్గా, మాటింగ్ ఖర్చులూ కలుపుకుంటే మొత్తంమీద 30 నుండి 40 వేల రూపాయలు ఆదా అవుతుంది కదాని, ముఖ్యమైన ఐదారు పేర్లు తప్ప వేయని ఓ పెద్ద నిర్మాతున్నాడు తెలుసా?"

"నిజమా?"

"నిజమే... ఓ రకంగా ఆయన చేస్తున్న పొదుపే మంచిది, టైటిల్స్‌ని ప్రేక్షకులు చదవలేనప్పుడు అంతే కదా?"

"గుప్పెడు మనసులో నీడల బొమ్మలున్నాయి గనుక చదువలేక పోయారంటే బానే వుంది. మరి మిగతావి అలా వుండవు కదా?"

"ఎందుకుండవు? కళ్ళు చెదిరే బ్యాక్ గ్రౌండ్‌లూ, టైటిల్స్ కలర్‌తో కలిసిపోయే బ్యాక్ గ్రౌండ్ కలర్సేకాక బీజీయమ్ కూడా టైటిల్స్‌ని చదవనివ్వదు. మధ్యలో సంగీతంమీదకు దృష్టిపోతుంది. ఎదురుగా కథేమీ నడవటంలేదు గనుక ప్రేక్షకుడి దృష్టి తెరమీద వుండదు. పాతకాలం దర్శకులు, చివరిగా దర్శకుని పేరు చూపించినప్పుడు నేపథ్య సంగీతం హోరు పెంచితే, ఆ హోరును హఠాత్తుగా ఆపి, నిశ్శబ్దాన్ని సృష్టించి, ప్రేక్షకుడి దృష్టిని తెరవైపుకు లాక్కుని, అప్పుడు దర్శకుని పేరును చూపించటం బాలచందర్ లాంటి దర్శకులు మొదలెట్టారు. ఈమధ్య వచ్చిన 'ఘర్షణ', 'ఉద్యమం' సినిమాల టైటిల్స్ చూపించినప్పుడు సంగీతం బదులు, మామూలు వాతావరణానికి సంబంధించిన చిన్నచిన్న శబ్దాలు మాత్రమే వినిపించారు. దాంతో ఒక డ్రమెటిక్ వాతావరణం ఏర్పడి, ప్రేక్షకుడి దృష్టి తెరపైనే నిలిచిపోయి, టైటిల్స్ అన్నీ చదివింపచేశారు. సో, ఒక్కోసారి సంగీతం మైనస్‌కూడా అవుతుంది"

"ఇందాకేమో ప్లస్సవుతుందన్నావు?"

"పిడుక్కీ, బియ్యానికీ ఒకే మంత్రం వుండదు బాబూ, లక్ష్మణకుమారా. ప్రతీ విషయాన్నీ మామూలు ధోరణికి కాస్త భిన్నంగా చూపిస్తే చూసేవాడికి చూడ బుద్ధేస్తుంది. లేకపోతే రామకోటి పుస్తకంలో పేజీల్లాగా, ప్రతీ సినిమా ఒకేలా వుంటే, మళ్ళీ వేరుగా తీయడమెందుకూ?"

"ఐదారు సినిమాలు తీస్తేగానీ యివన్నీ నేర్చుకోలేను చక్రీ. ఇక నీ షరతులలిస్టు కానియ్యి"

"షరతుల లిస్టు కాదయ్యా ప్రొడ్యూసర్ కుమారా, నా ఆలోచనలు చెబుతున్నాను. ట్రాక్స్ బదులు రీ రికార్డింగ్ చేసుకోవటంవల్ల కొంత ఖర్చు పెరుగుతుంది. అలాగే సినిమాస్కోపు అంటున్నారు కదా మీరు దానికీ ఖర్చు పెరుగుతుంది"

"లెన్స్ రెంటే కదా? సినిమాస్కోపులో తీయాలన్నప్పుడు, సినిమాస్కోపు లెన్స్‌కు రెంట్ ఇవ్వాలని తెలియదా నాకు?"

"లెన్స్ ఒక్కటే కాదు లక్ష్మణ్. మిగతా ఖర్చు




కూడా పెరుగుతుంది'' అన్నాడు గోవిందు.

''ఔనా బాసూ?''

''అవును... సినిమాస్కోప్ అంటే ఫ్రేమ్ వెడల్పు ఎక్కువుంటుంది కదా? అంటే, మనం కెమేరాలో బంధించే స్థలం నిడివిలో మార్పొచ్చింది కదా? అందువల్ల లైట్లు ఎక్కువ అవసరమవుతాయి. ఈ ఖర్చుకాక మరో ఖర్చుంది. సినిమాస్కోప్‌లో అందంగా కనిపించటానికి ప్రత్యేకమైన సెట్స్ వేసుకుంటారు. మనకేమో అసలు సెట్స్ వేసే ప్రసక్తేలేదు. అంటే వున్న దాన్నే స్కోప్ తెరపైన అందంగా చూపించాలి. ఇందుకు ఫ్రేమ్ బ్యూటీ కోసం కొంచెం సమయం ఎక్కువవుతుంది. అంటే ఒక్కోషాట్‌కు అదనంగా కొన్ని నిమిషాలనుకున్నా, మొత్తంమీద కొన్ని రోజులు ఎక్కువ అవుతుంది షూటింగ్‌కి. అంటే ఖర్చు పెరిగినట్టే కదా?''

''అమ్మో...భయపెడుతున్నారుసార్. సినిమాస్కోప్ అంటే లెన్స్ ఒక్కదానికి అద్దె ఎక్కువిస్తే సరిపోతుందనుకున్నాను''

''భయపెట్టడం కాద్సార్... ఏట్లోకి తోసి, తరవాత తమాషా చూడటంకన్నా ముందుగా, ఏరు దాటడంలోని కష్టనష్టాలు తెలుసుకొమ్మని చెబుతున్నాను''

''సరే...కానీండిసార్. ఏట్లోకి దిగి, లోతుకు భయపడతానా చెప్పండి. ఇంకా ఏమేమి భయపెడతారో'' నవ్వుతూ అన్నాడు శ్రీరామచంద్రుడు.

''సినిమాస్కోప్ సజెస్ట్ చేసింది మీరే. మన కథాపరంగానూ, బిజినెస్‌పరంగానూ బావుంటుంది కూడా. మనకు వర్కవుట్ కాకపోతే డ్రాప్ చేసుకుందాం. ముందుగా నా ప్రపోజల్స్ చెబుతున్నాను. ఇందులో కొన్ని సలహాలు, కొన్ని విన్నపాలూ, కొన్ని షరతులు కూడా. ముందు నేను చెప్పటం అయినాక మళ్ళీ మనం బడ్జెట్‌నిబట్టి చర్చించుకుందాం. ఇక సినిమాస్కోప్ అన్నాక 'ఆర్వో' ఫిలిమ్‌లో తీసే సమస్యేలేదు. ఎలాగూ 'గేవా'లో తీస్తున్నప్పుడు 'కొడక్' ఫిలిమ్‌మీదైతే, కొంచెం అదనపు భారం పడినా క్వాలిటీ చాలా బావుంటుంది. చాలామంది చిన్న నిర్మాతలు సినిమా అంతా ఏ ఫిలిమ్‌లో తీసినా, పాటలు బావుండాలని 'కొడక్'లో తీస్తుంటారు. అయితే, ఒకటి, రెండు పాటలు 'ఆర్వో'లో తీసే ఓ పెద్ద నిర్మాత కూడా వున్నాడనుకోండి, అది వేరే విషయం. ఫిలిమ్స్ బ్రాండ్ మార్చుకుంటే ఖర్చు స్వల్పంగా పెరుగుతుంది...

మరో విషయం కాస్ట్యూమ్స్. కొద్ది ఖర్చుతో ఎక్కువ ఫలితాన్ని రాబట్టగలిగే వాటిలో యిదొకటి. 'ప్రేమనగర్' సినిమాలో వాణిశ్రీ కట్టిన చీరలకోసం మళ్ళీమళ్ళీ చూసిన ఆడవాళ్లెంతో మందున్నారు. మనది మామూలు కథ గనుక అంత హంగామా అవసరంలేదు. మన సబ్జెక్ట్ యువతీయువకుల్ని ఆకర్షిస్తుంది. గనుక డిజైనింగుకూ, ప్రిపేరింగుకూ, మెటీరియల్‌కూ మనం ఎక్కువ ఖర్చుచేయనవసరంలేదు. నిత్య జీవితంలో పనికొచ్చే డ్రెస్సులు అంటే, సినిమాలో చూసి, బైటకుట్టించుకుని తొడుక్కోవటానికి ఎబ్బెట్టుగా వుండనివి, వీలైనన్ని ఎక్కువ సంఖ్యలో వాడితే బావుంటుంది. మీకు నా ఆల్బమ్ చూపించాను. అవసరమైతే మరికొన్ని లేటెస్ట్ ఆల్బమ్స్ ఏమైనా దొరికితే చూద్దాం. మన సినిమాను, అందులోని డ్రెస్సుల్ని అబ్జర్వ్ చేయటానికి కూడా ప్రేక్షకులు, ముఖ్యంగా కాలేజ్ స్టూడెంట్స్ మళ్ళీ మళ్ళీ చూడాలన్నమాట. మళ్ళీ ఖర్చు పెరిగింది.

పాటలు చాలా ముఖ్యం అనుకున్నాం. అదనపు పాటలు చేర్చుకున్నాం. కనుక వీటి చిత్రీకరణకు అదనంగా మరో ఆరు రోజులైనా కావాలి. అటు స్కోప్ మూలంగా కూడా వర్కింగ్ డేస్ ఎక్కువైనాయి. మనం ముందుగా అనుకున్నట్టు 30 రోజులు కాక మనకిప్పుడు 40 రోజులు కావాలన్నమాట.

మరో ముఖ్యమైన అంశం పబ్లిసిటీ. మీరూ నేనూ కొత్తవాళ్ళంగనుక ఇది మరీ ముఖ్యమైంది. మరీ ఎక్కువ పబ్లిసిటీ కూడా డేంజరే. పైగా మనం భరించలేం. సినిమా పూర్తయేవరకూ, కనీస పబ్లిసిటీకన్నా ఒక మోతాదు ఎక్కువే కావాలి. దీనికే కొంత అదనపు ఖర్చువుతుంది.

అన్ని ఖర్చులే అని కంగారు పడకండి. నా తరఫున మీకు కొన్ని హామీలిస్తున్నాను. కొన్ని ఆలోచనలు చెబుతాను. ప్రతి పాటకూ ఆడిబిలిటీలోగానీ, విజువల్‌లోగానీ పూర్తివెరైటీ స్కో



మ్స్ ఇస్తాను. ఇది నాకు మొదటి సినిమా గనుక ఆలోచనలన్నీ అయిపోయి, బుర్ర ఖాళీ అయిన పరిస్థితిరాలేదు. అలాగే కొన్ని ఆలోచనలు తరవాత సినిమాకు అట్టిపెడదాంలే అని ఎస్టాబ్లిష్డ్ దర్శకుల్లాగా ఆలోచించటానికి ఆస్కారమూ లేదు. ఎందుకంటే, ఈ సినిమాతో నేను కూడా నిలబడాలి. సో, ప్రతిపాటా మ్యూజికల్ హిట్ అవడానికి మంచి వెరైటీ స్కీమ్స్ ఆలోచించాను. తెరపైనకూడా, ప్రతి పాటకూ మనం చేసిన ఖర్చు కనిపించి, అన్నీ బావున్నాయనిపించుకునేట్టు చేస్తాను.

మరో ముఖ్యమైన విషయం. ఫైనల్ కాపీలో మిగలని సీను ఒక్కటి కూడా తీయను. తీసిన ప్రతిసీనూ తెరపైన కనిపిస్తుంది. అసలీ చిక్కు, కథ లేకుండా సెట్స్‌పైకి వెళ్ళినప్పుడు వస్తుంది. హీరో-పరిచయం నాలుగురకాలు, విలన్ పరిచయం నాలుగు రకాలూ, క్లైమాక్స్ మరో నాలుగురకాలూ, మధ్యలో హీరో, విలన్‌ల మధ్య వైరం పెంచటానికి పలురకాల ఆలోచనలతో తోచినన్ని సీన్లూ- ఇలా తీసుకుని, ముక్కలన్నీ ఎడిటింగ్ టేబుల్‌పైన వేసుకుని, బాగా అనిపించిందొకటి వుంచి, మిగతావన్నీ వదిలేయటం, ఏరుకున్న సీన్లకు లింకులు కుదరక మళ్ళీ తీయటం ఇవన్నీ కథ సిద్ధంగా లేనప్పుడు జరిగే తతంగాలు. మనకలా లేదు గనుక ఆ అవసరం రాదు. డైలాగులతోసహా స్క్రిప్టు రెడీగా వుంది గనుక సెట్టు మీద కూర్చుని డైలాగులు రాయించుకుని, కాల్‌షీట్ వృధాచేసుకుని ఖర్చు పెంచుకునే దౌర్భాగ్యమూ మనకు లేదు.

ఇక ఆల్టర్‌నేట్ షాట్స్. ఒక షాట్‌ని రకరకాల యాంగిల్స్‌లో తీసి, చివర్లో అవన్నీ చూసుకుని, వాటిలోంచి బాగా వచ్చినవి ఏరుకోవడం నా పద్ధతికాదు. 'నా పద్ధతీ' అంటున్నానని నవ్వుకోవద్దు. దర్శకుణ్ణి కావాలన్న ఆలోచన ఎప్పుడో వుంది కనుక, సినిమా తీసినా, తీయకపోయినా నా పద్ధతులంటూ నాకున్నాయి. ప్రతి సీనునీ రకరకాలుగా ఆల్టర్నేట్ షాట్స్ తీసి, తెరమీద చూసుకుని, ఏ షాట్ బాగుంటే అది ఎడిటింగ్‌లో వుంచుకోవటమనేది నా పద్ధతి కాదు. ఇది ఖచ్చితంగా వృధా ఖర్చే. ఎందుకంటే, ఏ సీను తెరమీద ఎలా చూపిస్తే బావుంటుందనే 'విజువల్ సెన్స్' అంటే 'దృశ్యజ్ఞానం' లేని వాడు మంచి సినిమా దర్శకుడు కాలేడు''

''అది కాదు చక్రీ, మరి మొన్నటి మీగురువు గారి సినిమాలో బ్లాస్టింగ్ సీన్సన్నీ మూడు కెమేరాలతో తీశారు గదా. అందులో ప్రతీ కెమేరా తీసిందీ వుంచరు గదా? మరి ఆయన అంత గొప్పదర్శకుడు... ఆయనకు విజువల్ సెన్స్ లేదంటావా?''

చిన్నగా నవ్వాడు చక్రి

''అలా తీసేది విజువల్ సెన్స్‌లేక కాదు. కామన్ సెన్స్‌వుండి. బ్లాస్టింగ్ సీన్సూ, వందలాది మందితో తీసే యుద్ధాల సీన్లూ, పది గుర్రాలు పరిగెత్తడం, మేడ మీదినుండి దూకడం, ఎక్కువమంది డాన్సర్లతో తీసే గ్రూప్ సాంగ్సూ- ఇలాంటివన్నీ ఒకటికి రెండు సార్లు చేయాలంటే వ్యయంతోపాటు ప్రయాసకూడా. అలాగే పొరపాటున కెమేరా పనిచేయకపోయినా మళ్ళీ తీయాలంటే చాలా యిబ్బంది. అందువల్ల ఇలాంటి సీన్లు తీసినప్పుడు మూడు, నాలుగు కెమేరాలతో రక, రకాల యాంగిల్స్‌లో ఒక్కసారే తీసేస్తారు. ఒకవేళ ఓ కెమేరా సరిగ్గా పనిచేయకపోయినా యిబ్బంది వుండదు. అలాగే చూపించాలనుకున్న ప్రతీ యాంగిల్‌కోసం మళ్ళీ, మళ్ళీ చేయాల్సిన అవసరం వుండదు. అందుకని అలా తీస్తారు. మన కథలో ఇలాంటివేమీ లేవు గనుక మనకా అవసరంలేదు. కాకపోతే, నా కిది మొదటి సినిమా గనుక ముఖ్యమైన మూడు, నాలుగు సీన్స్‌కు మాత్రం కొన్ని ఆల్టర్‌నేట్ షాట్స్ తీస్తాను అవసరమనిపిస్తే. కనుక వర్కింగ్‌డేస్ కానీ, నెగిటివ్ కానీ వృధా అయ్యే సమస్యే లేదు.

ఇక షెడ్యూల్ విషయం... మనం సింగిల్ షెడ్యూల్లో పూర్తిచేసుకున్నాం. ప్రతీ ఆర్టిస్టూ మనకు లొకేషన్‌లో వుంటాడు. హీరోని తప్పిస్తే, మిగతా వాళ్ళతో కాల్‌షీట్స్ ప్రాబ్లంలేదు. ఒక వూరినుండి మరో వూరికి షిఫ్ట్‌లేకుండా ఒకే చోట చేసుకునేందుకు వీలైన ఊరు ఎన్నుకుంటే, షిఫ్టింగ్‌వల్ల కష్టాలు సమస్యే వుండదు. షెడ్యూల్ కూడా ఆర్టిస్ట్‌వైజ్ కాకుండా, లొకేషన్‌వైజ్‌గా రూపొందించుకుంటే మరింత పొదుపుగా వుంటుంది. ముఖ్యంగా ఒకరోజు





షెడ్యూల్ చేసుకున్న సీన్లన్నీ ఎంత ఆలస్య మైనా, ఆ రోజు పూర్తి చేసుకునిగానీ ప్యాకప్ చెయ్యకూడదు. దానివల్ల అనుకున్న వర్క్ అనుకున్న సమయానికి పూర్తవుతుంది. యూనిట్ బేటాలలాంటి చిన్నచిన్న ఖర్చులు ఎక్కువైనా పెద్ద సమస్యలుండవు. ఇప్పుడు చాలా మంది ఇలాగే చేస్తున్నారు.

''నాకో వారం రోజులు టైమిస్తే స్క్రిప్టులో చిన్నచిన్న మార్పులు చేసుకోవాలి''

''ఇంకా మార్పులా? ఏమున్నాయసలు, ఎందుకున్నాయి?''

''మార్పులంటే పెద్దవి కాదు. కొన్ని చిన్న చిన్నవే. ఎందుకున్నాయంటే, ఇది రాయటం మొదలెట్టిన రోజున నేను డైరెక్టర్‌ని కాదు కదా. ప్రతీ డైరెక్టర్‌కు కథను నడిపించటంలో ఒక పద్ధతుంటుంది. సీను ఎత్తుగడా, ముగింపుల్లో రకరకాల పద్ధతులుంటాయి. ఇలాంటివన్నీ సెట్స్‌పై చూసుకుందామనుకుంటే అక్కడి హడావిడిలో ఏదో లింకు తెగిపోవచ్చు. అలాగే, ముఖ్యంగా డైలాగులతో చమక్కులు చూపించాలనీ, సెంటిమెంట్ పండించాలనీ, చప్పట్లు కొట్టించుకోవాలనీ కొందరనుకుంటారు. పది డైలాగుల భావాన్ని ఒక చిన్న దృశ్యంతో మెప్పించవచ్చని కొందరనుకుంటారు. ఆయా దర్శకుల అభిరుచినిబట్టి కొన్ని మార్పులు తప్పవు''

''అంటే ఇప్పుడు డైలాగ్ రైటర్ తమ ప్రతాపం చూపించటానికి చమత్కారాలన్నీ కురిపిస్తారన్నమాట శ్రీశ్రీశ్రీ చక్రవర్తి, డైలాగ్ రైటర్‌గారు'' ఉడికిస్తున్నట్టుగా అన్నాడు లక్ష్మణకుమార్.

''యూ ఆర్ రాంగ్ సార్'' నవ్వుతూ అన్నాడు చక్రి. ''మన డైలాగుల్లో సగానికి సగం కత్తిరించాలి. నామట్టుకు నాకు చిన్న డైలాగులు, ఎక్కువ విజువల్స్ యిష్టం. మరి మొన్నటి సినిమాలో పెద్ద డైలాగులు ఎందుకు రాశానంటే, అది ఆ డైరెక్టర్ టేస్ట్''

''అంటే, ఇప్పుడు డైరెక్టర్ చక్రి, రైటర్ చక్రిని పాలిష్ చేస్తాడన్నమాట'' అన్నాడు గోవిందు నవ్వుతూ.

''అంతేకాదు... కొన్ని సీన్లు కుదించుకోవాలి. సాగతీసినట్టుగా అనిపించినవన్నీ ముందే కుదించుకుని, అడ్డు తగులుతున్నాయనుకున్న సీన్స్‌ని ముందే కత్తిరించుకుని, పర్‌ఫెక్ట్ స్క్రీన్‌ప్లే తయారు చేసుకుంటే మంచిది. సెట్‌పైన కూడా శ్రమ తగ్గుతుంది. ఎడిటర్‌కు పని తగ్గుతుంది. నన్నడిగితే హడావిడిగా సెట్స్‌కు వెళ్ళి అన్నీ వృథాచేసుకోవటంకన్నా వీలైనన్ని రోజులు ముందే వెచ్చించి, వీలైనన్ని తెల్లపేపర్లు వృథా చేసుకోవటం మంచిది. మనమూ అలాగే చేద్దాం.

సో...మనం ముందుగా అనుకున్నట్టు 28 లక్షలుకాక 34 లక్షలు అవుతుంది బడ్జెట్. మన హీరోతో అంత బిజినెస్ అవుతుందా ఆలోచించుకుని అనవసరమైనవి ఏవైనా వున్నాయా చూసుకుందాం. మరోసారి చెబుతున్నాను, నాకు కావలసింది 40 వర్కింగ్ డేస్, 50 రోల్స్ ఫిలిమ్, పాటలకోసం అదనంగా 3 లక్షలు- ఇక మిగతావన్నీ మీ మీద ఆధారపడి వుంటాయి. ఇదే... నిర్మాత మీరు కాకుంటే, ఒక పేరున్న నిర్మాతయితే 28 కన్నా తక్కువలో చేయవచ్చు. ఈమాత్రం హీరో కూడా అవసరంలేదనే ధైర్యం నిర్మాతకుంటే ఇంకా తగ్గుతుంది. 'ఆర్వో'తో 24 ప్రింట్లు తీసుకోవటం కష్టంకానీ, లేకుంటే మనం 20 లక్షల్లో పూర్తిచేయొచ్చు. ఆ మాత్రానికి ఈజీగా బిజినెస్ చేసుకోవచ్చు. ఐతే ఫైనాన్స్ దొరకదు.

అన్నీ మరోసారి ఆలోచించుకోండి. చివరకు నా విషయం కూడా. మరో సంగతి నేను సినిమాలకు పాటలూ రాశాను. మాటలూ రాశాను. అయినా దర్శకుడిగా ఇది మొదటి సినిమా కనుక ఈ రెండు నేను చేయను, సెకండ్ థాట్‌కు ఆస్కారం లేకుండా పోతుంది'' ముగించి, సిగరెట్ వెలిగించుకుని కూర్చున్నాడు చక్రి.

అతను చెప్పినవన్నీ ఒప్పుకుని, ఏ సమస్యా రాకుండా మంచి హీరోతోనే తీద్దామని అంగీకరించారుగానీ, మాటలు మరొకరితో రాయించటానికి ఎవ్వరూ ఒప్పుకోలేదు.

''అసలు నువ్వు మాకు పరిచయమయిందే మంచి మాటల రచయితగా. నువ్వు రాసిన మాటలే బాగుండకపోతే, నీతో కథ గురించి మాట్లాడేవాళ్ళంకాదు. నీకు దర్శకత్వం అప్పగించేవాళ్ళం కాదు'' అన్నాడు లక్ష్మణకుమార్.

"పైగా ఇప్పుడు మన స్క్రిప్టు మొత్తం పూర్తయింది. ఏ మాటల రచయితా ఇంతక న్నా ఇంకా బాగా రాసి పొడిచేసేదేంలేదు. మాటలు మార్చనవసరంలేదు, మరొకరితో మళ్ళీ రాయించే అవసరం అంతకన్నా లేదు" వివరించాడు గోవిందు.

"ఇప్పుడీ మాటలు మరొకరితో రాయించా లంటే, మీరు ఇవి బాగా రాయలేదనుకోవాలా? అలా ఐతే మా అందరికీ ఎందుకు బాగా నచ్చాయి? మీరు ఇంతకు ముందు రాసిన సినిమాలక్కూడా బాగా రాశారని ఆ దర్శకు లెందుకన్నారు?" తర్కించాడు శ్రీరామచంద్రు డు.

"నాకు అగ్నిపరీక్షవుతుంది. నేను రాసుకు న్నవి నేనే దిద్దుకోవాల్సొస్తుంది... సరే, కనీసం పాటలు మాత్రం మరొకరితో రాయిద్దాం. ఇక పోతే, మనకున్నది, అంటే మన రేంజ్‌కు అందుబాటులోవుండి, మన బడ్జెట్ సినిమాకు బిజినెస్ అయ్యేంత మార్కెట్ వున్న హీరోలు ఆరుగురు. అందులో యిద్దరికి కామెడీ మార్కుంది. అయినా ఫరవాలేదు. మనం మన పాత్రలో ఒప్పించుకోవచ్చు. ఇందులో ఎవరిని తీసుకుంటే బావుంటుందో ప్రిఫరెన్స్ వారీగా ఆలోచిద్దాం..."

"అదంతా ఎప్పుడో పూర్తయింది. రేపు హీరో టైమిచ్చాడు. వెళ్ళి కథ వినిపించడమే తరు వాయి"

"చాలా పనులు చేశారే. వెరీగుడ్. హీరో ఇంటికి వెళుతున్నామా?"

"కాదు... లొకేషన్‌కు"

"లొకేషన్‌లో ఆర్టిస్టు మనసు పాత్రపైన వుంటుంది. మధ్యమధ్యలో డిస్టర్బెన్సులు. షాట్‌కీ షాట్‌కీమధ్య గేప్‌లో చెబుతుంటే వింటు న్న కథ మీద ఆసక్తి తగ్గుతుంది. అదంత మంచి పద్ధతి కాదు"

"నిజమే కానీ ఆయన లంచ్ బ్రేక్‌లో వింటానన్నాడు. పైగా ఎల్లుండి ఔట్‌డోర్‌కు వెడుతున్నాడు. మళ్ళీ పదిరోజులదాకా రాడు. ఓసారి అవుననిపించుకుని అడ్వాన్స్ యిచ్చే స్తే మిగతా పనులు చూసుకోవచ్చు"

"సింగిల్ షెడ్యూల్ అనీ 30 నుండి 35 రోజులు బంచ్‌గా కావాలనీ చెప్పారా?"

"అన్నీ చెప్పాం... పైగా హీరోలెవరూ కథను పట్టించుకోరు. విన్నట్టు నటిస్తారు. లేకపోతే రేపు ఇంటర్వ్యూల్లో కథ వినకుండా ఏ సినిమా ఒప్పుకోవట్లేదు అని చెప్పుకుంటే అబద్ధమవు తుంది గదా అందుకన్నమాట"

"అదంతా పెద్దనిర్మాత, పెద్ద డైరెక్టర్ వున్న ప్పుడు. మనలాంటి వాళ్లం అయినప్పుడు సవాలక్ష సందేహాలు పుట్టిస్తారు"

"అవన్నీ నా కొదిలెయ్‌గురూ... నేను చూసు కుంటాను గదా"

"మీఇష్టం"



"సాంగ్‌లో అమ్మాయి అత్తవారింటి కెళ్ళిన ట్టు చూపించాం"

కట్ చేస్తే

ఫాదర్‌పైన మాంటేజెస్ వర్క్ చేస్తాం. జూలీ లేని లోటును ఫాదర్ బాగా ఫీలవుతున్నాడు. అనుక్షణం ఆయనకు జూలీయే గుర్తొస్తూంది. పొరుగూరికే వెళ్ళినవాళ్ళు ఆదివారం రోజైనా వస్తారని అనుకున్నాడు. సండే సర్వీసింగ్ మధ్యలో మోటర్ సైకిల్ సౌండ్ విని, మురళొ చ్చాడనుకున్నాడు. మరొకతనెవరో రావటంతో నిరాశ చెందాడు. వారాలు గడుస్తున్నాయి. అప్పుడప్పుడు ప్రియ, విక్రమ్ వచ్చి ఆయన క్షేమసమాచారాలు కనుక్కుంటున్నారు. ఆయ నేమో వాళ్ళనుండి సమాచారం లేదని ఆందో ళనపడుతుంటే సర్దిచెబుతున్నారు.

ఉండబట్టలేక స్వయంగా తనే బయలు దేరి ఆ ఊరికి వెళ్ళాడు ఫాదర్. అయితే దాదాపు ఆ ఊళ్లోని ప్రతీ ఇల్లు తిరిగినా జూలీ,





మురళిల గురించి ఎవ్వరూ చెప్పలేక పోయారు. షాపుల్లో, సినిమాహాల్లో, చర్చిలో, పెట్రోల్ బంక్‌లో ఎక్కడడిగినా ఎవ్వరూ తెలియదన్నారు. ఏంచేయాలో తెలియక సాయంత్రానికి కాళ్ళీడ్చుకుంటూ బస్‌స్టాండ్ కొచ్చాడు. అప్పుడు ఒకతను తనకుతానై ఫాదర్‌ని పలకరించాడు. జూలీని అత్తవారింటికి తీసుకెళ్ళిన టాక్సీ డ్రైవర్ అతను. అక్కడి బస్టాండులో దిగి, ఏదో డిస్ట్రిక్ట్ బస్సెక్కారనీ, ఏ వూరి బస్సో తనకు తెలియదనీ చెప్పాడతను, ఫాదర్‌కు. నిశ్చేష్టుడైపోయాడు ఫాదర్. ఏం జరిగిందో, తనకు తెలియకుండా వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో, ఎందుకు వెళ్ళారో అర్థంకాక తెల్లబోయి నిలుచున్నాడు ఫాదర్. ఆయన మీద ఫ్రీజ్ చేస్తే ఇంటర్వెల్''

★ ★ ★

''చాలా బావుందండీ కథ... ఎవర్రాశారు?'' అన్నాడు 'పండుహీరో' అదాయన ముద్దుపేరు.

''డైరెక్టర్‌గారే రాశారు. కథ అంత బాగా వుంది గనుకే ఆయన్నే డైరెక్షన్ చేయమన్నారు మా ప్రొడ్యూసర్‌గారు'' వివరించాడు గోవిందు.

''అయితే మనపని ఇంకా సులువయింది. కథలో చిన్నచిన్న మార్పులు చేస్తే బావుంటుంది''

''చెప్పండి'' ముక్తసరిగా అన్నాడు చక్రి.

ఇంతలో ఆ షూటింగు తాలూకు ఎవరో వచ్చి, పండు హీరోగారి చెవిలో ఏదో చెప్పారు.

''స్టోరీ వింటున్నానయ్యా. పది నిమిషాల్లో వస్తున్నానని చెప్పు. మేకప్ దిద్దమని చెప్పు కుర్రాడికి'' పైకే అన్నాడు హీరో.

అతను వెళ్ళిపోయాడు.

''తీరా నేను వెళ్ళేసరికి లైటింగ్ పూర్తికాదు. వెయిట్ చేయమంటారు. అయినా బావుండదు కదా. డ్యూటీ ఫస్ట్. మిమ్మల్ని పది నిమిషాల్లో వదిలేస్తాను'' నవ్వు తెచ్చిపెట్టుకుంటూ చెప్పాడు.

''పోనీ... తరవాత సాయంత్రం ఎప్పుడైనా తీరిగ్గా మాట్లాడుకుందాం'' అన్నాడు చక్రి.

''అబ్బే... అంత ఇదేంలేదండీ... ఆ, ఏం చెబుతున్నానూ, ఏమీ చెప్పలేదు కదూ'' మళ్ళీ నవ్వాడు పండు హీరో. ''ఫస్ట్ థింగ్ నేను హీరోగా వుండగా మరొకరికి పాటలుంటే నా అభిమానులు ఒప్పుకోరండీ. ఆ లాస్ట్ సాంగేదో అన్నారు చూడండి, అదే, కమెడియన్‌కి... అది తప్ప మిగతావి కాస్త నాకే వుండేట్టు చూడండి. ఇక హీరోయిన్ విషయం. హీరోయిన్‌కు నాతో ఎక్కువ సీన్స్ వుండేట్టు చూడండి. ఫైట్ బొత్తిగా ఒక్కటే వున్నట్టుంది... ఏంటి సార్...ఈమధ్య జనం ఫైట్స్ లేకుంటే అస్సలు చూడటం లేదు... అంటే మీరు చెప్పిన కథ బాలేదని కాదు, కాస్త మాస్‌ని కూడా దృష్టిలో పెట్టుకోవాలికదా మనం... నేను రేపు ఔట్‌డోర్ వెళుతున్నాను. రాగానే ఓసారి మీరూ, నేనూ కూచుంటే డిస్కస్ చేసుకుందాం... కొత్త డైరెక్టర్లంటే నాకు చాలా ఇష్టమండోయ్... మరి మళ్ళీ కలుద్దామా'' లేచి నిలుచున్నాడు.

అందరూ లేచారు.

''వస్తామండీ'' నమస్కరించాడు చక్రి.

''మంచిది సార్'' తనూ నమస్కారం చేశాడు పండుహీరో- ''అన్నట్టు గోవిందుగారూ, మీరొక్క నిమిషం వుండండి''

గోవిందు ఉండిపోయాడు. మిగతా ముగ్గురూ బైటికొచ్చారు.

''వీడి పండుమొహానికి కథ మార్చాలట. హీరోయిన్‌తో ఎక్కువ సీన్లుండాలట. పాటలన్నీ వాడికే వుండాలట. అంతకన్నా ఏమీ లేదట'' కారు దగ్గరికెళ్ళగానే కసిగా అన్నాడు శ్రీరామచంద్రుడు.

''ఫైట్స్ కూడా కావాలట నాన్నా''

''ఏమిటి? నిర్మాతలిద్దరికీ హీరో నచ్చినట్టు లేదు'' అడిగాడు చక్రి.

గోవిందు వచ్చేశాడు.

''ఇప్పుడు తన రేటు ఐదట. సాయంత్రం ఒకటిచ్చి అనౌన్స్ చేసుకోవాలట. ఆరుగురు నిర్మాతలు వెంట పడుతున్నారట. కానీ మన కథ నచ్చింది కనుక మనకే కాల్షీట్స్ ఇస్తాడట''

''ఏంటి గోవిందూ... అన్నీ ' అట్లా ' చెబుతున్నావు?''

''వీడి మొహం... వీడికి మూడు కన్నా ఎక్కువక్కర్లేదు. బేరమాడితే నాలుగుకి ఒప్పుకుంటాడేమో, కానీ కథలో మార్పులు మాత్రం






మనం ఒప్పుకోం''

"అది కాదు గోవిందూ... రూంకెళ్ళి తీరిగ్గా చర్చించుకుందాం''

"చర్చించిన తరవాత కూడా అంతే డైరెక్టర్ సార్. నీకు తెలీదు. రేపే వెళ్ళి చెండు హీరోతో మాట్లాడి వస్తాను''

""చెండు హీరోకి యిప్పుడు మార్కెట్ ఎంతుంది?''

"వీడంతే వుంది. మనం ఎవరైనా ఒకటే అనుకున్నాం కదా... పదండి, పదండి''

★ ★ ★

రాత్రి తొమ్మిది కావస్తూంది.. టీ షాపులో బ్రహ్మయ్య ఒక్కడే వున్నాడు. తూలుతూ లేచి నించుని అమితాబ్ దగ్గరికొచ్చాడు. అప్పుడే అమితాబ్ ఓ ఫుల్ బాటిల్ తీసి, తను తాగటానికి గ్లాసులో ఒంపుకోబోతున్నాడు.

"ఒరేయ్ ఉబ్బర్ అమితాబ్, త్రీ ఔన్సెస హాడాల్ చేసేస్కో'' అన్నాడు, తొందరపెడుతు న్నట్టు.

"డబ్బులు?'' తనపని ఆపి అడిగాడు అమితాబ్.

జేబులన్నీ వెతికి మిగిలిన ఒకే ఒక్క రూపాయి తీశాడు బ్రహ్మయ్య - "ఒరేయ్, వన్ రూపీసే హడాల్స్‌రా... ఈ ఒక్కరోజూ త్రీ ఔన్సెస్ ప్లీజ్...''

"తాగింది చాలుగానీ చలో చలో, యింటికెళ్ళిపో''

"అమ్మింది చాలుగానీ చలో చలో కొట్టు మూసేస్కో'' ఉక్రోషంగా అన్నాడు బ్రహ్మయ్య. మళ్ళీ అంతలోనే ముఖం దీనంగా పెట్టుకున్నాడు - "ఒరేయ్ అమితాబ్, యివ్వాళ ఓన్లీ త్రీ ఔన్సెసే కొట్టాను. అస్సలు సరిపోదు. కొంచెం హడాల్స్ చేసుకోరా'' అని బతిమాలాడు.

అమితాబ్‌కు కొంచెం జాలికలిగింది. అందునా ఎప్పుడో ఓసారి మాత్రమే తాగే తానూ ఆరోజూ తాగుదామనుకున్నాడు. అందులోనే బ్రహ్మయ్యకూ మూడౌన్సులు పోద్దామని నిర్ణయించుకున్నాడు. ఐతే ఆ పని కొట్టుమూసేసి చెయ్యాలి. తెరిచుండగా అరువులూ, అప్పులూ, స్నేహాలూ ఏవీ కుదరవు. ఆరోజు అంతగా జనం కూడా లేరు.

తన అసిస్టెంట్లకు అన్నీ సర్దేయమని చెప్పి, అలాగే నిలుచునున్న బ్రహ్మయ్యను చూసి, సరదాగా అడిగాడు.

"సరేరా, అందరితో పందాలు కడతావు గదా. పోనీ నాతో కట్టు చూద్దాం"

"ఉన్నది వన్ రూపీసేరా జిఫాల్" అసహనంగా అన్నాడు.

"ఫర్వాలేదు... నువ్వోడిపోతే ఆ రూపాయే ఇయ్యి. నేనోడిపోతే మూడు పెగ్గులు పోస్తాను"

బ్రహ్మయ్య కళ్ళు చిత్రంగా మెరిశాయి. ఆలోచించసాగాడు.

"ఎంతసేపూ కొత్తవాళ్ళు వచ్చినప్పుడు 'కంటికి వంటినానిస్తా' తప్ప, నీకేం వచ్చురా?" ఎగతాళి చేశాడు అమితాబ్.

"నోర్మయ్యరా జిఫాల్... గాల్లో ఎగురుతుంది కానీ రెక్కలు లేవు. నీళ్లల్లో మునుగుతుంది గానీ ఈతరాదు, చనిపోదు. నేలపై నడుస్తుంది కానీ కాళ్ళు లేవు. తినటానికి పనికిరాదు కానీ అందరూ తినాలని చూస్తారు, ఏంటది?"

ఎంత ఆలోచించినా తోచక, చివరకు నిరాశగా మూడౌన్సులూ ఓ బాటిల్లో పోసి బ్రహ్మయ్యకు అందించాడు, అమితాబ్. అది తీసుకుని ఓ గుటకేశాడు బ్రహ్మయ్య. ఇంకా తను ఆలోచిస్తూనే, "ఏంట్రా అది? యిక చెప్పు. ఓడిపోయి పందెం యిచ్చాగదా" అడిగాడు, చివరకు.

"నాక్కూడా తెలీదు. నేనూ ఓడిపోయాను. ఇదిగో రూపాయి"

రూపాయి యిచ్చేసి, బైటికి నడిచాడు బ్రహ్మయ్య. తెల్లబోయి నిలుచున్నాడు అమితాబ్.

అతనింకా తేరుకోకముందే డేవిడ్ వచ్చి వంద నోటు టేబిల్‌పైన పడేశాడు.

"ఒరేయ్... యిప్పటికే నీ వాలకం చూస్తుంటే ఎక్కువైనట్టుంది. గమ్మున యింటికెళ్ళిపోక మళ్ళీ ఎందుకొచ్చావురా" మందలించాడు.

"ఛుప్ బే... పైసల్దీసుకుని మందియ్యి" గయ్యిన అరిచాడు డేవిడ్.

అమితాబ్ యిచ్చిన బాటిల్ తీసుకుని, మూత తీసుకుంటూ బైటికి నడిచాడు డేవిడ్, కొద్దిగా తూలుతూ.

★ ★ ★

తోటలో లాన్ చెయిర్‌లో కూచుని ఏదో పుస్తకం తిరగేస్తూంది మాలిని. అటూ, యిటూ పచార్లు చేస్తున్నాడు విక్రమ్. హఠాత్తుగా ప్రశ్నించింది మాలిని-

"ఒరేయ్ విక్రమ్, పెళ్ళివిషయం ఆలోచించరా. ఎన్నాళ్ళని యిలా వుంటావు?"

దీర్ఘంగా నిట్టూర్చాడు విక్రమ్, ఏమీ బదులివ్వకుండా, మళ్ళీ కొనసాగించింది మాలిని తన మాటలు.

"దేనికైనా ఒక హద్దుంది. జూలీ ఎక్కడుందో ఏమైందో తెలీదు. తెలిసినా మనం చేయగలిగిందేమీ లేదు. అయినా జూలీని మరిచిపోయి, మరో పెళ్ళి చేసుకోవాలి గానీ, యిలా ఎంతకాలం వుంటావు చెప్పు?"

జూలీ సుఖంగా వుందని తెలిస్తే నిజంగానే మనను రాయిచేసుకుని, మరొకర్ని పెళ్ళిచేసుకునేవాణ్ణేమో. కానీ యిన్ని సంవత్సరాలయింది. ఏమయిందో తెలీదు. ఎక్కడ, ఎలా వుందో తెలీదు. జూలీని పోగొట్టుకున్నప్పుడే పెళ్ళిమీద నగం విరక్తి కలిగింది. ఇక జూలీకి ఏమైందో తెలికపోవటంతో అసలు పెళ్ళంటేనే విరక్తి కలిగింది. ఎవరో, ఏమిటో తెలియని వ్యక్తిని జీవిత భాగస్వామిని చేసుకొని బ్రతుకంతా నరకం అనుభవించాలి జూలీలాగే. అవును జూలీ హాయిగానే వుంటే ఈ ఎనిమిదేళ్లలో ఎప్పుడో ఒక్కసారైనా కనీసం ఒక ఉత్తరమన్నా రాసేది కదా. అలాంటప్పుడు తనుమాత్రం ముక్కూ మొహం తెలీని అమ్మాయిని పెళ్ళిచేసుకుని, ఆమె స్వభావానికి తన జీవితం అప్పగించటం ఎందుకు. అందుకే పెళ్ళి చేసుకోలేదు, మనసులోని ఆలోచనల్లో





# ఏరిన ముత్యాలు

★ కష్టసుఖాలను ఓర్పుగా అనుభవించడం, హుందాగా ప్రవర్తించడం, ప్రశాంతంగా జీవించడం- ఇదే జీవిత లక్ష్యం.

— స్వామి రామదాస్

★ జీవితంలో ధ్యేయాలు రెండు. ఒకటి కోరుకున్నది సాధించడం, రెండు-సాధించినది అనుభవించడం.

— స్మిత్

★ జీవితంమీద ప్రేమకంటే ప్రేమమయ జీవితం గొప్పది.

— ఆంగ్ల సామెత

★ జీవితం క్షణికం అని బాధపడుతున్నామే కానీ జీవితంలో ఎన్ని క్షణాలను వృధా చేస్తున్నామో గమనించడంలేదు.

— సెనెకా

★ యవ్వనం ప్రేమ వలయం, కౌమార్యం సమస్యల నిలయం, వృద్ధాప్యం పశ్చాత్తాప సమయం.

— డిజ్రయిలి

★ తప్పులు చేసేవారే గొంతు చించుకొని బిగ్గరగా అరుస్తుంటారు. వాస్తవాన్ని నెమ్మదిగా కూడా చెప్పవచ్చు.

— నెహ్రూ

సేకరణ: **నల్లబెల్లి శ్రీమన్నారాయణ**

ఒక్కటీ పెదవి విప్పి మాలినితో అన్లేదు విక్రమ్.

"ఆలోచిద్దాంలే అత్తమ్మా" అన్నాడు, పైకి మాత్రం.

"జరిగినవన్నీ మన మంచికే అనుకోవాలి, తలొంచాలి. గతంలోనే బతకాలనుకోవటం వివేకం కాదురా..." యింకా ఏదో అనబోతున్న మాలిని, భళ్ళున చప్పుడు వినిపించటంతో ఉలిక్కిపడి అటుచూసింది. విక్రమ్ కూడా అటుతిరిగాడు. డేవిడ్ విసిరిన రాయికి ఒక పెద్ద పూలకుండీ పగిలింది.

ఇద్దరూ నిట్టూర్చారు. మళ్ళీ వచ్చాడన్న మాట. జూలీ వెళ్ళిన తరువాత ఓసారి తాగి నానా తిట్లూ తిట్టాడు డేవిడ్. విక్రమ్‌కి తలెత్తుకో లేనంత అవమానం అనిపించింది. జూలీ విషయం ఆరాతీయటానికి తనకు వీలైనన్ని ప్రయత్నాలు చేశాడు. రెండోసారి ఏడెనిమిది వారాల తరవాతొచ్చాడు డేవిడ్ మళ్ళీ. ఇక క్రమంగా అది అలవాటయింది. జూలీ గురించి బాధ ఎక్కువైనప్పుడల్లా, నిషా ఎక్కువైనప్పుడల్లా అలాగే అరుస్తాడు. అతన్ని ఏమీ అనవద్దని పనివాళ్ళను బెదిరించాడు విక్రమ్. అందువల్ల వాళ్ళు ఏమీ అనరు.

"అబే బుడ్డా, రారా బైటికి. చెప్పురా, ఏదిరా నా జూలీ?"

"డేవిడ్ యిలా అరిస్తే ఏమొస్తుంది చెప్పు. విక్రమ్‌బాబు మంచాడు గనక సహిస్తున్నాడు గానీ..." అనునయించాడు వాచ్‌మన్.

"లేకుంటె ఏం చేస్తడ్రా? లాకప్‌లేస్తడు. ఎయ్యమను. అరేయ్, మూతిమీద మీస ముంటె, మొగోడైతె, ఆ ముగళిగాణ్ణి పట్కోని ఎయ్యమన్రా, లాకప్‌ల, జెయిల్ల"

"సరె, వెళ్ళిపో"

"నేను పోను" హఠించి అక్కడే కూచున్నాడు. మళ్ళీ సీసా తీసుకుని తాగాడు. అందులోని మద్యం అయిపోవడంతో ఆ సీసాను విసిరి గోడకేసి కొట్టాడు. భళ్ళున పగిలింది సీసా.

"ఏదిరా జూలీ? ఆ ఫాదర్ పాగల్‌గాడు, గీ మేమ్‌సాబ్ పాగల్‌ది, గీ అమీన్‌గాడు పాగల్... పాగల్ దునియా... పెండ్లికొడుకు ఊరు తెల్వాదు, పేరు తెల్వాదు. అమ్మ తెల్వాదు, అబ్బ తెల్వాదు. కోన్, కిస్కా...వానికిచ్చి జూలీకి పెండ్లి చేస్తార్రా దివానా... ఎన్నేండ్లయిందిరా, ఎన్నినెల్లయిందిరా, ఎన్ని రోజులయిందిరా? ఇన్ని దినాలబట్టి జూలీ పోరి కనబడకపోతే ఒక్కనికన్న బుగులయినాది? ఆ బట్టేబాజ్‌గాడు దాన్నేం చేసిండో, అమ్ముకున్నడో, యిడిసిపెట్టిండో, సంపి బొందపెట్టిండో చెప్పుడ్రా... రోజు ఒర్లుతాంటె పాగల్‌లెక్క గొడుతున్నాను?"

"ఇక చాలు డేవిడ్... పద"

"హాఁ... జూలీని దొర్కబట్టి తెమ్మను. నాకే గానీ నీకున్న కొలువుంటె వాని బొక్కలిరగ్గొట్టి జూలీని పట్కొస్త"

"కరెక్టే... ఏం చేస్తాం చెప్పు" అనునయంగా అన్నాడు వాచ్‌మన్.

లేవలేక పోతున్న డేవిడ్‌ని ఆసరా యిచ్చి లేవదీశాడు. తోటమాలి, డేవిడ్‌ని పట్టుకుని నడిపించుకు పోతున్నాడు. వెళుతూ గొణుక్కో సాగాడు డేవిడ్-

"భూల్‌గయా సబ్ కుచ్, యాద్ నహీ అబ్ కుచ్... ఇత్‌నా బీ దూర్... మత్ జానా... ఫిర్ పాస్ ఆనా ముష్కిల్... ముష్కిల్..."

వెళ్ళిపోతున్న డేవిడ్ కనుమరుగయ్యేదాకా చూస్తూ నిలుచున్న విక్రమ్‌ని, భుజంతట్టి, కళ్ళతోనే, నిశ్శబ్దంగా ఓదార్చింది మాలిని.

"మనసులో బాధ తాగి చల్లార్చుకుని, పైకి చెప్పుకుని బరువు దించుకుంటున్నావు. ఎవరో ఒకర్ని తప్పుపట్టి గుండెమంట వెళ్లగక్కుకుంటున్నావు. మరి నేనేం చేయాలి" లోలోపలే అనుకున్నాడు విక్రమ్.

★ ★ ★

రాత్రి ఎనిమిదిన్నరవుతుంది. ఒక సెంట్రీ, రైటర్ తప్ప ఎవరూ లేరు. ఏదో ఫైల్ తిరగేస్తున్నాడు విక్రమ్. ఫోన్ మోగగానే క్యాజువల్‌గా అందుకున్నాడు. వింటుండగా అతని ముఖంలో కంగారు ప్రవేశించింది. ఫోన్లో వింటూ స్లిప్‌మీద ఏదో రాసుకున్నాడు. ఫోన్ పెట్టేసి రైటర్‌కు ఏదో చెప్పేసి, గబగబా క్యాప్ తీసుకుని బైటకు వరిగెత్తాడు. ఒక్క ఉదుట్లో జీప్ దగ్గరికి చేరుకుని స్టార్ట్‌చేశాడు. పదిక్షణాల్లో అరవైమైళ్ళ స్పీడందుకుంది జీపు.

★ ★ ★

జీపు దిగిన విక్రమ్ జాగ్రత్తగా అటూ, ఇటూ




పరిశీలించాడు. చప్పుడు కాకుండా గేటుతీశాడు. నిశ్శబ్దంగా మెట్లెక్కి, చెవి తలుపుకానించాడు. తలుపు తెరుచుకుంది. లోపలికి ప్రవేశించాడు. ఎవ్వరూ కనిపించలేదు. చిన్న చప్పుడు కూడా లేదు. హోల్‌స్టర్‌లోంచి రివాల్వర్ తీసి, సేఫ్టీక్యాప్ తొలగించాడు. తెరచివున్న ఓ గదిలోకి చూశాడు. ఖాళీగా వుంది. తలుపులు మూసివున్న మరో గదివైపు నడిచాడు. కొనవేలితో తలుపును నెమ్మదిగా నెట్టాడు. నెమ్మదిగా తెరుచుకుంది తలుపు.

ఎదురుగా పువ్వులు పరిచిన మంచంలో, తెల్ల చీర కట్టుకుని, తలనిండా మల్లెపూలు పెట్టుకుని రతీదేవిలా కూర్చుంది ప్రియ. తలుపు తీసిన విక్రమ్‌వంక తదేకంగా చూస్తూ వళ్ళు విరుచుకుంది. పైట జారిపోయింది. సన్నగా, సమ్మోహనంగా నవ్వింది. ఆమెకేసి తీక్షణంగా చూసి, గిరుక్కున వెనుదిరిగి, బైటికడుగు పెట్టాడు విక్రమ్.

ఒక్క అంగలో విక్రమ్‌ని సమీపించి వెనకనించి గట్టిగా వాటేసుకుంది ప్రియ. సుతారంగా ఆమెని విడిపించుకున్నాడు. ముందుకు అడుగేసి కదలబోయి, తన కొనవేళ్లను పట్టుకుని ప్రియ లాగటంతో ఆగిపోయాడు.

"విక్రమ్‌గారూ... నేనందంగా లేనా?"

అది కారణం కాదన్నట్టు అడ్డంగా తలూపాడు విక్రమ్.

"డ్యూటీలో వున్నందుకు సంకోచమా"

క్యాప్ తీసి చేతిలో పట్టుకున్నాడు.

"అబద్ధం చెప్పి పిలిపించానని కోపమా?"

బాధగా నిట్టూర్చి, సున్నితంగా ప్రియ పట్టునుండి తన చేతిని వదిలించుకున్నాడు. గిరుక్కున అతనిముందుకొచ్చి, అతనివైపు తిరిగి, చుబుకం పట్టుకుంది

"మరి?"

ఆమె కళ్ళల్లో కోరికను మించిన బాధ కనిపించింది... అప్పుడు పెదవి విప్పాడు

"ప్రియా... యిది తప్పు"

ప్రియ కళ్లల్లో నీళ్ళు సుళ్ళు తిరిగాయి. ఏదో ఉక్రోషం తన్నుకొచ్చింది. ఆవేశంగా బదులిచ్చింది-

"ఐతే అది నాతప్పు కాదు. ఆకలేస్తే అన్నం తినాలనుకోవటం తప్పా? దాహమేస్తే నీళ్ళు తాగాలనుకోవటం తప్పా? కోరికలు కొలిమిలా కాల్చేసి, పిచ్చెక్కిస్తుంటే... తప్పా? తప్పా?"

విక్రమ్ గుండెలపై కొడుతూ, భోరున ఏడుస్తూ, ఆర్తిగా అతనిమీద వాలిపోయింది. నిస్సహాయంగా చూసి, నెమ్మదిగా ఆమెను వదిలించుకున్నాడు.

"తప్పుకాదు, కానీ..." ప్రియమెళ్ళోని తాళిని చూపుడువేలితో పైకెత్తి పట్టుకుని చెప్పాడు - "మనిద్దరం దగ్గరైనప్పుడు గుండెల్లో ముల్లులా గుచ్చుకునే యిది" తెల్లబోయి తన ముఖంలోకి చూస్తున్న ప్రియతో మళ్ళీ చెప్పాడు, గోడమీదకి చూపిస్తూ, "అదే కాదు, శత్రువుల ఒంట్లో నింపే శతఘ్నులు నా మనసులో నింపుతున్న ఆ యూనిఫాం..."

అయోమయంగా గోడమీదికి దృష్టితిప్పింది ప్రియ. అక్కడ మిలటరీ యూనిఫాంలో వున్న ఆమె భర్త ఫొటో! యిటు చూసింది, పోలీస్ యూనిఫాంలో వున్న విక్రమ్... ఆ ఫొటోవైపు నడిచి దగ్గరగా వెళ్ళి ఐదారు క్షణాలు పిచ్చిదాన్లా ఆ ఫొటోనే చూస్తూ నిలుచుంది. అప్పుడు తన్నుకొచ్చింది గుండె అట్టడుగుపొరల్లో దాగివున్న ఆవేదన. తల గోడకు బాదుకుంటూ, పిచ్చిదానిలా భోరున ఏడవసాగింది, హిస్టీరిక్‌గా.

చటుక్కున ప్రియను లాగి, యీడ్చి చెంపమీద కొట్టాడు. నిస్తేజంగా మళ్ళీ విక్రమ్ ముఖంలోకి చూస్తూండిపోయింది. చటుక్కున ప్రియ జబ్బ పట్టుకుని, బరబరా యీడ్చుకుపోయాడు...

చల్లటి నీళ్ళు షవర్‌నుండి ధారాపాతంగా తడిపేస్తుంటే నిశ్చేష్టంగా నిలబడిపోయింది ప్రియ. ముఖమ్మీది బొట్టు కరిగి జారిపోతూంది. తలంతా తడిసిపోయింది. పైట నీళ్ల ధారకు కిందికి జారింది.

పక్కనే నిలుచున్న విక్రమ్‌కు ప్రియ పరిస్థితి బాధకలిగించింది.

సభ్యసమాజంలోని కట్టుబాట్లదృష్ట్యా ఆమె చేయాలనుకున్న పని తప్పే కావచ్చు. కానీ మనిషికి ప్రకృతిచ్చిన శాపంలాంటి వరం,

కామం... అది తప్పా? పెళ్ళయి భర్తతో ఉండ లేకపోవటం, భర్త మిలిటరీలో వుండటం ఆమె దురదృష్టం. నెలలతరబడి భర్తను వదిలి వుండటం దుర్భరమే. అలా వుండగలిగే చిత్త స్థయిర్యం, నిగ్రహం ప్రతివారికీ వుండాలని కోరుకోవటం పొరపాటే. ప్రియ చేయాలనుకు న్నదీ, చేసిందీ తప్పయితే, ఆ తప్పు అను క్షణం ప్రపంచాన్ని యుద్ధభయంలో ముంచు తూన్న రణోన్మత్తులది. వాళ్ల రక్తదాహంతో పోల్చుకుంటే ఈ కామదాహం తప్పేకాదు. అనలా తప్పుకు కారణమే ఆమె కాదు... ఆలోచిస్తున్న విక్రమ్, ప్రియవైపు చూశాడు. జారిపోతున్న పైటను భుజాలనిండుగా కప్పు కుంది. షవర్ ఆపేసి, ఆమె ఎదురుగా నిలు చుని, తలదించుకుని చెప్పాడు,

"సారీ"

ఆమాటనేసి చకచకా బైటికి నడిచాడు.

★ ★ ★

పాతసామాన్లతను పరిశీలిస్తున్న వస్తువుల్లో ఎలక్ట్రిక్ వాటర్ హీటరు చూసి, దాన్ని చేతిలోకి తీసుకుని పరిశీలించసాగాడు ప్రేమ్. బాగానే వున్నట్టనిపించిందతనికి. వెంటనే చెల్లెల్ని పిలిచాడు.

"ప్రియా"

హాల్లోకొచ్చిన ప్రియ, ప్రేమ్‌నీ, అతని చేతి లోని వాటర్ హీటర్నీ చూసి, తలదించుకుంది.

"ఇదేంటి, తుక్కుసామానుల్లో వేశావ్? చెడి పోయిందా?"

క్షణం ఆలోచించి బదులిచ్చింది ప్రియ.

"చెడగొడుతుందన్నయ్యా"

అయోమయంగా చూశాడు ప్రేమ్. బహుశా, షార్ట్ సర్క్యూట్ అవుతుందేమో అనుకున్నాడు. కానీ ఆమె పదప్రయోగం అర్థంకాలేదతనికి.

"ఏంటో, నాకర్థంకాలేదు" దాన్ని పడేసి, లేచి నిలుచున్నాడు.

'భర్తలు మిలిటరీలోవున్న భార్యలకు వేణ్ణీళ్ల స్నానం పనికిరాదన్నయ్యా' అనలేదు ప్రియ, మనసులోనే అనుకుంది.

★ ★ ★

తన జ్యూరిస్ డిక్షన్‌లో దొరికిన ఓ యింటర్ స్టేట్ క్రిమినల్ కేసు విషయంలో తరచుగా ఆ సిటీకొస్తున్నాడు విక్రమ్. ఆరోజు కేసు కోర్టులో సబ్మిట్ చేసిన సందర్భంగా తనవంతు సాక్ష్యం యిచ్చి, బైటికొస్తున్నాడు. చకచకా మెట్లు దిగు తుండగా పైకొస్తున్న పోలీసులచేతుల్లోని వ్యక్తిని చూసి హఠాత్తుగా ఆగిపోయాడు.

పోలీసుల మధ్య వున్న వ్యక్తి మురళి. విక్ర మ్‌ని చూడగానే తలదించుకున్నాడు. ముర ళిని తీసుకొస్తున్న ఇన్‌స్పెక్టర్, విక్రమ్‌ని చూసి నవ్వాడు

"హల్లో సర్... వీడు మీకు తెలుసా ఏంటి? మాకు మరో సెన్సేషనల్ కేసు యిచ్చేట్టున్నా రు"

ముక్తసరిగా తలాడించి, ప్రశ్నించాడు విక్రమ్,

"ఏంటి కేసు?"

"భార్యమీద హత్యాప్రయత్నం"

★ ★ ★

ఫాదర్ కళ్ళనుండి కారుతున్న నీరు, నిస్త్రా ణగా హాస్పిటల్ బెడ్‌పై పడుకున్న జూలీ కనుకొలుకుల్లో పడి, జాలువారుతూంది. ఓదా ర్పుగా ఆయన భుజంమీద చెయ్యివేశాడు విక్రమ్. లేచి నిలుచుని కళ్ళు తుడుచుకుని, అటువక్క అమాయకంగా నిదురపోతున్న మనవడివైపు చూశాడు. దరిద్రానికి ప్రతీకగా వున్నాడు ఎనిమిదేళ్ళ జిమ్మీ. మరింత బరువె క్కింది ఆయన మనసు. జిమ్మీ తల నిమిరి, దుప్పటి సర్ది, విక్రమ్ వెంట హాస్పిటల్ గది లోంచి బైటికి నడిచాడు.

గుమ్మం పక్కనే నిలుచున్న మురళి, వాళ్ల ను చూసి తలదించుకున్నాడు.

అతన్నుండి మరికాస్త దూరంగా నడిచాడు ఫాదర్. జరిగిన విషయం ఆయనకు వివ రించాడు విక్రమ్

"ఫాదర్... బాధపడకండి. అతను జూలీని అలవాటుగా కొట్టాడట. జూలీకి స్పృహతప్పితే ఎవరో గవర్నమెంట్ ఆసుపత్రిలో చేర్పించారు. డాక్టర్ల పట్టుదలమీద ఒకాయన పోలీస్ రిపోర్ట్ యిచ్చాడట. తగిలిన దెబ్బల్ని బట్టి, మా రూల్స్‌ప్రకారం పోలీసులు హత్యాప్రయ త్నంకింద కేసు బుక్‌చేసి మురళిని అరెస్టు చేశారు. అంతే... నేను బెయిల్ యిప్పించాను.





కేసు కోర్టుకొచ్చినప్పుడు చూసుకోవచ్చు. అంతా సర్దుకుంటుంది. నేనో పాతకేసు విషయంలో వచ్చాను. అది చూసుకుని వచ్చేస్తాను" వెళ్లబో తూ, ఆగి, క్షణం ఆలోచించి చెప్పాడు ఫాదర్‌కి "అతన్నేమీ అనకండి. మనం తరవాత మాట్లా డుకుందాం ఆ విషయాలు"

నిస్సహాయంగా నిట్టూర్చి, విక్రమ్ మలుపు తిరగ్గానే మురళివైపు తిరిగాడు ఫాదర్.

★ ★ ★

"ఇష్టపడి ప్రేమించావ్. దానికోసం మతం మార్చుకున్నావ్. పెళ్ళి చేసుకున్నావ్. హఠా త్తుగా మానుండి యింతదూరంగా తీసుకొ చ్చావ్. కానీ హత్యాప్రయత్నం అని పించేంతగా హింసిస్తున్నావంటే, ఎందుకు, ఏంచేసింది నా బిడ్డ?"

"నేను జూలీని పెళ్ళిచేసుకున్నది డబ్బు కోసం"

"ఏంటీ!?" తెల్లబోయాడు ఫాదర్, మురళి సమాధానం విని.

"యస్... డబ్బుకోసమే... మీకు తెలుసో లేదో జూలీ, మాలినీదేవికి పెళ్ళవకముందు పుట్టిన కూతురు"

చేష్టలుడిగి నిలుచుండిపోయాడు ఫాదర్.

"మాలినీదేవికి పురుడుపోసిన నర్సు, వాళ్లకు దూరపు బంధువు కూడా. అందుకే ఆ కుంతీ కుమారిని ఆమె పనిచేస్తున్న ఆసుప త్రిలో చేర్పించారు కాన్పుకోసం. ఆ నర్సు నా స్నేహితుని తల్లి. నేనూ, నా స్నేహితుడు సత్యం పట్నంలో వుండేవాళ్ళం. ఓరోజు సత్యంకు వచ్చిన వుత్తరం చూసి, అతనితోపా టు నేనూ వాళ్ళ ఊరికి బయలుదేరాను. ఆమెకు కేన్సరని తెలిసిందని కబురు.

పుట్టిన పాప చనిపోయిందని చెప్పి, ఆ పాపను అనాధాశ్రమంలో వదిలేసింది మాలిని. అప్పుడే అక్కడికెళ్ళిన మీరు ఆ పాపను తెచ్చుకున్నారని నాకు అక్కడ తెలిసింది.

ఆ తర్వాత మాలినీదేవిని మరెవరికో యిచ్చి పెళ్ళిచేశారు. ఆమెకు పిల్లలు పుట్టక ముందే మొగుడు చచ్చిపోయాడనీ, దూరంగా ఏదో ఊళ్ళో ఒంటరిగా వుంటుందనీ ఎప్పుడో, ఎవరో చెబితే సత్యం తల్లికి తెలిసిందట. అప్పుడు బాధపడి వూరుకుంది, కన్నబిడ్డ వుండే గొడ్రాలుగా బతుకుతున్న మాలినీదేవిని తలుచుకుని. కానీ తనకు కేన్సరని తెలియ గానే తను మాలినికి చెప్పిన అబద్ధం, ఒంట రిగా బతుకుతూందని తాననుకున్న మాలినీదే వినీ తలుచుకుని ఎలాగైనా ఆ తల్లికి ఈ కూతురి విషయం చెప్పమని సత్యంను కో రిందామె. ఈ కథంతా సత్యంకు అంతకు ముందే తెలును. తల్లి కోరిక తీరుస్తానని ఆమెకు మాటైతే యిచ్చాడు గానీ ఆ విషయం వదిలేశాడు సత్యం.

ఓసారి కాకతాళీయంగా ఆ అనాధాశ్రమం వున్న ఊరెళ్ళిన నాకు ఆసక్తి కలిగి ఆరా తీశాను. మాలిని డబ్బు చూసి ఆశ కలిగింది. జూలీని వెంటపడి, పెళ్ళి చేసుకున్నాను. జూలీకి నెల తప్పిన తరువాత ఓరోజు మాలినీ దేవి దగ్గరికి వెళ్ళాను. ఈ మాట చెప్పి, మెల్లిగా అసలు విషయం ప్రస్తావించాను...

★ ★ ★

"మీతో... మరో విషయం మాట్లాడాలండీ"

"చెప్పు బాబూ, అంత సంకోచమెందుకు?"

"ఏంలేదండీ... నాకు ముందు, వెనకా 'నా' అనేవాళ్ళెవరూ లేరు. ఏ ఉద్యోగమో చూసు కుంటే జూలీని వెంటబెట్టుకుని వెళ్ళిపోవచ్చు. కానీ ఈ వయసులో మిమ్మల్నందర్నీ కష్టపెట్టిన ట్టుంటుంది. అందుకని యిక్కడే ఏదో వ్యా పారం చేసుకుందామనుకుంటున్నాను"

"ఫాదర్ ఏమన్నారు?" కుతూహలంగా అడిగింది మాలిని.

"ఫాదర్‌కన్నా ముందుగా... మీరు... నాకు సహాయం చేయాలి... అదే, పెట్టుబడిలాంటి విషయాల్లో"

"ఇలాంటి విషయాలన్నీ విక్రమ్ చూసు కుంటాడు బాబూ. విక్రమ్ వచ్చాక నేనోసారి మాట్లాడతాను"

మురళికి జవాబు నచ్చలేదు. ఆ ఆస్తి అంతా తన భార్యది, అంటే తనదే. అలాంటిది తను విక్రమ్ముందు చేయి చాచటమేంటి అనిపించిందతనికి.

"ఇందులో విక్రమ్‌గారు చెప్పేదే ముందండీ... మీ ఆస్తి, మీ యిష్టమున్నవాళ్లకు

మీరిచ్చుకోవచ్చు''

అతని మాటలకూ ధోరణికీ ఆశ్చర్యపోయింది మాలిని. అయినా, కొందరి మాటతీర లాగుంటుందని సరిపెట్టుకుని, మామూలుగానే చెప్పింది.

"నాకు వరుసకు మేనల్లుడైనా విక్రమ్ నాకు దత్తుతీసుకున్న పెంపుడు కొడుకు. ఈ ఆస్తిపాస్తులన్నీ వాడివే. అయినా విక్రమ్ తప్పకుండా ఆలోచిస్తాడు. ముఖ్యంగా నువ్వు జూలీ భర్తవు గనుక తప్పక సహాయం చేస్తాడు''

ముఖ్యంగా నాతోపాటు జూలీ విషయంలో పోటీపడ్డాడు గనుక చెయ్యడు. చేసినా తన కోసం కాదు. వాడికి జూలీమీదున్న ప్రేమకోసం యిలా ఆలోచించిన మురళి ఓ నిర్ణయానికొచ్చాడు.

"నాక్కావలసింది 'విక్రమ్' సహాయంకాదు... అయినా అసలు మీకో ముఖ్యమైన విషయం చెప్పాలి. అప్పుడేమంటారో చూద్దాం''

"ఏమిటది?'' సాలోచనగా అడిగింది మాలిని.

ఆమె భావాలు పట్టుకోవాలన్నంత ఏకాగ్రతతో, ఆమె కళ్ళల్లోకి సూటిగా చూస్తూ చెప్పాడు మురళి

"మీకు మామూలుగానే యిష్టమైన జూలీ, మీకన్న కూతురుగదా?''

"నాకు తెలును'' ప్రశాంతంగా బదులిచ్చింది.

బిత్తరపోయాడు మురళి. కొన్ని క్షణాలు ఆయోమయంలోపడి, వెంటనే తేరుకున్నాడు. బలవంతంగా నవ్వు తెచ్చిపెట్టుకున్నాడు.

"అయితే, మీకు ఇంకా చెప్పవలసిందేముంది? మీ కన్నకూతురికి మీరు ఎంతైనా ఇచ్చుకోవచ్చు''

"చూడుబాబూ... ఇవన్నీ నీకెలా తెలుసని నేనడగబోవటంలేదు. కానీ ఇలా డబ్బడుగుతున్నావే. నువ్వు జూలీని జూలీగానే ప్రేమించావా? ఈ ఆస్తి వస్తుందనుకుని తెలిసి ప్రేమించావా?''

"మీరు ఫ్రాంక్‌గా అడిగారుగనుక నేనూ అలాగే చెబుతాను. ఇంత దూరమొచ్చి, ఇన్ని పాట్లు పడి, పెళ్ళిచేసుకోవటానికి జూలీ ఏమైనా అప్సరసా? సంసారస్త్రీ అందమంతా మొగుడికి మాత్రమే తెలునన్నట్టు, జూలీ అందమంతా ఇక్కడుందని నాకు ముందే తెలును''

"అంటే ఈ ఆస్తి నేనిస్తాననుకునే జూలీని పెళ్ళిచేసుకున్నావా?''

"ఏం... మీరివ్వట్లేదా?''

"నీకు దానిమీది ప్రేమకన్నా డబ్బుమీద ఎక్కువుంది. మరి దానిమీది ప్రేమతో నేన్నీకు డబ్బిస్తే ఏమవుతుందో తెలీదా నాకు?''

"ఇవ్వకపోతే ఏమవుతుందో మాత్రం మీకు తెలీదు''

"మురళీ... నీకాళ్ళమీద నువ్వు నిలబడి, పదేళ్ళు దానితో కుదురుగా కాపురం చేసాక, అవసరమనుకుంటే నేనేమైనా సహాయం చేస్తాను. అంతే కానీ, యిలా మాత్రం కాదు'' తాపీగా చెప్పింది మాలిని.

"దీని ఫలితమేమిటో తెలుసా?'' కోపంగా అరిచాడు మురళి.

"ఒక పోలీస్ ఇన్‌స్పెక్టర్‌కి తల్లిని. నీకు డబ్బిచ్చినా అంతే అవుతుందని తెలుసుకోలేనంత వెర్రిదాన్ని కాదు- ప్లీజ్ గెటౌట్''

"జీవితమంతా కూతుర్ని తలుచుకుంటూ కుళ్ళికుళ్ళి ఏడవాల్సొస్తుంది''

"ఆ రాత నాకు భగవంతుడే రాశాడు. దాన్ని నువ్వు మార్చగలిగితే మగాడివవుతావు గానీ, కొనసాగిస్తే కాదు''

★ ★ ★

"...మాలినీదేవి ఊహించనిదేదో చేయాలన్న ఉక్రోషంతోనూ, నన్ను కాదన్న మాలినీదేవి ముందరే కష్టాలు పడకూడదన్న పౌరుషంతోనూ, ఆయోమయంతోనూ బయలుదేరి వచ్చాను. ఏంచేస్తారు నన్ను? మీ పోలీసు విక్రమ్‌కి చెప్పి తన్నిస్తారా? అవన్నీ మళ్ళీ జూలీకి ఒప్పచెబుతాను.. విడాకులిప్పిస్తారా, మోస్ట్ వెల్‌కమ్. ఇన్నాళ్ళూ జూలీని వదిలేయకుండా వుంచుకున్నది దానిమీద ప్రేమతో కాదు, దాని తల్లి మీద కసితో. ఆ కసి తీర్చుకునే ఆలంబనని ఏదో ఓరోజూ, 'బాబూ, మురళీ, నేను వశ్చాత్తావ





వడుతున్నాను. అంతా నువ్వు అనుకున్నట్టు గానే జరుగుతుంది, వెంటనే తిరిగి రాగలవు' అని మాలిని పేపర్లో ప్రకటిస్తుందనుకున్నాను. ఇక నాకూ ఓపికపోయింది. ఇప్పుడు జూలీ నాకెందుకూ పనికిరాదు. పోనీ చంపేస్తారా నన్ను? ఎలా చంపగలరు? ఓ చెంపమీద కొడితే మరో చెంప చూపించాలి కదా! మీరు ఏంచేస్తారు నన్ను? ఏం చేస్తారు?"

మురళి మాటలకు నిరాసక్తంగా నవ్వాడు ఫాదర్.

"ద్వేషాన్ని ప్రేమతో జయించమన్నాడు ప్రభువు. కనీసం నా స్వార్థంతోనైనా నీకు ప్రేమ అందిస్తాను. మళ్ళీ మన ఊరికి వెళదాం. నీక్కావలసిన సహాయం నా చేతనైనంతలో నేను చేస్తాను. నిన్నెవ్వరూ ఏమీ అనరు. కనీసం, భార్యనీ, కొడుకునీ పోషించాల్సిన బాధ్యత తప్పుతుంది. నా చిట్టితల్లి నా కళ్ళ ముందరైనా వుంటుంది. ధనం కన్నా ప్రేమ గొప్పదని నువ్వు తెలుసుకునే రోజు రావాలని ప్రభువుని ప్రార్థిస్తున్నాను నాయనా"

సాలోచనగా ఫాదర్‌ని చూస్తూ నిలుచుండి పోయాడు మురళి.



"సారీసార్... సోలో హీరో పాత్రవున్న కథలే చేస్తాన్నేను"

"ఇప్పుడీ కథలో మీరే హీరో. కనీసం 40 శాతం సీన్స్ మీకే వున్నాయి. మూడు పాటలు మీకే వున్నాయి..."

"అయినా నా పాత్రకు సమానంగా మరో రెండు పాత్రలు నడుస్తున్నాయి. అలా నటించడం నాకిష్టంలేదు. ముగ్గురిలో ఒకడుగా నా మనసొప్పుకోదు. నా కెరీర్‌కు మంచిది కాదు" తల అడ్డంగా వూపాడు 'గుండు హీరో'.

"మరోసారి ఆలోచించండి. చిన్నచిన్న మార్పులేమైనా వుంటే చేద్దాం. డిస్కస్ చేద్దాం" అనునయంగా అన్నాడు చక్రి.

"ఈ కథవరకూ వద్దు. మరో కథేమైనా చెప్పండి. కథగా ఈ కథ నాకు చాలా నచ్చింది. అందుకే మరో కథ చెప్పమంటున్నాను. ఇలాగే గ్రిప్పింగ్‌గా, ఇంప్రెసివ్‌గా, వెరైటీగా వుండే మరో కథ. తప్పకుండా చేస్తాను. మీ థాట్స్ బాగున్నాయి. మీ స్క్రిప్టు చాలా బాగుంది. మీరు చేస్తారని నాకు నమ్మకముంది. ప్లీజ్ ట్రై అనదర్ స్టోరీ"

"రెమ్యూనరేషన్‌సైడ్ ఏమైనా ఆలోచిద్దాం. మీరు కథ బావుందంటున్నారు. కాల్షీట్స్ ప్రాబ్లం ఏదైనా వుందా చెప్పండి" అడిగాడు గోవిందు.

"నేను ఫ్రాంక్‌గానే చెబుతున్నాను. ఇప్పటికి నేను చేసిన సినిమాలన్నీ డబుల్ హీరో, త్రిబుల్ హీరోలే. నాకూ ఓ గుర్తింపు కావాలి. పెద్ద నిర్మాతల్నీ పెద్ద డైరెక్టర్లనీ ఇలా అడగలేను. ఇక్కడ మీరూ కొత్త, డైరెక్టర్‌గారూ కొత్త. అందుకే అడుగుతున్నాను. మీ కథ బావుంది. ఇలాంటిదే, ఒకే హీరో వుండేది మరో మంచి కథ తీసుకురండి. తప్పకుండా చేద్దామని అందుకే అంటున్నాను. నెక్స్ట్ మంత్ ఖాళీగా వున్నాను. ఇలా ఎవ్వరూ చెప్పరు. అయినా చెబుతున్నాను. వీలైనంత తొందరగా మీరొస్తే మీకే ఇస్తానాడేట్స్"

★ ★ ★

"పోని ఇంకో కథ చూద్దామా బాస్?"

"మీ యిష్టం"

"అంత నిరాశగా మాట్లాడుతావేంటి గురూ. ఇంకో కథ తయారుచేద్దాం"

"చేయొచ్చు... అది కాదు ప్రాబ్లం..."

"మరి?"

"మనం కథ బాగుందనుకుని దిగాం. ఈ కథలో అన్ని అంశాలు తగు మోతాదులో వున్నాయి. ముఖ్యంగా ఇలాంటి కథ ఈమధ్య

రాలేదు. తప్పకుండా సక్సెసవుతుందని ఆశతో తయారుచేసుకున్నాం. ఓకే, దీన్ని పక్కకు పెట్టొచ్చు. మరొకటి చేయొచ్చు. కానీ నెక్స్ట్ మంత్‌లో మాటింగంటే కష్టం''

"నువ్వు తలుచుకుంటే ఏదీ కష్టం కాదు గురూ''

"కానీ తల్చుకోవటంలేదు. మీకోసమే. మరొకరికైతే నాకు ఏ అభ్యంతరమూ లేదు. సినిమా ఎప్పుడూ హడావిడిగా తీయకూడదు. నాడా దొరికిందని గుర్రాన్ని కొనుక్కున్నట్టు, హీరో డేట్స్ వున్నాయని తీయటం మంచిది కాదని నా అభిప్రాయం. పెద్ద యంత్రాంగం, పుష్కలంగా డబ్బు, అవసరమైనంత ఇన్ఫ్లుయెన్సు వున్న నిర్మాత, వదోరోజున మాటింగు అంటే ధైర్యంగా ఇప్పుడు కథ మొదలెడతాను. 'గతంలో ఆ సినిమాకు, డైరెక్టర్ కెమేరా పెట్టి, లైటింగ్ పూర్తయేలోగా రాయమంటే రాశాను, ప్రతి సీనూ. అక్కడ నా బాధ్యత లేదు. కానీ మనకలా కాదు. అందరికీ మొదటి ప్రయత్నం. అందుకే తొందరపడకూడదని ఆలోచిస్తున్నాను- అంతే''

"మరేం చేద్దామంటారు?''

"మీ యిష్టం... నన్నడిగితే మరో కథ సిద్ధంచేసుకుని, అన్ని ఏర్పాట్లూ చేసుకునే తీసుకోవటం మంచిది. కావాలంటే ఇప్పుడు హీరోను డిసైడ్ చేసుకుని, ఆయనకు అడ్వాన్స్ ఇచ్చి, డేట్స్ తీసుకోవచ్చు''

"కానీ అప్పటివరకూ రిలీజయ్యే ఆయన సినిమాలు మూడూ ఫెలయితే మన సినిమా ఎవడు కొనక్కుంటాడు గురూ''

"అడ్వాన్స్ పోయిందనుకుని ఊర్కోవాలి. లేదా మరో హీరోతో తీసుకోవాలి''

"అప్పుడా హీరో ఈ కథ నచ్చలేదంటే?''

"అయితే ఏం చేద్దామంటారు?''

"గురూ... ఈ సినిమా ప్రపంచమే ఇంత. ఫాస్ట్‌నెస్ కావాలి. తప్పదు. తీరిగ్గా... ప్లాను ప్రకారం చేసుకోవాలంటే వీలుకాదు. రెండు రోజుల్లో కథ పూర్తిచేసుకోవాలి. పది రోజుల్లో మాటింగ్ మొదలెట్టాలి. మూడో నెల్లో రిలీజ్ చెయ్యాలి- అప్పుడే నిలబడతాం''

గోవిందు మాటలకు విసుగ్గా చూశాడు చక్రి.

"ఇవన్నీ నాకు తెలియకకాదు... కానీ ఈ సినిమా ఫెయిలైతే నాకంటే ఎక్కువ నష్టం మీకు. ఎందుకంటే, సినిమా ఫెయిలైనా, డైరెక్టర్‌లో పసవుందని కనిపెడితే ఏ నిర్మాతైనా నాకు ఇంకో అవకాశం ఇవ్వొచ్చు. మరి మీ సంగతేంటి? చక్రిని నమ్ముకుని మునిగిపోయామని చెప్పుకుంటారా?''

"ఛఛ... అలా ఎందుకు చెప్పుకుంటాం సార్... కానీ ఏ హీరో దగ్గరికి వెళ్ళినా కథ బాగుంది కానీ నాకు తగిన పాత్రకాదు అంటాడు. ఏం చేయాలో తెలీటంలేదు. ఒకడు పాత్రను పెంచమంటాడు. ఒకడు వేరే పాత్రను తీసేయమంటాడు. ఒకడు పెద్ద హీరోయిన్ కావాలంటాడు. అందుకే కథ మార్చేద్దాం. మీ యిష్టం, ఏ కథైనా సరే... నా గురించి ఆలోచించకండి మీరు. అలాగే ఇంత దూరం వచ్చాక తప్పుకుని పోకండి. కష్టమో, సుఖమో, అందరం కలిసి దిగాం. కలిసే వుందాం'' తన అభిప్రాయం చెప్పాడు శ్రీరామచంద్రుడు.

కాస్సేపు ఎవరూ మాట్లాడలేదు. హఠాత్తుగా అన్నాడు లక్ష్మణకుమార్

"మనకింకా ఇద్దరు హీరోలు మిగిలారు. వాళ్ళను కూడా సంప్రదించి వాళ్ళూ ఈ కథ వద్దంటే అప్పుడాలోచిద్దాం''

నిజమేననిపించింది అందరికీ.

"ముందుగా ఎవరిదగ్గరికెళదాం?''

"అది మన చేతుల్లో ఏముంది గురూ? ఎవడుంటే వాడి దగ్గరికెళదాం''

* * *

"జూలీ ఊళ్ళో అడుగుపెట్టింది. ఇంట్లో కెళ్ళింది. పేరలల్ మాంటేజెస్‌లో అందరి రియాక్షన్స్ చూపిస్తాం.

తెల్లవారింది ఫాదర్, జిమ్మీకి ఏదో కీర్తన నేర్పుతున్నాడు వాకిట్లో కూచుని.

జూలీని డబ్బడిగాడు మురళి. ఆమె దగ్గరెందుకుంటాయి డబ్బులు? లేవంది జూలీ.

అంతే ఈడ్చికొట్టాడు.

అప్పుడు ఫాదర్ వచ్చాడు. నిశ్శబ్దంగా ఓ నోటు తీసి మురళికిచ్చాడు.

జూలీ, మురళీ ఇద్దరూ ఆశ్చర్యపోయారు.

 

'గాడ్‌బ్లెస్‌యూ ఫాదర్' అనుకుంటూ, ఆ నోటు తీసుకుని వెళ్ళిపోయాడు మురళి.

అక్కణ్ణించి టీ కొట్టుకెళ్ళాడు మందు కొట్ట డానికి. మురళిని చూడగానే లేచి కొట్లోంచి బైటికి నడిచాడు డేవిడ్.

కట్ చేస్తే,

జూలీ హౌస్... జిమ్మీ వీధిలో పడిపోయి ఏడుస్తున్నాడు. జూలీ వచ్చి పిల్లాడి దుమ్ము దులిపి, ఓదార్చుతూంది.

మరో ఇంటిపక్కనుండి ఆమెకు కనిపించ కుండా ఆమెను చూస్తున్నాడు డేవిడ్.

అప్పుడే తూలుతూ మురళి వచ్చాడు. అత ను డేవిడ్‌ని చూడలేదుగానీ, వీధిలో వున్న జూలీని చూశాడు.

'ఎవడికి లైటు కొడుతున్నావె' అంటూ జూలీని కొట్టటానికి చెయ్యి ఎత్తాడు.

ఆ చేతిని ఆపాడు డేవిడ్. ఆవేశంగా ముర ళిని కాలర్ పట్టుకుని లాగి, కొట్టబోయి, ఆగిపో యాడు.

'ఛీ...నిన్ను గొట్టినా, గా కుక్కను గొట్టినా ఒక్కటే' అనేసి వెళ్ళిపోయాడు.

డేవిడ్ వెళ్లగానే జూలీని గొరగొరా లాక్కుపో యాడు లోపలికి. మధ్యలో అడ్డుపడిన జిమ్మీని ఈడ్చితన్నాడు. బావురుమన్నాడు జిమ్మి. జూలీని విసిరి గోడకేసి కొట్టి,

'ఇంటిదగ్గర వాడుగానీ మళ్ళీ కనిపించాడో నరికేస్తాను జాగ్రత్త' అనేసి, అక్కణ్ణించి వెళ్ళి పోయాడు.

తిన్నగా మళ్ళీ టీ కొట్టుకు వెళ్లాడు మురళి.

అమితాబ్ అరువియ్యనన్నాడు.

గమ్మున వెళ్ళి వెనకాల కూచున్నాడు, మిగ తా వాళ్లను చూస్తూ, ఆలోచిస్తూ.

అప్పుడక్కడ కూచున్న ఇద్దరు పొరుగూరు వాళ్ళు పందెం వేసుకుంటున్నారు.

దూరంగా వస్తున్నమ్మాయి వీనెక్ జాకెట్టేసు కుందని ఒకడూ, కాదు యూనెక్ జాకెట్టేసు కుందని మరొకడూ వెయ్యి రూపాయలు పందెం వేసుకున్నారు.

అది ఏనెక్కో చూపిస్తే తనకు వందిమ్మని చెప్పాడు మురళి. ఆ అమ్మాయి దగ్గరాగానే పైట లాగాడు. మురళిని ఈడ్చి కొట్టిందామె. ఆమె ప్రియ.

అంతవరకూ ప్రియ ముఖం తెలియ కుండా ప్రేక్షకుల్నీ మురళి చూడకుండానూ టేకింగ్‌లో చూపిస్తాం. మురళిని గుర్తుపట్టి తిట్టింది.

తన అన్నకు తెలిస్తే చంపుతాడని హె చ్చరించి వెళ్ళిపోయింది.

ఈ గొడవకు అక్కడికొచ్చిన అమితాబ్ అందర్నీ తిట్టాడు. వందరూపాయలూ తీసు కుని, మురళి మందు యిమ్మంటే యివ్వనన్నా డు. మాటామాటా పెరిగింది.

ఇక్కడ అమితాబ్, అమితాబచ్చన్ లెవల్లో చిందులేసి, అరచేత్తో యిటుకలమీద కొడితే అవి అడ్డంగా పగులుతాయి. కత్తి తీసి విసిరితే వెళ్ళి బ్రహ్మయ్య తల పక్కన గుచ్చు కుంటుంది. ఇంగుతిని, తన డబ్బులు తీసు కుని వెళ్ళిపోతాడు మురళి, తిట్టుకుంటూ.

అందరూ ఆశ్చర్యంగా అమితాబ్ చుట్టూ చేరతారు. గర్వంగా చూసి, పాట పాడుతాడు అమితాబ్- "మైఫల్ దో ఫల్ కా ఫైటర్ హూ, ఫల్ దో ఫల్ మేరే కరాటే హై"

కట్ చేస్తే మళ్ళీ హౌస్.

తూలుకుంటూ గేటు తెరిచాడు మురళి. లోపలికి నడిచాడు. ఎదురుగా కనిపించిన కుర్చీని ఈడ్చి తన్నాడు. కానీ అక్కడే పడింది, ఎక్కువ దూరం వెళ్ళకుండా. బైబిల్ చదువు కొంటున్న ఫాదర్, మురళి వచ్చాడని గమ నించి, పుస్తకంలోంచి తలెత్తి, ఓసారి క్రాస్ చేసుకుని, నిశ్శబ్దంగా మళ్ళీ పఠనంలో మునిగి పోయాడు. తండ్రి అలికిడి వినగానే, ఏదో ఆడుకుంటున్న జిమ్మి గమ్మున ఓ మూల నక్కాడు.

తను తన్ని పడేసిన కుర్చీని అతికష్టంమీద సరిగ్గా వేసుకుని దాన్లో కూర్చున్నాడు మురళి. అంతదాకా సన్నగా వస్తున్న ఎక్కిళ్ళు తీవ్రమ య్యాయి. కడిగేసిన పాత్రలు వంటింట్లో పెట్ట డానికొచ్చిన జూలీకి వినిపిస్తున్నాయతని ఎక్కి ళ్ళు. గిన్నెలన్నీ సర్దేసింది. ఇంకా ఎక్కిళ్ళు వినిపిస్తున్నాయి. గమ్మున ఓ గ్లాసులో నీళ్ళు తీసుకుని వచ్చింది. కుర్చీలో తల వెనక్కు

వాల్చి కళ్ళు మూసుకుని వున్న మురళి, జూలీని గమనించలేదు.

ఓ క్షణం తటపటాయించి 'నీళ్ళు' - అంది జూలీ ముక్తసరిగా.

బలవంతంగా కళ్ళు విప్పి చూసి, నీళ్ళగ్లా సందుకున్నాడు. తన పని పూర్తయినట్టు వెను దిరిగింది జూలీ. ఖంగున గ్లాసుపడిన చప్పుడు వినిపించటంతో ఉలిక్కిపడి వెనుదిరిగింది. తూలి ముందుకు పడిపోయాడు మురళి, కుర్చీతోసహా. కెవ్వున కేకపెట్టింది జూలీ.

ఫాదర్‌తోపాటు హడావిడిగా వచ్చిన డాక్టర్ మురళి నాడి ముట్టుకుని ఐదారుక్షణాలు పరిశీలించి, చెయ్యి వదిలేసి, లేచి నిలుచుని, జూలీ, ఫాదర్‌వైపు సానుభూతిగా చూశాడు-

వరుసగా మూణ్ణాలుగు మాంటేజెస్...

తెల్లబోయి చూస్తున్నమాలిని, విక్రమ్‌తోబాటు గబగబా బైటికొచ్చింది. కారు స్టార్టయింది. ప్రేమ్‌తో కలిసి యింట్లోంచి బైటికొచ్చింది ప్రియ.

బ్రహ్మయ్య... అమితాబ్‌లు ఒకరి ముఖాలొకరు చూసుకుని కొట్లోంచి బైటికొచ్చారు.

అంటే మురళి చనిపోయిన వార్త విని వాళ్ళంతా వస్తున్నారన్నమాట. కట్ చేస్తే,

ఇంటి అరుగుమీద మురళి శవం పడుకోబెట్టివుంది. చాలామంది వచ్చి చూస్తున్నారు.

ప్రియ, మాలినీలు జూలీ దగ్గర కూర్చున్నారు. నిర్వికారంగా చూస్తూ కూర్చుంది జూలీ. బైట విక్రమ్, మరికొందరు ఫాదర్‌తో మాట్లాడుతున్నారు.

'రావలసిన వాళ్ళెవరున్నారు ఫాదర్' అని ఒకాయనడిగాడు.

తనకు తెలిసి ఎవరూ లేరనీ, మురళి అనాథాశ్రయంలో పెరిగానని చెప్పుకున్నాడనీ బదులిచ్చాడు ఫాదర్.

'మరింకా ఆలస్యమెందుకు? శవం ఎదురుగా వున్నంతసేపూ దుఃఖం రగులుతూనే వుంటుంది. ఏర్పాట్లు తొందరగా కానిస్తే సరి' మరొకతను సలహాయిచ్చాడు.

అక్కణ్ణించి కదిలి లోపలికెళ్ళాడు విక్రమ్.

ఓ మూల నిలుచుని మాలిని, విక్రమ్‌లు మాట్లాడుకుంటున్నారు.

'ఏం చేయాలో తెలీటం లేదత్తమ్మా. నేను అర్జెంట్‌గా హెడ్‌క్వార్టర్స్ కెళ్లాలి' అన్నాడు విక్రమ్.

''నువుండి చేసేదేంవుంది. వీలైనంత తొందరగా వచ్చెయ్యి' అంది మాలిని.

జూలీని, బాబునీ కనిపెట్టుకునుండమని చెప్పి, విక్రమ్ వెళ్ళిపోయాడు.

ఫ్యునరల్... గొయ్యి పక్కన శవపేటిక వుంది. అందరూ మౌనంగా నిలుచున్నారు. ఫాదర్ ప్రార్థన పూర్తిచేశాడు.

బ్రహ్మయ్య, పెట్టెమీద మూతపెడుతూ దాన్ని కిందపడేశాడు. మళ్ళీ తీసి మూత సరిగ్గా పెట్టాడు. మొదటి మేకు కొడుతుండగా సుత్తి జారి పడింది. మళ్ళీ సరిగ్గా కొట్టాడు. అమితాబ్, బ్రహ్మయ్య భుజం తట్టి ఓదార్చాడు.

పెట్టెను గోతిలోకి దింపారు. గొయ్యిని మట్టితో కప్పేసి, దానిపై ఒక సిలువను పాతారు. అందరూ వెనుతిరిగారు. ఫాదర్‌తో మాట్లాడి, జిమ్మీని వెంటబెట్టుకొని వెళ్లిపోయింది మాలిని. స్మశానవైరాగ్యంతో అంతా భారంగా వస్తున్నారు. ఇక్కడ కట్ చేసుకుంటే,

మళ్ళీ ఫస్ట్‌సీన్‌కు వస్తాం. అంటే ఇక్కడి సీన్ కట్‌చేసుకుని, ప్రోలోగ్‌గా ముందు చూపించామన్నమాట.

చర్చి, అందులోంచి ఓ మనిషి బైటికొచ్చాడు. ఒకతను పారతీసుకుని బైటికొచ్చాడు.

ఓ కారు వేగంగా వస్తూంది.

ఎవరో సమాధి తవ్వారు.

ఇంతలో మరొకరు స్మశానం మరో మూలకొచ్చారు.

శవం కళ్ళు తెరిచింది.

సమాధి తవ్వినతను పారిపోయాడు.

మరొకతను వెళ్ళిపోయాడు.

కారు రివర్స్ తీసుకుంది.

రెండు కళ్ళు తెరనిండుగా కనిపిస్తున్నాయి. శవం లేచి కూచుంది. ట్రావెల్ షాట్, నీడ సజెషన్‌లో ముందుకు వెళుతూ, బ్యాక్‌గ్రౌండ్‌లో శవం.




దాని కళ్ళు...

మరో జత కళ్ళు...

కన్నున శవం గుండెలో కత్తి దిగింది...

తెరనిండా వున్న కళ్ళు మూడుక్షణాలు అలాగే చూసి, ఫ్రేమ్ ఔట్ అయ్యాయి.

చిక్కని చీకటి...

జనం పరిగెత్తుకొస్తున్న శబ్దం...

ముందుగా చూపించినప్పుడు శబ్దంతో ఆపేశాం. ఇప్పుడు నిజంగా జనాన్ని చూపిస్తాం. ముందుగా ప్రేమ్ వచ్చాడు. అతని వెనక మరికొందరు. కాస్సేపటికి ఫాదర్, పోలీసులు...

ఎందుకంటే అది మురళి శవం...

విక్రమ్ హెడ్‌క్వార్టర్స్‌కెళ్ళినట్టు ముందుగానే చూపించాంకదా. ఇన్‌స్పెక్టర్ శ్యామ్ వచ్చాడు.

"శవాన్ని ఎవడో పొడిచాడు. ఆ చచ్చినవాడు ఎవడికీ మంచి చేయలేదు. వాడు చచ్చినందుకు బాధ పడిన వాడెవడూ లేడు. అలాంటిది ఇప్పుడీ శవాన్ని ఎవడో పొడిచాడని కేసు, పరిశోధన, దీనివల్ల లాభంలేదు, చేయకపోవటంవల్ల నష్టమూలేదు. మీరేమైనా పట్టుపడతారా ఫాదర్' విసుగ్గా అడిగాడు ఎస్సై శ్యామ్.

ఫాదర్ అయోమయంగా చూస్తున్నాడు.

ఎక్కడికోవెళ్ళి, అక్కడికి మళ్ళీ అప్పుడే వస్తున్న ప్రేమ్ ఈ మాటలువిని బాంబు పేల్చాడు.

"ఏంలాభం లేదుసార్. నేనప్పుడే మా ఆఫీసుకి ఫోన్‌చేసి వస్తున్నాను. మార్నింగ్ పేపర్లో ఈ న్యూస్ వచ్చేస్తుంది' అన్నాడు. తప్పనిసరిగా తతంగం మొదలైంది. ఫొటోలు తీశారు. శవాన్ని పోస్ట్‌మార్టంకు పంపించారు.

★ ★ ★

పాథాలజిస్టు ముందు కూర్చున్నాడు ఇన్‌స్పెక్టర్ విక్రమ్. చేతిలోని కాగితాలు అందిస్తూ చెప్పాడాయన

"శవాన్ని పొడిచాడని చెప్పాడు మీ ఎస్సై. కానీ ఆ కత్తి పోట్లకే ప్రాణం పోయింది"

ఉలిక్కిపడ్డాడు విక్రమ్.

"వ్వాట్ డాక్టర్? అంటే ఇది హత్య కేను"

"యస్"

"కానీ..."

ఆగిపోయిన విక్రమ్ అనుమానాన్నిపూర్తి చేశాడు పాథాలజిస్టు.

"కానీ... సమాధి చేసిన తరవాత ఎలా బతికున్నాడని నీ డౌటు... కఫిన్ బాక్సులో కొన్ని గంటలపాటు సమాధైవుండి, తరవాత ఎవరో ఎందుకోతవ్వి తీస్తే బతికినవాళ్ల కేసులు కొన్ని వున్నాయి. ఇలాంటి ఓ కేసు, బహుశా రీడర్స్ డైజెస్టులో కూడా వచ్చినట్టు గుర్తు. పైగా ఇతను మూణ్ణాలుగు గంటలకన్నా ఎక్కువలేనట్టుంది. మేం కూడా వీటిని మిరకిల్స్ అంటాం. ఇదీ అలాంటిదే అనుకోవాలి. పోతే, అసలు బతికున్నవాణ్ణి ఎందుకు సమాధి చేశారో నువ్వే చెప్పాలి" ముగించాడు పాథాలజిస్టు.

★ ★ ★

"చెబుతాను ఇన్‌స్పెక్టర్ నిస్తేజంగా మొదలెట్టాడు మురళిని పరీక్షించి, అతను చనిపోయాడని చెప్పిన డాక్టర్.

అతను చెప్పేది వింటున్నాడు విక్రమ్. పక్కనే ఎస్సై శ్యామ్, కానిస్టేబుల్స్ కూడా వున్నారు. డాక్టర్ చెబుతున్నాడు.

"మురళిని పరీక్షించి చూశాను. నాడి అందలేదు. వాడు బతికితే బాధ పడేవాళ్ళున్నారు గానీ చస్తే బాధపడేవాళ్ళు ఎవరున్నారన్న ఆలోచనతో పూర్తిగా పరిశీలించకుండానే చనిపోయాడనే నిర్ధారణకొచ్చాను... నా కూతురు జూలీలాగే ప్రేమవివాహం చేసుకుని మోసపోయింది. మూడేళ్ల కిందట ఆత్మహత్య చేసుకుంది"

ఆయన వంక సానుభూతిగా చూశాడు విక్రమ్.

"ఒక తండ్రిగా ప్రవర్తించటం వైద్యుడిగా నా తప్పే ఒప్పుకుంటున్నాను"

వ్యక్తిగత జామీనుమీద ఆయన్ని వదిలేశాడు విక్రమ్.

★ ★ ★

ఫాదర్‌గానీ, జూలీగానీ ఈ విషయంలో ఏమీ చెప్పలేకపోయారు. ఆలోచిస్తూ కూర్చున్న

విక్రమ్ దగ్గరికి ఇద్దరు కానిస్టేబుల్స్ వచ్చి, అమితాబ్ కొట్టు దగ్గర జరిగిన గలాభా గురించి చెప్పారు. కాస్సేపటికి అమితాబ్‌ను తీసుకొచ్చారు. కరాటే దెబ్బతో ఇటుకలు పగలగొట్టిన విషయం, సరిగ్గా బ్రహ్మయ్య తలపక్కన తగిలేట్టు కత్తి విసిరిన విషయం ప్రశ్నించాడు విక్రమ్. లబోదిబోమన్నాడు అమితాబ్.

"నాకవన్నీ తెలిస్తే యిక్కడెందుకుంటాను సార్... అంతకుముందే పగిలిన ఇటుకల్ని కొట్టినట్టు నటించాను. చెయ్యికి దెబ్బ తగిలిందిగానీ అప్పుడెవరికీ చూపించలేదు. ఇదు గోండి బ్యాండెయిడ్. వాడు నన్ను 'పొట్టి నా కొడకా' అనేసరికి కోపమొచ్చి, ఆ కోపంలో ఏం చేస్తున్నానో తెలియక కత్తి విసిరాను. నా అదృష్టం బాగుండి బ్రహ్మయ్యగాడికి తగల్లేదు. అంతేగానీ నేను హత్య చేయడమేంటి సార్, పొట్టినా కొడుకుని"

"అసలు నీకూ, మురళికీ తగువెందుకొచ్చింది?" ఆరా తీశాడు విక్రమ్.

* * *

తలుపు తెరిచిన ప్రియ, ఎదురుగా విక్రమ్‌ని చూసి ఆశ్చర్యపడింది. మరుక్షణం కంగారు పడింది. మౌనంగా అతన్ని లోపలికాహ్వానించింది. లోపలికి నడిచిన విక్రమ్ కూర్చోకుండానే ప్రశ్నించాడు.

"జరిగిన విషయం మళ్ళీ గుర్తుచేస్తున్నందుకు సారీ. నిన్న టీ షాపు దగ్గర జరిగిన గొడవ..."

సూటిగా చూస్తున్న విక్రమ్, ప్రియ కళ్ళల్లో రెండు మూడు క్షణాలు ఆలోచన, ఆ తరవాత ఆశ్చర్యం, నిజాయితీగా వచ్చినవేనని పసిగట్టాడు.

"అదా... నేనప్పుడే మర్చిపోయాను. మా అన్నయ్యేమైనా రిపోర్ట్ చేశాడా?"

"నేనొచ్చింది మీరు మర్చిపోయారా, మనసులో పెట్టుకుని మురళిని హత్యచేశారా అడుగుదామనొచ్చాను..."

దెబ్బతిన్నట్టుగా చూసి, కొద్దిక్షణాల్లో తేరుకుని, ప్రశాంతంగా బదులిచ్చింది ప్రియ.

"కసీ, ద్వేషం... ఊహు, లేదండీ అలాంటి తుచ్ఛమైన వాటికి గురికాకుండా మనసునెలా అదుపులో పెట్టుకోవాలో నాకు ఓ మహాత్ముడు నేర్పించాడు. అది నేనెప్పటికీ మర్చిపోను. నా మనసు నా అదుపులో వుందిప్పుడు"

సూటిగా తగిలిన దెబ్బకు నిశ్చేష్టుడయ్యాడు విక్రమ్. ఆశ్చర్యంగా ప్రియను చూస్తూ నిలుచుని, గిరుక్కున వెనుతిరిగాడు.

* * *

మీరు చెప్పినట్టుగానే, ప్రియకు తెలియకుండా ఆమె ఎలిబీ గురించి విచారించాను. పక్కింటి అమ్మలక్కలు ఐదారుగురు మురళి మరణం గురించి మాట్లాడుకుంటూ కూచుని, టీవీలో మిడ్‌నైట్ షో చూస్తూండిపోయారట. వాళ్ళంతా ఆమెకు సాక్ష్యం. సో, ఆమెను అనుమానించలేం" వివరించాడు ఎస్సై శ్యామ్.

"అమితాబ్‌గాడికి వాడి షాపులో పనిచేసే వాళ్ళంతా వత్తాసు పలుకుతున్నారు సార్. అందరూ పేకాడుతూ కూచున్నారట. ఎవరు గెలిచారు, ఎవరు ఓడారు, అన్నీ అడిగి, వాళ్ళు రాసుకున్న కాగితాల్లో చెక్ చేశాం. వాళ్ళు చెప్పినట్టే వుంది ఆట- అంతేకాక..." మాట పూర్తిచేయకుండా ఆగిపోయాడు హెడ్‌కానిస్టేబుల్.

"అంతేకాక?" ప్రశ్నించాడు విక్రమ్.

"ఏంలేదుసార్" నీళ్ళు నమిలాడు హెడ్‌కానిస్టేబుల్.

"అమితాబ్‌లాంటి పొట్టివాడు చంపలేడనా? కానీ, కత్తి చాలా పదునుగా వుంది. ఎంత బలహీనుడు పొడిచినా లోపలికి దిగుతుందని చెప్పాడు పాథాలజిస్టు" అన్నాడు విక్రమ్, వాళ్ళ అనుమానాల్ని నివృత్తిచేస్తూ.

"మీరు చెప్పకపోయినా నేను మరో పనిచేశాను సార్" అన్నాడు శ్యామ్. "ఈ కేసులో మనం ఓ ముఖ్యమైన వ్యక్తిని మరిచిపోయాం. మురళి మొదటిసారి మరణించినప్పుడు... అంటే, అదే మరణించాడని మనం అనుకున్నప్పుడూ, హత్య చేయబడిన తరవాత అసలింతవరకూ కనిపించలేదతను...డేవిడ్"

విక్రమ్ కళ్ళు విచిత్రంగా మెరిశాయి.

"యస్... డేవిడ్ వెరీగుడ్. ఏమైంది? అతనికి ఎలిబీ వుందా?"

"లేదు. నిన్న మధ్యాహ్నం మురళిని తిట్టి, వెళ్ళిపోయినప్పట్నించీ ఏమయ్యాడో తెలీదు.




బహుశా అతను దొరికితే కేసు తేలిపోవచ్చు.

"సారీ ఫర్ ఇంటరప్షన్" అప్పుడే లోపలికొచ్చిన ప్రేమ్ కల్పించుకున్నాడు.

"నేనూ మీలాగే ఆలోచించి డేవిడ్ కోసం వెదికాను. అతన్ని కనుక్కున్నాను. కానీ అతను కాదని తెలుసుకున్నాను"

"మీకెలా తెలిసింది? ఇంతకీ డేవిడ్ ఎక్కడున్నాడు?"

భారంగా నిట్టూర్చి చెప్పాడు ప్రేమ్.

"ఊరిబయట చెట్టుకు వేళ్లాడుతున్నాడు. హీ యిజ్ డెడ్. జూలీని చూసిన తరవాత ఆమెకు జరిగిన అన్యాయాన్ని భరించలేక ఆత్మహత్య చేసుకున్నాడు. అక్కడున్న స్లిప్‌లో అదేవుంది"

★ ★ ★

వారం పదిరోజులయింది. డ్యూటీనుండి చాలా అలసిపోయి వచ్చాడు విక్రమ్. బట్టలు మార్చుకుని, మాలినితో మాట్లాడుతూ కూచున్నాడు కాస్సేపు.

"శవాన్ని తవ్వితీసి ఎవరో చంపారు. ఆ కేసులో అనుమానితుడు ఆత్మహత్య చేసుకున్నాడు. మిగతా వాళ్లెవర్నీ అనుమానించేట్టులేదు. అందరికీ ఎలిబీలున్నాయి. ఈ కేసు ఎలా తేలుతుందో అర్థం కావటంలేదు..."

"అంత తలబద్దలు కొట్టుకోవాల్సిన అవసరం వుందా?" నిదానంగా ప్రశ్నించింది మాలిని.

ఆమె ప్రశ్నకు విస్తుబోయాడు విక్రమ్—

"ఆదేంటత్తమ్మా అలా అంటున్నావు. అది నా డ్యూటీ"

క్షణంసేపు తడబడి బదులిచ్చింది మాలిని.

"ఏంలేదు... డ్రెస్సు మార్చుకున్నాక కూడా ఆలోచిస్తున్నానని అన్నాను"

నిస్పృహగా నిట్టూర్చాడు విక్రమ్.

"జూలీ కాపురం చక్కబడటానికి ఏమీ చేయలేకపోయినా, కనీసం మురళిని చంపినవాణ్ణి పట్టుకుంటేనైనా జూలీకి కొంత న్యాయం జరుగుతుందికదా" అని తన మనసులోని మాట వివరించాడు.

"వాణ్ణి చంపిందెవరో కానీ వాడే జూలీకి న్యాయం చేశాడు"

"అత్తమ్మా..."

"ఇది అమ్మ మనసురా. జూలీకి న్యాయం చేయాలనుకుంటే..." ఆగి విక్రమ్‌వైపు సూటిగా చూసి చెప్పింది "నువ్వు చేయాల్సిన పని ఇది కాదు"

ఆ మాటని విసిరి వెళ్ళిపోయింది మాలిని. స్థాణువై నిలుచుని, ఆమె మాటలోని అంతరార్థాన్ని గురించి ఆలోచిస్తూ, చాలాసేపు అచేతనంగా అలాగే వుండిపోయాడు విక్రమ్.

★ ★ ★

...కట్ చేస్తే, జూలీ హౌస్ లొకేషన్. నైట్ ఎఫెక్ట్.

నిద్రపోతున్నట్టు పడుకున్న జూలీ లేచి, నిశ్శబ్దంగా బైటికి నడిచింది. వీధిమలుపులో వున్న బావి దగ్గరకు చేరుకుంది. కొంచెం టెన్షన్ బిల్డప్ ఇస్తాం. అందులో దూకబోతూ ఆగింది.

వెనుకనుంచి ఆమె పైట పట్టుకుని నిలుచున్నాడు జిమ్మీ.

కొడుకును చూసేసరికి ఒక్కసారిగా నిర్లిప్తత పోయి, దుఃఖం పొంగుకునొచ్చి, కుర్రాణ్ణి వాటేసుకుని బావురుమంది జూలీ.

తల్లి కళ్లనుండి కారుతున్న నీటిని తన చిన్నారి చేతుల్తో తుడిచి, ఆమె మెడచుట్టూ చేతులు వేసి ముద్దుపెట్టుకున్నాడు జిమ్మీ.

లేచి నిలుచున్న జూలీకి తన చెయ్యి అందించాడు.

బస్... నో డైలాగ్స్... నో డ్రాపింగ్. చాలా టచింగ్‌గా వుంటుంది సీను. సింపతీ వర్కవుట్ చేయటానికేకాక, ఈ సీన్‌తో మనకు తరవాత పనుంది... నెక్స్ట్ సీనుకొచ్చాం.

"దొంగలు పడిన ఆర్నెల్లకు కుక్కలు మొరుగుతాయంటారు. కానీ మనం పోలీసులం. హత్య జరిగిన ఆర్నెల్లకైనా హంతకుణ్ణి పట్టుకోలేకపోతే, కుక్కల్ని తరిమినట్టు తరుముతారయ్యా హోమ్‌మినిస్టర్‌గారు" అన్నాడు అధికారి.

"సారీ సర్... పోనీ ఈ కేసు ఇంకెరికైనా అప్పగించండి సార్" అన్నాడు విక్రమ్. "అబ్బే



క్రిందపడకుండా యంత్రాశ్వంపై స్వారీ చేసే విధానాన్ని స్వయంగా చేసి చూపిస్తున్న కవెన్‌కీపె.

# యంత్రాశ్వపు స్వారీ మీరూ చేస్తారా ఓసారి?

నాగరిక యువతీ యువకుల గుర్రపుస్వారీ బులపాటం తీర్చడంకోసం క్వీన్స్‌లాండ్‌లోని టూవూంబే పట్టణంలో కవెన్‌కీపె అనే పెద్దమనిషి ఓ గమ్మత్తయిన యంత్రాన్ని తయారుచేశాడు. ఆ యంత్రం గుర్రంలా ఉండదు కానీ దానికి అమర్చిన సీటుమాత్రం అచ్చం గుర్రపు జీనులాగే ఉంటుంది. దానిమీద కూర్చుని మీట నొక్కితే చాలు కుదుపులు మొదలై గుర్రపుస్వారీ చేస్తున్న అనుభూతి కలుగుతుంది. అయితే ఈ యాంత్రికాశ్వపు కుదుపులు మామూలు గుర్రంకన్నా ఒకింత అధికస్థాయిలో ఉండడంతో రౌతులు దానిమీదనుంచి బిళ్లబీటుగా క్రిందపడిపోతున్నారట.

"ఇదేనా మీ సత్తా?" అనో లేకపోతే "దమ్ముంటే నా ఈ యాంత్రిక అశ్వంపై కిందపడకుండా స్వారీ చేయండి చూద్దాం" అనో కవెన్‌కీపె రెచ్చగొట్టడంతో పడినవాళ్లంతా లేచి దుమ్ము దులుపుకొని మళ్ళీ పట్టుదలగా యాంత్రికాశ్వాన్ని అధిరోహిస్తున్నారు. అయితే విజయం సాధిస్తున్నవారి సంఖ్య స్వల్పమే! అయినా సోగ్గాళ్ళూ, సొగసుగత్తెలూ దీన్నొక సవాలుగా తీసుకొని మళ్ళీ మళ్ళీ ప్రయత్నిస్తూ పట్టువదలని విక్రమార్కుడి వారసులమని నిరూపించుకుంటున్నారు. అశ్వారోహణకు తలకింత రుసుం చెల్లించుకునే నిబంధన కూడా ఉండడంతో కవెన్‌కీపె వ్యాపారం మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్థిల్లుతోంది.

కుర్రకారు అహాన్ని రెచ్చగొట్టి పబ్బం గడుపుకుంటున్న ఆ వ్యాపారి తెలివికి సంతోషిద్దామా? లేక అనవసరపు పట్టుదలకు పోయి చేతి చమురు వదిలించుకోడంతోపాటు, క్రిందపడి నడుములు విరక్కొట్టుకుంటున్న ఆ ఉడుకురక్తపు పిల్లకాయల మూర్ఖత్వానికి విచారిద్దామా?



యంత్రాశ్వపు కుదుపులకు ఆగలేక తలక్రిందులవుతున్న ఒకానొక యువకిశోరం.

# సచిత్ర విచిత్రం



"మైగాడ్... క్రిందపడేలా ఎగరేస్తోందే ఇది" యంత్రాశ్వపుధాటికి తట్టుకోలేక కేకలు పెడుతున్న యువతి.

నువ్వు చేయలేవని కాదోయ్. కాస్త తొరగా కానీ. ముందుగా ఎవడో ఒకణ్ణి లోపల తొయ్యి నాకు మాటరాకుండా చూడు. నువ్వూ మాటరాకుండా చూసుకో' అన్నాడాయన.

వీలైనంత త్వరలో ఏదో చేస్తానని చెప్పి సెల్యూట్‌చేసి బయటికొచ్చాడు విక్రమ్.



"బావుంది సార్ కథ. హీరోయిన్ ఎవరనుకుంటున్నారు?"

"కొత్తమ్మాయిని పెడదామనుకుంటున్నాం"

"కొత్తమ్మాయా? కొత్తవాళ్లతో రిస్కండీ... అంటే కొత్తవాళ్లను ఎంకరేజ్ చేయకూడదని కాదు. అలా అంటే ఒకప్పుడు నేనూ కొత్తవాణ్ణే కదండీ" నవ్వాడు 'కొంత హీరో'.

"కొత్తమ్మాయంటే కొత్తమ్మాయి కాదన్సార్. తెలుగు స్క్రీన్‌కు కొత్త. మలయాళంలో ఓ పిక్చర్‌లో చేసింది. హీరోయిన్ ఓరియంటెడ్ స్టోరీ. హండ్రెడ్ డేస్ నడిచేట్టుంది. ఫుల్స్ పోతూంది" వివరించాడు చక్రి.

"ఏం లేదన్సార్. ఇప్పుడు సినిమాలో నేనొక్కణ్ణే పెద్దవాణ్ణి. హీరోయిన్ కూడా తెలిసినదైతే బావుంటుంది. శోభా ఎలా వుంటుంది?"

శోభ పెద్ద హీరోయిన్ కిందేలెక్క. ఆమె రెమ్యునరేషన్ 4 దాకా వుంటుంది. అదీగాక కథకు కొత్త హీరోయిన్ అయితే బావుంటుందనుకున్నారు తామంతా" తమవంతు ఆలోచన సునిశితంగా వివరించాడు చక్రి.

"మేం కూడా శోభనే పెడదామనుకున్నాం. కానీ కథాపరంగా చిక్కులొస్తాయి. మీరైనా, శోభ అయినా ప్రేక్షకులకు బాగా తెలుసు. మీ ఇమేజెస్ మూలంగా ప్రేక్షకుల రెస్పాన్స్ బావుండదు. ఓ ఎస్టాబ్లిష్డ్ హీరో, ఓ ఎస్టాబ్లిష్డ్ హీరోయిన్ వున్నప్పుడు, ఈ హీరోయిన్ ఆయన్నిగాక మరొకర్ని ప్రేమిస్తే జనం ఒప్పుకోరు. శోభ హీరోయినై, పక్కనే వున్న మిమ్మల్నికాక మరొకర్ని అందునా కొత్త కుర్రాణ్ణి ప్రేమిస్తుందని వాళ్లనుకోరు. కానీ ఆ మురళిని ప్రేమిస్తుంది. ఆ పాత్ర కొత్త కుర్రాడో ఇంతవరకూ అంత పెద్దపాత్ర వేయని నటుడో వేస్తాడు. ప్రేక్షకులకు నచ్చదు. ఎస్టాబ్లిష్డ్ ఆర్టిస్టులున్నప్పుడు ఆర్టిస్టు సెలక్షన్ సరిగ్గా లేకపోతే చిక్కులొస్తాయి. ప్రేక్షకులు కొత్తవాళ్లల్లో పాత్రని చూస్తారుగానీ పాతవాళ్లల్లో ఆర్టిస్టునే చూస్తారు. అందుకే పెద్ద ఆర్టిస్టులను పెట్టుకున్నప్పుడు వాళ్లకున్న ఇమేజెను దృష్టిలో వుంచుకుని కథ తయారుచేసుకోవాలిగానీ దేన్నంటే దాన్ని వాళ్లతో తీయలేం.

మీరు ఈమధ్యేనే నటించిన సినిమా 'గంగాపురం రంగడు' అందుకే దెబ్బతింది. వసంతలాటి పెద్ద ఆర్టిస్టు ఊరూ పేరూ లేని సంతోష్‌ని ప్రేమిస్తుంది. మీరేమో వసంతను ప్రేమిస్తారు. మిమ్మల్ని కాదని ఆమె సంతోష్‌ని ప్రేమించటం ప్రేక్షకులు భరించలేకపోయారు. వాళ్లు పాత్రల్ని చూడరు. పాత్రధారుల్నే చూస్తారు"

"మీరన్నది కూడా నిజమే. పోనీ ఓ పనిచేస్తే? మురళి, విక్రమ్‌కి తమ్ముడని మార్చుకుంటే సరిపోతుందికదా? అన్నదమ్ములిద్దరూ ఒకే అమ్మాయిని ప్రేమించారు. తమ్ముడికోసం అన్న త్యాగం చేశాడు. అదీగాక తమ్ముడు దుర్మార్గుడు, అన్న మంచివాడు. తమ్ముడి హత్యకేసు అన్న పరిశోధించటం సెంటిమెంటల్‌గా కూడా బావుంటుంది..."

"కానీ మురళి, విక్రమ్ తమ్ముడైతే మాలినీ దేని దగ్గరే పెరుగుతాడా?"

"ఆమె హాబీ కూడా అన్నీ రెండేసి సమకూర్చుకోవడమేకదా? పైగా ఓసారి విక్రమ్ అంటాడుకదా, ఇద్దర్ని ఎందుకు పెంచుకోలేదని?"

"అందుకామె రియాక్షనిచ్చాం. దాని అర్థం ప్రేక్షకులకు తరవాత తెలిసింది. తనకో కూతురు కూడా వుందికదా, అందుకని పెంచుకోలేదన్నమాట. సరే, ఈ పాయింటు వదిలేద్దాం.





మురళి మాలిని పెంపుడు కొడుకైతే ఆమెను బ్లాక్‌మెయిల్ చేయటమెందుకు? ఎటూ అతనికీ ఆస్తిలో భాగం వస్తుందికదా?''

'కొండ హీరో' కాస్సేపు కొండలా తొణక్కుండా వుండిపోయాడు. అరనిమిషం ఆలోచించాడు. ఈ చిక్కుముడి ఎలా తేలుతుందాని ఆలోచిస్తూ చక్రి కూడా సిగరెట్ వెలిగించి, ఆలోచనలో పడిపోయాడు.

''మీరు సిగరెట్లు చాలా ఎక్కువగా కాలుస్తారు'' నవ్వు తెచ్చిపెట్టుకుంటూ అన్నాడు 'కొండహీరో'.

నేను నాలుగు లక్షలు తీసుకుంటున్న హీరోని. నువ్వు ఇంకా లక్ష రేంజ్‌కు కూడా చేరని రైటర్‌వి. ఒక్క సినిమా కూడా డైరెక్షన్ చేయలేదు. నాముందు సిగరెట్ తాగకుండా వుండి నాకు గౌరవం ఇవ్వొచ్చుకదా, అనే భావం కనిపించిందా మాటల్లో.

ఓసారీ టాపిక్ మిత్రుల దగ్గర కూడా వచ్చింది. అప్పుడు 'సిగరెట్ తాగటం నా అలవాటు. తనకంటే పెద్దవాడు తనముందు సిగరెట్ కాలిస్తే కిక్కురుమనని ప్రతివాడూ తనకన్నా చిన్నవాడని తాననుకుంటున్న వాడు కాలిస్తే బాధపడటం ఎందుకు? ఎవరు కాల్చినా సిగరెట్, సిగరెట్టే కదా. పైగా రేపు గంటలతరబడి వీళ్లతో పనిచేయాల్సి వచ్చినప్పుడు ఏంచేయాలి? అలవాటు మానుకోవచ్చనేది వేరే పాయింట్. అందుకే నేను ఇలాంటివన్నీ పట్టించుకోను. నా అసిస్టెంట్స్ చాటున సిగరెట్ కాలుస్తుంటే అంత అవసరంలేదని చెబుతుంటానుకదా అని వివరించాడు చక్రి. ఇప్పుడూ, ఆ హీరో మాటలు పట్టించుకోకుండా, నవ్వి ఊరుకున్నాడు.

కాస్సేపటికి 'కొండ హీరో' చిన్న గుహలాంటి నోరువిప్పాడు.

''పోనీ, అసలు విక్రమ్‌కూ మాలినీదేవికీ సంబంధమే లేకుంటే ఎలా వుంటుందంటారు. అంటే, మురళి, విక్రమ్‌లు అన్నదమ్ములు. విక్రమ్ ఇన్‌స్పెక్టరు. మురళి, జూలీకి క్లాస్ మేట్. అప్పుడు మీరనే చిక్కురాదుకదా?''

కాసేపు ఆలోచించి చెప్పాడు చక్రి

''మీరు కథ బావుందన్నారు. కథ బాలేదంటే ఈ పాయింట్లన్నీ ఆలోచిద్దాం. ఇప్పుడు మన ప్రాబ్లం హీరోయిన్‌గా శోభను వేసుకోవచ్చా లేదా అనేదిఅంచేతదీని గురించి ఆలోచిద్దాం''

ఏమనాలో తోచక, తోచింది చెప్పాడు 'కొండ హీరో'.

''కరెక్టే. శోభను హీరోయిన్‌గా వేసుకుని ఎలావుంటే బావుంటుందో చెప్పండి. అలాగే, ఆ డేవిడ్ కేరెక్టర్ తీసేస్తే బావుంటుంది. మరీ హీరోయిన్ కోసం పోటీ ఎక్కువయింది. అలాగే మురళిని జూలీ ప్రేమించినట్టుగాక మరోరకం చేయవచ్చు. మురళి, జూలీని ప్రేమించాడు గానీ జూలీ, మురళిని ప్రేమించలేదు. ఆమె నన్నే ప్రేమిస్తుంది. నేనూ, ఆమెను ప్రేమిస్తాను. మురళి, మాలినికి ఎస్టేట్ మేనేజర్. ఆమె దగ్గర వినయంగా వుంటూ ఆమె అభిమానం సంపాదించాడు. ఆమె రహస్యం తెలుసుకుని జూలీని పెళ్లి చేసుకుని ఆస్తంతా కొట్టేయాలనుకున్నాడు. కానీ జూలీ తనను ప్రేమించటంలేదు. ఓరోజు ఆ అమ్మాయిని రేప్ చేశాడు. అప్పుడు విక్రమ్ పోలీస్ ట్రయినింగ్‌లో వున్నాడు. విధిలేక జూలీ, మురళిని పెళ్ళి చేసుకుంది. జూలీ గురించి కలలు కంటూ వచ్చిన విక్రమ్, ఊళ్లోకి రాగానే చంకలో బాబుతో, పక్కన మురళితో వున్న తన ప్రియురాలిని చూసి షాక్ తింటాడు. ఇదెందుకు జరిగిందనేది, తర్వాత ఫ్లాష్‌బ్యాక్‌లో చెప్పిస్తాం. అప్పటిదాకా ప్రేక్షకులకు థ్రిల్లింగ్‌గా వుంటుంది. మీరన్న ప్రతి పాయింటూ వస్తుంది. శోభ హీరోయిన్ అయితే చిక్కుండదు. ఆలోచించండి. మనం మళ్లీ కలుద్దాం''

* * *

''జూలీని కాదు, ఓ నీగ్రోనే తెచ్చి వీణ్ణి రేప్ చేయించాలి. అది అమెరికా నీగ్రో అయితే, ఎయిడ్స్ వచ్చి చస్తాడు నా కొడుకు'' కసిగా అన్నాడు గోవిందు.

''జూలీ/కేరెక్టర్ శోభ వేస్తే కథ మార్పుకుండా బావుండదా చక్రీ?'' ప్రశ్నించాడు లక్ష్మణకుమార్.

''ఇవన్నీ మనం ముందు అనుకున్నాం.

మీకో ఉదాహరణ చెబుతాను. అప్పట్లో ఓ పెద్ద దర్శకుడో, నిర్మాతో సరిగ్గా గుర్తులేదు. ఓ సినిమా కథ విన్నాట్ట. ఆరో రీల్లో హీరోయిన్



హీరోని ప్రేమిస్తుంది.

'నాగేశ్వర్రావ్‌ని సావిత్రి ప్రేమించటానికి ఆరు రీళ్ళెందుకయ్యా? మొదటి రీల్లోనే వాళ్లెలాగూ ప్రేమించుకుంటారని ప్రేక్షకుడికి తెలును. దానికిన్ని కష్టాలెందుకూ'- అన్నాట్టాయన.

ఎస్టాబ్లిష్డ్ ఆర్టిస్టులతో తీస్తున్నప్పుడు జాగ్రత్తగా వుండాలి. ఓ తెలిసిన హీరోయిన్, పక్కనో తెలిసిన హీరో వుండగా మరొకర్ని ప్రేమిస్తే ప్రేక్షకుడికి తృప్తిగా వుండదు. అంతేకాదు, వీడెలాగూ మధ్యలో ఏదో అవుతాడు. లేకపోతే, మన హీరో వున్నదెందుకు అని కూడా ఊహించేస్తారు.

ఎప్పుడూ ఒక సస్పెన్స్‌ని ప్రేక్షకుడు పసిగట్టడానికన్నా ముందుగా మనమే చెప్పాలి. లేకుంటే చూస్తున్నవాడికి జరుగబోయేదంతా ముందుగా తెలిసిపోతూ, ఇంటరెస్టింగ్‌గా వుండదు. అలాగే కొన్ని సస్పెన్స్‌లు చాలా ముందుగా చెప్పేయటంవల్ల తరవాత కథలో ఏ పాయింటూ లేక బలహీనపడుతుంది.

కొన్ని సస్పెన్సులు ప్రేక్షకుడికి ముందుగా చెప్పి, పాత్రలకు తరవాత చెప్పాలి. ఉదాహరణకు ఓ దొంగ, ఓ పోలీస్ ఇద్దరూ అన్నదమ్ములు. కానీ తాము అన్నదమ్ములమని వాళ్లకు తెలియదు. ప్రేక్షకులకు తెలుసు. చూసేవాడికి చాలా థ్రిల్లింగ్‌గా వుంటుందిది.

అలాగే కొన్ని ప్రేక్షకులక్కూడా చెప్పకూడదు. ఉదాహరణకు ఇదే అన్నదమ్ములు చివరికి ఒకటై, ఇద్దరూ ఒక దారిలోకి వస్తారనుకుందాం. దొంగ దారిలోకి పోలీసో, పోలీస్ దారిలోకి దొంగో. అలాంటప్పుడు ఆ ఆలోచన ఆ పాత్రకు వున్నదనే విషయం ముందుగా ప్రేక్షకుడికి ఏమాత్రం లీక్ చేసినా పట్టుతప్పుతుంది.

అలాగే మరికొన్ని సస్పెన్సులు... 'ప్రతిఘటన'లో విజయశాంతి చివరకు ఏంచేయాలనుకుంటూంది, 'అన్వేషణ'లో హంతకుడెవరు లాంటివి.

అలాగే మన కథలో కూడా ప్రేక్షకుడికి కొన్ని చెబుతాం. కొన్ని చెప్పం. కొన్ని విషయాలు కొన్ని పాత్రలకు తెలుసు. కొన్ని పాత్రలకు తెలియదు.

మన కథలో అంతా తెలిసున్న ఆర్టిస్టులనుకుందాం. 'కొండ హీరో, శోభ, మురళి పాత్రకు ఓ యంగ్ విలన్. అప్పుడేమవుతుంది? శోభ, మురళిని పెళ్లి చేసుకోగానే మనం చెప్పకుండానే తెలిసిపోతుంది, అది నిలిచే పెళ్లికాదని. పక్కన 'కొండ హీరో వున్నాడు గనుక ఏదో జరుగుతుందని ముందుగానే అర్థమవుతుంది. ఇక మూడు గంటలు మనం చూపించటమెందుకు?''

''అవును బాసూ... ఈ విషయాలన్ని ఎవరాలోచించాలి?''

''ముఖ్యంగా డైరెక్టర్, తరవాత ప్రొడ్యూసర్. అవకతవకల సినిమా ముందుగా అమ్మేసుకుంటే ప్రొడ్యూసర్ నష్టపోడు. డైరెక్టర్‌కు చెడ్డపేరొస్తుంది. అలాగే ఆ ప్రొడ్యూసర్ రెండో సినిమాకు బయ్యర్స్ ముందుకు రాకపోవచ్చు. ఓసారి ఆయన సినిమాతో నష్టపోయారు గనుక''

''ఏది ముందు చెప్పాలి? ఏది తరవాత? ఏ కేరెక్టర్ ఏ నటుడు వేయాలి? ఇలాంటివన్నీ ఎలా తెలుస్తాయి? అసలు ప్రేక్షకుడు ఏ సినిమా ఎందుకు చూడడో, ఎందుకు చూస్తాడో చెప్పలేం. ఓ భాషలో హిట్ అయిన సినిమా మరో భాషలో ఫెయిల్ అవుతుంది. ఎందుకు? 'పుదియపాదై' తమిళంలో పెద్దహిట్టు. 'యముడే నా మొగుడు' అని తెలుగులో తీస్తే అంత హిట్ కాలేదు. 'ప్రేమపావురాలు' తెలుగులో హిట్ అయినా, నైజాంలోకన్నా ఆంధ్రాలో బాగా నడిచింది. తమిళంలో దెబ్బతింది. అదే 'పీపుల్స్ ఎన్‌కౌంటర్' నైజాంలో నడిచింది. మిగతాచోట్ల నడవలేదు. అందుకే ఈ తర్కాలన్నిటికన్నా అదృష్టంమీద ఆధారపడి, ఆ సమయంలో కలిసొచ్చిన పరిస్థితుల్ని బట్టి తీసేసుకోవటం బెటరండీ''

శ్రీరామచంద్రుడిలో నైరాశ్యం ఆవహించిందని అర్థమయింది చక్రికి. రెండు నెలలుగా పరిస్థితులు అలాగే వున్నాయి. పెద్ద హీరో అయితే ఆయన చెప్పినట్టు వినాలి. కాదని వాదించటానికి తమకు అంతకు ముందు సక్సెస్‌లేమీ లేవు. స్కోర్‌బోర్డ్ నిల్ కనుక అలాగే వుంటుంది. వాళ్ల సలహాలు వినకుంటే వాళ్ళు సినిమా చెయ్యరు. వాళ్ళు





# ఏరిన ముత్యాలు

★ ప్రాచీన శిథిలాలు, శిల్పాలు అంటే నాకిష్టం. ఆ మార్గాలలోనే మనం నడుస్తామని కాదు. గత చరిత్రలో ఏదో ఒక చిన్న సంఘటన మనల్ని ప్రభావితం చేయవచ్చు.

— జాన్‌వెబ్స్టర్

★ చరిత్ర అంటే అందరూ అంగీకరించిన కట్టుకథ.

— నెపోలియన్

★ చరిత్రలోని ఖాళీపుటలే మానవజాతికి స్వర్ణయుగం.

— ఎల్.వి. రాంకే

★ వాస్తవంగా చరిత్ర అనేది మానవుల నేరాలు, మూర్ఖత్వం, దౌర్భాగ్యం తప్ప మరేమీ కాదు.

— గిబ్బన్

★ గడిచిపోయిన రాజకీయాలే చరిత్ర. వర్తమాన చరిత్రే రాజకీయాలు.

— సీలీ

★ తగిన వ్యాయామం, ఉద్రేకాలను అదుపుచేసుకోవడం, శుభ్రమైన గాలి, కావల సినంత విశ్రాంతి- వీటిని మించిన వైద్యుడుండడు.

-పోప్

★ శత్రువుల నుండి తప్పించుకోవచ్చు. కాని చేసిన దుర్మార్గం నిన్ను నిరంతరం వేటాడుతూనే ఉంటుంది.

— తిరుక్కురల్

★ చెడు తరచు గెలుస్తుంది. కాని విజయం సాధించలేదు.

— జోసెఫ్‌రేక్స్

★ మరొకరు శాసించిన మార్గాన వెళ్లి మంచిని తెలుసుకోవడంకంటె ఎవరికి నచ్చిన తోవలో వారు వెళ్లి చెడును తెలుసుకోవడమే శ్రేయస్సు.

— డాస్టోవిస్కీ

★ ఆదరాబాదరా రాసే సాహిత్యం- జర్నలిజం.

— మాథ్యూఆర్నాల్డ్

★ చూడకముందే ఏ పదార్థాన్నీ భుజించకు.

★ బహిరంగంగా కనిపించే మురికి గుంటలకన్నా మనసులో మాలిన్యంకల వ్యక్తులే జాతికి ఎక్కువ ప్రమాదం.

— సర్వేపల్లి రాధాకృష్ణన్

★ నిజంగా మహనీయులనదగినవారు ఎంత ఎక్కువగా ఉంటే ఆ జాతి అంతగొప్పది.

— సింక్లేర్ లీవిస్

★ పొరుగువాణ్ణి ఒకణ్ణి ప్రేమించడంకంటే మానవజాతినంతనూ ప్రేమించడం తేలిక.

— ఎరిక్‌హూవర్

సేకరణ: **నల్లబెల్లి శ్రీమన్నారాయణ**

చెయ్యమంటే చిన్నవాళ్లతో తీసుకుంటే ఫైనాన్స్ రాదు. బిజినెస్ కాదు. ఇలాంటి పరిస్థితుల్లో తన మార్గం తప్పనే అనుకుంటాడు సామాన్యుడు. అదృష్టాలమీద ఆధారపడతాడు. తనపైన తనకు విశ్వాసం వున్నవాడు నిరాశలను మెట్లుగా చేసుకుని పైకి వెళ్లటానికి మరింత దృఢంగా నిలబడతాడు, సడలిపోకుండా. శ్రీరామచంద్రుడిలోని నిరాశను పారదోలటంతో పాటు అతనడిగిన ప్రశ్నలకూ జవాబివ్వటానికి పూనుకున్నాడు చక్రి.

"సార్... అదృష్టమే ముఖ్యమనుకునేవాడు వ్యాపారం చేయకూడదు. లాటరీటిక్కెట్లు కొనుక్కోవాలి. రేసులాడాలి. సినిమా వ్యాపారం రేసుల్లాంటిదే అని కొందరంటారు. అది తప్పు. కష్టనష్టాలు ప్రతీ వ్యాపారంలోనూ వుంటాయి. అనుకోని అవాంతరాలు ప్రతిరంగంలోనూ వస్తాయి. మన నైజాన్ని బట్టీ, అనుభవాన్ని బట్టీ విశ్లేషిస్తూ వుంటాం. జీవితంలో పొరపాటు చేయనివాడు ఏమీ సాధించలేడన్నమాట అని ఓ సామెత వుంది. పొరపాటు, అపజయం అనేవి సినిమాల్లో కూడా అంతే. తప్పుడు అంచనాతో, తప్పుడు ఆలోచనతో ఓసారి దెబ్బ తిన్నవాడు దాన్ని సరిగ్గా విశ్లేషించుకుంటే, నిజాయితీగా తను చేసిన తప్పును గుర్తించుకుంటే మరోసారి అపజయం పొందే అవకాశం తగ్గుతుంది.

ప్రత్యేకించి కొన్ని సినిమాలు విజయవంతమవుతాయి. కొన్ని ఫ్లాపవుతాయి. ఎందుకంటే సినిమా. సైకాలజీకి సంబంధించినది. ప్రేక్షకుడి మనసుమీద అది కలిగించే ప్రభావం ఎలా వుంటుందనేదానిపైన ఆధారపడి అది విజయవంతమవుతుంది. ఒక మంచి సినిమా, అంటే, విజయవంతమవుతుందనుకున్న సినిమా అపజయం పొందితే అందుకు కొన్ని వేరే కారణాలు కూడా వుంటాయి.

తుపాను, వర్షాల మూలంగా, కర్ఫ్యూ మూలంగా దెబ్బతిన్న సినిమాలున్నాయి. ఒక చిన్న సినిమా, అదే సమయంలో పెద్ద సినిమాలు వచ్చిన మూలంగా ఫెయిల్ కావచ్చు. పెద్ద సినిమాతోపాటు విడుదలై, అవేవీ బాగా లేనందువల్ల విజయవంతమైన చిన్న సినిమాలు కూడా కొన్నున్నాయి.

సరైన పబ్లిసిటీ లేకపోవటం కొన్నింటికి కారణమైతే, పబ్లిసిటీ ఎక్కువై ఫెయిలైన సినిమాలు కొన్నున్నాయి. ప్రేక్షకులు ఎంతో ఊహించుకుని థియేటర్‌కు వెళ్లి, తమ ఊహలకు రవ్వంత భిన్నంగా అనిపించినా పెద్దగా నిరాశ చెందుతారు, అనవసరమైన పబ్లిసిటీ వల్ల.

ప్రేక్షకులు తమకు తాము పెట్టుకునే ఆశలు కొన్నుంటాయి. ఉదాహరణకు 'శివ' తరవాత 'క్షణక్షణం', 'దసరాబుల్లోడు' తరవాత 'బంగారుబాబు'. ఆయా దర్శకుల మొదటి సినిమా అనుకోనంత విజయం సాధించటంతో ప్రేక్షకులు తమకుతామే అంతకన్నా రెండో సినిమా చాలా బాగా వుంటుందని ఆశలు పెట్టుకుంటారు. అదృష్టవశాత్తూ 'బంగారుబాబు' వారి అంచనాలకు దగ్గర్లో వుండి హిట్ అయింది. 'క్షణక్షణం' విషయం మనకింకా తెలీదు.

అలాగే సరైన సమయంలో విడుదల కాకపోవటంవలన కొన్ని సినిమాలు దెబ్బతింటాయి. ఒక మాదిరిగా నడిచిన 'ఉద్యమం' సినిమా, రెండు నెలలు ముందుగా అంటే యాంటీ రిజర్వేషన్ మూమెంట్ ఉధృతంగా ఉన్నప్పుడు వచ్చివుంటే మరింత విజయవంతమయ్యేది.

దాదాపు అలాంటి సబ్జెక్ట్‌తోనే వచ్చిన మరో సినిమా అంతకు ముందుగానే వచ్చి విజయవంతం కావటంవల్ల ఫెయిలయ్యేవి కొన్ని.

ఇక ప్రాంతాల భేదాలు. 'పుదియపాదై' తమిళంలో హిట్టు. తెలుగు డబ్బింగ్ ఎందుకు నడవలేదు. 'పుదియపాదై' తమిళంలో హిట్ కావడానికి ముఖ్య కారణం నేటివిటీ. మాస్ జనం. అంటే చదువుకోనివాళ్లు, కాయకష్టంతో బతికేవాళ్లు మాట్లాడుకునే ప్రత్యేకమైన భాష, వాళ్లలో అలవాటుగా వున్న ప్రయోగాలు, జాతీయాలతో నిండివుంది ఆ సినిమా. అందుకే మామూలు ప్రేక్షకుడికి దగ్గరగా అనిపించింది. అవే సంభాషణలు తెలుగులో అనుసరిస్తే బాగుండేది. కానీ 'యముడే నా మొగుడు'లో వాటిని అనువదించాల్సివచ్చింది, డబ్బింగ్ సినిమా కనుక. మరో కా





రణం మన నేటివిటీకి దూరంగా వుండటం. అటు సంభాషణలూ, ఇటు వాతావరణం రెండూ తెలుగువాళ్లకు సంబంధించినవి కావు. పైగా టైటిల్ ఒక డిసడ్వాంటేజ్. ఇదే సబ్జెక్ట్ రీమేక్ చేస్తే, జాగ్రత్తగా చేస్తే నడిచేదేమో.

'తూర్పు వెళ్ళే రైలు' రీమేక్ చేసినా తెలుగులో విజయవంతం కాకపోవటానికి కారణం అందులో చూపించిన ఆచారం మనది కాదు. అందువల్ల అది కల్పనగా అనిపించింది. ప్రేక్షకుడి దగ్గరికి వెళ్లలేదు.

'ప్రేమపావురాలు' వచ్చేనాటికి తెలుగువాళ్లకు ప్రేమకథల సీజన్ లేదు. మనవాళ్లు క్రైంలోనూ, రాజకీయాల్లోనూ వున్నారు. ఈ మూసలో వున్న ప్రేక్షకుడికి మనసుకు హాయిగా అనిపించటంవల్లనే 'గీతాంజలి' విజయవంతమయింది. 'ప్రేమపావురాలు' విజయవంతమయింది. 'ప్రేమఖైదీ' విజయవంతమైంది. మళ్లీ వచ్చే ప్రేమ కథాచిత్రాలన్నీ అంత సులువుగా విజయవంతం కాకపోవచ్చు. అలాగే 'ప్రేమపావురాలు' నైజాంలోకన్నా ఆంధ్రాలో మరింత బాగా నడవటానికి కారణం, దాని మాతృక 'మైనే ప్యార్‌కియా' అంతకుముందే నైజాంలో విజయవంతంగా నడిచింది. అయినా నైజాంలో కూడా, చాలా తెలుగు సినిమాలకన్నా బాగా నడిచిందీ డబ్బింగ్ చిత్రం. ఇదే 'ప్రేమపావురాలు' తమిళంలో అంత విజయవంతం కాకపోవటానికి కారణం అప్పటికే తమిళంలో ప్రేమకథాచిత్రాలు వస్తున్నాయి. డబ్బింగ్ జాగ్రత్తగా చేయకపోవటం కూడా ఓ కారణమని ఓ ప్రముఖుడన్నారు. బహుశా అదీ ఓ కారణం కావచ్చు.

అంచేత సినిమా తీయటం అనేది అదృష్టంమీద ఆధారపడిన వ్యాపారం కాదు. షేర్స్, అంచనాల్లాగా, ప్రతీ విషయాన్ని జాగ్రత్తగా పరిశీలించాలి. అయినా మన చేతుల్లో లేని కొన్ని కారణాలవల్ల సినిమా అపజయం పొందితే నిరాశపడనవసరంలేదు. తోపుడు బండిమీద సీజనల్ వ్యాపారం చేసే వ్యాపారి లాంటి సామాన్యుడు ఎన్నో ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి? మల్లెపూలెప్పుడమ్మాలి, ఉల్లిపాయలెప్పుడమ్మాలి, ఏ ఏరియాలో వు౦శే ప్రజలకు ఏ ధర చెప్పాలి, ఎలాంటి సరుకు ఏ వీధిలో అమ్మాలి ఇన్ని తెలియాలి. అయినా వాళ్లూ ఓసారి నష్టపోతుంటారు.

సినిమా మరెన్నో ఆలోచించాల్సిన విషయం. ఏపాత్ర ప్రభావం ఏమిటి? ఏ పాత్రను ఏ నటుడు పోషించాలి? ఏ విషయాన్ని ప్రేక్షకుడు ఎలా రిసీవ్ చేసుకుంటాడు? ఇలాంటి ఎన్నో విషయాలు ఆలోచించాలి. ఎందుకంటే ముందే చెప్పినట్టుగా ఇది ప్రజల మనస్తత్వాలలో ఆడే ఆట. అంతేగానీ లాటరీ కాదు మరి'' ముగించాడు చక్రి.

''చంపావు బానూ. పెద్ద ప్రైవేట్ క్లాసు తీసుకున్నావు''

''ప్రైవేటు క్లాసేం ఖర్మ. అసలు నిర్మాతకు పూర్తికోర్సే వుండాలని మీరు మొదలెట్టినప్పుడే చెప్పానుగదా. సాధారణంగా డబ్బుల విషయమే నిర్మాత చూసుకోవాలనుకోవటం తప్పు. నన్నడిగితే నిర్మాతకు స్క్రిప్టంతా కంఠతా వచ్చుండాలి. కథ ప్రజెంటేషన్‌లో డైరెక్టర్‌కు కమాండ్ వుండాలనేది కరెక్టే కానీ, నిర్మాత కాలుపెట్టకూడదనేది పొరపాటు. మన కథలో ఏ పాత్ర ప్రయోజనం ఏమిటి? ఏ సీను ఎందుకని వుంది? ఏపాత్ర ఎలాంటి నటుడు ఎందుకు వేయాలి? ఇలాంటివన్నీ ఎప్పుడో చర్చించుకున్నాం. పోనీ శోభనే హీరోయిన్‌గా పెడదామనీ అసలు మన చేతిలో ఏముందనీ అనటంతో మరోసారి చెప్పాల్సొచ్చింది''

''నిజమే బానూ. రెణ్ణెల్లుగా తిరిగీ తిరిగీ వినుగొచ్చి అలా అన్నాను. ఔను బానూ, నువ్వసలు ఎవరి దగ్గరా అసిస్టెంటుగా పనిచేయలేదు. సెట్టుమీదకొచ్చింది ఒక్క సినిమాకే. అక్కడా నీ సీన్లు నువ్వు రాసుకోవటంతోనే సరిపోయిందిగానీ నువ్వు నేర్చుకున్నదేమీ లేదు. మరి ఇవన్నీ నీకు ఎలా తెలుసు?''

''ఎలా తెలుసు అని సందేహమా, అసలేమైనా తెలుసా, లేదా అని అనుమానమా?'' నవ్వుతూ అన్నాడు చక్రి.

''నేర్చుకోవేయ్. నీ డైలాగ్‌రైటర్ తెలివి ఇక్కడ కాదుగానీ ముందుగా చెప్పు''

''దీనికి ఒక మాటలో సమాధానం చెప్పాలంటే ఒక ప్రఖ్యాత దర్శకుని మాటల్లో-

అసలు నేర్చుకునేదేం లేదు.



'నా శిష్యులమని ఎవరైనా చెప్పుకుంటే అది కేవలం గౌరవభావంతోనే తప్ప నిజానికి మేం నేర్పేదేమీ వుండదు. అసలు వాళ్ళకు నేర్చుకునే సమయమే దొరకదు' అన్నారాయన ఓసారి.

ఇక నా గురించి చెప్పాలంటే. కాస్త వివరంగా చెబుతాను. ఓ సినిమా దర్శకుడు ఓ పత్రికా సంపాదకుడిలాంటివాడు, ఒక్క విషయంలో తప్ప. సంపాదకుడు తన పత్రికను చదివించే విధంగా తీర్చిదిద్దితే, దర్శకుడు తన సినిమాను చూడగలిగే విధంగా తీర్చిదిద్దుతాడు. అదొక్కటే తేడా. గట్టిగా మాట్లాడితే సంపాదకుడిక్కూడా విజువల్ సెన్స్ వుండాలి. పత్రిక గెటప్, వ్యాసాల్లో ఫొటోలు, కథలకు వేసే బొమ్మలు, లేఔట్ యిలాంటి వన్నీ కంటికింపుగా తీర్చిదిద్దినపుడే పత్రికమీద ఆకర్షణ పెరుగుతుంది. ఓ పత్రికా సంపాదకుడు తన పత్రికలోని వివిధ రచనల్ని తన శైలికి అనుగుణంగా మలుచుకుని, ఆర్టిస్టుతో అందుకనువైన బొమ్మలు గీయించి, ప్రింటింగ్‌లో అక్షరాల సైజుల్ని నిర్దేశించి, వరుస క్రమాన్ని ఏర్పరిచి, మిగతా పత్రికలకన్నా తన పత్రిక బాగా వుండటానికెలా శ్రమిస్తాడో ఓ సినిమా దర్శకుడూ అలాగే శ్రమిస్తాడు.

కథకుడితో మంచి కథ రాయించి, దాన్ని ఒక క్రమంలో పేర్చుకుని సన్నివేశాల కనుగుణమైన సంభాషణలు రాయించి, మ్యూజిక్ డైరెక్టర్‌తో తన ఆలోచనలకనుగుణమైన ట్యూన్లు కట్టించి, పాటల రచయితతో తన భావాలకనుగుణమైన పాటలు రాయించి, కెమెరామన్‌తో తన ఊహలకనువైన దృశ్యాలను మలుచుకుని, నటీనటుల్తో తన కవసరమైన భావాలు రప్పించుకుని, యిలా ప్రతీ రంగంనుండి తన కనుగుణమైన విధంగా పనుల్ని రాబట్టుకుని సమన్వయ పరిచి, దానికి సంపాదకునికన్నా అదనంగా మరోపని సృజనాత్మక రూపకల్పనను జోడించి సినిమా రూపొందిస్తాడు. ఓ సంపాదకుడు తన ఆలోచనలన్నీ ఎక్కడ నేర్చుకుంటాడో ఓ సినిమా దర్శకుడూ అక్కడే నేర్చుకుంటాడు.

ప్రతి పండితుడూ మంచికవి కాలేక పోవచ్చుగానీ, మంచికవి కావాలనుకున్న వాడు పండితుడు కానవసరంలేదు. అయితే కవి, పండితుడైనప్పుడు అది అదనపు అర్హత అవుతుంది. పాండిత్యం నేర్చుకుంటే అబ్బేది. కవిత్వం సహజమైనది. అంటే ఉదాహరణకు 'చంపకమాల' ఛందస్సు తెలిసినంత మాత్రాన కవిత్వం రాయాలనిలేదు. కవిత్వం రాయాలనుకున్నవాడికి ఛందస్సు తెలియక పోయినా తన కవిత్వాన్ని మరో విధంగా రాయగలడు. అలాగే ఓ దర్శకుడి దగ్గర నుంచి నేర్చుకోగలిగింది కేవలం సాంకేతికమైన విషయాలే.

క్లాస్ ఎందుకు, క్లోజ్‌షాట్ అంటే ఏంటి, క్రేన్ షాట్ అంటే ఏంటి, బ్యాక్ లైటింగ్ అంటే ఏంటి- ఇలాంటివి మాత్రమే. ఇవన్నీ తెలియక పోయినా సినిమా తీయవచ్చు.

'ఉదాహరణకు ప్యానింగ్‌కీ, ట్రావెల్ షాట్‌కీ తేడావుంది. ఆపేర్లు తెలీని దర్శకుడున్నాడనుకుందాం. ఎలా చెబుతాడు...

హీరో నిలుచుని, నడిచి వెళుతున్న హీరోయిన్ని చూస్తున్నాడు. ఇది ప్యాన్ షాట్‌లో తీయాలి. అతనికా పేరు తెలియదు. అప్పుడు కెమేరాను కదలకుండా వుంచి, హీరోయిన్ వెంట తిప్పండి అని కెమెరామన్‌కు చెబుతాడు.

అదే హీరోయిన్ వెంట హీరో వెళుతుంటే, దాన్ని ట్రావెల్ షాట్‌లో తీయాలనుకున్నాడనుకుందాం.

ముందు హీరోయినూ, ఆ వెనుక హీరో, వీళ్ళిద్దరి వెనకా కెమెరా అలా వెళుతుంటారు అని చెబుతాడు.

ఆ దర్శకుడూ, కెమెరామన్‌ల సంభాషణ యిలా వుంటుంది.

'అమ్మాయి ముఖం మాత్రమే కనిపించాలండీ'

'అంటే క్లోజ్‌షాటా సార్, ఇలా సరిపోతుందా?'

'లేదండీ, యింకా తక్కువ కనిపించాలి. అమ్మాయి ముఖం మాత్రమే వుండాలి'

'అంటే టైట్ క్లోజ్ సార్?'

మరోసారి దానిపేరు 'టైట్‌క్లోజ్' అని చెప్పేయగలడతను. మూణ్ణాలుగు రోజులు ఇబ్బంది




గావుంటుంది. అదే, ఈ పేర్లన్నీ తెలిసిన కెమెరా అసిస్టెంట్లెందరో వున్నారు. అందులో కొందరే దర్శకులు కాగలుగుతున్నారెందుకని? కావలసింది సృజనాత్మకత.

ఒక సినిమా చూడటం యిందులో దర్శకుడు చెప్పదలుచుకున్నదేమిటి? దాన్నెలా చెప్పాడు? ప్రేక్షకుల ప్రతి స్పందన ఎలావుంది? ఇది ప్రజెంటేషన్. దీన్నే కొందరు ట్రీట్‌మెంట్ అంటారు.

ఇక సీన్లు... ఏ సీన్ తరవాత ఏ సీన్‌వుంది? ఎందుకలా వుంది? అలా వుండటం వల్ల లాభమేమిటి? నష్టమేమిటి? ఏయే సీన్‌ను ఎలా ప్రారంభించారు? ఎలా ముగించారు? ఆయాసీన్లు కథకు ఎక్కడ ఎలా ఉపయోగపడ్డాయి? దీన్ని 'స్క్రీన్‌ప్లే' అంటారు.

ఇదే నాటకంలో అయితే 'స్టేజ్‌ప్లే' అవుతుంది. స్క్రీన్‌ప్లేకూ, స్టేజ్‌ప్లేకూ తేడా తెలియక పోవటంవల్ల కూడా ఒక్కోసారి ప్రేక్షకులు సరిగ్గా రిసీవ్ చేసుకోరు.

ఇక టేకింగ్. కొంతమంది యిదే డైరెక్షనాఫ్ ఫొటోగ్రఫీ అనుకుంటారు. కానీ కాదు. ఇదే అసలైన డైరెక్షన్. ఒక సీనును కొన్ని ముక్కలుగా విభజించుతారు. ఇవే షాట్స్. నాటకం జరుగుతున్న స్టేజీ ముందు కెమెరా పెట్టినట్టుండకుండా వుండడానికి, అంటే నాటకంలో కన్నా మరింత ఎఫెక్టివ్‌గా చూపించటానికి సీన్స్‌ని షాట్స్‌గా విభజిస్తారు.

ఈ సీన్‌లో ఎవరు, ఎవరితో ఏమన్నారు? ఎవరెవరు ఏం చేశారు? ఈ సీన్ హీరో, అంటే ఆ సీను వరకూ ముఖ్య పాత్ర ఎవరు? అతనికీ సీన్‌లో ఏం జరుగుతుంది, లేదా అతనేం చేస్తాడు? ఆయా పనుల్లో దేన్ని చూపించటానికి ఏ షాట్ వాడాడీ దర్శకుడు? అది ఎంత వరకు మనసుకు హత్తుకుంది? ఇది ముఖ్యమైన భాగం. దీన్లో ఆ షాట్‌లో ఎవరుంటారు. ఎక్కడుంటారు, ఏం చేస్తారు లాంటివి దర్శకుడు చెప్పి, అది ఎలా కనిపించాలో వివరించి, దాని మూడ్‌ను విశదీకరిస్తే, కెమెరామన్ అందుకనువైన కోణంలో, అవసరమైన లైటింగ్ ఏర్పాటు చేసి, దాన్ని దర్శకుని సూచనల మేరకు చిత్రీకరిస్తాడు.

అంటే ప్రతీ సినిమా ఒకపాఠం. ప్రతీ దర్శకుడూ ఒక గురువు. విజయవంతమైనదైనా అంతే, తలకిందులైనదైనా అంతే. అంటే దర్శకుడు కావాలనుకున్నవాడు స్టూడియోలో కెమెరా వెనుక నేర్చుకునే దానికన్నా థియేటర్‌లో తెరముందు నేర్చుకునేది ఎక్కువ. నేనూ అలాగే నేర్చుకున్నాను.

ఎవరి దగ్గరా పనిచేయకుండా నేరుగా దర్శకులైన వారితో ప్రఖ్యాత దర్శకుడు బాపు ఒకరు. దర్శకుడికి కావాల్సింది విజువల్ సెన్స్. ఒక సీను ఎలా చూపిస్తే మనసుకు హత్తుకుంటుంది, ఎలా చెబితే తన భావాన్ని ప్రేక్షకుడికి సరిగ్గా చెప్పగలనూ అనేది ముఖ్యమైనది. అంటే యిక్కడ పత్రికా సంపాదకుని కంటే మరో అదనపు అర్హత సినిమా దర్శకుడికుండాలి. అదే, తానూ రచయిత కావటం. కాకపోతే మామూలు రచయిత పెన్నుతో పేపర్ మీద రాస్తే దర్శకుడు కెమెరాతో సెల్యులాయిడ్ మీద రాస్తాడని అన్నాడో దర్శకుడు. అది నిజం."

'మరి యాంగిల్సూ, ట్రిమ్మింగ్‌లూ అన్నీ దర్శకుడే చేస్తే ఎడిటర్ ఏంచేస్తాడు? డైరెక్టర్ తీసిన ముక్కల్ని అతికించటమేనా?"

"మంచి ప్రశ్నే... ఓ గొప్ప దర్శకుడి దగ్గర కూడా ఓ మంచి ఎడిటరేం చేసి, తన సృజనాత్మకతను చూపిస్తాడనేందుకు చిన్న ఉదాహరణ చెబుతాను.

'అంతులేని కథ' సినిమాలో తిలక్ యిచ్చిన ఉత్తరాన్ని జాకెట్లో దాచుకుంటుంది శ్రీప్రియ. అప్పుడే ఆమె అక్క జయప్రద వచ్చి చెల్లెలిలో కంగారు కనిపెడుతుంది. ఏమిటా అని చూస్తే జాకెట్లోంచి ఉత్తరం కనిపిస్తుంది. ఆ ఉత్తరం మీద 'తిలక్' అనే తన ప్రియుడి పేరు చూసి ఆమె తెల్లబోతుంది.

ఈ సీన్‌ని దర్శకుడు యిలా తీశాడు చెల్లెలి వైపు చూసిన జయప్రద కనుబొమలు ముడిచి ఏమిటా అని చూసి, ఆశ్చర్యంగా కనుబొమ్మల్ని పైకంది. ఇదో షాట్. శ్రీప్రియ జాకెట్లోంచి ఉత్తరం మీది తిలక్ అన్న అక్షరాలు కనిపించాయి ఇదో షాట్.

దీన్ని ఎడిటరేం చేశాడు,

కనుబొమ్మలు ముడవటం, విప్పడం రెండు




ముక్కలు చేసి, వాటి మధ్య తిలక్ అన్న పేరు చూపించాడు. అంటే అది యిలావుంది.

ఏమిటని అనుమానాస్పదంగా కళ్లు చిట్లించింది జయప్రద.

చెల్లెలి జాకెట్లో ఉత్తరం మీద తన ప్రియుని పేరు కనిపించింది.

వెంటనే ఆశ్చర్యంగా, ముడిచివున్న కనుబొమ్మల్ని పైకెత్తింది.

ఇది ఎంతో ఎఫెక్టివ్‌గా దర్శకుని భావం ప్రేక్షకునికి మరింత బాగా అర్థమయేట్టు వుంది. ఇది ఎడిటర్ చేసే అసలైన పని. పొడవెక్కువున్న షాట్లని కుదించటం లాంటివన్ని థియేటర్లోరెస్పాన్స్ బాలేకపోతే ఆపరేటర్లు కూడా కత్తిరించి పక్కన పెడతారు. అది అసమర్థులైన దర్శకుల విషయంలో వస్తుంది''

''అంటే దర్శకుడికి టెక్నికల్ విషయాలు ఏమీతెలియనక్కర్లేదా? అలాంటప్పుడు మరి రచయితలుగా సక్సెస్ అయిన వాళ్లు కొందరు దర్శకులుగా ఫెయిలవుతున్నారెందుకని?''

''డైరెక్టర్‌కు టెక్నికల్ విషయాలు తెలియనక్కర్లేదని కాదు నేనన్నది. అవి తెలియటం ఒక్కటే ప్రధానం కాదూ అని. నాకు తెలిసి మన తెలుగు సినిమాలకు టెక్నికల్ వాల్యూస్ కన్నా ముఖ్యమైనది ప్రజెంటేషన్. ఎంత గొప్పగా తీసినా మనం టెక్నికల్ వాల్యూస్ కోసం యాభైలక్షలు కూడా ఖర్చు పెట్టలేం. మన రేంజ్ అంతే. సాంకేతిక విలువలన్నిట్లోనూ ఎంతో గొప్పగావుండి ఒక్కోసారి మనకున్న వనరుల్తో హాలీవుడ్‌తో పోటీపడే స్థాయిలో తీసికూడా, మన ప్రేక్షకుల ముందు బోల్తా కొట్టిన సినిమా లెన్ని లేవు? అన్ని టెక్నికల్ వాల్యూస్ కన్నా గొప్పది డైరెక్షన్ టెక్నిక్. ఆ తరవాత మన బడ్జెట్‌ను బట్టి మిగతా వాల్యూస్ అన్ని ప్లస్ అవుతాయేగానీ, అసలు జీవం నరైన కథ, దాన్ని చెప్పే ఒడుపు లేకపోతే టెక్నికల్ వేల్యూసన్నీ శవాలంకరణలే...

ఇక కొందరు సక్సెస్ ఫుల్ రచయితలు, డైరెక్టర్లుగా ఎందుకు ఫెయిలవుతున్నారంటే విజువల్ సెన్స్ లేకనే అని చెప్పుకోవాలి. వినటం, చదవటం, చూడటం ఈ మూడూ వేర్వేరు అభిరుచులు. అలాగే చెప్పటం, రాయటం, చూపించటం ఈ మూడూ వేర్వేరు ప్రక్రియలు. ఇందులో ఒకటొచ్చిన వాళ్లకు మరొకటి రావాలని రూలేం లేదు. రచయితగా ప్రసిద్ధుడైన శ్రీశ్రీ, ఉపన్యాసకుడుగా ఆకట్టుకోలేదు. ఆయన రాయగలడు, మాట్లాడలేడు. మరి లక్షలాదిమందిని మంత్రముగ్ధులను చేసే ఉపన్యాసాలిచ్చే మన రాజకీయ నాయకులంతా రచయితలుగా రాణించగలరా అంటే సందేహమే. అలాగే రచయితలు, దర్శకులు కావటం ఇక్కడ మరోటి చెప్పుకోవాలి. దర్శకులంతా రచయితలు కాలేకపోవచ్చు కూడా''

''నేను డైరెక్టర్ కావాలంటే ఏం చేయాలి బాసూ?'' సాలోచనగా అడిగాడు లక్ష్మణకుమార్.

''ఎటూ నా పేరింకా ప్రకటించలేదుగనుక, నన్ను తీసేసి, ఈ సినిమాకు డైరెక్షన్ చేసేయటమే. అదృష్టం బాగుంటే నువ్వే పెద్ద డైరెక్టర్ కావచ్చు'' నవ్వుతూ అన్నాడు చక్రి. లక్ష్మణకుమార్ ఏదో అనబోతుండగా వారించి మళ్లీ చెప్పాడు ''నవ్వుతూ అన్నాను అంతే, నాలాగా నేర్చుకో. లేదా ఎవరికైనా అసిస్టెంటువుకా. లేదా ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరు. ఇక ఈ కబుర్లన్నీ కట్టిపెట్టి మన టాపిక్ చూసుకుందాం''

''బడ్జెట్ పెరిగితే పెరిగింది. శోభనే హీరోయిన్‌గా పెట్టుకుందాంగురూ'' అన్నాడు గోవిందు.

''తప్పదా?'' విసుగ్గా అన్నాడు చక్రి.

''నువ్వే ఆలోచించుగురూ, కొండ హీరోకి మంచిరేంజ్ వుంది. శోభను కూడా కలుపుకుంటే స్టారింగ్‌లో మంచి గ్లామర్ వస్తుంది. బిజినెస్ రేంజ్ పెరుగుతుంది''

''మరి మిగతా కేరెక్టర్లు మార్చమని ఆయన చెప్పిన విషయం?''

''నువ్వు మార్చనవసరంలేదంటే ఆయన్ని ఒప్పిస్తాను గురూ. మురళికి సాంగ్‌లేదనీ, లవ్ సీన్స్ లేవనీ అబద్ధం చెప్పేసి, తరవాత కలిపేసుకోవటమే. ఇక కాపీ చూసి డబ్బింగ్ చెప్పనంటాడనే ప్రాబ్లమ్‌లేదు. ఆయనకు డబ్బింగ్ వాయిస్ వేరే కదా. అంతకన్నా ఏమీ చేయలేం''

"ఏమీ ప్రాబ్లమ్స్ రావు కదా?" ప్రశ్నించాడు లక్ష్మణకుమార్.

"ఇంతకన్నా డైరెక్టర్‌ని కూడా ఓ చిన్న డైరెక్టర్‌ని చూసుకుంటే బావుంటుంది. మనకెటూ యిప్పుడు డైరెక్టర్ పేరుతో లాభం లేదు కదా?" అన్నాడు చక్రి.

"కోపమొచ్చిందా బాస్?"

"కోపం కాదు, ఇది లక్షల వ్యవహారం. నా కెరీర్‌కు సంబంధించింది. ఫస్ట్ అటెంప్టే యిన్ని కాంప్రమైజేషన్స్‌తో ఎందుకని? ఎటూ ఈ సినిమా సక్సెస్ ఐతే రెండో సినిమా నేనే చేస్తాను"

"అదంతా కుదరదండీ, మీరే చెయ్యాలి. వచ్చే డైరెక్టర్ తరవాత మన కొంప ముంచితే ఏం చేస్తాం? రోజూ డైరెక్టర్‌తో తగువు పెట్టుకోలేంకదా" అన్నాడు శ్రీరామచంద్రుడు.

"అంతేకాదు... వేరే డైరెక్టరైతే మనం చెప్పిన కథ ఉన్నదున్నట్టుగా తీస్తానని ఒప్పుకోవచ్చు. మన రేంజ్‌లో మన యిష్టప్రకారం తీయటానిక్కూడా ఆయన్ని ఒప్పించొచ్చు. కానీ తీసేదో కథా, హీరోకు చెప్పేదో కథా అంటే ఒప్పుకుంటాడా?" అనుమానం వ్యక్తం చేశాడు గోవిందు.

"నాక్కూడా అలా చేయటం బాగా అన్పించట్లేదు గోవిందూ, మంచి పద్ధతి కాదు"

"తప్పనప్పుడు చేస్తాం చక్రీ... లోకంతీరే యిది. సినిమా ఫీల్డులో యివన్నీ కామన్. నాకు చెప్పిన కథ కాదు బాబోయిది అనిఎందరు హీరోలు, హీరోయిన్లు మొత్తుకోవటంలేదు ప్రీవ్యూలు చూసి. సర్వైవాల్ ఆఫ్‌ది ఫిట్టెస్ట్. ఇక్కడ నీతి యిదే. అలావుంటేనే బతకగలమిక్కడ" అనునయించాడు గోవిందు.

"పోనీ మన లిస్ట్‌లో బండహీరో వున్నాడు గదా. అతన్ని కూడా ట్రై చేసి చూద్దామా? అతనూ కాదంటే అప్పుడాలోచిద్దాం"

"ఔను... చక్రి చెప్పిందీ కరెక్టే. లాస్ట్ ట్రయల్. మరో వారం రోజులు అంతే కదా" అన్నాడు లక్ష్మణకుమార్.

★ ★ ★

"బండహీరో యింత సులభంగా ఒప్పుకుంటాడనుకోలేదు" ఆశ్చర్యంగా అన్నాడు చక్రి.

"'ధనం మూలం ఇదమ్ జగత్' అన్నారు గురూ. ఆయన రేటు 4 అయితే 5 అని అన్నాడు సెక్రెటరీ. ఆయన 4 లక్షలే తీసుకుంటాడని నాకు తెలుసని చెప్పాను. అయితే, 5 లక్షలిస్తే కథ కూడా వినకుండా ఒప్పుకుంటాడని వెంటనే కాల్‌షీట్స్ యిస్తాడనీ అన్నాడు. సరేనన్నాం. 50 వేలు అడ్వాన్స్ యిచ్చాం. మరో 50 వేలు యిస్తేగానీ కాంట్రాక్ట్ రాసుకోవడం అనౌన్స్ చేసుకోవడం కుదరదన్నాడు. రికార్డింగ్ వరకు అదీయిచ్చేసి, అనౌన్స్ చేసుకుంటే సరిపోతుంది" వివరించాడు గోవిందు.

"అసలీ పని మనం ముందే చేయాల్సింది. ఓ లక్ష పోతేపోయింది. ఈ టెన్షన్ ఎప్పుడో పోయేది" అన్నాడు శ్రీరామచంద్రుడు.

"రేపు షూటింగ్ జరిగేటప్పుడు పేచీలొస్తే?" ప్రశ్నించాడు చక్రి.

"తోలు వలిచేస్తాను. నా సంగతి తెలియదు మీకు" అన్నాడు శ్రీరామచంద్రుడు.

"అయినా అచ్చంగా కథ వినడని కాదు గురూ. ఔట్ డోర్‌లో వున్నాట్ట. వచ్చిన తరవాత ఫార్మల్‌గా వింటాడు. విని, 'బ్రహ్మాండం, బాగుందీ' అంటాడు. అంతే"

"సరే, అయితే మనం యిక ఏర్పాట్లు ముమ్మరంగా చేసుకోవాలి. వచ్చేనెల మొదటి వారం నుండీ అడగ్గానే యిచ్చేశాడంటే నాకు ఆశ్చర్యంగావుంది. ఎవరివైనా క్యాన్సిల్ అయ్యాయా?"

"కరెక్ట్ చక్రీ... గురువాయూరప్ప ఫిలింస్ వాళ్ళకు చేయాల్సివుందీయన. వాళ్ళకేమో హఠాత్తుగా ఓ పెద్ద హీరో డేట్స్ దొరికాయి. అందువల్ల ఈయనతో చేద్దామనుకున్న సినిమాను పోస్ట్‌పోన్ చేశారు. అందునా మనం లక్ష ఎక్కువకు ఒప్పుకున్నాం. ఒప్పుకోకున్నా యిచ్చేవాడేమో చెప్పలేం. ఎందుకంటే మరెవరైనా తీసుకోవచ్చు. ఈ రిస్కులన్నీ ఎందుకని వెంటనే ఒప్పుకున్నాను. శ్రీరామచంద్రుడుగారు కూడా సరే నన్నారు. ఇక నాకు కూడా ఊపిరి సలుపనంత పని"

"చందర్ అని ఒకతను రెండుసార్లు ఆఫీసుకు వచ్చి వెళ్లాడు. రెండు సినిమాలు




అప్రెంటీస్‌గా డైరెక్షన్ డిపార్ట్‌మెంట్‌లో చేశాట్ట. తీసుకుందామా అతన్ని" అడిగాడు లక్ష్మణకు మార్.

"నాకు ప్రస్తుతానికి సుందర్ చాలు. అతని సంగతి ఆలోచిద్దాం. ఎలాగూ సెట్స్ పైకి వెళ్ళేటప్పుడు అసిస్టెంట్స్ కావాలికదా"

"ఉండనీ గురూ... ఇద్దరూ వుంటే నష్ట మేంటి? ఎలాగూ వాళ్ళకిచ్చే ఎమౌంట్‌లో పెరిగేదేం లేదు కదా. షూటింగ్ పూర్తిగా నెల రోజులు కూడా లేదు. లెక్కేట్టుకుంటే నీకు బోల్డు పనులు అవసరముంటాయి" అన్నాడు గోవిందు

"నీకేంటి... నాకూ కావాలి. అర్జెంట్‌గా మనకు లొకేషన్‌కు వెళ్ళేలోగా ఓ ప్రొడక్షన్ మేనేజరూ, ఓ ప్రొడక్షన్ బాయ్ కావాలి. మరి నిర్మాతగారేమంటారో"

"నేననేది ఏముంది... మీరే చూసుకోవాలి. ఏది ఎప్పుడు చేయాలో నాకేం తెలుసు. మనకు యిబ్బందులు కలక్కుండా చూసుకోండి. అంతేచాలు" చెప్పాడు శ్రీరామచంద్రుడు.

"అయితే సుందర్‌కీ, చందర్‌కీ కబురు పెడతాను... సుందర్, చందర్ తమాషాగా కలిసాయి యిద్దరి పేర్లూ. గురూ, వాళ్లను తొందరతొందర పెట్టకు, అంతా చిందర వందర చేస్తారేమో" నవ్వాడు గోవిందు.

అతనితో పాటు అందరూ సన్నగా నవ్వుకున్నారు.



ఆఫీసుకు సినిమా ఆఫీసు కళ వచ్చింది. అందరూ ఎవరి పనుల్లో వాళ్ళు తీరికలేకుండా వున్నారు. అసిస్టెంట్స్ యిద్దరూ తయారు చేసిన లిస్టులు చూస్తున్నాడు చక్రి, తన గదిలో.

"ఇంత ముందుగా యిలా కాస్ట్యూమ్స్ లిస్ట్ కూడా తయారు చేసుకునే వాళ్ళను నేను చూళ్ళేదు సార్" అన్నాడు చందర్.

"మన సార్ సంగతి నీకు తెలీదు. ఎవరి దగ్గరా అసిస్టెంట్‌గా చేయలేదుకానీ పనుల న్నీ చాలా సక్రమంగా వుంటాయి. ముందు ముందు యింకా చాలా ఆశ్చర్యాలు కలుగుతాయి" అన్నాడు సుందర్.

అతనికి చక్రితో పూర్వ పరిచయముంది. తన మొదటి సినిమాకు చక్రి మాటలు రాస్తున్నప్పుడు అతను సహాయం చేయటానికి అసిస్టెంట్ డైరెక్టర్‌గా వచ్చాడు. రచయిత, ప్రొడ్యూసర్ ఆఫీసులో కూర్చునో, ప్రొడ్యూసర్ యిచ్చిన హొటల్ గదిలో కూర్చునో రాస్తున్నప్పుడు, కాగితాలు సర్దిపెట్టటం, రాసింది ఫెయిర్ చేయటం, ఏమైనా అవసరమైతే తెచ్చిపెట్టటంలాంటి వాటి కోసం కొందరు నిర్మాతలు అసిస్టెంట్ డైరెక్టర్లను రచయిత దగ్గర వుంచుతారు. అలా జరిగిన పరిచయంలో, సుందర్ సిన్సియారిటీ చూసి చక్రి, చక్రి నేర్పుచూసి సుందర్, యిద్దరూ ఒకరికొకరు దగ్గరయ్యారు. అయినా, తనను ఏక వచనంలో సంబోధించమనీ, 'సార్' అనొద్దనీ చక్రి ఎన్నిసార్లు చెప్పినా అతను వినడు. సుందర్ గురువైన డైరెక్టర్‌కు ప్రస్తుతం సినిమాలేవీ లేకపోవడంతో అతన్ని పిలిపించి అడిగాడు చక్రి, తన దగ్గర పనిచేయమని. అతను వెంటనే ఒప్పుకున్నాడు.

చక్రి పిలుపు విని, యిద్దరూ అతనున్న గదిలోకి వచ్చారు.

"ప్రాపర్టీస్ లిస్ట్ రాసిందెవరు?"

"నేనుసార్" అన్నాడు చందర్.

"సీన్ నెంబర్ సెవెన్‌లో ఇంకేమైనా రాయాలా చూడు" అతనికి అందిస్తూ, మామూలుగా చెప్పాడు చక్రి.

"ఏమైనా మరిచిపోయానా సార్?" అన్నాడు చందర్ భయంగా.

కొందరు డైరెక్టర్స్ కోప్పడతారు, కొందరు తిడతారు, విసుక్కుంటారు. తప్పు చేసిన అసిస్టెంట్స్‌ని బండబూతులు తిట్టేవాళ్ళూ

కొట్టేవాళ్ళూ, ఫైల్సూ, కాగితాలే కాక క్లాస్ బోర్డు ముఖాన విసిరేవాళ్ళూ వున్నారు. ఎంతో సౌమ్యంగా చెప్పేవాళ్ళూ వున్నారు. నాలుగు రోజులు పనిచేస్తే కానీ ఎవరు ఎలాంటి వాళ్ళో తెలీదు. అందుకే భయంగా అడిగాడు చంద‌ర్.

"సీన్ చదువుతున్నప్పుడు ఒక్కోసారి ఓవర్ సైట్ వల్ల మరిచిపోతాం. అందుకే ఇప్పుడు గుర్తొస్తుందేమో చూడమన్నాను. అంతే" అన్నాడు చక్రి.

"సీన్ నెంబర్ సెవెన్ అంటే సమాధి తవ్వటం పారిపోవటం... అదే కద్సార్" అన్నాడు సుందర్, వన్‌లైన్ ఆర్డర్‌లో వెతుకుతూనే.

స్క్రిప్టు మొత్తం పూర్తయ్యాక ప్రతి సీనునీ ఒకటి రెండు వాక్యాల్లో తెలిసిపోయేటట్టుగా రాస్తూ ఒక లిస్ట్ రాస్తారు. దీన్ని వన్‌లైన్ ఆర్డర్ అంటారు. ఏ సీను తరవాత ఏ సీనుంది, ప్రస్తుతం తీస్తున్న సీన్ నెంబరెంత లాంటివే గాక అనేక సార్లు, అనేక విధాలుగా పనికొస్తుందీ వన్‌లైన్ ఆర్డర్. ప్రతిసారీ స్క్రిప్టును తిరగెయ్యానవసరం లేకుండా, క్లుప్తంగా వుంటుందిది. సాధారణంగా అసిస్టెంట్ డైరెక్టర్లంతా దీన్ని తలా ఓ కాపీ దగ్గరుంచుకుంటారు. అంతేకాక, షూటింగ్ మొదలయ్యే నాటికి వీళ్లకు దాదాపుగా సీన్లనంబర్లన్నీ కంఠతా వచ్చేస్తుంటాయి కూడా. ఇంగ్లీష్‌లో రానుకుని టైప్ చేయించుకుంటారు దీన్ని. వీళ్ళ స్క్రిప్టు వన్‌లైన్ ఆర్డర్ యిలా వుంటుంది-

1. చర్చ్ నుండి బయలు దేరటం
2. యింట్లోనుండి బయలుదేరటం
3. కార్ పాసింగ్ షాట్స్
4. పాసింగ్ షాట్స్
5. పాసింగ్ షాట్స్
6. కారు పాసింగ్ షాట్స్
7. స్మశానంలో సమాధి తవ్వి, పారిపోవటం... శవాన్ని పొడవటం
8. టైటిల్స్
9. జూలీ బయలుదేరటం
10. టీ షాప్ షాట్స్
11. జూలీ పరిచయం సీను
12. డేవిడ్ మీనం గొరగటం
13. ప్రియ పరిచయం సీను యుద్ధం గురించి ప్రేమ్‌తో చర్చ- జూలీ రావటం
14. ఫ్లాష్ బ్యాక్ విక్రమ్‌ను జూలీ పట్టుకోవటం, చిన్నప్పుడు
15. విక్రమ్ పరిచయం సీను జూలీ యింట్లో ఫాదర్‌తో విక్రమ్.

ఇలా వుంటుందా వన్‌లైన్ ఆర్డర్. అది చదవగానే ఆ సీనంతా గుర్తుకొస్తుందన్న మాట. ఒకే విషయం జరుగుతున్నప్పటికీ 'లొకేషన్' అంటే 'సంఘటన జరిగే స్థలం' మారగానే కొత్త నెంబర్‌తో సీను మొదలవుతుంది. జూలీ చర్చ్‌లోంచి బయలుదేరి టీషాప్ మీదుగా ప్రియ యింటికి రావటం మూడు సీన్‌లయిందందుకే.

"కరెక్టే... సీన్ నెంబర్ సెవెన్ సమాధి తవ్వటం" తనలో తనే అనుకుంటూ చందర్ రాసిన లిస్టు చూశాడు సుందర్.

"సీన్- 7
1. పార
2. సన్నటి ఇనుపకడ్డీ
3. గుడ్లగూబ
4. రాబందు
5. శవపేటిక
6. కారు"- చదివేసి,

"కత్తి, కత్తి" మెల్లగా చందర్ చెవిలో చెప్పాడు సుందర్.

"అవున్సార్... కత్తి" అన్నాడు సుందర్, చదవటం ఆపేసి.

"రాసినవన్నీ ఓసారి చెక్ చేసుకుంటే మంచిది" చక్రి చెబుతుండగా బైటినుండొచ్చిన లక్ష్మణకుమార్, గోవిందులు ఆ గదిలోకొచ్చారు.

"7. కత్తి" అని రాసేస్తున్న చందర్‌ని చూసి, అది చేతిలోకి తీసుకున్నాడు లక్ష్మణకుమార్. చక్రి చెబుతున్నాడు

"ఆ సీన్ తీసే ముందురోజు ఓసారి మళ్లీ చూసుకుంటామనుకో. కానీ అలసట వల్లనో, యిప్పటిలాగానో అప్పుడూ గుర్తురాకుంటే, కత్తి లేకుండానే షూటింగ్‌కెళితే యిబ్బందికదా" సౌమ్యంగా చెప్పాడు చక్రి

"అ హడావిడీ, యిబ్బందీ లేకుండా, యిప్పుడు తీరిగ్గానే వున్నాం గనుక యిప్పుడే చూసుకోవటం మంచిది"





"నన్నటి యినుప కడ్డీలూ, గుడ్ల గూబ లూఏంటి బాస్ యివన్నీ" ఆశ్చర్యంగా అడిగాడు లక్ష్మణకుమార్.

"అవన్నీ మా తద్దినం... లిస్టాఫ్ ప్రాపర్టీస్ అంటారు" చెప్పాడు గోవిందు.

"ఎందుకివన్నీ?"

"చక్రి చెబుతున్నాడు విన్నావుకదా... చందర్ చివర్న రాసిందేంటీ, 'కత్తి'... మా పీక కొయ్యటానికి. ఇది లేకుండా వెళ్లామనుకో. చివరి క్షణంలో గుర్తొచ్చి అసిస్టెంట్ డైరెక్టర్ చెబుతాడు

'సార్ అర్జెంటుగా ఓ కత్తి కావాల'ని.

మన వంట సామాన్లలో వుంటుంది. కూరలు కోసేది. తెప్పిస్తాను అంటాడు ప్రొడక్షన్ మేనేజర్.

అది పనికి రాదని చెప్పి, ఎలాంటిది కావాలో చెబుతాడీయన. కారేసుకుని వెళ్ళి తెస్తాడు ప్రొడక్షన్ మేనేజర్. ఖర్మకాలి డైరెక్టర్ తీసే మొదటి షాట్‌లోనే కత్తి కావాలనుకో అసిస్టెంట్లు చీవాట్లు తింటారు. ప్రొడక్షన్ మేనేజర్‌కే ఖర్మ కాలిందనుకో. తొందరగా దొరకదు.

ఏం ప్రొడక్షన్ చేస్తున్నారు? కత్తి తేవటానికి గంటా అని నన్ను తిడతాడు చక్రి.

ఇంతలో వెళ్ళిన ప్రొడక్షన్ మేనేజర్ వస్తాడు కత్తితో, తెలివైన వాడైతే.

ఎందుకంటే, కత్తివుందంటే మీ సీను రాత్రి కదా తీసేది. ఆ అర్థరాత్రి వాడికి కత్తి దొరికిందంటే తెలివైన వాడేనన్నమాట.

'సార్, చచ్చీ చెడీ తెచ్చాను సార్. ఆ షాపులో లక్కీగా మిగిలింది మన కోసం. లాస్ట్ పీసట' అంటాడు ప్రొడక్షన్ మేనేజర్.

'లాస్ట్ పీసేంటయ్యా నీ బొంద. ఇది మాలినీదేవి యింట్లోని కత్తిగానీ అయితే యిలాంటిదే మరొకటి కావాలి అని...'

గోవిందు చెబుతున్న విధానానికి నవ్వొచ్చింది అందరికీ.

"ఇక చాలు... ఆపు" చక్రి అనటంతో ఆపేశాడు గోవిందు.

"ఇందాక గోవిందు చెప్పాడు చూడు... మీకు కత్తి కావాలంటే అది నైట్ ఎఫెక్టుసీను అనీ ఇది మాలినీదేవి యింట్లో కత్తిఅయితే రెండు కావాలని అతనికెలా తెలిసింది. కథ తెలుసుకనుక మాలినీదేవి ఇంట్లో ప్రతిదీ రెండుంటాయని తెలును కనుక, ఆ హడావిడిలో గోవిందు వెళ్ళివుంటే, అది మాలిని యింట్లోదనుకుంటే రెండు తెచ్చేస్తాడు. కాకపోతే యిబ్బంది లేదు. అయివుంటే ఎలా అవుతుందన్నదే చెప్పబోయాడు గోవిందు. అందుకే ప్రతివారికీ కథగురించి కొంతైనా తెలిసుండాలి. ప్రొడక్షన్ మేనేజర్‌కు కథెందుకు, కెమెరా మన్‌కు కథెందుకు అనుకుంటారు గానీ చాలామంది, నిజానికి అవసరమే" చెప్పాడు చక్రి.

"ఇంతకూ ఈ లిస్టులేంటి?" మళ్ళీ ప్రశ్నించాడు లక్ష్మణకుమార్.

"రామాయణమంతా విని, రాముడికి సీతేమవుతుందన్నాట్ట నీలాంటి వాడొకడు" చిరాకు నటిస్తూ అన్నాడు గోవిందు.

"ఎగిరేసి తంతే రెండు చెక్కలవుద్ది గానీ ఏంటివి? యిదిగో యిక్కడేంటిది? కాస్ట్యూమ్ నెంబర్ వన్, నైన్, లెవెన్, థర్టీన్. ఏంటివి చక్రీ, చాలా రోజులైంది మనం యిలాంటివి మాట్లాడుకోక. అదీగాక నిర్మాత యివన్నీ తెలుసుకోవాలని నువ్వే అన్నావు" మళ్ళీ అడిగాడు లక్ష్మణకుమార్, గోవిందు చెప్పకపోవటంతో.

"ఇవన్నీ అవసరాలు. అంటే మనకు సీన్‌లో అవసరమైనవన్నమాట..."

"అంటే యిప్పుడు గుడ్లగూబ, రాబందు కూడా కొనాలా?"

"అక్కడే ప్రొడక్షన్‌వాళ్ల తెలివితేటలు కనిపిస్తాయి. ఇందాక గోవిందు అన్నాడు చూడూ, మామూలు కత్తయితే వంటవాళ్ల దగ్గరుంటుందని. అలా వీలైనన్ని తమదగ్గరున్నవే ఆరేంజ్ చేస్తారు. సూట్‌కేస్ కావాలనుకో. ఆఫీసులో ఎలాగూ వుంటుంది. దాన్ని వాడేస్తాడు. కొన్ని అలా వాడలేనివి వుంటాయి. కొన్ని మనదగ్గర లేనివుంటాయి. ఇవన్నీ 'ప్రాపర్టీ సప్లయర్' దగ్గర దొరుకుతాయి. ఈ ప్రాపర్టీ సప్లయర్స్ దగ్గర బీరువాల దగ్గర్నుంచి చీపురుకట్ట దాకా దాదాపు ప్రతిదీ అద్దెకు దొరుకుతుంది. ఇప్పుడు చాలావరకూ నిజం బిల్డింగుల్లో, నిజం ఆఫీసుల్లో మాట్ చేసుకోవటం మొదలైంది గనుక వీళ్ళ అవసరం చాలా

తగ్గింది. అయినా కొన్నిటికోసం వీళ్లదగ్గరికే వెళ్ళాల్సి వుంటుంది. రోజువారీ అద్దె వుంటుంది గనుక ఔట్‌డోర్స్‌కు వెళ్ళి ఏకబిగిని సింగిల్ షెడ్యూల్లో చేసుకునేవారు అద్దెకు తీసుకుంటే కొన్ని భరించలేరు. అలాంటప్పుడు ఏ షాపువాళ్లనో, లేదా ఆ వస్తువు వున్నవాళ్లనో ఒప్పించి, అద్దెకో ఉచితంగానో తెచ్చేస్తుంటారు. కొన్ని చిన్న చిన్నవి కొనాల్సివస్తుంది. కొనటానికీ, మరెవరిదగ్గరో తేవటానికీ కష్టమైన వాటిని కొన్నిటిని 'ఆర్ట్ డిపార్ట్‌మెంట్' అంటే మన కళాదర్శకుడూ, ఆయన సహాయకులూ 'మాయ వస్తువు' తయారుచేస్తారు. అంటే చూడటానికి అసలు దానిలాగే కనిపిస్తుంది"

"మరి గుడ్లగూబా, రాబందూ?"

"చెబుతానయ్యా మగడా. ఇవే కాదు, మొదటి ఓ సీన్లో ఒకతను యింట్లోనించి బైటికొచ్చి, నిర్మానుష్యమైన వీధుల్లో ఎవరూ లేరని జాగ్ర



త్తగా తెలుసుకుని, బైటికొచ్చాడు. దూరంగా అరుస్తున్న కుక్క కనిపించింది. ఈ కుక్కను కూడా మనం తెచ్చుకోవాలి. మనం తీసే సమయానికి కుక్క దొరుకుతుందనీ, దొరికినా మన మాట వింటుందనీ తెలీదు కదా. అయితే యిలాంటి కుక్కను వెంట తెచ్చుకునే బదులు మాటింగ్ చేస్తున్న ఊళ్ళో ఎవరిదో పెంపుడు కుక్కను అడిగి తెస్తారు. లేదా ప్రొడక్షన్ మేనేజర్ ఓ వీధికుక్కను పట్టుకుని దాన్ని మాలిమి చేసుకుని, పట్టుకొస్తాడు" గోవిందువైపు చూస్తూ నవ్వాడు చక్రి.

"చేస్తాం సార్, చేస్తాం. మంత్రసానితనానికి ఒప్పుకున్నాక ఏదో అన్నట్టు ప్రొడక్షన్ డిపార్ట్‌మెంట్‌లో వున్నాక అవసరమైతే కుక్కను మాలిమి చేసుకోవటం కూడా తప్పదు. ఓసారి ఓ సీన్లో హీరోయిన్ పరిగెత్తుకొచ్చి పేడలో పడుతుంది. మట్టి కాదు, మరేం కాదు, నిజంపేడే కావాలని, బ్రేక్ చెప్పి కూచున్నాడు



మా డైరెక్టరు. అక్షరాలా నేను, ఓ బుట్ట పట్టుకుని, దగ్గర్లో గొర్రెలున్నవాడి దగ్గరికెళ్ళి, అష్టకష్టాలూ పడి, గొర్రెతో పేడ వేయించుకుని వచ్చాను''

అందరూ పడీ పడీ నవ్వారు, అతని అనుభవానికి.

''మరి గుడ్లగూబా, రాబందూ?''

''నీ గుడ్లగూబా, రాబందూ పాడుగాను. వలేసి పట్టుకోవాలి'' అన్నాడు గోవిందు, వినుగు నటిస్తూ, నవ్వుతూ.

''ట్రెయిన్డ్ ఏనిమల్స్ వుంటాయి సార్, ఏనిమల్ సప్లయర్స్ దగ్గర'' చెప్పాడు సుందర్ నవ్వుకుంటూ, లక్ష్మణకుమార్ బాధ భరించలేక.

''ఏంటీ... ఏనిమల్ సప్లయర్సా? అవి కూడా సప్లై చేస్తారా?'' ఆశ్చర్యపోయాడు లక్ష్మణకుమార్.

''అవును... సినిమాలో కనిపించే చాలా జంతువులు వాళ్లదగ్గర్నించే తెస్తారు. ఆయా జంతువు చేయాల్సిన పనినిబట్టి, దాని అద్దె అవసరం వుంటుంది. మైనే ప్యార్‌కియాలో చేయాల్సినన్ని పనులు చేయాలంటే ఆ పావురానికో రేటు, మన కథలో లాగా అట్మాస్ఫియర్ కోసమైతే ఓ రేటూ... అలా వుంటుంది. వీళ్ల దగ్గర కుక్కలూ, పావురాలూ, గుర్రాలూ, ఏనుగులూ, పాములూ, యిలా చాలా జంతువులుంటాయి. ఓ చిన్నపాటి జూ అనుకో' వివరించాడు గోవిందు.

''మరీ లిస్టులేంటి?''

''మొదటినుంచి చివరిదాకా ప్రతి సీనూ చదువుతూ, అందులో తప్పనిసరిగా కావాల్సిన వస్తువులన్నీ రాసుకుంటారు, యిందాక నువ్వు చూసిన లిస్టులో లాగా. దాన్ని లిస్టాఫ్ ప్రాపర్టీస్ అంటారు. ఆ మరొకటి 'లిస్టాఫ్ కాస్ట్యూమ్స్'. అంటే దుస్తులు, చెప్పులు, గాజులు, తల పిన్నులు, చేతి సంచులు, నెక్‌టైలూ యిలాంటివన్నమాట. ఇందాక నువ్వు చదివావు చూడు, 'కాస్ట్యూమ్ నంబర్ వన్, నైన్, లెవెన్, థర్టీన్' అనీ. అది జూలీ కాస్ట్యూమ్స్ లిస్టు'' - వివరించాడు చక్రి.

''దానికి లిస్టెందుకు? ఏదో ఓ డ్రెస్సు వేస్తాంగదా?''

''వేస్తాంగానీ కంటిన్యుటీ బ్రేక్ తినకుండా. అంటే, జూలీ చర్చిలోంచి బయలుదేరి, టీషాపుముందు కనిపించి, ప్రియ యింటికి వెళ్ళింది. ఈ మూడూ మనం వరసగా తీయకపోవచ్చు. పోవచ్చేంటి, తీయం కూడా. ఒక్కో సీను ఒక్కో రోజు, వీలునుబట్టి తీస్తాం. అది షెడ్యూల్‌ని బట్టి వుంటుంది''

''షెడ్యూల్ అంటే ఏంటి?'' మధ్యలో అడ్డు తగిలాడు లక్ష్మణకుమార్.

''షెడ్యూల్ అంటే ఏంటో తర్వాత చెబుతాను గానీ ముందుగా యిది కానీ. వీలునుబట్టి మూడూ మూడుసార్లు తీశావనుకో. జూలీ తెల్లటి చీరలో చర్చిదగ్గర బయలుదేరి, ప్యాంటూ షర్టూ వేసుకుని టీషాపు దగ్గర కనిపించి, నల్లంచు తెల్లచీరలో ప్రియ ఇంటిదగ్గర కనిపించే ప్రమాదముంది. ఇలా జరక్కుండా కొందరేంచేస్తారంటే 'డ్రెస్ కంటిన్యుటీ' రాసుకుంటారు. గుడ్డెద్దు చేలో పడ్డట్టు తీసేవాళ్ళైతే ఏది ఎప్పుడు కంటిన్యుటీగా వస్తుందోనని ప్రతిదీ రాసుకుంటారు.

సెట్ కంటిన్యుటీ, అంటే ఓచోట గలాభా జరిగి వస్తువులన్నీ విరగ్గొట్టారు. మరునాడు పోలీసులొచ్చి అది చూశారు. ఈ సీన్లు రెండూ ఒకేసారి తీసుకుంటే యిబ్బంది వుండదు. అలా వీలుకానప్పుడు, ప్రేక్షకుడు సులభంగా గుర్తుపట్టగలిగిన వస్తువు ఏది, ఎక్కడ, ఎలా వుందో రాసి పెట్టుకుంటారు.

ఈ గలాభాలో ఒకరు చచ్చిపోయారనుకో... శవం పడిపోయిన విధానం, అంటే ఆ మనిషిచుట్టూ చాక్‌పీస్‌తో గీత గీసి, మళ్ళీ ఆ సీన్ తీసేటప్పుడు ఆ గీతల ప్రకారం పడుకోబెడతారు. అలాగే శవం తలపక్కనే ఓ కుర్చీ అడ్డంగా పడివుంటే, మరునాడు ఆ కుర్చీ వెల్లకిలా పడేస్తే సులభంగా మార్పు తెలుస్తుంది. అందుకని అలాంటివన్నీ రాసుకుంటారు. సాధారణంగా యిలాంటి సెట్టును కదిలించరుగానీ ముందు జాగ్రత్తకోసం 'సెట్ కంటిన్యుటీ' రాసుకుంటారు...

అలాగే డ్రెస్ కంటిన్యుటీ. జూలీ టీషాపుకెళ్ళే సీను ముందుగా తీస్తామనుకో. ఎర్రంచు నల్ల చుక్కల తెల్ల చీర,

ఎర్రపూల నల్ల జాకెట్టు,




నల్ల చెప్పులు హీల్సు లేనివి,

రెండు జడలు 'ం' షేపులో తెల్ల రిబ్బన్లతో పైకి కట్టినవి,

కుడివైపున పక్కగా ఎడ్వర్డ్ ఎర్రగులాబీ,

మెళ్ళో క్రాసున్న బంగారు గొలుసు,

చెవులకు పచ్చరాళ్ళ గుండ్రటి దుద్దులు,

కుడిచేతికి మణికట్టువైపు తిప్పి పెట్టుకున్న వాచీ,

ఎడమచేతికి ఎర్ర గోట్ గాజు,

పింక్ కలర్ నెయిల్ పాలిష్ చేతివేళ్ళకు,

భుజానికి మెరూన్ కలర్ హ్యాండ్ బ్యాగ్

-యిలా రాసుకుని, పెడతారు పుస్తకంలో. దీన్ని 'కంటిన్యూటీ బుక్' అంటారు.

అలాగే 'సెట్ కంటిన్యూటీ' లో...

సైకిల్ వెనకాల క్యారియర్‌కు మూడు పుస్తకాలు, పైనున్నది బ్రౌన్ కవర్ వేసింది-

అని రాస్తారు పుస్తకంలో. దాని పక్కనే 'కంటిన్యూటీ ఇన్ సీన్ నెం నైన్ అండ్ థర్టీన్' అని రాసుకుంటారు. కథ సిద్ధం లేనప్పుడు, ఎప్పుడేం తీస్తారో తెలీనప్పుడు ప్రతీ సీన్‌కీ ప్రతివారి గురించీ రాసుకోవలసిందే...

అంతేగాక, మరింత సులువుగా వుండటంకోసం, ఒక పాత్రకు వాడిన కాస్ట్యూమ్స్ అన్నింటికీ ఆ సీను నెంబర్ వేసి, వీలైనంతవరకూ అవి ఒకే కవర్‌లో పెట్టేసి వుంచుతారు. ఏరోజు తీసిన స్టిల్స్ ఆరోజే ప్రింట్ చేయించుకోవటంవల్ల కూడా ఈ యిబ్బందులు తగ్గుతాయి. అయితే ఒక్కోసారి స్టిల్స్‌లో చెవికమ్మలూ, నెయిల్ పాలిష్‌లాంటివి సరిగ్గా కనిపించవు. ఇవన్నీ వివరంగా రాసుకోవాలి. ఆ పని చేయాల్సింది అసిస్టెంట్ డైరెక్టర్స్.

'శృతిలయలు' సినిమాలో 'ఇన్ని రాశుల యునికి' పాటముందు, సుమలత, రాజశేఖర్‌తో మాట్లాడే సీన్లో, సుమలతకు ఓ షాట్‌లో వున్న చెవి కమ్మలు ఒరకంగానూ, మరో షాట్‌లో వున్న కమ్మలు మరో రకంగానూ వున్నాయి. అంటే, చూసే ప్రేక్షకుడికి ఇటు మాట్లాడి అటు తిరిగేనరికి కమ్మలు మారిపోయి కనిపిస్తాయి. నిజానికి ఆ మాటల్ని రెండురోజుల్లో, లేదా పొద్దున్నా సాయంత్రం తీసివుంటారు. లంచ్ టైంలో డ్రెస్సు మార్చుకుని, మళ్ళీ కాస్ట్యూమ్ వేసుకునేటప్పుడో, లేక మరునాడు తీసినందునో ఈ పొరపాటు జరిగివుంటుంది. 'అది విశ్వనాథ్ చూసుకోలేదా!' అనుకుంటారు ప్రేక్షకులు.

'గీతాంజలి'లో కూడా 'జల్లంత తుళ్ళింత' రెయిన్ సాంగ్ తర్వాత, వర్షంలో తడిసి యింట్లోకొస్తుంది గిరిజ. రెండూ వేర్వేరు డ్రెస్సులు. ఇదీ 'మణిరత్నం' లాంటి పెద్ద దర్శకుడు చూసుకోలేదా అనుకుంటారు ప్రేక్షకులు. కానీ అది చూసుకోవాల్సింది అసిస్టెంట్లు. వాళ్ళు రాసుకోవటం మర్చిపోవటంవల్లనో, లేదా కంటిన్యూటీ వుందని చూసుకోకపోవటం వల్లనో జరుగుతుంది. మరి దర్శకుడికి కంటిన్యూటీ గుర్తు రాదా అంటారేమో, కంటిన్యూటీ చూసుకుని, కాస్ట్యూమ్ వేయించి వుంటారనుకుంటాడు దర్శకుడు. ప్రతి షాట్‌కూ అడుగుతూ కూర్చోడు.

దీన్నే మనం ముందుగా, మరింత సులువుగా చేసుకుంటున్నాం. వరుసగా డ్రెస్సులకు నెంబర్లిస్తూ, అది ఏ సీన్లో కంటిన్యూ అవుతుందో అవన్నీ ఆ డ్రెస్ నెంబర్ ముందు రాసుకున్నాం. రేపు ఈ మూడు సీన్లలో ఏ సీను ముందుగా తీసినా, ఏది తరవాత తీసినా యిబ్బంది వుండదు''

''మరి పాటల్లోనేమో డ్రెస్సులు మారిపోతూంటాయి?'' ప్రశ్నించాడు లక్ష్మణ్‌కుమార్.

''డ్రెస్సులేంటి, లొకేషన్లు కూడా మారుతుంటాయి'' నవ్వుతూ అన్నాడు చక్రి.

''ఇదంతా అసహజం కదూ?''

''అవును. కానీ సినిమా సహజత్వం కోసం తీసేది కాదు. అలా తీసే కళాఖండాలు ఒక్క శాతం ప్రేక్షకులు కూడా చూడటంలేదు. సినిమా వినోద సాధనమయిందివాళ. ఓ పత్రిక తిరగేస్తే, కథలూ, కవితలూ, వ్యాసాలూ, జోకులూ, ఫొటోలూ, కార్టూన్లూ, బొమ్మలూ, సినిమా కబుర్లూ, రాజకీయాలూ, అన్నీ వున్నట్టే ఓ సినిమాకు వెళ్ళినా అన్నీ కావాలి ప్రేక్షకుడికి.

ఫలానా సన్నివేశంలో హీరో, హీరోయిన్లు దగ్గరయ్యారనటానికి ఓ పాట వినిపిస్తారు. ఒకతను బాధపడుతూ పాట పాడుకుంటాడు.



లేదా ఓ సీన్లో బ్యాక్‌గ్రౌండ్ పాట వుంటుంది. ఇవన్నీ ఆయా పాత్రల మనోభావాలని దర్శకుడు తన బాణీలో చెబుతున్నాడన్నమాట. అంతే, అలాగే పాటల్లో డాన్సులూ. కూలివాడు స్విట్జర్లాండులోని పార్కులో పాట పాడుకోవటం యివన్నీ అసహజమే. కానీ, కంటికింపుగా వుండటంకోసం, చెవులకింపుగా వుండటంకోసం చేస్తున్నారివన్నీ.

బాపు బొమ్మలో అమ్మాయి నడుము ఎంతో సన్నగా వుంటుంది. నామట్టుకు నేను అంత వయ్యారమైన అమ్మాయినింతవరకూ చూళ్ళేదు. అలాగని బాపు బొమ్మలు అసహజంగా వున్నాయంటామా? కంటికింపుగా వున్నాయి. లేదా బాపు దృష్టిలో అలా వున్నాయి. అలాగే సినిమాలోని సన్నివేశాలు కూడా ప్రేక్షకుల దృష్టిలో అలా వుంటాయి.

కొందరు కుప్పిగంతులని వెక్కిరిస్తున్న వాటినే నాట్యాలనుకుంటూ జనం వేలంవెర్రిగా చూస్తున్నారు. ఆ పాటలకోసమే సినిమాల్ని మళ్ళీ మళ్ళీ చూస్తున్నారు. మనసును రంజింపచేయటమే కళ పరమార్ధం. కళ కళ కోసం కాదు, ప్రజలకోసం. సినిమాలు సామాన్య ప్రజలకోసం ఉద్దేశించిన కళారూపాలు. అవి వాళ్లను రంజింపచేయలేకపోతే వ్యర్థమే కదా?

తన జీవితంలో తాను చూడలేని నాట్యాలూ, కార్లూ, కార్ల పందాలూ, అందమైన భవనాలూ, అందమైన ప్రదేశాలూ, విదేశాలూ, నాట్ నాట్, ప్రతిదీ సినిమాలో చూసి ప్రేక్షకుడు ఆనందిస్తున్నాడు. సినిమాలో తప్ప చూడలేడు గనుకే సినిమాలు చూస్తున్నారు. అందుకే సినిమాల్ని 'డ్రీమ్ సెల్లింగ్', 'కలల్ని అమ్ముకోవటం' అంటారు. ఆ కల ఎంత అందంగా వున్నదో కావాలి కానీ, ఎంత సహజంగా వున్నదో ఎవరిక్కావాలి?''

''మొత్తానికి మన సినిమాల్లో యివన్నీ వుండాలంటారు. మీరు కూడా యిలా అంటారనుకోలేదు సార్'' అన్నాడు సుందరం.

అతని మాటలకు చిన్నగా నవ్వాడు చక్రి

''డిమాండును బట్టి సప్లై. ప్రజలు చూడని సినిమా తీస్తానంటే ఏ నిర్మాతా ముందుకు రాడు. విప్లవం సినిమాలు, యదార్థ గాథలూ, సందేశాత్మకాలూ, సంగీత నాట్యాల సినిమాలూ, యివన్నీ వ్యాపారమే. కాకపోతే వ్యాపారంలో మరో ధోరణి. ఎన్నుకునే కథలో వైవిధ్యం, చూపించటంలో వైవిధ్యం... అంతే. ప్రిన్సిపుల్స్‌లాంటివి వున్నప్పుడు మరో ఛండాలమైనవి గాక కాస్త ఉపయోగకరం అనిపించేవి తీయాలి. ఈ రొంపిలోనే మన తెలివి తేటలు చూపించుకోవాలి. ఉదాహరణకు మన ప్రఖ్యాత దర్శకుడొకాయన ''సినిమాల్లో కథంటే ఏమిట''ని ప్రశ్నించి, నిజంకాని కథ అని అన్నాడోసారి. ఆయన ఎన్నుకున్న సినిమా కథలు విమర్శకుల చేతికొస్తే చివరకు ఏమీ మిగలదు. కానీ ఆయన చూపించే విధానం! ప్రతి ఫ్రేమూ ఎంతో కళాత్మకంగా వుంటుంది! విజువల్‌లో భావుకతంటే ఇతరులకన్నా ముందుగా ఆయన్నే చెప్పుకోవాలి. ఇతర సినిమాల్లోని కథ నడపటంలో, సీన్స్ ప్రజెంట్ చేయటంలో కనుపించే భావుకత వుంటే, ఇతని ఫ్రేమింగ్‌లో భావుకత వుంటుంది. ఆయన చిత్రీకరించే పాటల్లో ఎంత సృజనాత్మకత వుంటుంది! మరి ఆయన తీస్తున్న కథలు సహజంగా లేనంతమాత్రాన ఆయన మేధావి కాదని ఎవరైనా అంటే మూర్ఖులంటాన్నేను. మన ప్రజ్ఞను యిక్కడ మలుచుకోవాలేగానీ అంతకన్నా మరేమీ చేయలేం''

''ఇంకా కొందరు డైరెక్టర్ల గురించి చెప్పు చక్రీ'' ఉత్సాహంగా అన్నాడు లక్ష్మణకుమార్.

''మేం షెడ్యూల్ వేసుకోవాలి. బోల్డు పనుంది. యిక కదులు బాబూ'' ఎగతాళిగా అన్నాడు చక్రి.

''అయితే షెడ్యూల్ అంటే ఏంటో చెబుతానన్నావ్?''

''ఇప్పుడు వేస్తాంగదా చూడు''

అదికాదు... ముందుగా చెప్పు. అసలంత వినుగేంటి నీకు? పొద్దంతా పనిచేసుకుంటూ కూర్చోవటం మంచిది కాదు. తెలుసా? కాస్సేపు పని పక్కనపెట్టి, మార్పుగా మరేదైనా చేసుకోవాలి. వట్టి కబుర్లు కాదు, నాకు పనికొచ్చే కబుర్లు''

''రేపు షూటింగ్ మధ్యలో కూడా యిలాగే అను''

''అప్పుడెందుకంటాం. నోరుమూసుకుని





షూటింగ్ చూస్తూ కూర్చుంటాం. లేదా నా పనుల్లో నేను బిజీగా వుంటాను. ఇప్పటికేం ఫరవాలేదు. చెప్పవయ్యా మొగడా" పట్టుదలగా అన్నాడు లక్ష్మణకుమార్.

చక్రి మొదలెట్టాడు

"షూటింగ్ ఎప్పుడు ఏది చేయాలనే ప్లాన్‌ని 'షెడ్యూల్ బ్రేకప్' అంటారు. అలా చేసే పని రోజుల్ని షెడ్యూల్ అంటారు. ఓ సినిమాని ఒకే షెడ్యూల్లో వరసగా చెయ్యొచ్చు. పధ్నాలుగు, పదిహేను షెడ్యూల్స్ దాకా కూడా చేసిన వారున్నారు. కొందరు రెండు, మూడు షెడ్యూల్స్‌లో చేస్తారు. అలా ఎందుకు చేస్తారంటే, మనకున్న ముఖ్య కారణం కాల్‌షీట్స్ ప్రాబ్లం. ముఖ్య నటులు, దర్శకుడూ, ఒకేసారి ఎక్కువ సినిమాలు చేస్తుండటంవల్ల, వాళ్లకున్న తీరికనుబట్టి చేయాల్సొస్తుంది. ఒక వూళ్ళో తీయాల్సిన సీన్లన్నీ దాదాపుగా ఒక షెడ్యూల్‌గా వేసుకుంటారు. అంటే ఆ వూరికి మళ్ళీ వెళ్ళాల్సిన అవసరం వుండదు. సింగిల్ షెడ్యూల్‌లో చేసేవాళ్ళు షిఫ్ట్ చేయాల్సొస్తే, అంటే లొకేషన్ మారాల్సొస్తే, ప్రయాణం చేసేరోజు తప్ప, మళ్ళీ మామూలుగా షూటింగ్ జరుగుతుంది. కాల్‌షీట్స్ ప్రాబ్లంవల్ల ఒకేవూళ్ళో ఒకటికన్నా ఎక్కువ షెడ్యూల్స్ చేసిన సినిమాలూ వున్నాయి. ఇదంత మంచి పద్ధతి కాదు కానీ తప్పనప్పుడు సర్దుకుపోతున్నారు.

ఇక మనలాంటివాళ్ళు... ఒకేచోట వరుసగా, ఆర్టిస్టులందర్నీ పెట్టుకుని చేసుకునేవాళ్ళు, లొకేషన్‌ని బట్టి షెడ్యూల్ వేస్తారు. అంటే చర్చ్‌లో జరిగే సీన్లన్నీ ఒకరోజు. మాలినీదేవి యింట్లో ఒకరోజు. ఇలా... కాల్‌షీట్ ప్రాబ్లం వున్నప్పుడు, నటుడు లేదా నటి వుండే సీన్సన్నీ వరుసగా, లొకేషన్లు మారుతూ తీసి, మిగతావి తర్వాత తీరిగ్గా లొకేషన్‌వైజ్ తీసుకుంటారు...

ఒక సీన్ ప్రాధాన్యతనిబట్టి, అందులో తను తీయాలనుకున్న షాట్స్ విధానాన్నిబట్టి అది ఎంతసేపట్లో తీయవచ్చో దర్శకుడు తన అసిస్టెంట్లకు వివరిస్తాడు. సాధారణంగా కోడైరెక్టర్‌గానీ అసోసియేట్ డైరెక్టర్‌గానీ షెడ్యూల్‌ని దర్శకుని సూచనలప్రకారం తయారుచేసి, ఆయనకు చూపిస్తాడు. చిన్న చిన్న మార్పులుంటే చేస్తారు. ఒకరోజు తీయవలసిన సీన్లన్నీ లేదా తీయగలిగిన సీన్లన్నీ ఆరోజు షెడ్యూల్. దీన్నే 'ప్రోగ్రాం' అంటుంటారు. సాధారణంగా ఒక ప్రదేశంలో తీయాల్సిన సీన్లన్నీ వరుసగా తీసేస్తారు. దీంట్లో, రాత్రి, పగలు తేడా కూడా వుంది. ఉదాహరణకు మనకు చర్చ్‌లో రాత్రి తీయాల్సిన సీన్ ఒక్కటే వుంది. అలాంటప్పుడు పగలంతా చర్చ్‌లోనూ, రాత్రి దగ్గర్లోని మరో లొకేషన్‌లోనూ తీస్తారు. లేదా రోడ్లపైన రాత్రి తీయాల్సిన సీన్స్ ఆ కాలంలో తీసుకుంటారు. ప్రతిదీ వీలునుబట్టి చూస్తూ, ఒకరోజుకు ఎన్ని సీన్లు తీయగలరో అన్నీ ప్లాన్ చేస్తారు. ఈ షెడ్యూల్ ప్రకారం ఏరోజు ప్రోగ్రాం ఆరోజు పూర్తిచేయటం దర్శకుని బాధ్యత. ఏదైనా కారణంవల్ల ఒకరోజు అవాంతరాలొస్తే దాన్ని మరోవిధంగా అధిగమించటం చేస్తారు. ఉదాహరణకు జూలీనీ, మురళి, స్టాప్‌లుక్ బోర్డు దగ్గర తీసే సీనుంది. జూలీ పాత్ర వేయాల్సిన నటి రావటం ఆలస్యమైందనుకోండి. లేదా మురళి వచ్చే మోటార్ సైకిల్ పంక్చరయిందనుకోండి. అప్పుడు, మరో నటుడి క్లోజ్ షాట్స్ తీస్తారు, ముందుగా. వీలుకాని పరిస్థితుల్లో, అంటే వర్షం వచ్చిందనుకోండి, యిండోర్ సీన్స్ ఏవైనా యిళ్లల్లో తీసుకుంటారు. అసలే వీలుకాక సమయం వృధా అయిందనుకోండి, అంటే మురళి మోటార్ సైకిల్‌మీంచి పడి కాలుకి దెబ్బ తగిలించుకున్నాడు. అప్పుడు, మరో సీన్స్ తీయాల్సిన రోజున వీటిని అడ్జెస్ట్ చేస్తారు. ఇలాంటి అవాంతరాలొచ్చినప్పుడు ఒకటి, రెండురోజులు ఆలస్యమవుతుందంతే.



పైఅధికారితో చీవాట్లు తిని, సీరియస్‌గా జీపులో వస్తున్నాడు విక్రమ్. అలా వస్తూ,

దారిలో ఒక బట్టల షాపుముందునుండి వెళు తూ, అక్కడ అరుగులమీద బట్టల పార్సిల్సు ఓపెన్ చేయటం గమనించాడు. ఏదో మెరి సింది.

కట్ చేస్తే,

పోలీస్ స్టేషన్‌ముందు జీపు ఆగింది. కొన్ని చెక్క పెట్టెలు దింపారు కానిస్టేబుల్స్. విక్రమ్ సైగచేయగానే ఓ కానిస్టేబుల్ ఓ పెట్టె మూత తెరిచాడు. ముక్కలుముక్కలైందది. మరో కాని స్టేబుల్‌ని మరో పెట్టె తెరవమన్నాడు. అదీ అలాగే ముక్కలైంది. మరో కానిస్టేబుల్ తెరి చిన మరో పెట్టె మూతా ముక్కలైంది.

అప్పుడు...

లోపల్నించి తీసుకొచ్చారు బ్రహ్మయ్యని. అతన్ని మూత తెరవమన్నాడు విక్రమ్. ఎందు కో అర్థంకాకపోయినా ఉత్సాహంగా తెరిచాడు బ్రహ్మయ్య. నీట్‌గా, పెచ్చు ఊడిపోకుండా తీశాడతను. అంతే, ఈడ్చితన్నాడు విక్రమ్, బ్రహ్మయ్యని.

'నా కొడకా, ఎందుకు చంపావు మురళిని' అన్నాడు...

లబోదిబోమన్నాడు బ్రహ్మయ్య, తాను చంప లేదని.

'ఫొటోల్లో నీట్‌గా తీసివున్న సమాధి పెట్టె మూత చూశాను గానీ, అదంతా నీట్‌గా ఎలా వుందో యిందాకర్థమైంది. అది ప్రొఫెషనల్ పనీ అని యింకా బుకాయించకు' - అన్నాడు విక్రమ్.

'నేను మూత తీశానుగానీ చంపలేద్సార్' అన్నాడు బ్రహ్మయ్య.

'కఫిన్ బాక్స్‌లో శవం పెడుతుండగా దాని చేతికి ఉంగరం చూశాను. దానికోసం తెగించి రాత్రిపూట వచ్చి సమాధి తవ్వాను. కానీ శవం కళ్ళు తెరుచుకోవటంతో భయపడి, లేచి పరు గుతీశాను. అంతలో కళ్లల్లో గుప్పున ఏదో వెలుగు పడింది. కామినీ పిశాచి అనుకున్నా ను. మరోదిక్కుకు పరిగెత్తిపోయాను' అని వివ రించాడు బ్రహ్మయ్య.

ఆ వెలుగు గురించి గుచ్చి, గుచ్చి అడిగా డు విక్రమ్.

అది దయ్యమై వుంటుందని తప్ప మరేమీ చెప్పలేక పోయాడు. అప్పటికి శవం ఛాతీలో కత్తిలేదని చెప్పాడు బ్రహ్మయ్య.

అతనితో ఓ సంతకం తీసుకుని వదిలేశారు. నిజానికి సమాధి తెరిచిన నేరమ్మీద అరెస్ట్ చేసి, కోర్టులో హాజరుపరచాలి. ఆ వివరాలన్నీ మనం చూపించటంలేదు....

బతుకుజీవుడా అనుకుని టీకొట్టు చేరుకు న్నాడు బ్రహ్మయ్య. జరిగినదంతా విని, తన మిత్రుడూ హత్యానేరం నుండి బైటపడిన శుభ సందర్భంలో తనే ఫ్రీగా యిస్తున్నానంటూ మందు ఆఫర్‌చేశాడు అమితాబ్.

'నేనివాళ మందు తాగనురా' అన్నాడు బ్రహ్మయ్య.

'నిజమా మామా' వెనకవున్న పోస్టర్‌లోని హీరోయిన్ పోస్టర్లోంచి బతికొచ్చి అడిగింది.

ఆశ్చర్యంగా వెనుతిరిగి చూసిన బ్రహ్మ య్యకు పోస్టరే కనిపించింది. మళ్ళీ యిటు తిరిగి 'నిజంగా యివాళ మందు ముట్టుకో నురా జీఫాలో' అన్నాడు బ్రహ్మయ్య.

'నువ్వు మందు ముట్టుకోనంటే ఇవాళంతా హడాల్సే' అని ప్రాణంపోసుకున్న పోస్టర్ హీరో యిన్ అంటుండగా, చప్పున వెనక్కి తిరిగి, సజీవంగా బైటికి లాగాడామెను. ఆమేరకు పోస్టర్ కట్ అయింది. ఈ పాత్రలో ఫేడ్ అయిన ఓ పెద్ద హీరోయిన్ని గానీ, ఒప్పు కుంటే ప్రస్తుతం బిజీగా వున్న హీరోయిన్ను గానీ పెడదామనుకుంటున్నాం. ఇక సాంగ్‌లో వేరే వాల్యూస్ అవసరంలేదు. అదే ఒక అట్రాక్షన్. ముఖ్యంగా ప్రేక్షకుడు థ్రిల్ అవుతా డు...

సరే, చకచకా అందెల చప్పుడు రిథమిక్‌గా వినిపిస్తుంటే హీరోయిన్ బైటికి నడిచింది.

'అత్తరు సాయెబా రారా' అన్న జానపద గీతం తీసుకుని, చిన్న చిన్న మార్పులు చేశాం. ఇదొక్కటే పాటకు ట్యూన్ కట్టాలి. మిగతావన్నీ ట్యూన్స్‌కే పాటలు రాయించుకుంటాం. దీంట్లో సాంగంతా ఫిమేల్ వాయిస్. మేల్ కోరస్ వుంటుంది. మధ్యలో 'ఉబ్బురుబ్బుర్' అనీ, 'హ డాల్స్' అనీ బ్రహ్మయ్య అరుపులుంటాయి. రిథమ్ ఆర్కెస్ట్రాలో 'టేప్' ప్రామినెంట్‌గా వుండాలి. కొన్ని ఫోక్‌లోర్ ఇన్‌స్ట్రుమెంట్స్ మాస్‌కు పట్టేట్టుగా వుండాలి. థియేటర్‌లో





అటు మాంఛి హీరోయిన్ డాన్సు చేస్తున్నందుకూ, యిటు పాట లైవ్లీ ట్యూన్‌లో వున్నందుకు జనం లేచి గంతులేయాలి. విజిల్స్ వెయ్యాలి. ఆపైన మీయిష్టం"

★ ★ ★

"కథ చాలా బావుంది సార్. ఓపెనింగ్ సీన్‌తో గ్రిప్‌లోకొస్తాడు ప్రేక్షకుడు. టైటిల్స్ పూర్తవగానే హారర్ మూడ్‌లోంచి లవ్ మూడ్‌లో పడిపోతాడు. మళ్ళీ యింటర్వెల్‌లో జూలీ ఏమైందో తెలీలేదని ఫాదర్‌ను చూపించి ఫ్రీజ్ చేయగానే మొదటి సీన్లో గుర్తుతెచ్చుకుని, జూలీని మురళి చంపివుంటాడని కొందరూ, అసలు వాళ్ళిద్దరూ ఏమయ్యారని మరికొందరూ రకరకాలుగా ఊహించుకుంటూ సెకండ్‌పార్ట్ స్టార్టవడానికి ముందే వచ్చి కూర్చుంటారు. వెంటనే సెకండ్‌రీల్లో మురళి కనిపించాడు. జూలీ, మాలిని కూతురని తెలిసింది. ఆ మరుక్షణమే ఊళ్ళోకొచ్చిన మురళి మామూలుగా మరణించాడు. అంతలో హారర్ బిల్డప్. శవాన్ని ఎవరో పొడిచారు. కాదు, కత్తిపోటుకే చచ్చాడని డాక్టర్ చెప్పటం. ఎవరు చంపారని సస్పెన్సు. డేవిడ్ కావచ్చని అనుకోగానే అతని ఆత్మహత్య. బ్రహ్మయ్య అనుకోగానే కాదని తెలియటం... చాలా వెరైటీగా వుంది కథ. ముఖ్యంగా నాకు రీరికార్డింగ్‌కు చాలా బావుంది. సీన్స్‌లో ఎక్కువగా విజువల్సే వున్నాయి. డైలాగ్స్ తక్కువగా వున్నాయి. కనుక రీరికార్డింగ్‌కు మంచి స్కోప్ వుంది. అంతేగాక అటు లవ్‌ట్రాక్, యిటు సస్పెన్స్ ట్రాక్, మంచి మ్యూజిక్ యివ్వొచ్చు. ఇక మీరు సాంగ్ సీక్వెన్సులూ, స్కీములూ చెబితే ట్యూన్స్ మొదలుపెడదాం" అన్నాడు మ్యూజిక్ డైరెక్టర్ మునిమాణిక్యం.

అప్పుడప్పుడే తారాజువ్వలా దూసుకొస్తున్న మునిమాణిక్యంను ఒక సినిమా మ్యూజిక్ సిట్టింగ్స్‌లో చూశాడు చక్రి. ఎంతో ఓపిగ్గా, డైరెక్టర్ చెప్పే ప్రతీ విషయానికీ ప్రాధాన్యతనిస్తూ, తన సలహాలు సున్నితంగా చెబుతూ ఆయన చేసిన వర్క్ చక్రికి బాగా నచ్చింది. అవన్నిటినీ మించి ఆయన టాలెంట్. అందుకే పెద్ద పేరున్న మ్యూజిక్ డైరెక్టర్స్‌ను తీసుకుందామని గోవిందూ, శ్రీరామచంద్రుడూ అంటే వినకుండా ఆయన్నే తీసుకోవాలని నచ్చచెప్పాడు చక్రి. వీళ్ల చర్చలన్నీ పూర్తయిన కాలవ్యవధిలో ఆయన పెద్దవాళ్లల్లో చేరిపోయాడు కూడా. కొత్త డైరెక్టర్‌కు, తనని డామినేట్ చేయకుండా, తనకి కావలసిన పని చేయగల టెక్నీషియన్స్ పెద్ద ఎస్సెట్ అవుతారు. అందువల్ల గూడా మునిమాణిక్యంతో చక్రి చాలా హాయిగా పనిచేసుకోగలిగాడు.

"సార్, యిది నా మొదటి పిక్చర్. నాకు కొన్ని ఆలోచనలున్నాయి.అందులోబాగాలేవనుకున్నవి మీరు చెప్పండి. నిజమేననిపిస్తే మీరు చెప్పినట్టే చేస్తాను. ఒకవేళ నాకు నచ్చలేదనుకోండి. ఈ ఒక్కసారికీ నా ఆలోచనకే ప్రిఫరెన్సివ్వండి. ఇది నా మొదటి పిక్చర్. ఐ వాంట్ టు ప్రూవ్ ఆర్ డిస్‌ప్రూవ్ మైసెల్ఫ్"

"భలేవారండీ... మొదటి సినిమాకే డిస్‌ప్రూవ్ అని అపశకునమెందుకు? మీరు సక్సెస్ అవుతారనే ఆశిద్దాం. అవ్వాలనే కోరుకుంటాను. ఈ సినిమాకు మీరు డైరెక్టర్. డైరెక్టరీజ్ ద కెప్టెన్. మీకు ఎలా కావాలో అలా చేయించుకోండి. మీకు నచ్చేవరకూ చేయటం నా బాధ్యత. ట్యూన్స్ విషయంలో, మ్యూజిక్ విషయంలో డైరెక్టర్‌గారిష్టం. ఖర్చు విషయంలో ప్రొడ్యూసర్‌గారిష్టం. ఇది నా పాలసీ. ఇక మీ యిద్దరికీ క్లాష్ వచ్చినప్పుడు, అంటే మీరు చెప్పేంత ఖర్చు వద్దని నిర్మాతగారంటే నేను సలహా యిస్తాను. అనవసరమనిపిస్తే, అవునండీ వద్దని మీకు చెబుతాను. వుంటేనే బాగుంటుందనిపిస్తే ప్రొడ్యూసర్‌గారికి చెబుతాను. జస్ట్ సజెషన్. ఆ తరువాత నిర్ణయం మళ్ళీ మీదే" నవ్వుతూ వివరించాడు మునిమాణిక్యం.

"మనకు మొత్తం సిక్స్ సాంగ్స్. అన్నిటికన్నా ముందుగా ఒక నర్సరీ రైమ్. అంటే టోటల్ సెవెన్ సాంగ్స్. ఆ రైమ్ ప్రీతీసాగర్ పాడింది వుంది. రైట్స్ ఎవరి దగ్గరున్నాయో కనుక్కుని, పర్మిషన్ దొరికితే అడాప్ట్ చేసుకుందాం. లేదంటే అదీ రికార్డ్ చేసుకుందాం. అది నైంటీ సెకండ్స్ డ్యూరేషన్. సాంగ్స్ కంటిన్యుయస్‌గా చేస్తాం గనుక ఎక్కడో అడ్జెస్ట్ యిపోతుంది. సెపరేట్ ఆర్కెస్ట్రా బిల్లూ, థియేటర్ బిల్లూ అవసరం రాదనుకుంటాను. సింగర్‌కు పే చేస్తే సరిపోతుంది" అన్నాడు




చక్రి.

పాటల రికార్డింగ్, సినిమా నిర్మాణంలో ఓ ముఖ్యమైన ఘట్టం. కొన్ని పాటలు మూడు నిమిషాలుంటాయి. కొన్ని పాటలు ఎనిమిది, తొమ్మిది నిమిషాలుంటాయి. పాటలు రికార్డ్ చేసే థియేటర్‌కు గంటల లెక్కన అద్దె చెల్లించాలి. కొన్నింటికి కాల్‌షీట్ లెక్కన వుంటుంది. కాల్‌షీట్ అంటే అంటే ఎనిమిది గంటలు. ఓ పాట రికార్డు చేయడానికి థియేటర్ అద్దె సుమారుగా 2 వేల రూపాయలవుతుంది. దాని తర్వాత ఆర్కెస్ట్రా. అంటే వాయిద్యాలు. పాతకాలంలో ప్రతీ వాయిద్యానికీ 2 వందల రూపాయలు ఇచ్చేవాళ్ళు. ఇప్పుడు ఎలక్ట్రానిక్ వాయిద్యాలు, అంటే సింథసైజర్స్ వచ్చాయి. అదో చిన్నసైజు కంప్యూటర్. ఒక సింథసైజర్‌లో చాలా వాయిద్యాల ధ్వనులు వస్తాయి. కనుక ఇప్పుడు ప్రత్యేకమైన వాయిద్యాలను ఉపయోగించటం తగ్గింది. అందువల్ల వాయిద్యానికిచ్చే రేటు సంగీత దర్శకులు నిర్ణయిస్తుంటారు. సాధారణంగా దేనికీ 3 వందల రూపాయలు మించదు. ఒక వయొలినో, సితారో, మృదంగమో కావాలంటే ఆ వాద్యకారుడు తానే వాయిద్యాన్ని తెచ్చుకుని వాయిస్తాడు. అందుకిచ్చే సొమ్ము అతని వాయిద్యం అద్దె ప్లస్ అతను వాయించినందుకిచ్చే రెమ్యూనరేషనూ అన్నమాట. అదే ఎలక్ట్రానిక్ వాయిద్యాలకైతే 12 వందల రూపాయల నుండి వుంటుంది సుమారుగా. ఇక ఈ అద్దె లెక్క కాల్‌షీట్‌ని బట్టిగాక ఒక నిడివిని బట్టి వుంటుంది.

ఒకపాట అంటే 5 నిమిషాలు... అంటే పాట వ్యవధి 5 నిమిషాలకు తగ్గినా పూర్తిసొమ్ము ఇవ్వాలన్నమాట. అది 5 నిమిషాలని దాటినప్పుడు అదనంగా సగం అద్దె లెక్కగట్టాలి. అంటే ఉదాహరణకు ఒకపాట నిడివి 320 సెకన్లనుకుందాం. అంటే 5 నిమిషాలకన్నా 20 సెకన్లు ఎక్కువుంది. ఆ పాటలో వయొలిన్ వినిపించేది 10 సెకన్లే అనుకుందాం. వయొలిన్ 300 రూపాయలు ఇస్తారనుకుంటే, అది వినిపించేది పాట మొత్తంలో 10 సెకన్లే అయినా నిడివి 5 నిమిషాలు దాటినందువల్ల 150 రూపాయలు అదనంగా ఇవ్వాలి. పాట నిడివి 5 నిమిషాలు దాటితే, ప్రతి వాయిద్యానికీ ఇదేలెక్కన లెక్కకట్టి ఇవ్వాలి. ఆ పాటలో ఆ వాయిద్యం ఎంతసేపు వినిపించినా సరే. అందువల్ల సాధారణంగా 5 నిమిషాలు దాటకుండా చూసుకుంటారు. అలా దాటినప్పుడు, చిన్న బిట్ ఏదైనా వుంటే అప్పుడే రికార్డు చేస్తారు. అందువల్ల ఈ అదనపు చెల్లింపును కొంత సద్వినియోగం చేసుకున్నట్లవుతుంది. సాధారణంగా 5 నిమిషాల నిడివి దాటని ఒకపాట ఆర్కెస్ట్రా బిల్లు 7 నుండి 12 వేలవరకూ ఉంటుంది. సంగీత దర్శకుడూ, నిర్మాతా, దర్శకుడూ, సినిమా బడ్జెట్‌లాంటి అంశాలతో ఒక్కోసారి ఇది ఇంతకు 5, 6 రెట్లు మించి కూడా అవుతుంది. అది పెద్ద సినిమాల సంగతి.

ఇక పాటలో కోరస్, అంటే గాయకుల బృందం వున్నప్పుడు. బృందగానం ఉండాల్సిన స్థాయిని బట్టి 4, 5 నుండి 20 మంది వరకూ బృందగాయకులుంటారు. వీళ్లకు 200 రూపాయల చొప్పున చెల్లిస్తారు. ఇక ముఖ్యగాయకులు. వీళ్లు సాధారణంగా పాట నిడివిని బట్టి పేచీలు పెట్టరు. వీళ్ల పారితోషికం కూడా స్థాయిని బట్టి పాటకు రూ॥ 1,000 నుండి రూ॥ 5,000 వరకూ ఉంటుంది. ముఖ్యగాయకులు రానప్పుడు ట్రాక్ సింగర్స్‌తో పాడిస్తారు. పాటను కొన్ని ట్రాక్‌లపైన, విడిగా విభజించి రికార్డు చేస్తారు. లయ వాయిద్యాలు ఒక ట్రాక్, ముఖ్యమైన వాయిద్యాలు వేర్వేరు ట్రాక్‌లు, గాత్రం ఒక ట్రాక్ ఇలా వుంటుంది. ఇందులో ఏదైనా అదనంగా కలపాలనుకున్నప్పుడు ఆ ప్రత్యేక ట్రాక్ పైన కలుపుతారు. తొలగించాలనుకున్నా ఆ ట్రాక్‌నుండి తొలగిస్తారు. ఒకరి మూలంగా ఏదైనా ఇబ్బంది కలిగితే, ఆ ఒకరిదీ వేరే ట్రాక్‌పై ప్రత్యేకంగా రికార్డు చేస్తారు. అంటే, ఒక్కరి మూలంగా మిగతావాళ్లంతా మళ్లీ మళ్లీ వాయించాల్సి వుండదు. అలాగే గాయకులు పాడటం కూడా. ఒక గాయకుడి మూలంగా మరో గాయకుడికిగానీ, ఆర్కెస్ట్రాకుగానీ లేదా ఆర్కెస్ట్రా మూలంగా గాయకుడికి గానీ ఇబ్బంది వుండదు. ఈ సౌకర్యాలు లేనప్పుడు ఏ ఒక్కరు పొరపాటు చేసినా, మళ్లీ అందరూ మొదటినుండి మొదలుపెట్టి వాయించటం, మళ్లీ మళ్లీ పాడటం జరిగేది. ఇప్పుడు మరో

సౌకర్యం ఏమిటంటే, పాట రికార్డు చేస్తున్నప్పుడు గాయకుడికి వీలులేకపోతే, మరొకరు పాడతారు. ఇలా పాడేవాళ్లను 'ట్రాక్ సింగర్స్' అంటారు. వీళ్లకు సుమారుగా 200 నుండి 500 వరకూ చెల్లిస్తారు. అసలు గాయకుడు వచ్చిన తరవాత ఈ ట్రాక్‌సింగర్ పాడింది తొలగించి, అతనితో పాడిస్తారు. ఆ తరవాత ఈ ట్రాక్‌లన్నిట్నీ మిక్స్ చేస్తే పాట పూర్తవుతుంది. 'ట్రాక్ సింగర్స్'లో కూడా ప్రతిభావంతులుంటారు. ఇవాళ ప్రముఖంగా వినిపిస్తున్న నాగూర్‌బాబు, ఒకప్పుడు శ్రోతలకు వినిపించని ట్రాక్ సింగరే.

ఈవిధంగా ఒకపాట రికార్డ్ చేయటానికి కవికి ఇచ్చే పారితోషికం కూడా కలుపుకుంటే మొత్తంమ్మీద 25 వేలకు తక్కువవదు. ఓ పాటకు 25 వేల లెక్కన ఖర్చయితే గొప్ప విషయమే. "ఓ పాటవల్ల సినిమాకు అదనంగా వచ్చేదేముంటుంది గనుక? ఆ పాతికా మాకిస్తే మరింత పకడ్బందీగా కథ రాస్తాం కదా' అంటుంటారు కొందరు రచయితలు.

"ఏ రైమ్ సార్ అదీ?" ఆరాతీశాడు మునిమాణిక్యం.

"ఓల్డ్ కుక్ డొనాల్డ్ హాడేఫాకు ఇయ్యా ఇయ్యావో అని నాలుగైదు జంతువుల పేర్లొస్తాయందులో. ఏ జంతువు పేరొచ్చినప్పుడు, ఆ జంతువు గెటప్‌లో చూపిస్తాం పిల్లని. ఇది కాస్ట్యూమ్ సాంగన్నమాట. ఈ కాస్ట్యూమ్స్‌కే 20 వేలనుకున్నాం. కానీ పిల్లలకు చాలా బాగుంటుంది, చూడటానికి. జూలీ ఇంటికొచ్చి ఫాదర్‌ని కలిసి విక్రమ్ జీపులో వెళుతున్నప్పుడు, చిన్నప్పటి జ్ఞాపకాలుగా ఈ రైమ్ చూపిస్తాం. పాటంతా పావురం వుంటుంది. రైమ్ అయిపోగానే పావురం చచ్చిపోయే సీను. అద్దైపోతే విక్రమ్, జూలీ కాలేజ్ దగ్గరికొస్తాడు" చెప్పి కాసెట్లోంచి రైమ్ తీసి వినిపించాడు చక్రి "ఇది మన ఫస్ట్ సాంగన్నమాట" అంటూ.

"బావుందండీ... మనం రికార్డు చేసుకోవచ్చు" అన్నాడు మునిమాణిక్యం విని.

"జూలీని ఫస్టటైం చూసి, విక్రమ్ ఇంటికెళ్లి డాన్స్ చేసే సీన్లో ఇంటర్‌కట్‌గా సెకండ్ సాంగండీ. నిజానికి ఈ సాంగూ, ప్రియ సాంగూ మేం ముందు అనుకోలేదు. పెద్ద హీరోని తీసుకుంటున్నాం గనుక, ఆయన కేరెక్టర్ కొంచెం ఎలాబరేట్ చేయాలని పెట్టాల్సొచ్చింది. ఈ సెకండ్ సాంగ్ క్లాసికల్‌గా, సాఫ్ట్‌గా, వినటానికి హాయిగా వుండేట్టు వుంటే బావుంటుంది సార్. విక్రమ్ కేరెక్టర్ కూడా జెంటిల్‌గా చూపిస్తున్నాం గనుక పిచ్చిగంతులేవీ లేకుండా నిండుగా వుండేట్టుంటే బావుంటుందనుకుంటున్నానండీ. ఈ సాంగ్‌లో మినియేచర్స్ వాడుదామనుకుంటున్నాను. పాటంతా సాఫ్ట్ లైటింగ్‌లో ప్లజంట్‌గా వుంటుంది. అలాగే డాన్స్ అనగానే డాన్స్ మ్యూజిక్ కాకుండా ఫ్లూట్ బిట్స్‌మీద చూపిద్దామనుకుంటున్నాను..."

"అంటే సాంగ్‌లో ఫ్లూట్ మెయిన్ ఇన్‌స్ట్రుమెంట్‌గా పెడదామా?"

"కాద్సార్... జూలీ, మురళిల సీన్స్‌కి రీరికార్డింగ్ ఫ్లూట్‌మెయిన్‌గా చేద్దామని వుంది. అందుకని విక్రమ్ వున్న సీన్స్‌లో ఫ్లూట్ ఎక్కువ రాకుండా చూసుకోవాలి. సాంగ్‌లో చిన్న ఇంటర్ కట్స్‌లో అతను గదిలో డాన్స్ చేయడం చూపిస్తాం. మొత్తంమీద ఇరవై సెకన్స్ మించి ఈ సాంగ్‌లో ఫ్లూట్ వుండకూడదు"

"ట్యూన్ ప్యూర్ క్లాసికల్‌గా వుండాలా?"

"అహహా... క్లాస్ టచ్ వుండాలి. ఏదైనా పాపులర్ రాగం తీసుకునో, ఒకటి, రెండు రాగాలు కలుపుకునో కట్టండి"

"సాధారణంగా మనకు కళ్యాణి, భూపాలం ఇలాంటిచోట్ల పాపులర్. మనం మలయమారుతం తీసుకుందాం. అదీ భూపాలానికి దగ్గరగా వుంటుంది"

"మీ ఇష్టం. 'నాకు క్లాసికల్ మ్యూజిక్ గురించి ఏమీ తెలియదు. సంగీతం విని, బాగుందా లేదా చెప్పటంవరకే తెలుసు" నవ్వుతూ చెప్పాడు చక్రి.

"ఓకే... తరవాత?" ప్రశ్నించాడు మునిమాణిక్యం.

"చరణాలకు మధ్యలో వాటిని బ్రేక్ చేస్తూ స్వరాలు, చరణం మధ్యలోనే, చివర్లనో ఒక లెంథీ బిట్ స్వరాలు... స్వరాలు బిట్స్‌గా వచ్చినప్పుడు చిన్నప్పటి జూలీ, విక్రమ్‌లను చూపిస్తాం. లెంథీ బిట్‌లో ఓ ఇన్‌సెట్‌లో చిన్నవాళ్లు, మరోవైపు పెద్దవాళ్లు ఇలా చూ




# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

పిస్తాం. ఫస్ట్ చరణం తరవాత బిజీయమ్‌లో భరతనాట్యం చూపిస్తాం. డాన్సూ, మ్యూజిక్కూ రెండూ ఒకేవిధంగా వుండి మొనాటినీ రాకుండా ఈ మ్యూజిక్కంతా ఇన్‌స్ట్రుమెంట్స్‌తో కాకుండా కోరస్ హమ్మింగ్స్, ఎలక్ట్రిక్ గిటార్ లాంటి డిఫరెంట్ ఇన్‌స్ట్రుమెంట్‌తో కంపోజ్ చేయవచ్చా?''

''తబలా, మృదంగం లాంటిదేదైనా బ్యాక్ గ్రౌండ్‌లో వుంచొచ్చా''

''వీలైనంత తక్కువ, వీలైతే అసలు లేకుండా వుంటే బావుంటుందని. పాట వినే య్యగానే పిక్చరైజేషన్ చేసేట్టు వుండకుండా వుండాలని'' నవ్వుతూ చెప్పాడు చక్రి.

ఆలోచిస్తూ వుండిపోయాడు మునిమాణి క్యం.

''మీకు ట్రబుల్ ఇస్తున్నట్టున్నాను...'' కాస్సే పటికి మళ్లీ అన్నాడు చక్రి.

''భలేవారే. మీకు ఎలా కావాలో అలా చేసిస్తాను సార్. మీరేం మొహమాటపడొద్దు. మీరు చెప్పింది బాగుండదనుకున్నప్పుడు నేనే చెబుతాను. అంతవరకూ మీరు కంగారుప డకండి. రిథమ్ లేకపోతే డాన్సు కంపోజింగ్ కష్టమవుతుందేమోనని ఆలోచిస్తున్నాను. పోనీ రిథమ్‌ని వేరే ఇన్‌స్ట్రుమెంట్స్‌తో చేద్దామా?''

''మామూలుగా వినేవాడికి 'ఇక్కడ భరతనా ట్యం వుంటుంది' అనే ఐడియా రాకుండా వుంటే చాలు''

''ఒకే... మొదలు పెడదామా?''

''చిన్న విషయం సార్'' అడ్డుతగిలాడు చక్రి. ''ఓపెనింగ్ మ్యూజిక్ మన సాంగ్ కన్నా ఫాస్ట్‌గా వుండాలి. 'ఆహా జూలీ నామీద జోక్స్ ప్లే చేసిందంటే నేను ఆమె మనసులో వున్నట్టే కదా' అనుకుని ఉత్సాహంగా వస్తున్నాడు విక్రమ్. ఆ ఉత్సాహం మూడ్‌నుండి 'సాంగ్ ఇల్యూజన్'లోకి వెళ్లిపోతాడు. అంటే సాంగ్‌లోకి కట్ అయ్యేసరికి ఆ సాఫ్ట్‌నెస్‌లోకి వచ్చేసిన ఫీలింగ్ రావాలి. దానిముందుగా ఫాస్ట్‌నెస్ వున్నప్పుడు, కాంట్రడిక్షన్ ఎక్కువై, ఆ ఫీలింగ్ మరింతగా వస్తుంది''

''ఒకే సార్... బీజీయమ్స్ మనం ఎలా కావాలంటే అలా కలుపుకోవచ్చు. ముందు ట్యూన్స్ ఒకే చేసుకుంటే అవి సింపుల్‌గా అయిపోతాయి''

''రైట్ సార్... ఇక మొదలెట్టండి''

హార్మోనీ పెట్టెకు నమస్కరించి, కాస్సేపు ఆలోచించి మొదలెట్టాడు మునిమాణిక్యం. సన్నగా వాయిస్తూ, తబలిస్టుకూ, గిటారిస్టుకూ సూచనలిచ్చి వాళ్లు వాయించింది విని సరిచే శాడు. ఆయన వేళ్లు హార్మోనీ మెట్లమీద కదు లుతున్నాయి. తబలా, గిటారు- అందుకనుగు ణంగా మోగుతున్నాయి. కాస్సేపటికి ఆయన సైగ చేయగానే వాళ్లు ఆగుతున్నారు. ఆయన మళ్లీ ఆలోచించుకుని మళ్లీ వాయిస్తున్నాడు. మళ్లీ దరువు కలుపుతున్నారు తబలిస్టు, గిటా రిస్టు. చక్రితోసహా అందరికీ అయోమయంగా వుంది. అయిదారు నిమిషాలకు ''వినిపిస్తాను సార్'' అని మొదలెట్టాడాయన.

'తననా'లలో పాడాడాయన. ఏకాగ్రతతో విన్నాడు చక్రి. కాస్సేపు ఆలోచించి మళ్లీ వాయించమన్నాడు. మళ్లీ వినిపించాడు ము నిమాణిక్యం. 'ఎలా వుందన్నట్టు' మిగతావాళ్ల వైపు చూశాడు చక్రి. వాళ్లు తెల్లముఖాలు పెట్టారు, ఏమీ అర్థం కాలేదన్నట్టు. మరోసారి కూడా విని చెప్పాడు చక్రి

''చాలా స్లోగా వున్నట్టుంది... పాతాళభైరవీ, పాండవవనవాసం రోజులకు వెళ్లినట్టు'' సర దాగా చెప్పాడు.

చిన్నగా నవ్వాడు మునిమాణిక్యం- ''శంక రాభరణం, సప్తపది దగ్గరకు రమ్మంటారా?''

''ఊహూ... 1992లోకి వెళ్లండి'' అదే ఊపులో బదులిచ్చాడు చక్రి.

అర్థమైనట్టు నవ్వాడాయన. కాస్సేపు నిశ్శ బ్దం. మళ్లీ ప్రసవ వేదన. తల్లికన్నా గొప్పవాడు కళాకారుడు. తలుచుకుంటే క్షణాల్లో కళాసృష్టి చేస్తాడు. శిశువుకన్నా గొప్పది కళ. నూరేళ్లు దాటినా నిలిచివుంటుంది. అందుకేనేమో 'ఆ ర్టీజ్ లాంగ్, లైఫీజ్ షార్ట్' అన్నారు.

కాస్సేపటికి రెండో ట్యూన్ వినిపించాడా యన. దాన్ని మూడుసార్లు విని చెప్పాడు చక్రి ''చాలా బాగుంది సార్''

''మరోసారి వింటారా?'' ఉత్సాహంగా అడి గాడాయన.

మౌనంగా తలూపాడు చక్రి, వింటానన్నట్టు.





ఆ తరవాత చరణం కంపోజింగ్... అది మరో రాగంలో తీసుకున్నాడాయన. ఆ రాగంలో మూడురకాల ట్యూన్స్ వినిపించినా చక్రికి నచ్చలేదు. చక్రి చెప్పిన మీదట మరోరాగం తీసుకున్నాడు. అది మొదటి ట్యూనే నచ్చింది. దాన్ని శ్రద్ధగా నాలుగుసార్లు విని చెప్పాడు చక్రి

''మూడు బిట్స్ లిరిక్, రెండు బిట్స్ స్వరాలు. ఈ రెండు బిట్స్ స్వరాలలో రెండోది ఇన్‌స్ట్రుమెంట్‌లోకి మార్చుకుంటే?''

''మార్చుకోవచ్చు'' కాస్సేపు ఆలోచించి చెప్పాడాయన.

''అదే ట్యూన్‌లో రెండు లైన్లున్నాయికదా. మొదటి లైన్‌లో మొదటి మూడు బిట్స్ లిరిక్, ఒక బిట్ స్వరాలు, ఒక బిట్ ఇన్‌స్ట్రుమెంట్. అది రెండోలైన్లో తారుమారుచేసి, మొదటి మూడు బిట్స్ లిరిక్, ఒక బిట్ ఇన్‌స్ట్రుమెంట్, లాస్ట్‌బిట్ స్వరాలు వేసుకుంటే?'' మళ్లీ ప్రశ్నించాడు చక్రి.

''అంత బావుండదు సార్. రెండు లైన్లూ మీరు ముందు చెప్పినట్లుగానే బావుంది. ఓసారి వినిపిస్తాను. వినండి'' అని వినిపించాడాయన.

విన్నాక చెప్పాడు చక్రి.

''మొదటి చరణంలో లెందీ స్వరాలున్నాయి కదా, దీన్ని రెండో చరణంలో ఆలాపనగా చేసుకోవచ్చా?''

''మేల్ వాయిసా, ఫిమేల్ వాయిసా?''

''ఏదైనా ఫర్లేదు సార్''

''ఫిమేల్ వాయిస్‌లో బావుంటుంది''

ఆ చరణం కూడా వినిపించాడాయన, స్వరాలను ఆలాపనగా మార్చి. ఒక ట్యూన్ అయిపోయింది. దీన్ని టేప్‌రికార్డర్‌లో రికార్డు చేశారు.

మ్యూజిక్ డైరెక్టర్ వెళ్లిపోయాక అడిగారంతా చక్రిని

''మ్యూజిక్ సెట్టింగ్స్ ఇంత కష్టమా?''

''కష్టేఫలే అన్నారు బాబూ. మునిమాణిక్యంగారు కూడా చెప్పారుగదా, ఇది సూపర్ హిట్టవుతుందని. మ్యూజిక్ డైరెక్టర్‌కు, డైరెక్టర్ టేస్ట్ తెలిసేవరకూ కొంత కష్టం అనిపిస్తుంది. ఆ తరవాత ఇంత కష్టంగా వుండదు. ఇక ఈ ట్యూన్‌కి పాట రాయించాలి''

''అదీ ఇంతేనా?''

''డైరెక్టర్ చెప్పింది కవికి అర్థమైతే అయిదు నిమిషాల్లో అయిపోతుంది. త్వరగా ఇద్దరూ ఒక ఫ్రీక్వెన్సీలోకి రాకపోయినా, పొరపాటున ఆరోజు కవిగారి మూడ్ బాగా లేకపోయినా చాలా ఆలస్యమవుతుంది''

★ ★ ★

''టీనేజ్ జంట యుగళగీతం. వెరీగుడ్. ఏమైనా ప్రత్యేకంగా రాయాలా, క్యాజువల్‌గా వుంటే సరిపోతుందా?'' అన్నాడు అన్వేషి. ఆయన తెలుగు సినిమా కవిగా ప్రసిద్ధుడు.

''లేద్సార్... చాలా ప్రత్యేకంగా వుండాలి'' అన్నాడు చక్రి.

''ట్యూన్ విందాం. ఓసారి ముందుగా''

అసిస్టెంట్ డైరెక్టర్ చందర్‌వైపు చూశాడు చక్రి. సూట్‌కేసులోంచి టేప్‌రికార్డర్ తీసి బైటపెట్టాడు చందర్. మునిమాణిక్యం ఇచ్చిన ట్యూన్ విని చెప్పాడు అన్వేషి

''స్లోగా, రిథమ్ ఇన్‌స్ట్రుమెంట్ లేకుండా స్టార్టయి, మధ్యలో హైపిచ్‌లో అందుకని తబలా పడగానే బలే అందం వచ్చింది ట్యూన్‌కు. ఎవరూ మ్యూజిక్?''

''మునిమాణిక్యం గారండీ''

''మంచి స్పార్కుంది కుర్రాడి దగ్గర. చాలా చకచకా పైకొచ్చేస్తున్నాడు. చరణం ట్యూనింగ్‌లో మంచి ఊపొచ్చింది. టీనేజ్ లవ్ సాంగ్ సొగసంతా అక్కణ్ణించొచ్చింది'' సంగీత బాణీని మెచ్చుకుని ''చెప్పండి, ఎలా వుండాలి'' అన్నాడు అన్వేషి.

''పాట స్లోగా స్టార్టయితే అందంగా వుంటుందని అలా తీసుకున్నాం. ఆ నెమ్మదితనాన్ని మీ లిరిక్ బ్రేక్ చెయ్యాలి. భావం కుర్రకారును ఆకట్టుకునేలాగా వుండాలి''

''ఇంగ్లీష్ మాటలు వాడొచ్చా''

''చిన్న చిన్నవి వాడండి, ఫర్లేదు... సిట్యువేషనేంటంటే, అమ్మాయి వెంట ఎన్నోరోజులుపడి, ఆమె కోపానికి బలై, మరో ఇద్దరితో పోటీపడ్డాడు అబ్బాయి. ఆరోజు ఆమెను ప్రేమిస్తున్నందుకు, ఆమె ముందరే మరొకతను చితగ్గొట్టాడతన్ని. మౌనంగా తన్నులన్ని భరించాడు''

సన్నివేశం వివరించాడు చక్రి. "ఆ ఇద్దరి చూపుల పైనుండి లీడ్ మ్యూజిక్ స్టార్టయితే, నెమ్మదిగా సాంగ్‌లోకి కట్ చేసుకుంటాం. ఇప్పుడు వాళ్లకు ప్రేమ తప్ప మరేమీ తెలియదు. ప్రేమించుకోపటం తప్పు కాదనీ, ప్రేమించుకోవటం యువతరం హక్కనీ ఈ పాటలో మిగతా వాళ్లకు ప్రబోధిస్తారన్నమాట. ఈ సాంగ్‌ని, లిరిక్ పోర్షనంతా పబ్లిక్‌రోడ్లు, బస్సులు, లోకల్ ట్రెయిన్లు, ఫుట్‌పాత్‌లు, కాలేజీలూ లాంటిచోట్ల చిత్రిస్తాం. అంటే బజారునపడి ప్రేమ ఉద్యమం మొదలెట్టారన్నమాట. పాట చాలా తమాషాగా, హుషారుగా కుర్రకారును ఆకట్టుకునేటట్టుండాలి"

విన్నాక టేప్‌రికార్డర్ పెట్టుకుని పల్లవి రెండు మూడుసార్లు విని, కాస్సేపు ఆలోచించి, కాగితంమీద రాసి చూపించాడు అన్వేషి.

**"అడగాలీ అబ్బాయంటా అలగొద్దూ అమ్మాయంటా**

**అవునంటే అమ్మాయంటా సయ్యంటూ లవ్వేనంటా"**

చదివి తనలో తను ట్యూన్ కనుగుణంగా పాడుకుని చెప్పాడు చక్రి

"అడగాలీ అని ఎత్తుకోవటం కాస్త ఇబ్బందిగా వుంది సార్. పాట నోళ్లల్లో నానేట్టుగా వుంటే బావుంటుంది. భావం కూడా ఇంకాస్త కొత్త టైప్‌తో..."

**"ఐ లవ్ యూ అంటే ప్రేమ యూ లవ్ మీ అంటే ప్రేమ**

**పదహారేబాటే ప్రేమ జలసాలజోరే ప్రేమ"** మళ్లీ రాసేడు అన్వేషి.

"బావుంది సార్. అయితే ప్రేమను నిర్వచించినట్టుగా వుంది. మనకలా కాదు, కాస్త ప్రబోధించినట్టుగా అనిపించాలి. 'ప్రేమ' అనేది చాలా క్యాజువల్, దానికోసం కష్టపడనవసరం లేదన్నట్టుండాలి" నున్నితంగా వివరించాడు చక్రి.

అన్వేషి చాలా పెద్ద కవి. వయను చక్రి వయనుకు రెట్టింపు వుంటుంది. ఆయనకేమైనా కోపమొస్తుందేమోనని గాభరాగా చూడసాగాడు గోవిందు. కానీ ఆయనకలాంటి ఆలోచనేదీ వున్నట్టులేదు. తన ఆలోచనల్లో తనున్నాడు.

"హీరో, హీరోయిన్ల పేర్లేంటి? అవేమైనా వాడొచ్చా?" ప్రశ్నించాడాయన.

"హీరోయిన్ పేరు జూలీ. హీరో పేరు మురళి. మురళి పేరును 'పిల్లనగ్రోవి' అనే అర్థంతో మాత్రం వాడకండి.
ఎందుకంటే అలా సీన్స్‌లో వాడుకున్నాం. అంతేగాక పాటలో 'ఫ్లూట్' మెయిన్ ఇన్‌స్ట్రుమెంట్. ఒకటే రిపిటీషన్‌లా వుంటే బావుండదు"

**"ఓ లవ్‌లీ లవ్‌లీ జూలీ- ఓ జాలీ జాలీ జానీ**

**కలిపారా చేయి చేయి- లవ్వేగా ఎల్‌వోవీయీ"** ఠక్కున చెప్పాడాయన- "ఓ జానీ- అన్నాం గనుక 'నమ్ ఎక్స్' అన్న అర్థంలో తీసుకోవచ్చు. పేరు మారిందనుకోనక్కర్లేదు" వివరించాడు.

అర్థమైనట్టు తలూపాడు చక్రి. కాస్సేపు ఆలోచించి చెప్పాడు

"థాట్‌వరకూ బావుంది సార్. కానీ క్యాచీగా అనిపించటంలేదు. కాస్త వినగానే అర్థమయ్యేట్టూ, చిన్న చమక్కుతో వుంటే బావుంటుంది... సారీ, మీకు ట్రబుల్ ఇస్తున్నట్టున్నాను"

చక్రి చివరిమాటల్ని పట్టించుకోకుండా తన ఆలోచనల్లో మునిగిపోయాడాయన.

అయిదారు నిమిషాలకు, ఆ రెండు లైన్లతో పాటు మొత్తం పల్లవంతా పాడి వినిపించాడు.

**"అయ్యయ్యో టీనేజంటా- అమ్మమ్మో కాలేజంటా**

**సిలబస్సూ లవ్వేనంటా- మనసిచ్చే పాసవ్వంటా**

**అమ్మమ్మా, మన తాత ఈలలే** సరిగమ

ఎన్నెన్నో... **కథలైన పాట** ప్రేమ"

"మొదటి రెండులైన్లూ బావుంది సార్. చివరి రెండులైన్లూ మరీ ఫాస్ట్‌గా వున్నాయా, ఫర్వాలేదా- అని అటూ ఇటూ అనిపిస్తూంది. వాటికి ఆల్టర్నేట్ చూడండి. ప్రేమకు డెఫినిషన్‌లాగా ఇక్కడుండొచ్చు. కాస్త సాఫ్ట్‌గా..."

"ఇదెలా వుంది చూడండి...

**తెలుసా** శతమానమైనదీ సరిగమ

మనసా జతగానమైన ప్రేమ

**లేదా...** నమహా **జతగానమైన** ప్రేమ"




అని కూడా అనుకోవచ్చు"

చక్రి ఆలోచిస్తుండటం చూసి అన్నాడా యనే మళ్లీ-

"లేదా... జయహో జతగానమైన ప్రేమ అని కూడా అనుకోవచ్చు"

చిన్నగా నవ్వాడు చక్రి

"నాలుగు లైన్లూ కలిపి చూస్తున్నాను సార్ అంతే. 'మనసా'నే బావుంది. ఇక చరణానికొస్తే, ప్రేమను ఇంకాస్త వర్ణించండి చాలు"

**"ప్రేమంటే మండే ఎండంట,**
**దాన్ని అరచేత ఆపొద్దంట...**
**ప్రేమంటే ఎర్రని గోరింట**
**గుండియ చప్పుళ్లో తందానంటా..."** రాశాడు అన్వేషి.

"బావుంది సార్. కానీ ఇలా భావాత్మకంగా వర్ణిస్తే, తీరిగ్గా విని ఆలోచించి, బావుందని మెచ్చుకునేంత టైం ఎవరికుంది సార్? వినగానే అర్థమైపోవాలి. బావున్నా లేకున్నా ఏదో బావుందే అన్నట్టుంటే చాలు సార్. ఈ సాంగ్ లైట్ లిటరేచర్. ఊరికే సరదాగా, లల్లాయి పాటలాగా వుంటే చాలు. మనకు మంచి కవిత్వం రాసుకోవటానికి మరో రెండు పాటలున్నాయి. అందులో ఇంతకన్నా చక్కటి భావాలు ట్రై చేద్దాం సార్"

చక్రి చెప్పింది విని, చిన్నగా నవ్వాడు అన్వేషి

"సరే, బస్టాపులు, ఫుట్‌పాతుల్లో తీస్తామన్నారుగదా, ఇది చూడండి

**బస్టాపు, టైపింగ్ ఇన్‌స్టిట్యూట్**
**సైటూ గోల్డ్‌స్పాటూ సబ్‌స్టిట్యూటే...**
**నవ్వైనా, జారిన పువ్వైనా**
**క్రేజీ కాజున్నా పెన్నుట్యూబే...**
**అవ్వలూ, తాతయ్యలు ఆదర్శం**
**రోమియో, జూలీలదీ వెర్షన్...**
**తెలుసా, శతమానమైనదీ సరిగమ**
**మనసా, బతుకైన బాట ప్రేమ..."** పాడి వినిపించాడు.

మరోసారి చూసి, నవ్వుతూ తలూపాడు చక్రి- "ఇదే స్టయిల్లో రెండో చరణం కూడా వుండనీయండి. ఇక్కడ ప్రేమ పుట్టేస్థలాలూ, వైనాలూ వివరించినట్టు అందులో ప్రేమ సిగ్నల్స్, సందేశాల లాంటివి వుంటే బావుంటుంది"

"ఓకే..."

"సార్ ఇంకోమాట. ఈ రెండో చరణం ఓసారి ట్యూన్ వినండి. చిన్న మార్పుంది. ఏంలేదు. మొదటి నాలుగు లైన్లూ ముందు మామూలుగానూ, తరవాత అవే పదాలను 'ఖవాలీ బీట్'లోనూ, పాడి, మళ్లీ చివరి రెండు లైన్లూ కూడా మొదట మామూలుగానూ, తరవాత ఖవాలీ బీట్‌లోనూ పాడతామన్నమాట"

"ఎందుకలా?"

"ఏంలేదు సార్. ముందుగా మన హీరో, హీరోయిన్లు పాడతారు. తామున్న స్థలం చూసుకోరు. అక్కడో సినిమా షూటింగ్ జరుగుతూందన్నమాట. వీళ్ల పాటా, ఆటా చూసిన ఆ సినిమా హీరో వాళ్లను పిలుస్తాడు. పిలిచి 'ఈ స్టయిల్ కూడా ట్రై చెయ్యండి' అంటూ, అతను ఖవాలీ టైప్‌లో పాడి డాన్స్ చేస్తాడు. ఎవరైనా పెద్ద హీరోని రిక్వెస్ట్‌చేసి పిలవటమో, లేక వాళ్ళ షూటింగ్ దగ్గరే మనమూ తీసుకోవటమో చెయ్యాలని అనుకుంటున్నాను. జస్ట్, ప్రేక్షకులకు చిన్న సర్‌ప్రైజ్‌లాగా వుంటుంది. పాట బైట వింటున్నప్పుడేమో, బీట్‌మారి, స్ట్రయిట్‌గా సాగిపోకుండా, చిన్న ఛేంజ్‌తో బావుంటుంది" వివరించాడు చక్రి.

"ఒకవేళ ఏ పెద్దహీరో ఒప్పుకోలేదనుకోండి. అప్పుడు?" సరదాగా అడిగాడాయన.

"అప్పుడు సింపుల్. వీళ్ల పాట విన్న మరో జంట, అదే లిరిక్‌ని తమ పద్ధతిలో పాడుకున్నట్టు చూపిస్తాం"

"వెరీగుడ్... అన్నీ ఆలోచించి పెట్టుకున్నారన్నమాట... సరే, ఈ చరణం చూడండి-

**"మ్యావ్ అన్నా, భవ్వు భవ్వన్నా...**
**లవ్వు, లవ్వన్న సిగ్నల్సన్నా...**
**ప్యార్ అన్నా, కాదల్, రపేమన్నా**
**భాషా భేదాలు లేవోరన్నా**
**నిన్న, నేడు, రేపు ప్రేమించు**
**ప్రేమలోనే నువ్వు జీవించు...**
**తెలుసా, శతమానమైనదీ సరిగమ**
**మనసా జతగానమైన ప్రేమ"**

"ప్యార్... కాదల్, ప్రేమ- హిందీ, తమిళం,




తెలుగు- ఏ భాషలోనైనా, ఏ భాషవారైనా ప్రేమించుకోవచ్చు... చప్పున అర్థంకాదుకానీ, బావుంది సార్- ఉండనిద్దాం" అన్నాడు చక్రి.

"అసలు మీరు మొదటి లైన్లు అర్థం కావంటారేమోననుకున్నాను" సంతృప్తిగా అన్నాడు అన్వేషి.

"దానికి చిన్న టెక్నిక్ వుంది సార్. ఆ చరణానికి ముందొచ్చే మ్యూజిక్ అయిపోతుందనగా 'మ్యావ్, మ్యావ్' అని ఓ అబ్బాయి గొంతూ, 'హాఛ్'మని ఓ అమ్మాయి తుమ్ము వినిపిస్తే సరి. ఇక సీక్వెన్స్‌పైనంటారా... మనహీరో, హీరోయిన్లు పార్కులో వెళుతుండగా 'మ్యావ్, మ్యావ్'మని పిల్లి కూతలు వినిపించి అటు చూస్తే, చెట్టు చాటున ఓ అబ్బాయి అరుస్తుంటాడు. ఆ చెట్టు ముందర ఓ అమ్మాయి తల్లిదండ్రులతో కూర్చునుంటుంది. ఇతని పిల్లికూత వినగానే ఏంచేయాలో తెలియక 'హాఛ్' మని తుమ్మి, తాను విన్నాననీ, కాస్త ఓపిక పట్టమనీ సిగ్నల్ ఇచ్చిందన్నమాట. వెంటనే లిరిక్ ప్రారంభమవుతుంది మ్యావ్ అన్నా భవ్వు భవ్వన్నా... లవ్వు లవ్వన్న సిగ్నల్సన్నా అంటూ సరిపోతుంది కదా"

చక్రి వివరణ విని ప్రశంసా పూర్వకంగా నవ్వాడు అన్వేషి.

మళ్ళీ చెప్పాడు చక్రి-

"ఇక ఈ పాటా, మరో పాటా మటుకు చాలా బాగా రాయాలి సార్. దీన్లోలాగా పిల్లి కూతలుంటే ఒప్పుకోను" నవ్వుతూ, చనువుగా అన్న చక్రి మాటల భావం అర్థమై తనూ నవ్వాడు అన్వేషి.



పావురాయి సమాధి దగ్గర పువ్వులుంచి, మౌనంగా నిలుచున్నాడు విక్రమ్. ఆగిన రిక్షాలోంచి దిగిన జూలీ, ప్రియలు విక్రమ్ దగ్గరికి నడిచొచ్చారు. జూలీ నీరసంగా అడుగులేస్తూంది. ప్రియ చేతిలో కొన్ని మందుల రేపర్లున్నాయి. ఇద్దరూ విక్రమ్‌ని తమాషాగా చూస్తున్నారు. కాస్సేపటికి యిటు తిరిగిన విక్రమ్, వాళ్లను చూసి ఆశ్చర్యపడి, ఆ తరవాత పలకరింపుగా నవ్వాడు

"ఎక్కణ్ణించొస్తున్నారు? హఠాత్తుగా ఎదురయ్యారు?"

"జూలీని డాక్టర్ దగ్గరికి తీసుకెళ్ళాను"

"జూలీకి ఒంట్లో బాలేదా? నాకు తెలీదు" నొచ్చుకున్నాడు విక్రమ్.

"డాక్టర్ కూడా ఒంట్లో సుస్తీయేమీ లేదు, మనసు ప్రశాంతంగా వుండాలన్నాడు. అందుకే ఆసుపత్రినుండి ఇటు లాక్కొచ్చాను. ఇరవై నాలుగ్గంటలూ ఇంట్లోనే వుంటే మనసెలా బావుంటుంది చెప్పండి?" వివరించింది ప్రియ.

"ఔను జూలీ... జరిగింది మరిచిపోయి, ఏదైనా వ్యాపకం కల్పించుకో. అత్తమ్మతో మాట్లాడి ఏదైనా ఏర్పాటుచేయమంటాను" అన్నాడు విక్రమ్.

"ఔనూ... మీరేమిటి, ఇక్కడ..." ఆశ్చర్యంగా అడిగింది ప్రియ. "ఎవరిదీ సమాధి?"

జూలీవైపు చూసి బదులిచ్చాడు విక్రమ్

"జూలీకి తెలుసు"

అతని జవాబుకు తెల్లమొహం వేసింది జూలీ.

"నాకా... నాకేం తెలుసు?"

ఈసారి ఆశ్చర్యపోవటం విక్రమ్ వంతైంది

"ఈ సమాధి, ఇది... రాణిది"

"రాణెవరు?" కుతూహలంగా అడిగింది ప్రియ.

"రాణి... రాణి గుర్తులేదా జూలీ నీకు?" నమ్మలేనట్టుగా అడిగాడు విక్రమ్.

ఇబ్బందిగా చూస్తూ చెప్పింది జూలీ-

"ఏమో... నాకు గుర్తు రావటం లేదు"

"రాణి! నువు చిన్నప్పుడు పెంచుకున్న పావురం! అది చచ్చిపోతే, మనిద్దరం ఇక్కడికొ

చ్చి, దాన్నిక్కడ సమాధి చేశాం... ప్రతీ సంవత్సరం ఇక్కడికొచ్చి తలచుకోవాలీ, రాణంటే నాకిష్టం అని చెప్పావు నువ్వు... గుర్తొచ్చిందా...''

అప్పుడు గుర్తొచ్చింది జూలీకి. అతనివైపు ఆశ్చర్యంగా చూసింది ప్రియ.

పశ్చాత్తపురాలిలాగా, మంత్రముగ్ధలాగా పావురాయి సమాధి దగ్గరికి నడిచి, పైట తలమీదకు లాక్కుని, అక్కడున్న చెట్టు పువ్వులు తుంపి, దానిమీద పెట్టి మౌనంగా నిలుచుంది జూలీ, కళ్ళు మూసుకుని.

కాస్సేపటికి కళ్ళు తెరిచిన జూలీకి విక్రమ్ వైపు చూడటానికి మొహం చెల్లలేదు. ప్రియ కూడా ఏమీ మాట్లాడలేదు. కళ్ళతోనే వీడ్కోలు చెప్పాడు విక్రమ్. ఇద్దరూ రిక్షాదగ్గరికి వెళ్ళి, ఎక్కి కూర్చున్నారు. రిక్షా కదిలి కొంతదూరం వెళ్ళాక అంది ప్రియ

''జూలీ...నువు చిన్నప్పుడెప్పుడో చెప్పిన మాట పట్టుకుని, యింకా ఆ పావురాయిని మరచిపోలేదంటే, ఆ మనసులో నీకున్న స్థానం'' జూలీ కళ్ళవెంట రాలుతున్న అశ్రువుల్ని చూసి తన మాటలు ఆపేసింది ప్రియ... కొద్దిక్షణాలాగి అంది ''అయాంసారీ, నిన్నేమైనా నొప్పించానా?''

ప్రియ మాటలకు బదులుగా ఆమె చేతిని తన చెంపకు అన్చుకుంది జూలీ.

★ ★ ★

భోజనం పూర్తిచేసి తోటలో చల్లగాలికి కూర్చున్న విక్రమ్ దగ్గరికొచ్చి, ఏదో పెళ్ళి సంబంధం గురించి చెప్పింది మాలిని.

''వద్దత్తమ్మా... నేను పెళ్ళిచేసుకోను. పెళ్ళి సంబంధాల గురించి మాట్లాడొద్దు- ప్లీజ్'' బతిమాలుతున్నట్టుగా చెప్పి, మళ్ళీ ఇంట్లోకి నడిచాడు విక్రమ్.

అతని వెనకే నడిచింది మాలిని

''ఎంతకాలం యిలా పెళ్ళిచేసుకోకుండా వుంటావురా?''

''బతికినంతకాలం'' నిరాసక్తంగా బదులిచ్చాడు.

''అది బతుకే కాదురా''





''ఏం చేస్తాం అత్తమ్మా... కొందరి అదృష్టాలంతే''

మళ్ళీ అక్కణ్ణించి కదలబోయిన విక్రమ్‌ని, భుజం మీద చెయ్యివేసి, ఆపి, చెప్పింది మాలిని, మృదువుగా, కానీ స్థిరంగా.

''మన అదృష్టాలు మన చేతుల్లో కాదు, చేతల్లో వుంటాయిరా. గతాన్ని మరిచి భవిష్యత్తును ప్రేమించాలి. విధి నెదిరించి ప్రస్తుతాన్ని ఎదుర్కోవాలి. మన సమస్యలకు పరిష్కారాలు మన నుదుటి రాతల్లో వుండవురా. నువ్వు తలుచుకుంటే, నీ జీవితంతోపాటు మరో జీవితానికి అదృష్టాన్ని అందించగలవు''

ఆమె మాటల్లోని భావం సూటిగా తగిలింది. ఆశ్చర్యంగా చూశాడు.

''అత్తమ్మా!''

''ఏం? నా ఆలోచన తప్పా?''

''తప్పని కాదు...'' అంటూ ఆగిపోయాడు సందిగ్ధంగా.

''మరి యింకా ఎందుకీ ఆత్మవంచన? ఎందుకీ పిరికితనం?''

''లేదత్తమ్మా... నేనొక్కణ్ణే అనుకుంటే సరిపోతుందా?'' కాస్సేపాగి మళ్ళీ చెప్పాడు- అదీకాక. ఈ హత్యా కేసు పరిష్కరించకుండా నేనా పని చేస్తే, ఆ హత్యా చేసింది నేనే అనే అపోహ కలుగుతుంది. అది ఎవరికి మాత్రం మంచిదత్తమ్మా?''

దీర్ఘంగా నిట్టూర్చింది మాలిని.

''ఏమో... నువ్వీకేసు పరిష్కరిస్తేమాత్రం ఎవరికి మంచి జరుగుతుందో...'' అంటూ అక్కణ్ణించి గబగబా వెళ్ళిపోయింది.

ఆమె ఎందుకలా అన్నదో అర్థంకాక కాస్సేపు అక్కడే నిలుచుని ఆలోచించి, చివరకు అక్కణ్ణించి తన పడకగది వైపు దారితీశాడు విక్రమ్.

అలా వెళ్ళేముందు అతను కొద్దిగా తలతిప్పి చూసివుంటే...

అన్నీ రెండేసి వుండే మాలిని ఇంట్లో, ఆ గోడకు మూలన ఒంటరిగా వున్న ఒక పదునైన కత్తి కనిపించి వుండేది. దాని పక్కనే అంతకు ముందు అక్కడ మరో కత్తి కూడా వుండేదన్నందుకు సాక్ష్యంగా మిగిలివున్న కత్తిలాంటి మరకా కనిపించి వుండేది.

★ ★ ★

బరియల్ గ్రౌండ్ సీన్సన్నీ రెయిన్ ఎఫెక్ట్‌లో తీయాలనుకుంటున్నాను సార్. అంటే ఫ్యునెరల్ కార్యక్రమమంతా మబ్బుపట్టి, మెరుపులుండగా జరుగుతుంది. కత్తితో పొడిచే సీను, దాని రిలేటివ్ సీన్సన్నీ రెయిన్ ఎఫెక్టలో తీస్తే బావుంటుందనిపిస్తూంది" వివరించాడు చక్రి.

"రెయిన్ ఎఫెక్ట్ అంటే టైం చాలా తీసుకుంటుంది. కొన్ని క్రేన్ షాట్స్ తప్పని సరిగా వుంటాయి. త్రీ నైట్స్ అవుతుందనుకుంటాను" అన్నాడు చలం, ఆయన కెమేరామన్.

"అందుకే మీకు చెబుతున్నాను. పోతే ప్రియ సాంగ్, విక్రమ్‌ను దొంగ ఫోన్ చేసి పిలిపించినప్పుడు, అతను గదిలో అడుగుపెట్టగానే ప్రియ ఇమాజినేషన్‌లో వుంటుంది. ఇది కాకినాడలోని షిప్‌లో తీద్దామనుకుంటున్నాను. అదొక్కటే మనకు షిఫ్ట్ పడుతుంది"

"కాకినాడలోనా? అక్కడెందుకు? మనకు షిప్స్ కావాలంటే మద్రాస్‌లో దొరుకుతాయి. వైజాగ్‌లో కూడా దొరుకుతాయి"

చిన్నగా నవ్వి చెప్పాడు చక్రి

"ఓ చైనీస్ షిప్ తుపానుకు కొట్టుకొచ్చి నగం ఇసుకలో, నగం సముద్రంలో కూరుకుని ఆగిపోయివుంది కాకినాడలో, మనకు ఆ పొజిషన్‌లో షిప్ దొరకటం కష్టం. చాలా డ్రమెటిక్‌గా వుంటుందా వ్యూ. దానికితగ్గ స్కీమ్ ఆలోచించాను. ఆ షిప్ కెప్టెన్ విక్రమ్. ప్రియ సముద్ర దొంగల నాయకురాలు. మిగతా దొంగలూ అమ్మాయిలే. వాళ్ళంతా రాత్రిపూట నర్సింగ్ చేస్తూ వస్తారు. ఓడమీద దాడిచేస్తారు. విక్రమ్ ఓడిపోతాడు. అతన్ని బంధిస్తారు. ప్రియ ఆతని దగ్గరికెళ్ళి అతని పొందు కోరుతుంది. అతను తిరస్కరిస్తాడు. అతన్ని రెచ్చగొడుతుంది. మొదటి చరణం అయిపోగానే బీజీయమ్స్‌లో అతను ఓడలోంచి తప్పించుకుని, గుర్రంమీద పారిపోతుంటాడు. సముద్రం వక్కనుండి హఠాత్తుగా నీళ్ళల్లో బోట్ మీద అతన్ని వెంబడిస్తుంది ప్రియ. ఒక పిస్టల్ గురిచూసి పేలుస్తుంది. అది తగలగానే విక్రమ్ ఆమెకు వశుడవుతాడు. అతనితో రాసలీలలో తేలుతుంది ప్రియ. పాట ఐపోతే విక్రమ్ తిరిగి వెళ్ళిపోతుంటాడు ప్రియ గదిలోంచి. అలా ఆ సీన్‌లో కొస్తాం. ఇందులో కూడా థర్డ్ బీజీయమ్ నుండి రెండో చరణం అయేవరకూ రెయిన్ ఎఫెక్ట్‌లో తీద్దామనుకుంటున్నాను. సాంగంతా నైట్ఎఫెక్ట్"

"ఎందుకీ రెయిన్ ఎఫెక్టులు" నవ్వుతూ ప్రశ్నించాడాయన.

"మర్డర్ సీన్లో మూడ్‌ను ఇంప్రెసివ్‌గా ఎస్టాబ్లిష్ చేస్తుంది. అదీకాక ఒక్కొక్కరూ తమ అనుభవం చెప్పినప్పుడల్లా, ఫ్లాష్ బ్యాక్‌లో ఈ సీన్ మళ్ళీ మళ్ళీ చూపించినప్పుడల్లా ప్రేక్షకుడు ప్రస్తుతం మూడ్‌లోంచి వెంటనే ఆ సీన్ మూడ్‌లోకి ఆటోమేటిక్‌గా షిఫ్ట్ అవుతాడు. ఇక ఈ సాంగ్‌లో ఎందుకంటే చినుకుల్లో శృంగారం, అందునా సముద్రం వక్కన, రాత్రి పూట చాలా బావుంటుంది"

"షెడ్యూల్ ఎన్ని రోజులేనుకున్నారు?"

"డైలాగ్‌స్టార్ 26 రోజులు, సాంగ్స్ 14 రోజులు. సింగిల్ షెడ్యూల్. మొత్తం 40 రోజులు"

"ఇంకో ఐదురోజులు వేసుకుంటే బావుంటుంది"

"ఆలోచిద్దాం... సాంగ్స్‌కు అవసరమనుకుంటే చూద్దాం" ఆయన తృప్తికోసం అన్నాడా మాటలు.

"ఆర్ట్ డైరెక్టర్ ఎవరు?"

"రాయుడుగారు" బదులిచ్చి, మళ్ళీ చెప్పాడు చక్రి

"న్యూయియర్ డే సాంగ్స్ సెట్స్ స్కెచెస్ వేయించాను"

చూపించాడాయనకు. అన్నీ పరిశీలించాడాయన.

"సీరియల్ బల్బులతో స్కైరిటన్స్ అన్ని బాగున్నాయి. ఏం కలర్ లైట్స్ వేస్తున్నారు?"

"అది మీరు చెప్పాలి..."

"రెడ్ అయితే బావుంటుంది"

"మేమూ అదే అనుకున్నాం. నెక్స్ట్‌వీక్ లొకేషన్స్ చూడటానికి వెళుతున్నాం. మీరొస్తానంటే ఎవరినైనా పంపిస్తాను చెప్పటానికి. లేదా షెడ్యూల్‌కు రెండు రోజులుముందుగా చూస్తానంటే మీ యిష్టం"

"ఈవయసులో ఇంకా లొకేషన్స్ ఏం చూ

స్తాంలెండి. ఎటూ మీరు కొత్త కుర్రాళ్ళు జాగ్రత్త గానే చేసుకుంటారు కదా. షెడ్యూల్‌కు వెళ్ళిన ప్పుడు చూసుకోవచ్చు. ఔట్‌డోర్ యూనిట్ ఎవ రనుకుంటున్నారు?''

చెప్పాడు చక్రి.

''అన్ని దొరుకుతాయా కాళ్ళదగ్గిర. నేనోలిస్ట్ ఇస్తాను ముందుగా. మా అసిస్టెంట్ వచ్చి యిస్తాడు''

''పాంథర్ క్రేన్ తీసుకుందామనుకుంటు న్నాను''

ఆశ్చర్యంగా చూశాడాయన

''ఔటు డోర్ మొత్తానికా?''

''అవును... ఎలాగూ మామూలు క్రేన్ తప్ప దు. మావాళ్ళు కాంటాక్ట్ బేసిన్‌లో మాట్లాడా రట. మనది స్కోప్ కదా. సాంగ్ సీన్స్‌లోనూ, సీన్స్‌లోనూ ఎఫెక్టివ్‌గా వుంటుందని తీసు కుందామనుకుంటున్నాను''

''40 రోజులుకు 25 వేలకన్నా ఎక్కువైతే వద్దు''

''మా వాళ్ళు 22 వేలకే మాట్లాడారు''

''వెరీగుడ్'' నవ్వాడాయన.

''నెక్స్టవీక్ రికార్డింగుంది. మీరొస్తారు గదా?''

''తప్పకుండా... మరిక వెళ్ళొస్తాను''

''నమస్కారం''

''నమస్కారం... విష్‌యూ ఆల్ ద బెస్ట్''

''థాంక్యూ''

★ ★ ★

''వార్తలేవీ లేనప్పుడు రిపోర్టర్ తనే కుక్క ను కరవాలి. అందుకే 'వాచ్‌డాగ్' లాంటి పోలీసుల్లో చిన్న పేచీ పెట్టుకుందామనుకున్నా ను. చాన్నాళ్ళుగా వార్తలులేవు. ఏంచేయ మంటారు?''

''మీరు పేపర్లో రాసినందుకు పర్సనల్‌గా నాకేం బాధలేదు. కానీ యిది చూసి ఏ రాజకీయ నాయకుడో హోంమినిస్టర్‌నడుగు తాడు. ఆయన మా బాస్‌ని కడుగుతాడు. మా బాస్ నన్ను దులుపుతాడు. కానీ ఏమీ రాల దు'' స్పోర్టివ్‌గానే బదులిచ్చాడు విక్రమ్.

''ఎవరో ఒకర్ని అరెస్ట్ చేయండి సార్''

''మిమ్మల్ని చేయమంటున్నాడు మా బాస్. హత్యా జరిగిన తరువాత శవాన్ని మొదట చూసింది మీరేగదా అందుకు''

''శవాన్ని మీ ఎస్సై పాతిపెడతానంటే వద్ద న్నది నేనే కదా''

''అందుకే కదా మిమ్మల్ని అరెస్టు చేయ మంటున్నాడాయన'' నవ్వుతూ అన్నాడు విక్రమ్.

''పోనీ ఆ పనైనా చేయండి, ఇంకో న్యూస్ దొరుకుతుంది''

ఏంచేయాలో తెలీటం లేదు. ఒక్క ఆధారం లేదు. సమాధిలో అతను బతికున్నాడని ఎవరి కి తెలును గనుక హత్యా చేశారనుకోవాలి? లేకపోతే, ఆ టైంలో బ్రహ్మయ్య దాన్ని తెరుస్తా డని కలగని ఎవరూ వెళ్ళరు గదా''

★ ★ ★

మర్డర్ స్పాట్‌లో తీసిన ఫోటోలన్నీ పరిశీలి స్తున్నాడు విక్రమ్. ఎక్కడో, ఏదో కనిపిస్తూంది. కానీ తనకు దొరకటంలేదు. ఒక ఫోటోను చూసిన విక్రమ్‌కు అక్కడేదో అసహజంగా కనిపించింది. దాన్ని ఎన్‌లార్జ్‌చేశాడు. ఒక రబ్బర్. దానిపైన...? విక్రమ్ కళ్ళు మెరిశాయి. లేచి నిలుచున్నాడు.

★ ★ ★

''బావుంది సార్'' ఏమీ బాలేదన్న భావంతో చెప్పాడు 'బండ హీరో'. నిష్ఠురంగా ''చాలా బావుంది. కథ, ట్రీట్‌మెంట్ వుండగానే సరిపో యిందా? నాకు తగ్గ కేరెక్టర్ వుండొద్దా?''

''మీరు కథ ఒప్పుకున్నారని మీ సెక్రెటరీ చెప్పాడు సార్'' కల్పించుకున్నాడు గోవిందు.

'బండహీరో' రేటు 4 లకారాలైతే, 5 లకారా లిస్తామనీ, వెంటనే డేట్స్ కావాలనీ ఆయన సెక్రెటరీకి చెబితే వెంటనే ఒప్పుకున్నాడు. 'బండహీరో'తో మాట్లాడాడు. ఆయన కూడా గోవిందు, శ్రీరామచంద్రుడులకు చెప్పాడు తను ఔట్‌డోర్‌నుండి వచ్చేలోగా అన్నీ సిద్ధం చెసుకోమనీ, తాను రాగానే అగ్రిమెంట్ రాసు కుందామనీ. ఆయన సెక్రెటరీ ఇస్తానని చె ప్పిన డేట్స్ మరునటి నెలలోనే కావటంతో ఏర్పాట్లన్నీ పూర్తిచేసుకున్నారు. ఇంకో రెండు రోజులైతే ఆయనకూ, శోభకూ అడ్వాన్సు లివ్వా లనుకుంటున్నారు. అందుకే అంత డైరెక్టుగా





అడిగేశాడు గోవిందు.

"అబ్బే... కథ బావుందంటే నేను నిజమే అనుకున్నాను. అంతవరకూ నిజమే అనుకోండి. కానీ యిది కొత్తవాళ్ళతో తీసుకోవాల్సిన సబ్జెక్టు. నాకు కేరెక్టరుందా చెప్పండి. నేనున్నాననగానే ప్రేక్షకులు ఏదో అనుకుంటారు. అనలీరోజుల్లో మెషీన్‌గన్ పట్టుకుని కాలిస్తే, జనం కుప్పలుగా పడిపోతుంటే, ఆప్టరాల్ ఓ శవాన్ని పొడిస్తే కేసు, దానికి సస్పెన్సు అంటే జనాలకేం ఆనుతుంది చెప్పండి? ఓ ప్రధానమంత్రో, ముఖ్యమంత్రో హత్య చేయబడితే, ఆ కేసు హీరో పరిశోధిస్తే ప్రేక్షకులకు ఉత్సాహం వస్తుంది. ఇన్వెస్టిగేషన్‌కు పూనుకోగానే కారు బ్లాస్టు, వెళుతుంటే హెలికాప్టర్‌తో దాడి. అసలు విలన్ గవర్నర్. హీరో లాగిన తీగ తన డొంకను కదిలిస్తుందనగానే హీరోమీద అరెస్టు వారెంటులు, డైహార్ట్ టైపులో హీరో కుటుంబాన్ని ఫ్లాట్‌లో పెట్టి చుట్టూ బాంబులు, స్టెన్‌గన్లు, ఏకే-47లు... యిలా వుండాలిగానీ ఒక చావు గురించి ఇన్వెస్టిగేషన్ ఏం కదిలిస్తుందండీ?"

"ఒరకంగా ఈ ఇన్వెస్టిగేషన్ మనం క్లయిమాక్స్‌గా తీసుకున్నాం. అంతే కద్సార్. అదే మెయిన్ పాయింట్ కాదు కదా?"

"ఎంత కాదనుకున్నా జనం బైటికొచ్చి చప్పరిస్తారు, ఎవణ్డో గొయ్యిలోంచి తీసి చంపితే, హీరో సినిమా అంతా వాణ్ని వెతుకుతాడ్రా అని. లాభంలేదండీ. మన చుట్టూ టెర్రరిజం నాట్యం చేస్తున్నరోజుల్లో ఓ చావు ఎవడ్ని ఆకర్షిస్తుందండీ?"

గోవిందువైపు చూశాడు చక్రి. ఆ హీరో అక్కర్లేదన్నట్టు సైగ చేశాడు గోవిందు. లక్ష్మణకుమార్, శ్రీరామచంద్రుడూ గమ్మున కూచున్నారు, మరెవరి సినిమా గురించో మాట్లాడుతున్నట్టుగా. గోవిందు సిగ్నల్ అందగానే లోలోపలే నిట్టూర్చి, పెదవి విప్పాడు చక్రి

"సార్... మీరు 'గీతాంజలి' సినిమా చూశారా?"

"యస్... బ్రహ్మాండమైన పిక్చర్. ఎక్సలెంట్" ఉత్సాహంగా అన్నాడు 'బండహీరో'.

"సీతారామయ్యగారి మనవరాలు, చూశారా?"

"అరే... ఫెంటాస్టిక్ మూవీ ఐసే"

"మరి 'గీతాంజలి'లో థీమ్ ఏమిటి? చావు కూడా కాదు, చనిపోతారన్న భయం. కుదరని వ్యాధితో హీరో, హీరోయినూ చనిపోతారనే భయమే కదా ఆ సినిమా థీమ్. పోనీ 'సీతారామయ్యగారి మనవరాలు' థీమ్ ఏమిటి? నాగేశ్వరరావుగారి కొడుకూ కోడలూ యాక్సిడెంట్లో మరణిస్తే, ఆయన మనవరాలు ఆ మరణాన్ని దాచటం. అంతే కదా. మరి కనీసం హత్య కూడా లేకుండా, 'చావు' అనే భయాన్ని ఎంత చక్కగా మలిచి చూపించారు? మీరూ బావున్నాయంటున్నారు..."

గతుక్కుమన్నాడు బండహీరో. మరుక్షణం నవ్వు తెచ్చి పెట్టుకుని-

"భలేవారు సార్... వాళ్లంటే గొప్పదర్శకులు. అక్కడ ఓ దాంట్లో నాగేశ్వరరావుగారు హీరో అయితే మరోదాంట్లో నాగార్జున. పైగా వాళ్ళ స్టార్స్. నిజంగా పోతుందనుకున్న సినిమా మద్రాస్ టాకంతా ఫెయిల్యూరనే. హిట్టయినావంటే స్టార్స్ సార్. లక్" అన్నాడు వేదాంత ధోరణిలో.

* * *

గురువాయూరప్ప ఫిలింస్ వాళ్ళకు పెద్ద హీరోకు నచ్చిన కథ దొరక్కపోవటంతో అది పోస్ట్‌పోనయి బండహీరోతో మొదలెట్టారని తర్వాత తెలిసింది. పనులేవీ లేకపోవటంతో రెండు వారాలు. ఇంట్లో హాయిగా, తాపీగా వున్నాడు చక్రి. సరిగ్గా పదిహేనో రోజున ఫోనొచ్చింది-

"బాసూ, పదిహేడో తారీకున నువ్వు మద్రాసులో వుండాలి" అని చెప్పాడు లక్ష్మణకుమార్.

"మీరు యివ్వాళ యిక్కడి కొస్తామన్నారు?"

"లేదులే... బిజీగా వున్నాం. అందుకే ఫోన్ చేశాను"

"ఏంటి విశేషం?"

"హీరోకు కథ చెప్పాలి"

"ఎవరు?"

"మొండి హీరో... మన 'బండ హీరో' అడ్వాన్స్ రిటర్నిచ్చాడు"

"మొండి హీరోనా? ఎవరాలోచన?"

"అందరమూ అనుకున్నాం. రాబోయే హిట్ సినిమాలన్నీ 'మొండి హీరో'వి. మళ్ళీ మధ్యలో ఏ నాయకుడో చస్తే ఫోన్ చేయటం కూడా వీలవదని యిప్పుడే చెప్పాను. 'మొండి హీరో' పందొమ్మిదిన వింటానన్నాడు. అందుకే ముందు జాగ్రత్తగా నువు పదిహేడుకే మద్రాను వచ్చెయ్యి- ఓకేనా?"

"ఓకే...గోవిందు ఏంచేస్తున్నాడు?"

"శోభ కాల్‌షీట్స్ కోసం వెళ్ళాడు"

"అదేంటి... ఎప్పుడో పూర్తవాలి కదా?"

"అప్పుడు వాళ్లమ్మ ఊళ్ళో లేదులే"

"మీనాన్నగారు?"

"ఉన్నాడు... ఆఫీసులో మందుకొడుతున్నాడు. నేను వెళ్ళాలి బానూ. అర్థంచేసుకో" నవ్వుతూ అన్నాడు లక్ష్మణకుమార్.

"ఓకే" ఫోన్ పెట్టేశాడు చక్రి.

★ ★ ★

ఆటో దిగి ఆఫీసులో అడుగుపెట్టిన చక్రి ఆశ్చర్యపోయాడు. తాను రాయించిన లోగోలు టెక్నీషియన్ల పేర్ల ఛార్టూ స్కెచ్‌లూ- గోడల నిండా వుండాల్సింది. ఒక్కటీలేదు. గోడలంతా బోసిగా వున్నాయి. ఏమై వుంటుందా అనుకున్నాడు. అప్పుడే లోపల్నుంచి గురుమూర్తి వచ్చాడు అతనూ ఓ రచయిత. సినిమాలకింకా రాయలేదు. రాయాలని తాపత్రయం. నిర్మాతలకు మంచి స్నేహితుడు. ఇద్దరూ కాసేపు మాట్లాడుకున్నాక ప్రశ్నించాడు చక్రి- లోగోలు లేని విషయం.

"టైటిల్ మార్చారండీ"

ఆశ్చర్యపోయాడు చక్రి. తనకు చెప్పకుండా టైటిల్ మార్చటమేంటీ అని ఆలోచించాడు.

"ఏంటీ టైటిల్?"

"శాలివాహనుడు"

"ఏంటీ?"

"మీరు విన్నది కరెక్టే గురూ. శాలివాహనుడు... కథ కూడా మారింది"

"ఆహా" నిర్లిప్తంగా అడిగాడు చక్రి "ఎవ రాశారు?"

"నేనే"

ఏదో జరిగిందని అర్థమయింది చక్రికి. ఇంకా నస్పెన్సెందుకని చివరి ప్రశ్న అడిగాడు "నేనున్నానా"

"మిమ్మల్నీ మార్చేశారు"

"అదా సంగతి" అనుకుని, అడిగాడు "ఎవరు డైరెక్టర్?"

"నెల్లూర్ రెడ్డి"

అతనెవరో చక్రికి తెలియదు అందుకే అడిగాడు

"ఎవరతను? ఎవరి దగ్గర చేశాడు?"

"మా ఫ్రెండ్. పెద్దిరెడ్డిగారి దగ్గర చేశాడు"

పెద్ద బరువు తొలిగినట్టు ఫీలయ్యాడు చక్రి.

కాస్సేపటికి శ్రీరామచంద్రుడు వచ్చాడు

"మీకు ముందే చెబుదామనుకున్నాం. నరే...ఎటూ మీరూ ఇవ్వాళ వస్తారు గదాని ఫోన్ చెయ్యలేదు"

"ఏంటి సంగతులు?" జరిగిందానికి కారణం చెబుతాడనే వుద్దేశంతో అడిగాడు, చక్రి.

"ఏముంది? మొండి హీరోతో పిక్చర్ మొదలెట్టాము. గురుమూర్తి మీకు చెప్పే వుంటాడు"

"నేనంతవరకే చెప్పానండీ" జాగ్రత్తపడ్డాడు గురుమూర్తి.

"ఏంటి సంగతులు?" మళ్ళీ అడిగాడు చక్రి.

"ఏమున్నాయండీ... చాలా బిజీగా వున్నాం" ముక్తసరిగా అన్నాడు శ్రీరామచంద్రుడు.

చాలా ఆశ్చర్యపోయాడు చక్రి. అసలు తనెవరో తెలియనట్టు ఎంత సులభంగా తీసేశాడు విషయాన్ని. తను ఆశపెట్టుకోలేదు కనుక సరిపోయింది. మరొకడైతే ఎంత కుంగిపోయేవాడు. అయాచితంగా వచ్చింది, అనూహ్యంగా పోయింది. పేపర్‌లో తన పేరు అనౌన్స్ చేయకపోతే చాలా బాగుండేది. సరే జరిగిందానికి చేసేదేముంది. ఈ విషయం తనకు మామూలుగా చెబితే ఎంత బాగుండేది. కాఫీలో ఈగను తీసేసినంత సులభంగా తీసేశారు!

"వస్తానండీ" హఠాత్తుగా అన్నాడు చక్రి.





"మంచిది" లోపలికెళ్ళిపోయాడు శ్రీరామ చంద్రుడు.

చాలా అసహ్యమనిపించింది చక్రికి. చివ రకు తలవండిన సినిమావాళ్లల్లో కూడా యిలాంటివాళ్ళను చూళ్ళేదు.

లేచి బైటికి నడిచాడు చక్రి. అతనివెంట గేటుదాకా వచ్చాడు గురుమూర్తి.

"సారీ గురూ"

"దేనికి"

"ఏం జరిగిందో నాకూ తెలీదు. పెద్దిరెడ్డిగా రు కావాలని నన్నడిగారు. ఆయన వీళ్లకు దొరకడు కదా. నన్ను కథ రాయమన్నారు. నెల్లూరు రెడ్డిని నేనే సజెస్ట్ చేశాను. అంతే, నాకేమీ తెలియదు"

"సొంతకాళ్ళమీద నడిచి వెళ్ళటంకన్నా ఏట్లో దూకితే తొందరగా వెళ్లవచ్చుననుకున్నా రు. నన్నూ లాగనందుకు మాత్రం సంతోషంగా వుంది. ఒక అవకాశం పోయిందన్న బాధ లేకపోలేదు. కానీ 'హమ్మయ్య' అన్న ఫీలింగ్ ఎక్కువగా వుంది" - అనుకున్నాడు చక్రి లోలోపల. చిన్నగా నవ్వి, గురుమూర్తి భుజం తట్టి బైటకు నడిచాడు.

* * *

"రివ్వున వచ్చిన జీపు జూలీ ఇంటి ముందాగింది. అప్పటికే అక్కడ మాలిని కారు ఆగివుంది. మాలిని, జూలీలు లోపలున్నారు. ఫాదర్ అరుగుమీద కుర్చీలో కూర్చున్నాడు. తిన్నగా ఫాదర్‌ని అడిగాడు విక్రమ్.

'ఫాదర్... మీరే మురళిని చంపారు. నాకు యిప్పుడు తెలిసింది. నిజం ఒప్పుకోండి' అన్నాడు.

తను కాదన్నాడు ఫాదర్.

ఆరోజు ఫాదర్ స్మశానం దగ్గిరున్నట్టు సాక్షు లున్నారన్నాడు విక్రమ్.

తానక్కడికి వెళ్ళింది నిజమే... కానీ ముర ళిని చంపలేదన్నాడు ఫాదర్.

జూలీకి నిద్రమాత్ర యిచ్చి ప్రియ వెళ్ళిపో యింది.

మనశ్శాంతికోసం చర్చికెళ్ళి, వర్షం మొదల వడంతో తాను తిరిగొస్తుండగా ఎవరో ఓ సమాధి తవ్వటం లీలగా గమనించి ఆగాననీ, కాస్సేపటికి అతను భయంకరంగా అరవ టంతో జూలీ గుర్తొచ్చి వెనుతిరిగాననీ, రెండడు గులు వేసేసరికి మరో అరుపు వినిపించిందనీ, అంతకన్నా తనకేమీ తెలియదనీ అన్నాడు ఫాదర్.

అప్పుడు తన జేబులోంచి ఒక వస్తువు తీశాడు విక్రమ్. ఫొటోలో కనిపించిన మరక అదే. అది ఒక రబ్బర్. దానిపైన 'క్రాస్' గుర్తుంది. దాన్ని చూపించి - యిది సమాధిపె ట్టెలో దొరికింది. సిలువగుర్తున్న రబ్బర్ మీదికా దంటారా' అన్నాడు విక్రమ్.

చిన్నగా నవ్వి 'యిప్పుడే వస్తాన'ని లోనికెళ్ళా డు ఫాదర్. నిశ్చేష్టులై చూస్తున్నారు మాలిని, జూలీలు.

లోనికెళ్ళిన ఫాదర్ ఒక పెద్ద గోనెసంచీని లాక్కొచ్చి, విక్రమ్‌ముందు కుమ్మరించాడు. దాన్నిండా అలాంటి రబ్బర్‌లే.

అవి మిషనరీనుండి వస్తాయనీ, చుట్టువ క్కల పదివన్నెండు గ్రామాల్లో ప్రతి యింటా కనిపిస్తాయనీ చెప్పాడు ఫాదర్.

ఆయన స్టేట్‌మెంట్ తీసుకోవడానికి స్టేష న్‌కు తీసుకెళ్ళాడు విక్రమ్, నిరాశగా...

ఏదో ఆలోచిస్తున్న మాలిని, 'అమ్మా' అన్న జూలీ పిలుపు వినిపించగానే ఉలిక్కిపడింది.

మళ్ళీ పిలిచింది జూలీ - 'అమ్మా'.

మాలిని కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

'ఎవరూ లేనప్పుడైనా నిన్నలా పిలవకూ డదా అమ్మా, యిన్నేళ్ళుగా తెలీకపోయినా, తెలిసినప్పట్నుంచీ మనసు ఆపుకోలేకపోయాన మ్మా' జూలీ మాటలకు మాలిని కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి.

జూలీని అక్కున చేర్చుకుంది. తల్లిని ఆర్తిగా పెనవేసుకుంది జూలీ. జీరనిండిన గొంతుతో అంది మాలిని.

'నా దురదృష్టం నీకు తల్లిప్రేమను దూ రంచేసింది. ఆ దురదృష్టం నిన్నూ వెంటాడి, నీ జీవితాన్ని కల్లోలం చేసింది' అన్నేళ్ళ బాధను తల్లి కౌగిట్లో దింపేసుకుంది జూలీ, వెక్కివెక్కి ఏడుస్తూ.

పాటని డీసాల్వ్ చేస్తే,





పక్కపక్కన కూర్చున్న మాలినీ, జూలీలు. మాలిని మాట్లాడుతూంది 'జరిగిందంతా పీడ కలనుకుని మరిచిపో తల్లీ. ఈ కష్టం కలకాలం వుండదు. నేను బతికుండగా యిక నీకు యిలాంటి జీవితం రానీయను. నీకోసం, నీ సుఖంకోసం, ఏమైనా చేస్తాను. నన్ను నమ్ము తల్లీ'

కట్ చేస్తే పోలీస్ స్టేషన్...

ఫాదర్‌ని విక్రమ్ అనుమానించాడని తెలిసి వచ్చిన ప్రేమ్, ఆయన్ని వదిలేసారని తెలిసి తన మనసులోని అనుమానం బైటపెట్టాడు...

కేసులో అనుమానితులంతా విక్రమ్‌కు సన్నిహితులే. అందుకే దాన్ని సాల్వ్ చేయటం విక్రమ్‌వల్ల కాకపోవచ్చునని ప్రేమ్ సందేహం. అంతేకాక, అసలు హత్య జరిగిన రోజు విక్రమ్ హెడ్‌క్వార్టర్స్‌కని బయలుదేరాడే కానీ అతనికి ఆ రాత్రి ఎలిబీ లేదు. మరి విక్రమ్‌ని ఎందుకు అనుమానించకూడదు అని ప్రేమ్ ప్రశ్న. అనుమానితుడే కేసు పరిశోధించవచ్చునా?

ఇది విని ఎస్సై ప్రేమ్‌నేదో అనబోతే విక్రమ్ వారించాడు.

ఒకప్పుడు జూలీని విక్రమ్ ప్రేమించాడని తనకు తెలిసిందనీ, పెళ్ళి చేసుకోకుండా వున్న విక్రమ్, జూలీని పెళ్ళి చేసుకోవటంకోసం మురళిని ఎందుకు చంపివుండకూడదనీ ప్రశ్నించాడు ప్రేమ్. అప్పుడు సమయం సాయంత్రం ఏడవుతూంది.

ఈ హత్య చేసినవారిని 24 గంటల్లో తను పట్టుకోలేకపోతే, కేసును మరొకరికి అప్పగించటం కాదు, రాజీనామా చేస్తానని చెప్పాడు విక్రమ్. మరునాటివరకూ తన పత్రికకు ఈ అనుమానాలు పంపనని చెప్పి, ప్రేమ్ వెళ్ళిపోయాడు.

ఇంటికి వెళ్లటానికి లేచి, విక్రమ్ గుమ్మం దగ్గరికొచ్చేసరికి, జీపు రివర్స్ చేస్తున్నాడు డ్రైవర్. హెడ్‌లైట్ల కాంతి గుప్పున కంట్లో పడింది. అనంకల్పితంగా తన కంట్లో అప్పుడు ఏదో వెలుగు కొట్టిందని బ్రహ్మయ్య చెప్పిన మాట గుర్తొచ్చింది విక్రమ్‌కు. ఆలోచిస్తూ జీపు స్టార్టుచేశాడు.

కట్ చేస్తే...

మాలిని హౌస్ లొకేషన్. విక్రమ్ జీపు వేగంగా యింటిముందాగింది. తెరనిండా వున్న జీప్ హెడ్‌లైట్స్ ఆరిపోయాయి. ఫేడౌట్ అయింది. ఫ్రేంనిండా వున్న హెడ్‌లైట్స్ ఫేడిన్ అయి, లైట్లు వెలిగాయి. జూలీ యింటినుండి కారులో బయలుదేరింది మాలిని.

కట్ చేస్తే...



"బాగలేవుంది యార్ కథ. దీన్ని ఒక్క హీరో కూడా ఒప్పుకోలేదా?" విచిత్రంగా అడిగాడు సూర్యం.

"కథ ఒప్పుకున్నారు. తమ పాత్ర ఒప్పుకోలేదు" విశదీకరించాడు చక్రి.

"మరి ఇంకో కథ తయారుచేసుకోవచ్చు కదా నీతోనే. ఇలా చేశాడేంటి యార్, ఆ ప్రొడ్యూసర్?"

"ప్రపంచంలో అతనొక్కడే ప్రొడ్యూసర్ అయినట్టూ, అతను తీయకపోతే సినిమాలే రానట్టూ, అసలు శ్రీరామచంద్రుడు సినిమా తీస్తే డైరెక్షన్ చేయాలనే పుట్టినట్టూ, సినిమా డైరెక్షన్ అనేది చేయకుండా ప్రపంచంలో వుండకూడదన్నట్టూ ఎందుకంత బాధ. ప్రపంచం చాలా విశాలమైంది"

"నరే... యిప్పుడుమాత్రం ఏమైంది? కొందరు ప్రొడ్యూసర్లను కలుద్దాం"

"ఎవ్వరిదగ్గరా పనిచేయకుండా డైరెక్షన్ చేస్తానంటే వినేంత తీరికెవరికుంది? తీసేంత ఓపికెవరికుంది?"

"వారెవ్వా! ఏంటి యార్... కొందరు ప్రొడ్యూసర్లున్నారు. వాళ్ళను కలుద్దాం"

★ ★ ★



జీపుదిగి షెడ్డు వైపు చూశాడు. అక్కడ ఒక్కటే కారుంది. అంటే, మరో కారు తీసుకుని మాలిని బైటికు వెళ్ళిందన్నమాట. సాలోచనగా లోపలికి నడిచాడు. అటూ యిటూ హాలంతా కలయతిరిగాడు, అసహనంగా. గబుక్కున వంటగదిలోకెళ్ళి, ఓ ఫ్రిజ్‌లోంచి వాటర్ బాటిల్ తీసుకుని, ఓ గుక్కతాగాడు. ఆ సీసాను అలాగే పట్టుకుని ఒక్కోగుక్క తాగుతూ వస్తున్న విక్రమ్, హఠాత్తుగా తాగుతున్న నీళ్ళ విషయం మరిచిపోయి గోడవైపు చూస్తూ నిలుచుండిపోయాడు. అక్కడ... అక్కడ... కారు నుండి కలం వరకూ రెండేసి వుండే మాలిని యింట్లో, గోడకు ఒక్కటే కత్తివుంది. ఒక్కటే...ఒకే ఒక్కటి... ఇంతకుముందు దాని పక్కన మరొకటుండే దన్నట్టుగా కత్తితాలూకు గుర్తు కనిపించింది. నిస్త్రాణంగా నడుస్తూ హాల్లోకెళ్ళి, అచేతనంగా ఓ సోఫాలో కూర్చుండిపోయాడు. భారంగా కళ్ళు మూసుకుని.

బైట కారాగిన చప్పుడయింది. మాలిని నడిచొస్తున్న శబ్దం వినిపిస్తుంది. అయినా కళ్ళు తెరవకుండా అలానే కూచుండిపోయాడు. అతన్ని చూసి, అతని వాలకం చూసి మాలిని ఆశ్చర్యపడింది.

"విక్రమ్, ఏంటి, యింకా యూనిఫాంలోనే వున్నావు?"

కళ్ళు తెరిచి ఆమెనోసారి నిరసనగా చూసి, నిటారుగా నిలుచుని, బదులిచ్చాడు.

"డ్యూటీలోనే వున్నాను"

విచిత్రంగా చూసింది మాలిని.

"భోజనం చెయ్యవూ?"

"కడుపు నిండిపోయింది"

అతని గొంతులో స్ఫురించిన ఎగతాళిని గ్రహించింది మాలిని. కానీ విక్రమ్ ఎందుకలా మాట్లాడుతున్నాడో ఆమె కర్థం కాలేదు.

"అదేంట్రా? విచిత్రంగా మాట్లాడుతున్నావ్?"

తాపీగా ప్రశ్నించాడు విక్రమ్, సూటిగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

"మురళిని ఎందుకు హత్య చేశావత్తమ్మా?"

"ఏంటీ!?" అర్థం అయ్యీ అవక అసంకల్పితంగా అంది మాలిని.

"మురళిని చంపాల్సిన అవసరం నీకేంటి?"

"ము... మురళిని... నేను.. చంపడమేమిట్రా?" తడబడుతూ మాట్లాడలేక మాట్లాడుతున్నట్టు అడిగింది మాలిని.

"నమ్మలేని నిజం" ఆ వెంటనే గొంతులోకి పోలీసు దర్పం వచ్చింది. "ఆ రోజు రాత్రి నువ్వక్కడికి వెళ్ళావా, లేదా? వెళ్ళావా లేదా?" రెట్టించి అడిగాడు విక్రమ్.

గుటకలు మింగుతూ నిలుచున్న మాలిని, బలవంతంగా గొంతు పెకల్చుకుని బదులిచ్చింది.

"వెళ్ళాను... కానీ..."

"కానీ...?"

"మురళిని చంపటానికికాదు. ఆ రోజు రాత్రి జిమ్మీని నా దగ్గరుంచుకున్నాను. తల్లి దగ్గరికెడతానన్న వాణ్ణి బలవంతంగా వారించి నిద్రబుచ్చాను. అర్ధరాత్రి లేచి చూసేసరికి జిమ్మీలేడు. ఇంటికెళ్ళాడేమోనని, కంగారుగా కారు తీసుకుని బయలుదేరాను..."

ఆనాటి రాత్రి తాను ఒంటరిగా కారులో వెళ్ళటం, శ్మశానం పక్కకు వెళ్ళేసరికి ఎవరిదో చావుకేక వంటిది వినిపించటం, మరుక్షణంలో అదే కేక మళ్ళీ వినిపించటం, తాను కారు రివర్స్ చేసుకుని యింటికి తిరిగి వెళ్ళటం అంతా గుర్తు చేసుకుని వివరించింది మాలిని.

"కానీ యింటికొచ్చాక పిల్లాడేమయ్యాడోనన్న ఆదుర్దా కలిగింది. మళ్ళీ మనను చిక్కబట్టుకుని వెళ్ళాలనుకున్నాను గానీ, స్మశానం దగ్గరి అరుపులకు ధైర్యం చాలలేదు. విషయం చెప్పి, మన తోటమాలిని పంపించాను. బాబు క్షేమంగా యింట్లోవున్నాడన్న కబురుతోపాటు, మురళి శవాన్నెవరో పొడిచిన వైనం కూడా వివరించాడు తోటమాలి. మరునాడు నువ్వొచ్చి అప్పటిదాకా మురళి బతికేవున్నాడనీ, ఆ కత్తిపోటుకే చచ్చిపోయాడనీ చెప్పటంతో మరింత ఆశ్చర్యం వేసింది. అంతే అంతకన్నా నాకు తెలియదు"

అపనమ్మకంగా చూసి, ఎగతాళిగా నవ్వి ఉక్రోషంగా అన్నాడు విక్రమ్.

"ఎందుకత్తమ్మా యింకా బుకాయిస్తావ్? ఈ

యింట్లో నువ్వు కొనిపెట్టే చెత్తంతా ఎన్నడూ తీరిగ్గా చూళ్ళేదు గనుక యింతాలస్యమైంది గానీ లేకపోతే ఎప్పుడో కనిపెట్టేవాణ్ణి...''

అతనన్న మాటలకు అర్థమేమిటో ఆలోచిస్తున్న మాలినిని, చెయ్యిపట్టుకుని బరబరా లాక్కుపోయి, అంతక్రితం చూసిన కత్తిని చూపించి అడిగాడు.

''నువ్వు చెప్పేదంతా నిజమైతే, ఈ కత్తి మరొకటేది? ప్రతిదీ రెండేసి కొంటావుగదా? ఇదొక్కటే వుందేం?''

ఆశ్చర్యంగా ఆ కత్తిని చూసి బదులిచ్చింది మాలిని

''నాకు తెలీదురా? నేనూ యిప్పుడే చూస్తున్నాను. మరోటేమైందీ?''

''ఏమవుతుంది? దాంతోనేగా నువ్వు మురళిని చంపింది...''

''విక్రమ్, పదేపదే నన్ను హంతకురాలనకు. నేనా హత్య చేయలేదు. నేనేగానీ వాణ్ణి చంపాలనుకుంటే ఎప్పుడో ఏడెనిమిదేళ్ల కిందటే ముక్కలుగా నరికి చంపేదాన్ని. అంతా అయిపోయాక యిప్పుడెందుకురా చంపటం?'' బావురుమంది మాలిని.

''ఏంటీ!?'' బిత్తరపోయాడు విక్రమ్.

''అవును... నేను చంపాలనుకుంటే వాణ్ణి ఎప్పుడో చంపేదాన్ని''

''ఎందుకు?''

''ఎందుకంటే ఎందుకంటే జూలీ నా కన్న కూతురు కనుక''

దెబ్బతిన్నట్టు చూశాడు విక్రమ్.

''ఏంటత్తమ్మా... జూలీ...?''

''నా కన్నకూతురు... వయసులో చేసిన తొందరపాటును సిగ్గువిడిచి చెప్పుకోలేక ఇంత కాలం రహస్యంగా దాచాను. ఈ రహస్యం నాకూ, ఫాదర్‌కూ తప్ప యింకెవ్వరికీ తెలియదనుకున్నాను. కానీ, అది తెలుసుకుని, నా ఆస్తి కోసమే జూలీని ప్రేమించినట్టు నటించి, మురళి పెళ్ళి చేసుకున్నాడని తెలిసేసరికి తెల్లబోయాను. నాకు జరిగిన అన్యాయమే నా కూతురికీ జరుగుతుందేమోనన్న ఆవేదనతో, ఆస్తి యిస్తే అంతటితో దాన్ని వదిలేస్తాడేమోనన్న భయంతో వాడికి డబ్బివ్వటానికి నిరాకరించాను. నిజంగా నేను వాణ్ణి చంపాలనుకుంటే ఆరోజే వాణ్ణి చంపేదాన్ని. నా కూతురికి విముక్తి కలిగించేదాన్ని...''

మాలిని చెబుతున్నవన్నీ దిగ్భ్రాంతితో వింటూ అచేతనంగా నిలుచుండిపోయాడు విక్రమ్.

''... ప్రేమంటే తెలియని వయస్సులో నేను చేసిన తప్పే నా కూతురూ చేసింది. ఆడదాన్లో ఆడతనం తప్ప మనసు చూడలేని కామాంధులూ, నీచులూ వున్న యీ లోకంలో నాకు జరిగిన అన్యాయమే జూలీకీ జరిగిందని తెలిసిన మరుక్షణమే, ఆ పని చేసిన నీచుణ్ణి నిలువునా నరికేదాన్ని కానీ యిప్పుడెందుకు చంపుతాన్రా... ఇప్పటికీ నువ్వు నన్ను నమ్మకపోతే అరెస్టు చెయ్యి. నన్ను ఉరితియ్యి. కానీ, నా కూతురు మళ్ళీ అనాథలా, నాలాగే నిస్సారమైన జీవితం గడపకుండా చూడు. చాలు, అందుకోసం నన్ను చచ్చిపొమ్మన్నా చచ్చిపోతాను''

''ఒద్దత్తమ్మా... యింకేం చెప్పకు. నువ్వే అయివుంటావన్న అనుమానంతో నిన్ను బాధపెట్టాను కానీ నువ్వు కాదని ఇప్పుడు నాకర్థమైంది''

''విక్రమ్, నాకేమైనా అయితే, జూలీని... జూలీకి... ఏ లోటూ రాకుండా చూసుకుంటావా...'' బేలగా అడిగింది మాలిని మాతృహృదయం.

''నువ్వు నన్నడగాలా అత్తమ్మా'' ఆర్ద్రంగా అన్నాడు విక్రమ్. ''వెళ్ళి భోజనం ఏర్పాట్లు చూడు''- ఆకలి లేకున్నా ఆమె మూడ్ మళ్ళించటానికి అన్నాడు.

★ ★ ★

చీకట్లో పచార్లు చేస్తూ ఆలోచిస్తున్నాడు విక్రమ్... హఠాత్తుగా అతని కళ్ళెదుట జూలీ ప్రత్యక్షమయింది.

''అయాం సారీ విక్రమ్. ఆ హత్య చేసింది నేనే. నీ ముందరంటే నిజం చెబుతున్నాను కానీ, కోర్టులో చెప్పమంటే మాత్రం చెప్పను. నువ్వు నిరూపించలేవు కూడా''

మరుక్షణంలో మాయమైపోయింది జూలి. నిజంగా జూలీ చేసి వుంటుందా? ఆ





అర్ధరాత్రి అసలు స్మశానానికి ఎందుకు వెళు తుంది? వెళ్ళినా, తమ యింట్లోని కత్తి జూలీ కెలా దొరుకుతుంది. ఆ సమయంలో రెడీగా...

ఆలోచిస్తున్న విక్రమ్‌కు కేసులోని ప్రతి అను మానితుడూ దోషి అయివుండవచ్చునని పించింది. మరుక్షణంలో కాదనిపించింది. ప్రతి వాళ్ళూ చెప్పిన విషయాలు గుర్తు తెచ్చు కుని ఆలోచిస్తున్నాడు. ఒక్కొక్కరూ అతని స్మృతి పథంలో కొచ్చి, హేళనగా వెక్కిరిస్తున్నా రు...

"నా ప్రాణానికి ప్రాణంగా పెంచుకున్న జూలీ బతుకుని అన్యాయం చేసిన వాణ్ణి క్షమించేంత ఔదార్యం ప్రభువు నాకివ్వలేద య్యా. మురళిని నేనే చంపాను. అప్పుడే ఆ రబ్బర్ పడిపోయింది. కానీ నువ్వు నిరూపించ గలవా?"

ఫాదర్ చంపి వుంటాడా?

ఆయన తమ ఇంట్లోని కత్తిని దొంగ లించాడా?

ఎప్పుడు?

ఎందుకు?

ఆ కత్తి తీసుకుని, ఎవరో మురళి సమాధి తవ్వి బైటకు తీస్తారని తెలిసి వెళ్ళాడంటే ఎవరూ నమ్మరు. అయినా మురళి బతికున్నా డని ఆయనకెలా తెలుసు?

"నేనే చంపానండీ... ఎంత నిగ్రహమున్నా నడిబజార్లో పైట లాగి అవమానించిన వాణ్ణి క్షమించేంత ఔదార్యం నాలో లేదు. పైగా నా స్నేహితురాలి బతుకుకు వాడో గుదిబండ. అందుకే వాణ్ణి అంతం చేశాను. కానీ, మీరు నిరూపించలేరు"

ప్రియ చంపి వుండవచ్చా?

మరి ఆమెకున్న ఎలిబీ మాటేమిటి?

అసలామెకు కత్తి ఎక్కడిది?

కొంపదీసి కేసు గజిబిజి చెయ్యాలని తను ఇంట్లోని కత్తి తీసుకుని వెళ్ళిందా ఆ రాత్రి?

అయితే ఇంట్లోకెలా వచ్చింది?

కానీ అసలు మురళి సమాధి తవ్వి వుంటుందనీ, అందులో అతను బతికే వున్నా డనీ ప్రియకెలా తెలుసు?

"నేన్నీకు చెప్పిందంతా ఉబ్బర్ ఉబ్బరా జిఫాల్. నేనే వాణ్ణి హడాల్స్ చేసేశాను"

బ్రహ్మయ్యకు అవకాశం వుందిగానీ, చంపినవాడు ఉంగరమెందుకు తీసుకోలేదు?

అది నకిలీదని తెలిసి వదిలేశాడా?

అంత ధైర్యంగా చంపి, వేలిని పరీక్షించిన వాడు ఎందుకు భయపడి అరిచాడు?

అతని అరుపుకు ఫాదరూ, తన అత్తమ్మా ఇద్దరూ సాక్షులున్నారుగదా?

ఒకవేళ పోస్ట్‌మార్టమ్ చేసిన డాక్టర్‌గానీ ప్రాక్టికల్ జోక్ వేద్దామని పోలీసుల్ని ఏడిపిద్దా మనీ, కత్తిపోట్లకు మరణించాడని కల్పించి చెప్పాడా?

గట్టిగా తల విదిలించాడు విక్రమ్. తన ఆలోచనలు సరైన దారిలో వెళ్ళటం లేదు. ఇంకానయం, ఉరేనుకున్న డేవిడ్ దయ్యమైవ చ్చి చంపాడనుకోలేదు...

అసలీ కేసులో ముఖ్యమైన పజిల్...

ఎవరు చంపారనుకున్నా...

మురళి చనిపోలేదనీ...

అతని సమాధిని బ్రహ్మయ్య తవ్వాడనీ ఎలా తెలుసు వాళ్లకు అనేదొకటి.

ఆ సమయంలో...

తమ ఇంట్లోని కత్తిని తీసుకుని...

అక్కడికెందుకెళ్ళారనేది మరొకటి.

ఈ కత్తి తీయడానికీ, కాకతాళీయంగానైనా తవ్వివున్న సమాధిని చూడటానికీ అవకాశం వున్న దెవరికీ?

ఎవరికి?

హఠాత్తుగా ఎవరికో అనిపించి దిగ్భ్రాంతి చెందాడు. అంతే అయివుంటుంది. దీన్ని బైట పెట్టాలి...

ఓ నిర్ణయానికొచ్చి, ఇంట్లోకి నడిచి, పోలీస్ స్టేషన్‌లో వున్న ఎస్సై శ్యాంకు ఫోన్ చేశాడు-

"హలో శ్యాం, నేను విక్రమ్‌ని... మురళి హత్యా కేసులో అనుమానితులు అందరినీ ...యస్, ప్రతి ఒక్కరినీ రేపు ఉదయం పదింటికి చర్చ్ దగ్గరికి తీసుకొచ్చే ఏర్పాటు చెయ్యి. రేపు తేల్చేస్తాను... అనుకుంటున్నాను"

ఫోన్ పెట్టేసిన విక్రమ్ చాలాసేపు అక్కడే

నిలుచుండిపోయాడు. మనసంతా శూన్యంగా, కాస్సేపటికి భారంగా అనిపించింది.

హాల్లో గడియారం ఒక గంటకొట్టింది. టైం ఎంతయిందో అనుకుంటూ మళ్ళీ యింట్లోంచి బైటికి నడిచాడు. ఊరు నిశ్శబ్దంగా నిదరోతున్నది. తను మాత్రం యిక నిదరపోలేడీ రాత్రికి.

ఏమిటీ జీవితం, ఏమిటీ బంధాలూ, అనుబంధాలూ... ఎందుకీ కష్టాలు, సుఖాలూ, పోరాటాలూ... ఒక్కో జీవితాన్ని ఒక్కో విధంగా మలిచే ఆ భగవంతుని అంతర్యమేమిటి? అసలు తనీ వూరికి రాకుంటే బావుండేదా? తన ఆలోచనకు అనుకోకుండా నవ్వొచ్చింది విక్రమ్‌కు. రాకపోతే, లేకపోతే, ఇది యిలా జరగకపోతే, యివన్నీ పిచ్చి ప్రశ్నలు...

చిన్నప్పుడు జూలీ, తనూ కలిసి ఏ ప్రేమలూ, వాంఛలూ, కోరికలూ లేకుండా ఎంత హాయిగా వుండేవాళ్ళు. కలకాలం అలాగే వుండిపోతే ఎంత బావుంటుంది. కానీ అది అసాధ్యం కదా. పుట్టుక, చావు, మార్పు, మలుపు, ఓటమీ, గెలుపూ, దిసీజ్ ఆల్ యిన్ ద గేమ్. ఒక పుట్టుక ఎంత కష్టం, ఒక తల్లి తొమ్మిది నెల్లమోత బరువు, కాస్సేపటి పురుటినొప్పులూ, వెరసి జనించే ఒక మనిషి నూరేళ్ళ బతుకులో ఎన్ని మోత బరువులు, ఎన్ని బాధలు, ఎన్ని కేరింతలు, ఎన్ని సమస్యలు... ఒక చావు ఒక జీవితాన్ని ముగిస్తుందేమో కానీ, ఆ జీవితో ముడిపడి వున్న ఎంత మందికి ఎన్నిరకాల అనుభూతుల్నీ అనుభవాల్నీ పంచియిస్తుంది...

తను ఈ వూరికి రావటమే తన జీవితంలో ఒక మలుపు... కాదు, తనను తన అత్తమ్మ దత్తు తీసుకోటమే మలుపు. జీవితంలో పెళ్ళి మరో ముఖ్యమైన మలుపన్నారు. అంతదూరం పోకుండానే తన జీవితం ఎన్నో మెలికలు తిరిగింది. అసలా మాటకొస్తే జూలీ జీవితాన్ని పెళ్ళి ఓ కుదుపు కుదిపింది. జూలీ జీవితం అలా కావటానికి తన అత్తమ్మ మాలినీ దేవి ముఖ్యకారణమేమో. ఆమెగానీ తను వయసులో వుండగా తొందరపడకపోతే, ప్రేమను అషామాషీగా తీసుకోకపోతే, జూలీ మరోరకంగా పెరిగేది. అయినా ఫాదర్ దగ్గర ఎంతో అపురూపంగా పెరిగిన జూలీ, చదువూ, ఆలోచనా, వివేకమూ వున్నదనుకున్న జూలీ, మురళి విషయంలో ఎందుకంత తొందరపడింది.

ఇన్‌స్పెక్టర్‌గా తనావూరికి వచ్చిన మొదటిరోజునే ఫాదర్‌ని కలిశాడు, ముందుగా యింటికి వెళ్ళకుండా. అది ఫాదర్‌మీద గౌరవంతో కాదు, జూలీకోసం. నగరంలో కాలేజీల్లో, ఎంత మంది అమ్మాయిలు కనిపించినా, ఎందుకు తనకు సన్నిహితంగా రావటానికి ప్రయత్నించినా, ఎందుకో తన మనసు జూలీచుట్టే తిరిగేది. అందుకే కదా, సిగ్గువిడిచి జూలీని చూడాలనే ఆత్రంతో కాలేజీ దగ్గరికి అనాలోచితంగా వెళ్ళాడు తను. అన్నాళ్ళూ చిన్నారి జూలీ రూపమే తన మనసులో ముద్రపడి పోయింది గానీ కొత్త తొడుగులతో వయసు చివురులతో ఎదిగిన జూలీని ఊహించుకోలేక, ఊహలకుంచెతో చిత్రించుకోలేక ప్రియని జూలీగా పొరవడ్డాడు... ఆ రోజు ఎంత ఆనందం, ఎంత ఉద్వేగం, ఎంత ఉత్తేజం, ఎంత ఉత్సాహం... జూలీ తనతో జోక్స్, ప్రాక్టికల్ జోక్స్ వేసిందంటే తనెంత సంబరపడిపోయాడు. జూలీ తనదే నన్న ఆలోచన ఎంత హాయిగా తోచిందప్పుడు.

అలాంటిది 'స్టాప్‌లుక్ అండ్ ప్రొసీడ్' బోర్డు దగ్గర మురళి పరిచయంతో జూలీ తననుండి దూరమవుతుందని తాననుకోలేకపోయాడు. ఆ సంఘటన జరిగిన మరునాడు జూలీ తనతో నవ్వుతూ చెప్పినప్పుడు తనూ జూలీతోపాటు నవ్వకుండా వుండలేకపోయాడు. మురళి పరిచయాన్ని ముందుకు కొనసాగించేటప్పుడు జూలీ ఆ బోర్డును గుర్తుతెచ్చుకుంటే ఎంత బావుండేది. ఆగి, ముందూ వెనకా ఆలోచించి, ముందుకు సాగాలా వద్దా అనేది నిర్ణయించుకుంటే, ఇప్పుడు జూలీ జీవితం కానీ తన జీవితం కానీ మరోవిధంగా ఉండేవేమో. ప్రేమలో పడే ప్రతీ మనిషీ స్టాప్‌లుక్ అండ్ ప్రొసీడ్ అని గుర్తుతెచ్చుకుంటే ఇన్ని విఫలప్రేమల వ్యధిత జీవితాలుండేవి కావేమో. నిజానికి ఆ ట్రాఫిక్ సిగ్నల్ రోడ్డు మలుపుల దగ్గరే కాదు, జీవితంలో తిరిగే ప్రతి మలుపుదగ్గరా గుర్తుంచుకోవాల్సిన హెచ్చరిక.

జూలీ, మురళి ప్రేమలో పడిందని తను

గ్రహించలేకపోయాడు. ప్రేమ పిచ్చిదని జూలీ విషయంలోనే కాదు, తన విషయంలో నూ రుజువయింది. లేకపోతే, జూలీ ప్రేమ కోసం తహతహలాడిన డేవిడ్‌నీ, మురళినీ ఒకేగాట కడతాడా తను. చివరికి డేవిడ్‌నీ, తననీ ఒకే గాట కట్టింది జూలీ. మురళి హఠాత్తుగా మతం మార్చుకున్నప్పుడైనా తను ఊహించలేదు. బహుశా ప్రియ ముందుగానే కనిపెట్టివుంటుంది. అందుకే తన వెంట పడిందేమో. లేకపోతే, 'జూలీ పెళ్ళాడబోయే విక్రమ్'గా తన గురించి ఊహించి వుంటే, తన స్నేహితురాలికి ద్రోహం తలపెడుతున్నాననే ఆలోచనతో ప్రియ తన వెంట పడేది కాదు.

తన తరపున తన అత్తమ్మ, ఫాదర్ దగ్గరికెళ్ళి పెళ్ళి ప్రస్తావన తీసుకొచ్చేవరకూ ఈషణ్మాత్రంగానైనా తనకు నిజం తెలియదు. తెలిసినాక జూలీని అభినందించటం తప్ప మరేం చేయగలిగాడు... జూలీ పెళ్ళి రోజున, మనసులో ఆవేదన ఉప్పెనగా చెలరేగుతుంటే, కళ్ళతో చిరునవ్వుల తెమ్మెరలు చిలికించాడు. జూలీ హాయిగా, ఆనందంగా కాపురం చేసుకోవాలని మనసారా కోరుకున్నాడు. జూలీ పెళ్ళయిన మరునాడు పావురాయి సమాధి దగ్గర కూర్చుని, తన ప్రేమనూ సమాధిచేశాడు. కానీ జూలీ జీవితం అలా మారుతుందని ఊహించలేకపోయాడు.

జూలీ, మురళితో ఊరు విడిచి వెళ్ళిన రోజున ప్రాణాన్ని నిరాకారం చేసి, దేహం వెళుతున్నట్టు బాధపడిన ఫాదర్‌ను తనే ఓదార్చాడు. మురళినుండిగానీ, జూలీ నుండిగానీ కబురులేదని తల్లడిల్లిన ఫాదర్‌ను ఓదార్చాడు. అయిన వాళ్ళందరినీ మరిపించే భర్త మురిపాల్లోపడి జూలీ హాయిగా వుండి వుంటుందని ఫాదర్‌కు నర్దిచెప్పాడు. కానీ, వాళ్ళకోసం వెళ్ళిన ఫాదర్ తిరిగొచ్చి చెప్పిన మాటలు విని అయోమయంలో, అచేతనావస్థలోపడిపోయాడు. అది తాత్కాలికంగా మాత్రమే. ఆ తరువాత ఎన్నో విఫలయత్నాలు, జూలీని కనుక్కోవటానికి...

ప్రేమలో తొందరపడి, పెళ్ళికి ముందే బిడ్డనుకని, ఆ బిడ్డకు దూరంగా వెళ్ళిపోయి, మరొకర్ని పెళ్ళిచేసుకుంది తన మేనత్త మాలిని. ఆమె దురదృష్టం, ఆ భర్తతోనూ సుఖంగా నాలుగురోజులు వుండకముందే పసుపు, కుంకుమలకు దూరమై, కన్న కూతురు కళ్ళెదుటే వున్నా తన కూతురని చెప్పుకోలేక మోడువారిన గొడ్రాలి బ్రతుకు బతికింది. ఆ తల్లి కన్నకూతురే అయినా, జూలీ పెళ్ళికి ముందే తొందరపడకుండా జాగ్రత్త పడింది కానీ, అంతకన్నా ఘోరంగా మోసపోయింది తనకూతురు. పెళ్ళి చేసుకుని మోసపోయిందని తెలుసుకున్న ఆ తల్లి ఎంత బాధపడిందో, పడుతూందో, ఎవరు చెప్పగలరు... ఆ మాటకొస్తే తను మాత్రం...? జూలీ యెడబాటుతో మనసు ముక్కలయింది. ఆమె పెళ్ళి వంచనగా మారిందని తెలియగానే అసలు పెళ్ళి మీదే విరక్తి కలిగింది.

తనలాంటి మరో నిర్భాగ్యుడు డేవిడ్. ప్రేమించటానికి అర్హతేం వుంది గనుక, జూలీని ప్రేమించటానికి డేవిడ్ తగడనుకోవటానికి... జూలీని ఎంత గాఢంగా ప్రేమించకపోతే, దేవదానులా తాగుబోతుగా మారి, జూలీ బతుకు నరకమయినవైనం కళ్ళారా చూడగానే తట్టుకోలేక ఆత్మహత్య చేసుకుంటాడు. డేవిడ్ కూడా జూలీని పిచ్చిగా ప్రేమించాడు. ఆమె కూడా తననలాగే ప్రేమిస్తున్నదని నమ్మి, ఆమె తల్లో పువ్వు పెట్టుకొస్తుందని వందెం కాసి, నగం మీసం పోగొట్టుకున్నాడు. న్యూయియర్‌డే రోజున తన కొండంత ప్రేమకు గుర్తుగా కొండంత పూలగుత్తి తీసుకొచ్చాడు. జూలీ ఎంత నిర్లక్ష్యం చూపించినా పిచ్చివాడిగా తిరిగాడు. ఇంత పిచ్చి ప్రేమికుల్ని కాదని మురళిని నమ్మిందంటే జూలీ పిచ్చిదనుకోవాలా...

కాదేమో. అది మురళి చాకచక్యం. తెలిసి నేరం చేసినవాడు మాత్రమే తానా నేరం చేయలేదని బలమైన రుజువులు చూపించుకున్నట్టుగా, అవసరానికి ప్రేమించిన వాడే ఎక్కువగా ఆరాధిస్తున్నట్టు నమ్మించగలడు. నిజం నగ్నంగా వున్న ఇల్లాలైతే అబద్ధం అలంకరించుకున్న వెలయాలని ఎవరో అన్నట్టు, అబద్ధం బైటికొచ్చినంత సులభంగా నిజంరాలేదు. కవట ప్రేమ అంత ఆకర్షణీయంగా అసలైన ప్రేమ కనిపించదు. చివరకు మతం కూడా మార్చుకోవటంతో జూలీతోపాటు



ఫాదర్ కూడా దిగ్భ్రాంతి చెంది వుండవచ్చు. మతం ప్రాణాలకన్నా ఎక్కువైన రోజుల్లో ప్రేమకు అంతకన్నా రుజువేం కావాలని ఎవరైనా అనుకుంటారు. అదే జరిగింది. జూలీ, మురళిని పెళ్ళిచేసుకుంది. అత్తారింటికి తరలి వెళ్ళింది. కానీ ఆ అత్తారిల్లు ఆమె పాలిటి యమ సదనమని ఆలస్యంగా అర్థమయింది.

అసలు జూలీ ఎక్కడుంది ఎలా వుంది, బతికేవుందా.. వుంటే ఉత్తరాలు రాయదేం, ఎన్ని ప్రయత్నాలు చేసినా కనిపించదేం, అని ఎంత మధనపడ్డారు తామంతా. ఓరకంగా డేవిడ్ అదృష్టవంతుడు. తనను తాను మరిచి పోయేంతగా తాగి, తన మనసులోని బాధ తోనే ఫాదర్‌ని ఓదార్చాడు. ఆ ఓదార్పుకు కూడా నోచుకోని తన అత్తమ్మ మాలినీదేవి ఎంత క్షోభననుభవించిందో...

భగవంతుడు గొప్ప సాడిస్టేమో... లేకపోతే జూలీ ఏమైపోయిందోనని పడుతున్న ఆవేదనను అంతం చేసినట్టే చేసి, ఆమెను చూపించి, అంతకన్నా క్షోభను కలిగించాడు. కోర్టులో, చేతులకు సంకెళ్ళతో ఎదురైన మురళి, భార్య మీద, అంటే జూలీ మీద హత్యా ప్రయత్న నేరానికి అరెస్టయ్యాడని విన్నప్పుడు తన మనసులో కలిగిన ఆలోచనల్ని ఎలా తెలుపుకోగలడు మాటల్లో...

మురళి అంత దిగజారిపోయాడా అనుకుంటే, తాగటానికి డబ్బులకోసం పందెంవేసి, నడిరోడ్డో ప్రియ పైట లాగేంత దిగజారిపోయాడని, అతను మరణించాక తెలిసింది. పాపం ప్రియ, తనకు జరిగిన అవమానం తన సొంత అన్నకు కూడా చెప్పుకోలేదు. పైగా, ఆవేశాన్నణచుకునే నిగ్రహమార్గం చూపింది మీరేగా అని గుర్తు చేసింది. తాను ప్రేమించిన మనిషిని పెళ్ళి చేసుకోలేకపోయాడు. జూలీ, ప్రేమించి పెళ్ళి చేసుకున్న భర్తకు దూరంగా వుండాల్సొస్తోంది. ఎంత విచిత్రం ఈ జీవితాలు. ఎందుకీ సమస్యలు... ప్రభూ, నాకు ప్రశాంతమైన జీవితం కావాలంటే, ప్రశాంతత స్మశానంలో తప్ప దొరకదంటాడేమో దేవుడు.

మురళిలాంటి వాడికి ఆ స్మశానంలో కూడా ప్రశాంతత దొరకదేమో. రెండు చావులు, రెండు సార్లూ నికృష్టంగానే చచ్చిన వాడు, చచ్చికూడా సమస్యలు సృష్టించాడు. ముఖ్యంగా తనకు... ఎంత విచిత్రమైనదీ కేసు...

శవాన్ని పొడిచారనే సంఘటనతో ప్రారంభమైంది. జర్నలిస్టు ప్రేమ్ పుణ్యమాని పత్రికలకెక్కి, గొప్ప సంచలనం సృష్టించింది. సమాధయి పోయిన వాణ్ణి, సమాధి తవ్వి, శవపేటిక బైటికి తీసి పొడిచారంటే, ఆ చచ్చిన వాడి మీద ఆ మనిషికెంత కసి వుండాలీ అనిపించింది అలాంటిది, ఆ కత్తి పోట్లకే చచ్చాడని పోస్టుమార్టమ్ రిపోర్టు. అంటే బతికున్న వాణ్ణే సమాధి చేసారన్నమాట. అది మరో సంచలనం. అసలు మురళి సమాధిలో బతికే వున్నాడని ఎలా తెలుసు, తెలిస్తే మాత్రం అలానే చావనీయమని వదిలేయకుండా, బైటికి తీసి పొడిచేయటం ఎందుకన్న దగ్గరే కొన్ని నెలలు ఆగింది. చివరకు బట్టలు షాపు వాళ్ళు పెట్టెల మూత తీయటం చూసి, తన డిపార్టుమెంటు తీయించిన ఫొటోలు అదే సమయంలో గుర్తొచ్చి, తాను బ్రహ్మయ్యను అనుమానించటంతో మొదటి ముడి విడిపోయింది. ఆలోగా అందరూ అనుమానితులే. ఆ తరవాతా అందరూ అనుమానితులే అయ్యారు. మురళి సమాధిని బ్రహ్మయ్య తవ్వి పెట్టాడని తెలిసి, అదే సమయానికి తన యింట్లోని కత్తి తీసుకుని అక్కడికి వెళ్ళే అవకాశం ఎవరికుంది? ఎంత ఆలోచించినా ఈ చిక్కు ముడి వీడలేదు. లేదంటే మురళి బతికున్నాడని తెలిసి, వెళ్ళి కత్తి తెచ్చుకునే సరికి అతను స్పృహలోకొచ్చి లేచి వెళ్ళి పోవచ్చుననే ఆలోచన ఆ హత్య చేసినవారికి రాదా? అప్పుడు ఏ బండతోనో తల పగలగొడితే సరిపోయేది. ఇప్పుడూ ఆ కత్తి పోట్లు అలాగే వున్నాయి, ఆవేశంతో పొడిచినట్టు. అప్పుడు మళ్ళీ ప్రశ్న మొదటి కొచ్చింది. ఆవేశమొచ్చిన సమయానికి కత్తి రెడీగా ఎందుకుంది? ఈ చిక్కుముడి బహుశా రేపటితో విడిపోతుంది తన ఊహ సరైనదేనని తన నమ్మకం...

కానీ అమాయకమైన కన్నెవయసులో ఎవరో ఒకర్ని నమ్మి మోసపోయే మాలినీదేవిల కథలూ, దుర్మార్గుల్ని నమ్మి పెళ్ళిచేసుకుని జీవితాలు నరకం చేసుకునే జూలీల కథలూ ఎప్పుడాగుతాయనే చిక్కు ప్రశ్నకు మాత్రం సమాధానం లేదు...




ఆలోచనల్లోంచి తేరుకున్న విక్రమ్, ఎర్రబడుతున్న ఆకాశాన్ని వింతగా చూశాడు. పక్షుల కువకువలు వివిపిస్తున్నాయి. పూల వానల్ని మోనుకొస్తున్న పొద్దుటి గాలి చల్లగా, హాయిగా తగులుతూంది. ఆకాశాన్ని పొడుచుకునో, భూమిని చీల్చుకునో కెంపుముక్కలా వస్తున్నాడు సూర్యుడు. అన్ని అందాలు కళ్ళెదుటే వున్నా బరువెక్కిన మనసుతో యింట్లోకి నడిచాడు విక్రమ్.

★ ★ ★

చర్చ్ ముందు జీపుదిగిన విక్రమ్, అక్కడ సమావేశమైనట్టున్న జనం మధ్యకు నడిచాడు. అనుమానితులందరూ విక్రమ్‌ని చూసి సర్దుకున్నారు. అందులో కొందరి మనసుల్లో భయం బితుకు బితుకుమంటూంది. కొంపదీసి తమనే దోషి అని లోపల తోస్తాడేమోనని. మరికొందరికి కుతూహలంగా వుంది. ఇందరిలో ఎవరు? ఎవరైవుంటారు?-అని. ఎలా కనిపెట్టాడు, లేదా కనిపెడతాడు అని మరికొందరిని సందేహాలు తొలుస్తున్నాయి. ఎస్సై శ్యాంకైతే తన బాస్‌ని చూసి చాలా గర్వంగానూ, ఆ హత్య చేసిందెవరో ముందుగా తనకు చెబితే బావుండునని నిరాశగానూ, ఎవరైవుంటారో తొందరగా తేల్చేస్తే బావుణ్నని ఆత్రంగానూ వుంది.

ఇక అసలు హత్య చేసిన వ్యక్తికేమో తనను విక్రమ్ కనిపెడతాడన్న జంకూ గొంకూ లేదు.

ఒక్కొక్కరినీ చివరిసారిగా ప్రశ్నించాడు విక్రమ్, తెలిసిన నిజం చెప్పమని. చివరిసారిగా అడిగాడు, నేరం చేస్తే ఒప్పుకోమని. అందరూ ఒకటే మాట. తమకు తెలిసిందంతా చెప్పేశామనీ తాము హత్య చేయలేదనీ. అందరినీ ఓసారి చూసి-

"సరే... నేనే బయట పెడతాను" అని ఒక్కొక్కర్ని దాటి నడవసాగాడు. అలా వెళ్ళినవాడు జూలీ ముందు నిలుచుని, ఓ క్షణం సాలోచనగా చూసి, జూలీ బుగ్గమీద ఈడ్చి కొట్టాడు.

అందరూ నిర్ఘాంతపోయారు. జూలీ షాక్ నుండి తేరుకోకముందే మరో దెబ్బ... కళ్ళవెంట నీళ్ళు జలజలారాలుతున్నాయి జూలీకి. విక్రమ్ మామూలుగానే సాధుస్వభావి. అందునా అతనికి జూలీ అంటే వున్న యిష్టం అందరికీ తెలును. అందుకే ఆశ్చర్యంగా చూస్తున్నారు. జూలీ చెంపలపైన ఐదో దెబ్బపడబోతుండగా-

"ఒద్దు... కొట్టొద్దు" అని ఎవరో అనటం వినిపించింది.

విక్రమ్‌తో పాటు అందరూ అటు తిరిగారు.

"ఎందుకు?" కఠినంగా ప్రశ్నించాడు విక్రమ్.

"నేను చెబుతాను"

అంతా తెల్లబోయారు. బాధగా నిట్టూర్చి, చెప్పమన్నట్టు చూశాడు విక్రమ్.

★ ★ ★

మురళి చనిపోయిన రోజు, మాలిని బలవంతంమీద నిద్రపోయినట్టు నటించిన జిమ్మీ, ఆమె నిద్రలోకి జారుకోగానే లేచాడు. మంచం దిగి హాల్లోకి నడిచాడు. తలుపు తీయబోతే గొళ్ళెం అందలేదు. అటూ, యిటూ స్టూలు కోసం చూడగా గోడనున్న కత్తులు కనిపించాయి. ఒకదాన్ని లాగాడు. దాని సాయంతో గొళ్ళెం తీసి, తలుపులు తెరిచి, కత్తిని లోపల పెట్టబోయి ఆ ప్రయత్నం మానుకుని చేతిలో పెట్టుకుని బైటికి నడిచాడు.

చీకట్లో బితుకుబితుకుమంటూ నడుస్తుండగా, స్మశానం వచ్చింది. అది దాటితేనే ఇంటికి చేరుకుంటాడు. స్మశానం పక్క నడుస్తుండగా ఎవరో ఏదో తవ్వుతున్న చప్పుడు వినిపించి, ఆగి, అటుకేసి చూశాడు. ఎవరో సమాధి పెట్టె మూత ఊడతీస్తున్నారు. అడుగు ముందుకేయకుండా ఆగిపోయాడు. అంతలో బ్రహ్మాయ్య అరిచిన అరుపులతో బిక్క చచ్చిపోయాడు. మాలిని కారును గుర్తించి, అరవటానికి గొంతు పెకిలించుకునేలోపల ఆమె వెళ్ళిపోయింది. అప్పుడు వినిపించింది జిమ్మీకి, "జూలీ" అన్న అస్పష్టమైన పిలుపు. అదే ట్రాన్స్‌లో అలాగే అటుకేసి నడిచాడు. సమాధిలోంచి లేచి కూచున్న మురళి, యింకా మగతలోనే వుండి, కలవరిస్తున్నట్టుగా గొణుగుతున్నాడు "జూలీ, జూలీ" అని. అతని ఒక్కో పిలుపు, జిమ్మీకి, అతను తల్లినీ తననూ పెట్టిన చిత్రహింసలు గుర్తొచ్చాయి. సిగరెట్లతో కాల్చటం, బెల్టుతో కొట్టటం, తలగోడకేసి

బాదటం, కాలితో తన్నటం... తనకూ, తన తల్లికీ ఒంటిమీదా, గుండెలమీదా చేసిన గాయాల కసితో ఒక్క పోటు పొడిచాడు. అసంకల్పితంగా ఆ ఊపుకు మురళి గుండెలో దిగిన కత్తితోపాటు గోతిలో పడిపోయాడు జిమ్మీ. అతని షర్టు జేబులోని రబ్బర్ పడిపోవటం గమనించలేదు. గోతిలో పడగానే స్పృహ వచ్చింది. కత్తితో కస, కసా పొడిచి, బైటపడి ఇల్లు చేరాడు.

★ ★ ★

జిమ్మిని సంకెళ్ళువేసి, ఎస్సై శ్యాం తీసుకు పోతుండగా నిస్సహాయంగా విక్రమ్ గుండెల పై బావురుమంది జూలీ. ఓదార్పుగా ఆమె తలపైన చెయ్యివేసాడు విక్రమ్.

ఫ్రీజ్ చేస్తే-

ఆ ఫ్రేం, ఇన్‌సెట్‌లా ఒక మూలకు వెళ్ళి ంది. మరో పక్కన అక్షరాలు ఫేడ్‌యిన్ అయ్యాయి. "స్టాప్- లుక్- అండ్ ప్రొసీడ్" అని. మరుక్షణంలో స్టాప్- లుక్ ఒక పక్కకూ అండ్ ప్రొసీడ్ మరో పక్కకూ జరిగితే వాటిమ ధ్యలో టైటిల్స్ అన్నమాట వచ్చి చేరింది. కలిపి చదివితే- స్టాప్ లుక్ టైటిల్స్ అండ్ ప్రొసీడ్-

ఆగి, టైటిల్స్ చూచి, వెళ్ళండి.

రోలింగ్ టైటిల్స్ ప్రారంభమయ్యాయి.

★ ★ ★

"ఈ కథకోసం అంటే ఒక సాధారణమైన డిటెక్టివ్ కథనుమించి ఏమీలేని ఈ కథకోసం యిందరు హీరోలనుకాదని, యిన్ని కష్టాలు పడ్డారా మీరు!" ఆశ్చర్యంగా అడిగాడు రాఘవ రావు, స్క్రిప్టుతిరిగి యిచ్చేస్తూ.

రాఘవరావు పేరున్న నిర్మాత. చిన్న బడ్జె ట్‌లో సినిమాలు తీసి, ప్రేక్షకులను ఆకట్టుకోవ టంలో అందెవేసిన చేయిగా పేరుగాంచిన వాడతను. కొత్తవాళ్ళను ప్రోత్సహించటంలో అందరికన్నా ముందుంటాడనే పేరుందాయ నకి. ఆయన్ని కలుసుకుని తన విషయమంతా వివరించి, తన స్క్రిప్టు ఆయనకిచ్చాడు చక్రి.

రాఘవరావు మాటలు విని చక్రి ఆశ్చర్యపో యాడు.

"మీరు స్క్రిప్టంతాచదివారా?"

"చదివానండీ... కథ ఏమంత గొప్పగాలేదు. ఏ అభ్యుదయ భావమో, కొత్త ప్రయోగమో వుంటే బావుండేది. కనీసం ఒక సందేశం..."

సందేశం యివ్వటానికి టెలిగ్రాం యిస్తే సరిపోతుంది, లక్షలు ఖర్చుపెట్టి సినిమా తీయటం దేనికన్న చక్రపాణిగారి మాటలు గుర్తొచ్చాయి చక్రికి. కానీ అది చెప్పకుండా తమాయించుకున్నాడు.

"నరేసార్... ఇది వినండి రోడ్డుమీద ఒక చిన్న యాక్సిడెంట్ జరుగుతుంది. అది చేసిన కారు డ్రైవర్, దానికి గురైన వ్యక్తి, ఆ డ్రైవర్ చెప్పగా ఈ సంఘటన గురించి విన్న అతని ప్రియురాలు, ఈ కేసు పరిశోధిస్తున్న ఇన్సూరె న్స్ ఏజెంట్. అతను డబ్బవసరంలో వుంటా డు. ఈ నలుగురూ కాక ఆ యాక్సిడెంట్‌గు రించి పేపర్‌లో చదివిన ఓ రచయిత ఈ ఐదుగురి దృష్టిలో ఆ యాక్సిడెంట్‌కు సంబంధించిన ఆలోచనలతో ఓ కథవుంది యిమ్మంటారా?"

రెండు క్షణాలుతెల్లబోయి నవ్వేశాడు రాఘ వరావు.

"ప్రయోగం అంటే మరీ యింత గొప్ప ప్రయోగమా... కనీసం మ్యాట్నీ షోకైనా జనం వుంటారంటారా? ఆర్ట్ ఫిలిం తీసి ఆరిపో మ్మంటారా? బలేవారండీ"

"మరి నేనూ అంతేగదండీ. అందునా డైరె క్టర్‌గా మొదటిసినిమా. నా నిర్మాతా, దాన్ని కొన్న బయ్యర్లూ బాగుంటేనే కదా నా దగ్గరికి రెండో నిర్మాత వచ్చేది"

"చక్రిగారూ, నా మాటల్ని అపార్థం చేసుకు న్నారు. ప్రయోగంలాంటి సినిమా నేను తీస్తా నని కాదు నా అభిప్రాయం. మామూలుగావున్న ఒక కథను పట్టుకుని దానికోసం సినిమా అవకాశం వదులుకున్నారే అని అంతే..."

చిన్నగా నవ్వాడు చక్రి.

"ఈ ఒక్క కథ తప్ప తీయలేకపోతే నేను దర్శకుణ్ణి కావాలనుకోవటమే వృథా. ఓ కొత్త నిర్మాతకు మినిమంగ్యారంటీగా వుంటుందని, వుండాలని చాలా జాగ్రత్తగా తయారుచేసిన కథయిది. హారర్‌తో ప్రారంభమై, టీనేజ్ లవ్ స్టోరీలా యింటర్వెల్ దాకా నడిచి, ఆ తరు

వాత ఆ కథ మరో మలుపు తిరిగి, ఓ చిన్న హత్యతో ముగుస్తుంది. ఈమధ్య కాలంలో యిలాంటి కథలులేవు. కామెడీ తీసుకుందా మంటే కుప్పతెప్పలుగా వస్తున్న కామెడీల్లో, నా సినిమా విడుదలయే సమయానికి దానికి పోటీగా ఏది రిలీజవుతుందో తెలియదు. ఫామిలీ సెంటిమెంట్ తీసుకుందామంటే బిజినెస్ రేంజ్ వున్న హీరోలు చేయరు. క్రైం తీసుకుందామంటే చిన్న బడ్జెట్‌లో కష్టం. పూర్తిగా లవ్ సబ్జెక్ట్ తీసుకుందామంటే కొత్త హీరో హీరోయిన్లు కావాలి. నా నిర్మాతలూ కొత్తవాళ్ళు కనుక దానికి ఫైనాన్స్ దొరకటం కష్టం. ఇవన్నీ ఆలోచించి ఈ కథలో నాకు మినిమం గ్యారంటీ వస్తుందని నమ్మకం కలిగింది గనుక ఆలోచించాను. అంతేకాక, హీరోలు చెప్పిన మార్పులు ఖచ్చితంగా చేయకూడదని కాదు, కానీ హడావిడిగా కూడదని. మేం అనుకున్న దాన్నిబట్టి అప్పుడు మాకంత సమయంలేదు. తొలిసారిగా దర్శకత్వం వహించే సినిమా కథ హడావిడిగా తయారుచేసుకుని, స్క్రిప్టు లేకుండా సెట్స్ మీదికి వెళ్ళే రిస్కు చేయలేక అంతే... మీలాంటి నిర్మాత సిద్ధపడితే ఎలాంటి కథైనా తీయగలను. అయినా మనలోమాటగా అడుగుతున్నానూ, అసలు కథంటే ఏమిటి సార్?''

''కథంటే కథే... కాస్త కొత్త కథ'' సందేహంగా అన్నాడు రాఘవరావు.

''గ్రీకులో ఓ ఏడు కథలున్నాయట. మనం ఎంత కొత్తగా ఆలోచించినా, మన ప్రతికథా అందులో ఏదో ఒకదాన్ని పోలివుంటుందట. ఇంతకూ నా అభిప్రాయమేమిటంటే కొత్త కథలుండవు. కొత్త కథనాలుంటాయి. సినిమా చూసినంత సేపూ ప్రేక్షకుడు థియేటర్‌లో కూర్చుని చూడాలి అంతే... అది ప్రజెంటేషన్‌లో వుంటుంది. నా స్క్రిప్టులో మీకేమనిపించింది?''

''నిజంగా ఆసక్తిదాయకంగానే అనిపించింది. కాకపోతే మీరు ఏదో ఒక సినిమాకు పని చేయండి. ఆ తరువాతి ఛాన్స్ నేనివ్వగలను''

ఆయన మాటలకు ఏమని బదులివ్వాలో అర్థంకాలేదు చక్రికి. కాస్సేపటికి మళ్ళీ ఆయనే అన్నాడు.

''చక్రిగారూ... నేను కొన్ని ఇంగ్లీష్ క్యాసెట్లూ, కొన్ని కటింగ్సున్న ఫైల్సూ యిస్తాను. వాటి సహాయంతో ఓ కథ తయారుచేయండి. అది మా డైరెక్టర్‌గారికి నచ్చితే ఈ సినిమాకు డైరెక్షన్ డిపార్టుమెంట్‌లో చేద్దురుగానీ. అలా ఒకటి రెండు సినిమాలకు పనిచేశాక మీరు డైరెక్టు చేసే విషయం ఆలోచిద్దాం''

★ ★ ★

కొత్తదనానికి ఎప్పుడూ కష్టాలు తప్పవు. కానీ దాన్లో తేడాలున్నాయి. కొత్తగా వయసొచ్చిన ఆడపిల్లకైతే కావలసినంతమంది ఆరాధకులుంటారు. అక్కడ ఆ తాజాదనమే ఆకర్షణ. ఆ తరువాత ఆ కొత్తదనపు మోజు తగ్గాక ఏమవుతుందో చెప్పలేము. అదే కొత్త ఆలోచనకు చేయూతనివ్వటంలో ఎవ్వరూ ముందుకు రారు. విత్తనంలోంచి వచ్చే మొలకలాగా తనకుతనే పోరాడి, చీల్చుకుని, బైటపడి, నిలదొక్కుకోవాలి.

మేకవన్నె పులుల్ని నమ్మి మోసపోయే మాలినీదేవి, జూలీలాంటి వాళ్ల కథలకు సినిమాలు తాత్కాలిక ముగింపుల్ని చూపిస్తాయి గానీ, అలాంటి వాళ్ళ కథలకైనా, తన ఆలోచనను నమ్మేవాడికోసం తపన పడుతూ అలుపులేని అలల్లాతీరం చేరటానికి పోరాటం చేసే చక్రిలాంటి వాళ్ల కథలకైనా ముగింపులెలా వుంటాయో చెప్పటం కష్టం.

అరవిరిసిన సుమంలోని నవమధువుల కోసం ఎగిరొచ్చే సీతాకోక చిలుకలుంటాయి గానీ కోశస్థదశలో సమాధి చేస్తున్న ప్రతి గొంగళి పురుగూ కోశాన్ని చీల్చుకుని సీతాకోక చిలుక గానే మారుతుందని ఎవరు విశ్వసిస్తారు. తేనె దోచుకోవటానికి సీతాకోక చిలుక పూలకోసం అన్వేషిస్తుంది. సీతాకోక చిలుకగా మారటానికి గొంగళి పురుగు కోశం నిరీక్షిస్తుంది. ఇది ప్రకృతి సహజం. ★

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291, Anantapur 22977.

